# శ్రీకుమారగీత.



శ్రీమహాభారత ధర్మోపన్యాస విశారద
ముదిగొండ బుచ్చయ్యలింగ శాస్త్రి గారిచే
సమకూర్చ బడినది.





బ్రహ్మశ్రీ అనుముల రామనాథ శాస్త్రి గారిచే
పరిశోధింప బడినది.

శ్రీ శివాభ్యాం నమః

# శ్రీ కుమారగీత.

(శ్రీ మద్భగవద్గీత.)

---

భారత ధర్మోపన్యాస విశారద

ముదిగొండ బుచ్చయ్యలింగ శాస్త్రిగారిచే

సమకూర్చబడినది.

---

శ్రీ మదాంగీరస నామ సంవత్సర

ఆశ్వీజ శుద్ధ

విజయదశమీ ఆది వారము.

# విషయ సూచిక.





శ్రీశివాభ్యాం నమః.

# స్వవిషయము.

---

శ్రీమద్భాగ్యనగరము (హైద్రాబాదు) మాకు నివాసము; ఉద్భటారాధ్య వంశము; భారద్వాజస గోత్రము; ఇంటి పేరు ముదిగొండ వారు; లింగధారి బ్రాహ్మణులము; (ఆరాధ్యులు) సదా శివుడు కుల దైవము; పూర్వము నుండియు వైద్యము మాకు గృహవిద్యగా వచ్చుచున్నది. పంచాక్షరీ ప్రెస్సు స్వంతము లక్ష్మీ సంపన్నులగు వైశ్యులు మాకు శిష్యులుగా నుండి జీవనోపాధిగా నున్నారు. వైద్యకళా విశారదులును, శివపూజా ధురంధరులు నగు ముదిగొండ మల్లనారాధ్యుల వారు మా తండ్రి గారు; రాజమాంబ తల్లి గారు.

లింగధారణ గావించిన వారు శ్రీ వేమనారాధ్య వంశ సంభూతులగు రాజేశ్వరారాధ్యుల వారు; శ్రీహారీతస గోత్రులయిన భగవచ్ఛాస్త్రుల వారు విద్యా గురువులు.

ఈశ్వర సం॥ కార్తీక శు॥ ౧౨ శనివార ముదయము జననము. నందన సంవత్సరమున వివాహము జరిగినది. శ్రీ శిరిపురపు రాజయారాధ్యుల వారి యేక పుత్రిక యగు నాగమాంబను నాకు ధర్మపత్నిగా నీశ్వరుడొసగెను. శ్రీ శివ చరణుడు, నందికేశ్వర చరణుడని యిరువురు పుత్రులు. శివకుమార చరణుడను పుత్రుడును, అన్నపూర్ణ యను పుత్రికయు వివాహము-అయిన పిదప కీర్తిశేషులయి దుఃఖము యొక్క రుచి జూపిరి.

సన్మిత్రులు, విద్యా గురువగు శాస్త్రి గారు, వీరి సహాయముచే ధర్మబోధ చేయుటకు గాను పది వేల రూప్యముల శెలవు జేసి ధర్మబోధక సమాజము అను దానిని హైద్రాబాదు అబ్దులు గంజునందు స్థాపించితిని.

శివానుగ్రహముచే నాకు ప్రాజ్ఞత గలిగినది మొదలు సత్పురుషుల తోనే చక్కగా కాలము గడపితిని.

యవనాంగ్ల భాషలతో విలసిల్లు హైద్రాబాదు నగరమందున్నను మా తండ్రి గారు నన్ను గీర్వాణ విద్య యందే యాసక్తి గలవానిగా జేయు చుండిరి. మా గురువు గారు కావ్యాది పాఠముల జెప్పి తమ స్వదేశమునకు వెళ్ళి యుండిరి. పిదప నా పదునెనిమిదవ యేట మా తండ్రిగారు కైలాస వాసులైరి. తిరిగి మాగురువు గారు స్వదేశము నుండి వచ్చి హైద్రాబాదు నందే స్థిర నివాసమేర్పరచు కొని తండ్రి వలె దయతో సంస్కృతమును జెప్పు చుండిరి.

కీలక సం॥ వచ్చిన మూసానది వరదల వలన ప్రజలు విపరీత నష్టమునకు పాల్పడిరి. అందు మా గురువు గారి గృహము గూడా శిథిలమై వారికి విశేష నష్టము గలిగెను తత్పూర్తికై ఫీల్ఖాన బజారు వైశ్య సంఘము వారిని మహా భారత పురాణము జెప్పించుడని కోరితిని. అందుకు వారు సమ్మతించి నందున నేను పాఠకుడగను మా గురువు గారు అర్థ బోధకులుగను యేర్పడి మహాభారతమును బూర్తి జేసితిమి. అప్పుడే నాకు మహాభారత విషయిక జ్ఞానము గొంత గలిగినది.

అప్పుడు గీతా పారాయణము గూడా జేయు చుండిన నాకు మహా భారతము నందలి ధర్మములను, గాథలను, గీతను సమన్వయించి వ్రాసిన బాగుండు నని దోచు చుండెను. ఇది గురువు గారికి సైతము దెలిపితిని; వారును యంగీకరించిరి; కాని కాలము వారిని వశమొనర్చు కొనెను.

పిదప చాలా కాలము గడచి పోయెను. గీతాభారత సమన్వయచింత శుష్కించెను. ఈ సందర్భమున యొక విపరీత సంఘటన జరిగి యుండదేని యీ గ్రంథ మీరూపకముగా వెలువడదు.

శుక్ల సం॥ నా ద్వితీయ పుత్రుడగు శివకుమార చరణునకు శరీర మస్వస్థతగ నుండి వాయుఃపరి వర్తనార్థము బందరునకు బోయితిమి; కాని దురదృష్ట వశాత్తు వాడచ్చట నే కీర్తి శేషుడయ్యెను. విజ్ఞుడగు పుత్రుని దుఃఖమున విచారగ్రస్తుడనై యుండియు, వాని పేరున యేదే నొక గ్రంథమును వ్రాయ దలచితిని. ఈ సందర్భ మున నే తిలక మహాశయుని గీతారహస్యమును జూచుట తటస్థించి నది. అందు పరిశిష్ట ప్రకరణమున మహా భారతము గీతకు విస్తృత వ్యాఖ్యానము " అని వ్రాసిన దానిని జూచి గీతా భారత సామరస్యము వ్రాయ వలయు నను నాపూర్వాభి ప్రాయము బల పడినది. అప్పటి నుండి వ్యయ ప్రయాసలకు వెను దీయక రెండు సంవత్సరములు గ్రంథమును వ్రాసి శుద్ధ ప్రతిని గూడా సిద్ధ పరచితిని

మఱొకప్పుడు బందరునకు వ్రాత ప్రతులను దీసు కొని పోవు చుండగా రైలులో సుమారుఐదు రూపాయల సొమ్ము గల పెట్టె నెవరో నెత్తుకొని పోయిరి. ఆపెట్టె లోనే పెట్టబడిన గీత యొక్క వ్రాత ప్రతులు, గీతా రహస్యము సైతము బోయెను అప్పటికి యింటిలో గల చిత్తు ప్రతిని జూచి శుద్ధ ప్రతిని వ్రాసు కొన వచ్చునను ధైర్యము వహించితిని. కాని యింటికి వచ్చి జూడ యదియు నీళ్లు బడియక్షరములు స్పష్టముగా యగుపించని స్థితిలో యుండెను ఐనను వెనుదీయక పునః వ్యయ ప్రయాసలకు లోనై గ్రంథము నీ విధముగా పరి సమాప్తి జేసి మత్పుత్రుని పేరు లోని దగు కుమార శబ్దమును జేర్చి కుమార గీత యని పేరిడి ప్రకటించితిని

బందరు పురమున యుండి యీగ్రంథమును వ్రాయు సమయ

మనను, దుఃఖ సమయమునను అన్ని సహాయ సంపత్తుల నొడ గూర్చిన - లక్ష్మీశ్రీ సంపన్నులైన

మ॥ రా॥ శ్రీ మత్ప్రియ శిష్యులగు తాడేపల్లి వారి కుటుంబమును
" " ఉదయగిరి జగన్నాథ రావును
" " దారా సుబ్బారావును

ఇంకను ప్రియ బంధువులగు యితర మిత్రుల నీ శుభ పరి సమాప్తి సమయమున జ్ఞాపకము జేసు కొను చున్నాను.

మఱియు శ్రీ ప్రజోత్పత్తి సం॥ బందరు పురమున నాగేశ్వర స్వామి యాలయమున - శ్రీసాంగవేద పాఠశాలాధి కారులు, పండితులు, పౌరులు, మొదలగు వారు శివ పురాణము, భారతము రామాయణము వీటి సారము నుపన్యాసములుగా జెప్పించి నంది కేశ్వర విగ్రహ చిహ్నితమును, భారత ధర్మోపన్యాస విశారద యను బిరుదు గల స్వర్ణ పతకము నొసగిరి. ఆ సమయముననే పూజ్యులైన నాదెళ్ల పురుషోత్తమ కవి శేఖరులు భారతాంభోధి కుంభ సంభవ యని బిలచి యెంతయు సంతసించిరి. ఇట్టి పెద్దల కెల్ల కృతజ్ఞుడను.

ఇట్లు
ముదిగొండ బుచ్చయ్య లింగ శాస్త్రి.

ధర్మోరక్షతి.

# శ్రీ మహా భారతము.

---

కృష్ణ ద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం భువి
కో హ్యన్యః పురుష వ్యాఘ్ర మహా భారత కృద్భవేత్॥

శాం. ౩౪౯ - ౧౨

కృష్ణ ద్వైపాయను డగు వ్యాసుని భూమి యందు నారాయణుడని తెలియుము. పుండరీకాక్షుని కన్నవేరెవ్వడు భారతమును రచించ గలడు? ఆ ప్రభువు దప్ప వేరెవ్వడు నానా విధము లగు ధర్మములను జెప్ప గలడు? అని భారతమందు జెప్ప బడినది.

కృష్ణ ద్వైపాయనో వ్యాసో వేద వ్యాసో మహామునిః
సుమంతు ర్జైమిని శ్చైవ పైల శ్చ సుదృఢ వ్రతః
అహం చతుర్థః శిష్యోవై పంచమ శ్చ శుకః స్మృతః
ఏతాన్ సమాగతాన్ సర్వాన్ పంచశిష్యా న్దమాన్వితాన్
శౌచాచార సమా యుక్తాన్ జిత క్రోధాన్ జితేంద్రియాన్
వేదా నధ్యాపయామాస మహాభారత పంచమాన్॥

వైశంపాయనః ౩౪౧ - ౨౧

జనమేజయునకు వైశంపాయను డిట్లు జెప్పెను; - సుమంతుడు, జైమిని, పైలుడు, శుకుడు, నేను వ్యాస శిష్యులము మేమైదుగురము తపస్సంపన్నులమై, శౌచాచారములు గలిగి క్రోధమును జయించిజితేంద్రియులమై యుంటిమి గురువు గారు మాకు నాలుగు వేదములను, ఐదవ వేదమగు భారతమును నధ్యయనము చేయించెను.

ఈ ప్రమాణముచే చతుర్వేదములతో సహా పంచమ వేదమని బరగిన భారతమును గూడా గురువుల వద్ద జదువు కొన

వలయు నని తెలియు చున్నది. ఇంతియ గాక భారతము వేద సమ మని గూడా బోధ పడు చున్నది.

ఇతిహాసము వేద తుల్యమగునా యని సంశయింప బనిలేదు. ఎందుకనగా వేదార్థ ప్రతిపాదకమగు భారతము వేద తుల్యమే యగు చున్నది.

మఱియు వేద సారములగు బ్రహ్మ సూత్రములను, భగవద్గీతలను భగవానుడగు వ్యాస మహర్షియే నిర్మించి నాడు. ఈ రెండిటికి గల గౌరవమును మహాభారతమునకు మాత్రమివ్వక పోవుటకు గల హేతువు గానుపించదు. గ్రంథకర్త యొక్క వివిధ గ్రంథములకు వేర్వేరు మన్నన లుచితము గా నుండవు.

ఈ సందర్భమున తిలకు మహాశయుని యభిప్రాయమును జూడుడు- "గీత యనునది మహాభారతమునకు రహస్యోపనిషత్తును శిరోభూషణము నయ్యున్నది. ఇంతియ గాక మహాభారతము గీతలలో ప్రతిపాదింప బడిన మూలభూత కర్మ తత్వమునకు సోదాహరణమగు విస్తృత వ్యాఖ్యానము నై యున్నది"

గీతార్థమును భాష్య వేత్తలు సులభముగా గ్రహించెదరు; కాని పరమార్థ బుద్ధి గల పామరులు గీతల సిద్ధాంతమును తెలుసు కొనుటకు, భారత దృష్టాంతముల చేతను, చిన్న గాథల చేతను వ్రాయబడిన శ్రీ కుమారగీత యెంతయు యుపయోగించును కావున గీతా భారతముల రెండిటిని గలిపి బోధించినచో సదాశయము గల వారంతయు సంతసింతురు.

---

# శ్రీమద్భగవద్గీత.

---

సముపోఢేష్వనీకేషు కురుపాండవయోర్మృధే
అర్జునే విమనస్కే చ గీతా భగవతా స్వయం॥

శాంతి. ౩౪౭ - ౮

పాండవ కౌరవుల యొక్క యుద్ధ సమయమందు విమనస్కుడగు (విషాద యుక్తుడగు) అర్జునునకు భగవంతుడు విషాదహారమగు గీతను స్వయముగా బోధించెను.

ఈ గీతను ఖండాంతర వాసులును తమ తమ భాషలలోనికి విపులముగా వ్రాసి ప్రకటించిరి. వీరికి గీత జ్ఞానప్రదముగను, మనకు ధర్మగ్రంథముగను విలసిల్లు చున్నది.

ఇట్టి గీత యొక్క అభిప్రాయ వివరణము కొఱకు మహాపురుషులనేకులు విస్తృతములగు వ్యాఖ్యానములను వ్రాసియున్నారు ఐనను పెద్దలనేకులింకను గీత విషయికమై తమ తమ యభిప్రాయములను ప్రకటించు చునే యున్నారు. ఇంత చేసినను కుబేరుని నిధి వలె తరుగ దల లేనిదై గీతయింకను క్రొంగ్రొత్త యభిప్రాయముల నానాటికి వెలువు చునే యున్నది. మఱియు భాష్యగ్రంథములలో మూడవద్దై తత్త్వజ్ఞానప్రాప్తికి మూలమగుచు అర్థగ్రహణమునకు దుస్సాధ్యమగు చున్నది.

తత్త్వమును మాత్రమే చింతించుచు ధర్మ చింతన లేక యుండు వారైనను భగవద్గీతా తత్త్వమేదియో దానికి మూలమేదో మొదట విచారించ దగును. ధర్మాచరణ తత్పరులకు దప్ప తదితరులకు గీతా వాక్యములద్భుతముగా నుండి, ధర్మ కర్మ యోగాదులు పరస్పర విరుద్ధములుగా యగుపించును.

కావుననే ధర్మాచరణ తత్పరులై యున్న శిష్యులకు మాత్రము వేద వ్యాస మహర్షి వేదములతో పాటు భారతమును అందలి గీతను యుపదేశించెను. దీనిచే ధర్మాచరణ చేయని వారికి గీత ఉపదేశార్హముగాదని స్పష్టముగా బోధ పడుచున్నది.

ఇంతియగాక తులాధారుడు, జాజలి మొదలగు వారి చరిత్రలను జూచినచో యందు స్వ ధర్మాచరణచే ప్రాప్తమగు జ్ఞాన సంపత్తి యొక్క శక్తి యగపడగలదు. మఱియు వారు తమతమ స్వధర్మముల (కర్మల) యందాసక్తులై యుండియు సంసారభారమును నిర్వహించు కొనుచు నిర్లిప్తులుగా యుండిన విషయ మత్యద్భుతముగా యుండి యాదర్శప్రాయముగా నున్నది కావున స్వ ధర్మ త్యాగము చేయక తత్త్వ వేత్తలగుటకు ప్రయత్నించుచో దప్పని సరిగా భగవదనుగ్రహమునకు పాత్రులగుదురు. ఒక పక్షమున జ్ఞాన ప్రాప్తి గాక పోయినను ధర్మాచరణచే గలుగు ఫలమెచ్చటికిని బోదు. ఇదియు భగవద్వచనానుసారము యుక్తమే: ఏమన? "అనేక జన్మ సంసిద్ధితతో యాతి పరాం గతిమ్" అని జెప్ప బడిన ప్రకారము అనేక జన్మల లోని సంసిద్ధిచే దప్ప పరమ మగు గతి ప్రాప్తము గాదు. కావున యుక్తులైన వారు స్వ ధర్మ యందు నిలచి యుందురు. ఇందుకు గాను జనకుడు మొదలగు మహారాజులు గూడా దృష్టాంతము గానున్నారు

అకారణో హి నైవాస్తి ధర్మ స్సూక్ష్మో హి జాజలే
భూత భవ్యార్థ మేవేహ ధర్మ ప్రవచనం కృతమ్॥

తులాధారః ౨౬౨-౩౬

---

# శ్రీమద్భగవద్గీతా ప్రచారము.

| | | |
|---|---|---|
| ౧ | సంస్కృతమ్- ... ... | ౫౨ |
| ౨ | సంస్కృత హిందీ- ... ... | ౧౪౩ |
| ౩ | దేవనాగరి, భాష మరాటీ- ... | ౬౭ |
| ౪ | దేవనాగరి, భాష మేవాడీ- ( రాజపుతానా ) ... | ౨ |
| ౫ | దేవనాగరి, భాష నేపాలీ- ... | ౫౦ |
| ౬ | బంగాలి :- ... ... | ౧౧౩ |
| ౭ | కనడీ :- ... ... | ౧౯ |
| ౮ | తమిళ్ :- ... ... | ౧౦ |
| ౯ | తెలుగు :- ... ... | ౪౦ |
| ౧౦ | మళయాళం :- ... ... | ౩ |
| ౧౧ | దేవ, సింధి, ( ఉర్దూ ), భాష సింధీ- ... | ౮ |
| ౧౨ | ఫార్సీ, భాష ఉర్దూ- ... | ౧౬ |
| ౧౩ | ఫార్సీ:- ... ... ... | ౩ |
| ౧౪ | రోమన్, భాష ఖాసీ- ( అసామ్ ) ... | ౧ |
| ౧౫ | రోమన్, భాష ఇంగ్లీషు- ... | ౧౦౪ |
| ౧౬ | ఇంగ్లీషు- ఫారన్- ... ... | ౧౭ |
| ౧౭ | గుజరాతి :- ... ... | ౪ |
| ౧౮ | గీతాసంబంధ చిత్రములు మొదలగునవి- ... | ౧౧ |
| ౧౯ | మఱియు వేరే ౭౬ - పుస్తకములు గలవు. | |

ఈ విధముగా ఉపర్యుక్త భాషలందు గీతలు ప్రకటింపబడి యన్ని దేశములందును ప్రచారములో నున్నవి.

కల్యాణ్ యను హిందీ మాస పత్రిక వారు ప్రచురించిన గీతాంకము నుండి యీ విషయ మంతయు గ్రహించ బడినది.

# శ్రీ మహా భారతము – గీతలు.

## రాజధర్మానుశాసన పర్వము.

౧ ఉతథ్య గీత.

ఇది రాజ ధర్మములను బోధించును. రాజు రాజ్య మెట్లు చేయవలసినది, ప్రజా రక్షణ చేయ దగిన విధము, శత్రుసంహార మెట్లు చేయ వలసినది, సైన్య దుర్గాదుల నిర్మాణ విధి, ధర్మార్థ కామ విచక్షణ మొదలగునవి జెప్ప బడినవి.

తస్మాదర్థాచ్చ కామాచ్చ ధర్మ ఏవోత్తరో భవేత్
అస్మిన్ లోకే పరే చైవ ధర్మాత్మా సుఖ మేధతే ॥

అర్థ కామముల కన్నను ధర్మమెక్కువ; ధర్మపరుడిహ పర లోకములందును సుఖమందును.

౨ వామదేవ గీత.

ఇదియు రాజధర్మములనే జెప్పుచున్నది. రాజు ద్రవ్యమున కన్న ధర్మమునే యెక్కువగా జూచుచు దాని వృద్ధి యందే బుద్ధి యుంచ వలయు ననియు, తగిన వారిని తగిన పనులందుంచ దగు ననియు, దయా వంతుడు గా వలయు ననియు, మఱియు ప్రజాపరిపాలనము చక్కగా చేయు రాజు యిహ పర లోకము లందును జయ శాలి యగు ననియు దెలుప బడినది.

3 ఋషభ గీత.

ఋషభునిచే వీర ద్యుమ్నుడను రాజునకు ఆశ యొక్క చెడుపును గూర్చి బోధ చేయ బడినది

## మోక్ష ధర్మ పర్వము.

౪ పింగళ గీత.

ఇందు ఆశ యొక్క నిరసనము చేయ బడినది. పింగళ యను యొక స్త్రీ కాముకుని చేత వంచించ బడి తనలో దాను

పర్యాలోచించు కొనిన విషయము పింగళ గీత యన బడు చున్నది అందలి కొంత విషయము ఉదహరింప బడును.

నావద్దనే యున్న శాంత స్వరూపుడైన కాంతుని గన జాలక వేరొకని కొఱ కాశ పడితిని. ఉన్మత్త రాలనైవానితో చిరకాలము నివసించితిని. ఇక మీద నాతొమ్మిది యింద్రియముల యొక్క విపరీతముల నన్నిటిని నిరోధించెదను. సత్యమైన కామము లేకయే యున్న వారి వలె నటించు ధూర్తుల నిక మీద యెవతె కామించును? ఒకప్పు డనర్థములుగా నున్నవి పూర్వకృత సుకృతముచే యర్థవంతములే యగును.

నే నిప్పుడు జాగ్రత్తగా నున్నాను. ఆశలను విడచితిని; కామమును జయించితిని; ఇట్లని నిర్ధారణ చేసు కొనినదై పింగళ సుఖముగా నిద్ర బోయెను.

౫ శంపాక గీత.

ధనము దుఃఖదాయకము; త్యాగము సర్వసుఖముల నిచ్చును కావున త్యాగి గావలయు నని బోధించును.

౬ మంకి గీత.

కామము యొక్క నిరసనము కొఱకు ప్రత్యేకముగా జెప్ప బడినది. చూ. వ. గీ. ౨-౪౧

౭ బోధ్య గీత.

ఇది ఆశా తిరస్కారము జేయ బడినది.

౮ విచఖ్యు గీత.

యజ్ఞములు హింసాత్మకములగుటచే జేయజనదు. మఱియు

విష్ణు మేవాభి జానంతి సర్వ యజ్ఞేషు బ్రాహ్మణాః
పాయసైః సుమనోభి శ్చ తస్యాపి యజనం స్మృతమ్ ॥

పాయసాదులు మొదలైన వాటిచే విష్ణ్వారాధన చేయ వలసినది. అని విచఖ్యుడను ఋషి గానము జేసెను. ఇందు ప్రధానముగా భక్తి వర్ణింప బడినది.

౯. హారీత గీత.

"న హింస్యా త్సర్వభూతాని" హింస చేయకపోవుటయు ఇంద్రియ నిగ్రహము గలిగి యుండుటయు, విరాగు డగుటయు, లఘ్వాహారముల భుజించుటయు మొదలుగా గుణములు గల వాడు ముక్తుడగు నని జెప్ప బడినది.

౧౦ వృత్ర గీత.

విష్ణు మాహాత్మ్యము వర్ణింప బడినది.

౧౧ పరాశర గీత.

జనక డేది శ్రేయోదాయక మని ప్రశ్నించగా పరాశరు డెనిమిది యధ్యాయములు గల గ్రంథమును బోధించెను.

౧౨ హంస గీత.

సత్యము, దమము, క్షమ, ప్రజ్ఞ మొదలుగా గలగుణముల గూర్చి బ్రహ్మ హంసరూపమున సాధ్యులను దేవతలగూర్చియు పదేశించెను. ఇందు యక్ష ప్రశ్నల వలె ప్రశ్నోత్తరములునుగలవు.

౧౩. అనుగీత.

భగవద్గీతలందు ప్రతిపాదింప బడిన విషయములిందు విపులముగా పునః చర్చింప బడినవి.

౧౪ బ్రాహ్మణ గీత.

ఇది యనుగీతాంతర్గతముగానే యున్నది. అర్జునుడు భగవద్గీత బోధపడ లేదనగా రెండవమారు పై రెండు గీతల ముఖముగా బోధ చేయ బడెను.

### ౧౫ కామ గీతలు.

ఇందు కామమును గురించి కృష్ణుడు ధర్మజునకు దెలిపెను. ఈ ప్రకారముగా మహాభారతము నందు భగవద్గీతలతో గూడి ౧౬ గీతలు జెప్పబడినవి. ఇవి గాక యింకను కొద్ది గొప్ప శ్లోకములు గల యనేక గీతలు గలవు. ఎవరే విషయమును గురించి జెప్పుదురో వారి పేరుతోడనే యది బిలువ బడుచున్నది. ఈ గీతల పద్ధతి సామాన్యముగా భగవద్గీత ప్రక్క నుండియే ప్రారంభించ బడినది.

మహాభారతము నందలి గీతలే గాక, ౧౮ పురాణములందును యనేక గీతలు వ్రాయ బడి యున్నవి. వీటియన్నిటికన్న భగవద్గీతకెక్కువ ప్రాశస్త్యమెట్లు వచ్చినదో తిలక భగవానుడు గీతారహస్యమున చక్కగా వివరించినాడు

ధర్మమును దానిని లక్ష్యమందుంచు కొని గీతాకారుడు మానవులయొక్క దుఃఖమునకు మూలమైన విషాదమును లెస్సగా తిరస్కరించినాడు. ఇంతియ గాక ఆకాలమున భిన్న భిన్నములుగా నుండి వివాదగ్రస్తములైన సాంఖ్యము, యోగము, జ్ఞానము, కర్మ, భక్తి ఈ మొదలైన వాటిని ధర్మమను యొక సూత్రమున బంధించినవాడై యంతవఱకు కని విని యెఱుగని యొక అపూర్వ సృష్టినే చేసెను.

నిర్దుష్టమై సంఘమునకు, వ్యక్తికి సుఖప్రదమైన ఆ సృష్టిని ప్రపంచమంతయు మన్నించక తప్పినది గాదు.

---

శ్రీ శివాభ్యాం నమః

# గీతా ధర్మము.

స్వధర్మమపి చావేక్ష్య నవికంపితుమర్హసి॥

---

ఈశ్వర నిర్మిత ప్రపంచమందు ధర్మ నిలయమగు భరతఖండము భారతీయులకు నివాస భూమిగా నున్నది. భారతీయులు వర్ణాశ్రమాచార ధర్మ పరాయణులై ఖ్యాతి గాంచిన విధమద్భుతముగా నున్నది. భారతీయులకు ధర్మ నిశ్చయము జేయు నిగమాగమ స్మృతి పురాణేతిహాసముల యొక్క తాత్పర్యమును గ్రహించి వేదవ్యాస మహర్షి పంచమ వేదమని బరగిన శ్రీమహాభారతమును రచించెను. అతి విస్తృతమైన భారతము నంతయు నధ్యయనము జేయుటయు, ప్రచారము జేయుటయు కష్టసాధ్యమని గాబోలు - భారతము యొక్క పదునెనిమిది పర్వములకు పర్యాయముగా పదునెనిమిది యధ్యాయములు గల గీతను వ్రాసి భారతము నందే నిలిపెను.

భౌతిక సౌఖ్యముల సరకు సేయక కేవలము మోక్ష చింతయే గల భారతీయులకు త్రివర్గములు (ధర్మార్థ కామములు) సాధనముగా నున్నవి. ఈత్రివర్గ ప్రతిపాదకములగు శాస్త్రములందు అనేక కారణములచేత భగవద్గీత మిన్నగా నున్నది.

భారతమును లెస్సగా పరిశీలించి జూచిన యందు ధర్మము యొక్క ప్రాశస్త్యమెంత ఘనముగా నున్నది దెలియును. "ధర్మో యోనిర్మనుష్యాణాం" మానవులకు ధర్మమే కారణమనియు, "యతో ధర్మ స్తతో జయః" ఎక్కడ ధర్మమో

యక్కడనే జయమనియు విశదముగా జెప్పబడినది. ఇది యే భారతీయుల యొక్క తుది సిద్ధాంతమై యున్నది.

ప్రజా ధర్మము.

నైవరాజ్యం న రాజాసీ న్న చ దండో న దాండికః
ధర్మేణైవ ప్రజా స్సర్వా రక్షంతి స్మ పరస్పరం ॥

పూర్వము రాజ్యము, రాజు, శిక్ష, శిక్షించు వాడు, ఏమియు లేకుండెను. ధర్మము చేతనే ప్రజలుపరస్పరము రక్షించు కొను చుండిరి; అని భీష్ముడు ధర్మ రాజునకు జెప్పెను.

ఇంతియ గాదు; ధర్మమునే సేవించి చరిత్రాత్మకులైన వారిలో యొకడగు భీష్ముడు -

నమో ధర్మాయ మహతె నమః కృష్ణాయ వేధసే
బ్రాహ్మణేభ్యో నమస్కృత్య ధర్మాన్ వక్ష్యామి శాశ్వతాన్ ॥

గొప్పదైన ధర్మమునకు కృష్ణునకు, బ్రాహ్మణులకు నమస్కరించిశాశ్వతములైన ధర్మములను జెప్పెదను; అని అన్నిటికన్న పూర్వము ధర్మమునే గానము జేసెను. కుంతీ మహాదేవియు, "నమో ధర్మాయ మహతే" "ధర్మో ధారయతి ప్రజాః" గొప్పదైన ధర్మార్థము నమస్కారము; ప్రజలను ధర్మమే ధరించు చున్నది; కావున కృష్ణా! పాండవులకు స్వధర్మమును విడువ వలదని నామాటగా జెప్ప వలయునని కృష్ణునితో జెప్పెను. యుద్ధమునకు పూర్వము పాండవుల శరణు జెందుమని పలువురు పెద్దలు జెప్పగా దుర్యోధను డిట్లనెను.

ధర్మాయ చైవ ప్రణమేద్బ్రాహ్మణేభ్య శ్చ మద్విధః ॥

మహా పురుషులారా! నా యట్టివాడు ధర్మమున కైనను, బ్రాహ్మణులకైనను నమస్కరించును. (తదితరుల కెంతమాత్రము నమస్కరించదు)

సుదర్శనుడను నొక బ్రాహ్మణుడు అతిథి ధర్మ మను దాని చేతనే మృత్యువును జయించ గోరిన వాడై భార్యతో "సుదతీ! నీ సమస్తము నంకితమైనను, నేనున్నను లేకున్నను, అతిథి సత్కారము జేయుట యందేమరకుము; అతిథి కోరినది లేదనకుము" అని నచ్చ జెప్పెను.

ఇట్లు జరుగు చుండ సుదర్శనుడొక నాడు స్థలాంతర మునకు బోయినప్పుడు ధర్మదేవత బ్రాహ్మణ రూపమున వచ్చి సుదర్శనుని భార్యతో దన కామము దీర్చు మని కోరెను. అందు కామె సమ్మతించి యథోచిత సత్కారము జేయు చుండగా సుదర్శనుడు వచ్చి బిలుచుచు తలుపు దట్టెను. అది విని యింట అతిథి యున్నాడని ఆమె ప్రత్యుత్తరమిచ్చెను. ఇందుకు సుదర్శనుడెంత మాత్రము గినియక మంచిది; తొందర పడ వలదని శాంతముగా నొక చెట్టు మూల గూర్చుండెను. అంతట ఆతని యతిథి ధర్మ కెంతయు సంతసించి బ్రాహ్మణ రూపమున నున్న ధర్మ దేవత ప్రత్యక్షమైనదై

ఉవాచ చైనం ధర్మాత్మా పూర్వమామంత్ర్య వామతః।
ధర్మోఽహ మస్మి భద్రం తే జిజ్ఞాసార్థం తవానఘ॥
ప్రాప్తః సత్యం విత్తో జ్ఞాత్వా ప్రీతిర్మే పరమా త్వయి
విజితశ్చ త్వయా మృత్యు ర్యోయం త్వా మను గచ్ఛతి॥

సుదర్శనా! ఇటు రమ్మ నేను ధర్మ దేవతను నీ యొక్క ధర్మ పరీక్షార్థమై వచ్చితిని. సత్యమైన నీయతిథి సేవ చేత తృప్తి జెందితిని నీవు మృత్యువును గెలిచితివి. దంపతులగు మీరిరువురును వెయ్యి గుఱ్ఱములచె గట్ట బడిన రథము నెక్కి లోకములందన్నిటి యందును సంచరించ గల శక్తి నిచ్చితినని జెప్పి యంతర్థానమయ్యెను.

ఈకథను విచారించి జూడగా చేయ బడు సద్వ్రతముల కన్నిటికిని ఫలదాత ధర్మ దేవత యని దేలు చున్నది.

విశ్వామిత్రుడు బ్రహ్మర్షి గాదలచి నాలుగు దివ్యాబ్దము లతపస్సు గావించెను; కాని గాలేదు. ఇట్లుండ యొకనాడు ధర్మదేవత వసిష్ఠరూపమున వచ్చి అన్నము బెట్టుమని కోరెను విశ్వామిత్రుడు వసిష్ఠుని మీది ద్వేషమును విడచి పళ్లెరమున అన్నము బెట్టుకొని వచ్చి యెదుట నిలచెను; కాని వసిష్ఠ రూపమున నున్న ధర్మదేవత ఇప్పుడే వచ్చెద నని యది భుజించకయే యట నుండి వెడలి పోయెను.

విశ్వామిత్రుడు వసిష్ఠుడెప్పుడు వచ్చునో యని పళ్లెరమును చేత బట్టుకొని నూరు సంవత్సరములట్లే నిలచి యుండెను.

అథ వర్ష శతే పూర్ణే ధర్మః పునరుపాగమత్
క్షత్ర భావాదపగతో బ్రాహ్మణత్వముపాగతః॥

నూరేండ్లు నిండిన తర్వాత ధర్మదేవత వసిష్ఠ రూపముననే వచ్చి "విశ్వామిత్రా! ద్వేష రహితుడవగుట చేత క్షత్రభావము నొదలి బ్రాహ్మణుడ వైతివి" యని జెప్పి దన నిజరూపమును జూపి యంతర్ధాన మయ్యెను.

జమదగ్ని యొక్క శాంతమును పరీక్షించ దలచి ధర్మమెుకప్పుడు క్రోధ రూపమున వచ్చినదై జమదగ్నియొక్క శాంత భంగము జేయ జాలక తిరిగి పోయెను.

త్వ జ్జిజ్ఞాసార్థ మద్యేహ విద్ధి మాం ధర్మ మాగతం॥

జనకుని బరీక్షింప దలచి వచ్చిన ధర్మమునవ్వి జనకా! నీ వనుకొనినట్లు నేను బ్రాహ్మణుడ గాను. ధర్మదేవతను. తెలుసుకొను మని జెప్పెను.

బ్రహ్మ సంహారము కొఱకు మృత్యువును సృష్టింపగా యది యందరి నెట్లు. జంపుదునని విచార పడెను. అప్పుడు బ్రహ్మ దానితో "ధర్మస్సనాతనశ్చ త్వామిహైవాను ప్రవేక్ష్యతి" ఓమృత్యువా! నాయాజ్ఞ ప్రకారము జేయుము; సనా

తనమగు ధర్మము నిన్నిప్పుడే పొంద గలదనెను.

వస్త్రాపహరణ సమయమందు ద్రౌపది భగవంతుని ప్రార్థించెను. "తతస్తు ధర్మోంతరతో మహాత్మా సమావృణోద్వై వివిధైః స్సువస్త్రైః" అంతట భగవంతుడు ధర్మ స్వరూపమున వివిధ వస్త్రములతో ద్రౌపది నాశ్రయించెను. "ప్రాదుర్భవంతి శతశో ధర్మస్య పరిపాలనాత్" ధర్మము యొక్క రక్షణచేత వస్త్రముల నేకములై ద్రౌపదిని గాపాడెను.

ధర్మమును గూర్చి యిట్టి గాథలు భారమునం దనేకము గలవు; కావున వాటి తాత్పర్యము మాత్రమే విచారణీయము.

భగవంతుడు, ధర్మము అను రెండిటి యొక్క పర్యవసాన మొక్కటే యై యున్నది. ధర్మము ఆచరణ రూపకము గను, భగవంతుడు ధ్యాన గమ్యుడుగను నున్నాడు. వర్ణాశ్రమాచారధర్మముల నను సరించున దొకటి, సర్వ్వులకు నంతర్గతమై యంతరింద్రియములను ప్రేరేపించు నది యొకటి; ఇట్లు ధర్మము రెండు విధములుగా నున్నది.

"ధర్మస్య పరమా గతిః" ధర్మము యొక్క గతి యుత్కృష్టమైనదని జెప్ప బడినది. మఱియు "ధర్మ నిశ్శ్రేణి మాస్థాయ కించిత్కించి త్సమారుహ" ధర్మమను నిచ్చెనను కొద్ది కొద్దిగా నెక్కుము. అని వ్యాసుడు శుకున కుపదేశించెను. అనగా ధర్మ పరాయణుడు త్తమ స్థానమునుబొందునని దెలిపెను.

ధర్మాయ యేభ్య సూయంతి బుద్ధి మోహాన్వితా నరాః
అపథా గచ్ఛతా తేషాం అనుయాతాపి పీడ్యతే॥

ధర్మమును గూర్చి యసూయపడువారు మోహితులనియు, వారి ననుసరించు వారు బాధ పడుదురనియు జెప్ప బడినది.

ధర్మముల నన్నిటిని వదలి నన్ను బొందుమని భగవంతుడు నుడివెను. బహువచనముచే ధర్మములనగానే నానాత్వము సిద్ధిం

చును. నానాత్వము నిశ్చయాత్మకము గాదు. ఏకత్వమే కార్య సిద్ధికి సాధకము; కావున నానాత్వ వాసనల విడచిన వాడే కృతార్థుడు. ఇటులనే ధర్మము భగవంతుడే యైనను, వివిధ విధములుగా నుండుటచే వదల వీలయును. ఇచ్చట ధర్మముల నొదులుట యనగా వాటి ఫలముల విడచుట యనియే గ్రహించు నది ఎందుకన ధర్మముల విడచుచో స్థితి నిబంధనకే పతనము సంభవించును.

ఇహమునందు ధర్మాచరణచే యర్థ సిద్ధియు గలుగును. ఆ యర్థమును సుకృతము లందు వినియోగ పరచుటచే ధర్మము వృద్ధి పొందును. ధర్మ సహితములైన అర్థ కామోప భోగులు మోక్షమున కర్హులగుదురు.

మహా భారతము నందలి ధర్మముయొక్క సారమంతయు గీత యందు సమ కూర్చ బడినది; కావున ధర్మ పరాయణులు గీత నెంతయు శ్రద్ధగా చదువ దగును. తత్వజ్ఞులైన వారికి గీతా ధర్మము స్పష్టముగా యవగాహన మగు చున్నది.

ధర్మఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః॥

ధర్మము రక్షించిన వారిని రక్షించును; నశింప జేసిన వాని నశింప జేయును.

---

## విషాదము.

విషాదము మానవులకు సామాన్య ధర్మముగా నున్నది. విషాదముచే స్వధర్మము కప్పబడి మంచి చెడ్డల జ్ఞానము నశించుచున్నది. ఇది యతి బలశాలియగుట చేతనే, కీర్తిశాలియైన అర్జునుడును యుద్ధ సమయమున కృష్ణునితో "గాండీవము జారి పోవుచున్నది; ప్రియులగు బంధువులను జంప జాలను. వీరిని జంపి రాజ్యమేలుట కన్న భిక్ష మెత్తుకొనుట నయము" అని యన వలసి వచ్చెను.

ఇది యంతయు విని దీనికి మూలము విషాదమని గ్రహించి భగవంతుడు స్వధర్మ మెట్టిదో యది పరిపాలింప బడకున్న నష్టమేమొ విపులముగా దెలిపెను.

ఇంతియ గాక స్వ ధర్మమునకు బాధ గలుగ కుండ అనగా దానిపై విశ్వాసము దొలగ కుండ కర్మ జ్ఞాన సాంఖ్యాది యోగముల రూపకముగా పదునెనిమిది యధ్యాయములు గల గ్రంథమును బోధించి తుదకర్జునునిచే ధర్మ నిర్వహణము జేయించెను.

ఇంతటి గ్రంథమునకు మూలమైన విషాద మెంతటి భయంకరమైనదో విజ్ఞులూహించ దగును. ఈ విషాదము మానవుడు స్వధర్మాచరణపరాయణుడు గానంత వఱకు జన్మజన్మాంతరములు వెన్నాడుచుండు ననుటకర్జునుడు ప్రబల సాక్ష్యము. కావున భగవంతుడు మొదలే యర్జుననకిట్లు బోధించెను.

అర్జునా! యుద్ధ సమయమున నీకీ విషాదమెట్లు గలిగెను? ఈ నీయవస్థ స్వర్గ మార్గమునకు విఘ్నకరము; అపకీర్తికి స్థానము; అనార్యులచే యనుభవింప దగినది; కావున నింద్యమగు విషాదమును విడచి పెట్టుము; యుద్ధోన్ముఖుడవు గమ్ము; జయించితివేని భూమిని, మరణించిన స్వర్గమునసనుభవింప గలవు.

## ధర్మజ విషాదము.

యుద్ధానంతరము ప్రియబంధువులు మరణించుటచే విషాదపీడితుడై విరక్తుడై రాజ్యాది భోగముల విడచి యరణ్యమునకు బోవ నిశ్చయించు కొని ధర్మరాజు యర్జునునితో యిట్లనెను.

అర్థము కొఱకు మన మనర్థమునే గావించితిమి; భిక్ష మెత్తుకొని యేని జీవించక లోభమోహములకును, అహంకార మునకు లోనై చెడ్డ పనియే జేసితిమి. ఈ భయంకర సంగ్రామమున యొందఱో యువకులు మడిసిరి. వారిని కని పెంచి పెద్ద జేసిన తలిదండ్రులెంత దుఃఖింతురో గద? ఈ శోకము నన్నెంతయు బీడించు చున్నది.

త్యాగవాంశ్చ పునః పాపం నాలం కర్తుమితి శ్రుతిః ॥

త్యాగ శీలుడు అనగా నన్నిటిని విడచిన వాడు తిరిగి పాపమును జేయడని శ్రుతి జెప్పు చున్నది; కావున నే నన్నిటిని విడచి యరణ్యమునకు బోయెదను. మీరు రాజ్యమును బరిపాలించు కొనుడు.

అర్జునుడిట్లు జెప్పెను -

శత్రూన్ హత్వా మహీం లబ్ధ్వా స్వధర్మేణోప పాదితాం॥

స్వ ధర్మాను సారముగా శత్రువుల జంపి పొందిన భూమిని విడచి యడవికి బోవుట న్యాయము గాదు. మన పూర్వ పూర్వతర పురుషులు శత్రువుల జయించి యశ్వ మేధాది యజ్ఞముల జేసి యుత్తమ గతుల బొందిరి; కావున స్వ ధర్మాచరణ పరాయణులమైన మనము పాపముల నెంత మాత్రము పొందము.

భీము డిట్లనెను -

యథాన్నం క్షుధితో లబ్ధ్వా న భుంజీయాద్య దృచ్ఛయా॥

అకలి గొన్నవాడు అన్నమును సంపాదించు కొని యే

కారణము చే నైనను దిన నట్లు, కష్టముల కోర్చి సంపాదించిన రాజ్యమును నేననుభవింపననుచున్నావు. ఇది మిక్కిలి కష్టముగా నున్నది.

అపేక్షస్య యథా సైస్సై సై ః కర్మభిర్వ్యాపృతం జగత్.
తస్మాత్కర్మైవ కర్తవ్యం నాస్తి సిద్ధిరకర్మణః॥

ప్రాణులు తమ తమ కర్మల చేతనే ఆయా వ్యాపారములందు వ్యాపించి యున్నవి; కావున కర్మయే చేయదగినది. కర్మను విడచిన వానికి సిద్ధి లేదు.

పునః అర్జునుడు గృహస్థశ్రేష్ఠుడనియు, బ్రహ్మచారులను వానప్రస్థులను, సన్యాసులను గృహమేధియే యాశ్రయమనియు నచ్చజెప్పెను. ఐనను పట్టుదల వీడని ధర్మజునితో నకులుడిట్లనెను.

రాజు స్వధర్మత్యాగము జేసినచో ప్రపంచము దొంగలమయమగును; ధర్మములు నశించును; కావున వేదోక్తధర్మముల విడచిన వాడు బాగుపడడు "స్వధర్మే పూర్వైశ్చరితే పార్థివ జుష్ట జుష్టే" కావున పూర్వులచే యనుష్ఠింపబడిన స్వధర్మమునందు స్థిర బుద్ధి గలిగి యుండుము. అట్లుగాదేని గాలిచే నెగుర గొట్టబడిన మేఘము వలె ఛిన్నాభిన్నము నై, యుభయ లోకభ్రష్టుడవై యంతరాళమున పిశాచము వలె యుండ గలవు.

సహదేవుడిట్లు జెప్పెను —

న బాహ్యం ద్రవ్యముత్సృజ్య సిద్ధిర్భవతి భారత
శారీరం ద్రవ్యముత్సృజ్య సిద్ధిర్భవతివా నవా॥

రాజ్యాది బాహ్యవస్తు విసర్జనము చేతనే సిద్ధి గలుగదు. ఆంతరికము లైన కామక్రోధముల విడచిననే సిద్ధి గలుగును.

ఈ విషయమునే భగవానుడను గీతలలో యీ విధముగా వివరించి జెప్పెను.

కామగీతలు.

అత్ర గాథాః కామ గీతాః కీర్తయంతి పురా విదః
శృణు సంకీర్త్యమానాస్తా నిఖిలేన యుధిష్ఠిర
నాహం శక్యోనుపాయేన హంతుం భూతే కేనచిత్
యో మాం ప్రయత తే హంతుం జ్ఞాత్వా ప్రహరణే బలం
తస్య తస్మిన్ ప్రహరణే పునః ప్రాదుర్భవామ్యహం
యో మాం ప్రయత తే హంతుం యజ్ఞైర్వివిధ దక్షిణైః
జంగమేష్వివ ధర్మాత్మా పునః ప్రాదుర్భవామ్యహం
యో మాం ప్రయత తే హంతుం వేదై ర్వేదాంత సాధనైః
స్థావరేష్వివ ధర్మాత్మా తస్య ప్రాదుర్భవామ్యహం
యో మాం ప్రయత తే హంతుం ధృత్యా సత్య పరాక్రమః
భావో భవామి తస్యాహం స చ మాం నావబుధ్యతే
యో మాం ప్రయత తే హంతుం తపసా శంసిత వ్రతః
తత స్తపసి తస్యాథ పునః ప్రాదుర్భవామ్యహం
యో మాం ప్రయత తే హంతుం మోక్ష మాస్థాయ పండితః
తస్య మోక్ష రతిస్థస్య నృత్యామి చ హసామి చ
అవధ్య సర్వ భూతానామహ మేక స్సనాతనః
తస్మాత్త్వమపి తం కామం యజ్ఞైర్వివిధ దక్షిణైః
ధర్మే కురు మహారాజ తత్ర తే స భవిష్యతి॥

యుధిష్ఠిరా! పూర్వులచే గానము చేయ బడిన కామ గీత లను వినుము. (కామము జెప్పు చున్నది)

"నే నే భూతముల చేతను చంపుటకు వీలైన దానిని గాను ఎవడు నన్ను జంపుటకు ప్రయత్నించునో వాని యందే పుట్టు చున్నాను.

దక్షిణలు గల యజ్ఞములచేత జంప దలచిన జంగమము

అందు ధర్మాత్ముని వలె బుట్టగలను. వేద వేదాంత సాధనముల చే జంప దలచిన స్థావరమునందు ధర్మాత్ముని వలె జనియించగలను. ధైర్యముచే సత్యపరాక్రమము గలిగి నన్ను జంప ప్రయత్నించిన వానికి భావము నే నగుచున్నాను. ఇంతైనను వాడు నన్ను దెలియ నేరడు.

పండితుడు వ్యామోహమును బొంది నన్ను జంపదలచిన అతని మోక్ష చింతలోనే నేనాడుచు పాడుచుందును.

సర్వ భూతముల చేతను చంప శక్యము గానిదానిని; నేనొక్కడనే సనాతనుడను.”

కావున ధర్మనందనా! కామము నే విధముగను జంప లేవు. వివిధ దక్షిణలతో గూడిన యజ్ఞముల జేసితివేని, యందలి కామమే ధర్మముగా బరిణమించును.

ద్రౌపది యిట్లు జెప్పెను.

ప్రశాధి పృథివీం దేవీం ప్రజా ధర్మేణ పాలయన్
స పర్వత వనద్వీపాం మా రాజస్వ మనా భవ ॥

ప్రజలను ధర్మయుక్తముగా బరిపాలించుచు, నదీ నవ పర్వ్యములతో గూడిన భూమిని బరిపాలించుము. విషాద మగ్నుడవై విమనస్కుడవు గాకుము.

దేవస్థాన వ్యాసాది మహర్షులు ధర్మజునకు అడవి కేగుట ఉచితము గాదనియు, స్వధర్మమునందుండుటయే శ్రేయోదాయకమనియు, ౩౬ అ గ్రంథమును బోధించిరి.

ఎవరెన్ని విధముల జెప్పినను పట్టుదల వీడని ధర్మజునితో శ్రీకృష్ణుడిట్లు జెప్పెను.

నేదాసీమతి నిర్బంధం శోకే త్వం కర్తుమర్హసి
యథాహ భగవాన్ వ్యాసః స్తత్కురుష్వ నరోత్తమ ॥

దుఃఖపడఁడు; వ్యాసుడు మొదలు కొని సి యాప్తులు జెప్పి నట్లు జేయును.

ధర్మ స్సతాం హితః పుంసాం ధర్మశ్చైవాశ్రయస్సతాం
ధర్మా ల్లోకా స్త్రియస్తాత ప్రవృత్తా స్స చరా చరాః ॥

ధర్మమే సత్పురుషుల కాశ్రయము. ధర్మము వల్ల నే చరాచరాత్మకములగు త్రిలోకములును బ్రవర్తింపుచున్నవి.

## కర్మ.

వేదే వచనముక్తంతు కురు కర్మ త్యజేతి చ ॥

వేదము నందు కర్మను జేయుము; వదలుము; అని రెండు విధములుగా జెప్ప బడినది. వేదమిట్లు జెప్పుటలో యర్థ మేమని సంశయము గలుగ వచ్చును; మంచిది విచారింతము.

నాలుగాశ్రమములలో మొదటి రెండగు బ్రహ్మచర్య గృహస్థాశ్రమములు కర్మలతో గూడి యున్నవి. మిగిలిన రెండును కర్మలకు దూరముగా నున్నవి. అనగా కామ్యాది కర్మలు లేక యున్నవి.

కర్మలను చేయుట చేత యీ యా లోకములందు దిరుగుచుందురు. విద్యచేత అనగా దెలుసు కొన దగిన దానిని దెలుసుకొనుట చేత, ఉత్తమ గతిని బొందుదురు.

మొదటి రెండాశ్రమములకు కర్మ సాధన మనియు, మిగత రెండాశ్రమములకు విద్య సాధన మనియు వేదాభిప్రాయమగుటచే కురు త్యజలకు విరుద్ధత లేదు. ఇంతియగాక కర్మను చేయుటయు, విడచుటయు ఆయాయాశ్రమములకు స్వధర్మమే యై యున్నది.

గీత పైన జెప్ప బడిన విధముగా గాక మఱొక విధముగా యభిప్రాయ పడు చున్నది. ఏమని యనగా: కర్మ నెవరైనను జేయక తప్పదు; కాని తత్ఫలమును మాత్రము కోర రాదు. ఎందుకనఁ? ఫలమును గోరుటచే బద్ధుడగును. కర్మను చేయుటయు ఫలమును విడచుటయు నెందులకు? మేము కర్మనే జేయ మని నిశ్చయించు కొనినచో శరీర యాత్ర జేయుటయే దుస్తరమగు నని సమాధానము జెప్ప బడినది.

నాలుగాశ్రమములందును దిరుగుచు అయాఫలముల మూట గట్టు కొనుటకైనను మనకు వ్యవధి లేదు. అను క్షణము మృత్యువు వెన్నాడు చున్నది. కావున శరీరమున్నంతవఱకువిధ్యుక్త కర్మల నాచరించుటయు, జ్ఞానప్రాప్తి గలుగుట కాసక్తిని వదలుటయు మానవునకు కర్తవ్యముగా నున్నది.

కర్మను కృషికి బోల్చ వచ్చును. మఱియు ఫలవంతమగు తోట యన దగును. వ్యవసాయకుడు, (యజమాని) తోటను ఆశ్రయించి సుఖించును మఱియు దన నాశ్రయించిన వారిని సుఖింప జేయును. ఈ విధముగానే కర్మ ను చేయు వారు తాము సుఖించుట గాక పరులను సుఖింప జేయుదురు. ఇట్లు గాక కర్మలను విడచిన యతడు దానొక్కడే యానంద మనుభవించును.

ఇది యంతయు యాలోచించి యాజ్ఞవల్క్యాది మహర్షులు కర్మను విడచి సుఖింతమను కొనిన జనకాది రాజర్షులకు సైతము కర్మ చేయుమనియే బోధించిరి.

చిత్తము స్వాధీనములో లేని వారు కర్మ చేయుటయే ముఖ్యము. ఇట్టి వారు ఆచరణమందు నిష్ఠులై యుందురు. తుదకు కర్మలయొక్క అసారమును దెలుసు కొని తరింతురు.

శరీరము కర్మ మయముగను, ఆత్మ జ్ఞాన మయము గను నున్నది. కర్మయంద నాదరము జూపుట, లోకమునంద నాదర

ము జూపుటయే యగు చున్నది. లోకమునకు నిరాదరణ జూపుట చేత శరీరమున కుండ దగిన గౌరవముండదు. తాను జేయు పనులయందు గౌరవమే ఆత్మజ్ఞానమునకు ముఖ్యము. ఆత్మజ్ఞానము గలుగనిది సుఖవంతుడు గాడు. కావున శరీర పోషణమునకు లోక సంగ్రహము కొఱకు, పితృదేవతల యొక్కయు, దేవతల యొక్కయు ప్రీతి కొఱకు, వైదిక శారీరక కర్మలను జేయ వలయును.

కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః॥

జనకుడు మొదలగు వారు కర్మను జేసియే సిద్ధి బొందిరి. కావున కర్మను జేసియే సిద్ధిని బొంద వచ్చునని దెలియు చున్నది.

మహా భారతమంతయు: కర్మ మయముగా నున్నది. కర్మ యందలి ముఖ్య ధర్మము గీత యందు గానము జేయ బడినది.

## నీతి.

కామ క్రోధం చ లోభం చ తస్మాదేత త్రయం త్యజేత్॥

---

కామ క్రోధాదులు నరక ద్వారములని నీతి శాస్త్రి కోవిదుడగు విదురుడు జెప్పెను. ఇట్టి నీతులను భగవంతుడు గీత యొక్క ౧౬- ౧౭- ౧౮ అ. జెప్పెను. ౧౫ వ అ. తత్త్వ బోధచేయ బడినది. చివర నున్న ౩ అ. జెప్పిన తర్వాత, మొదటి ౧౫ అ. బోధించ దగి యుండెను. ఇట్లు గాక మొదలే తత్వోప దేశము జేయ బడి పిదప నీతులు, ధర్మములు బోధింప బడెను. తత్వ పూరితమగు భారతము దుఃఖం నీతి జెప్ప బడినట్లే, గీతయందు నీతి, ధర్మ, కర్మ వీటిని గూర్చి సూక్ష్మముగా జెప్ప బడెను.

---

## జ్ఞానము.

---

న హి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే ॥

---

విషాదము రోగ సదృశమైనది; దీని కౌషధము సద్విచారము; పథ్యము కర్మచేయుట; జ్ఞానమారోగ్యము; ఆరోగ్యమే ఆనందము. క్రమముగాజ్ఞానప్రాప్తి యగును. ప్రాప్తిరైన జ్ఞానము నశించదు. మఱియు నొకచో లభ్యము గాదు. చీకటికి దీపమవసర మైనట్లు అజ్ఞానికే జ్ఞాన మవసరము.

జ్ఞానమును సంపాదింప గోరు వాడు కామ క్రోధములను విడువ వలయును. వీటిని బూర్తిగా విడచిన వాడు వాడాత్మ మయుడగును. ఆత్మ యెట్టిదనః జ్ఞాన సాధనములతో గూడి జ్ఞానవంతమగును. అజ్ఞాన సాధనములతో గూడి యజ్ఞానావృత మగును.

స్వ ధర్మ విహితములైన కర్మల నాచరించుచు, లోక సంగ్రహము కొఱకే నేని కర్మలనాచరించు చుంటిని; కాని వీటి తో నాకెట్టి సంబంధము లేదని భావించుటయే జ్ఞాన సాధనమునకు మొదటి మెట్టు.

## యోగము.

చిత్తవృత్తి నిరోధకరమైనది యోగము. యమ నియమ ప్రాణా యామ ప్రత్యాహార ధ్యానధారణసమాధులు యోగమున కంగములు. వీటిని యభ్యాసము చేయుటచే చిత్త శుద్ధి గలిగి జ్ఞానమునకు సాధన ముగా నుండును. మఱియు కాయసిద్ధియు, ఇంద్రియ నిగ్రహము, గలుగును. ఇంతియ గాక మనస్సును సమాధి యందుంచ గలడు. తేజశ్శాలి గా గలడు నిగ్రహానుగ్రహ సమర్థుడును యగును.

అన్ని మతముల వారును యోగము నంగీకరింతురు. గీత యొక్క ౬ వ అ. ధ్యాన యోగమును గూర్చి గొంత జెప్పబడినది. ఆత్మజ్ఞానము కొఱకు శరీరముచే చేయదగిన సాధనమునే ౬ వ అ. జెప్ప బడినది. యోగ సాంఖ్యములు రెండును సమముగానే యున్నవి ఇట్లే శరీరమును, ఆత్మయు సమములుగా యున్నవి. సాంఖ్యధర్మ మాత్మనను, యోగధర్మము శరీరమునను దోడుపడుటను అనుకూలముగా నున్నవి. కావున విజ్ఞులగు వారు శరీరము నెంతమాత్రము నిందించరు. ధర్మ సాధనము శరీరమవసరముగా నుండుటయే ముఖ్యము.

యోగమును దెలుపుటకు ఖండ శాస్త్రము గలదు. యోగాభ్యాసము చేత పరకాయ ప్రవేశము, దూరశ్రవణ దూరగమనాదుల సాధించ వచ్చును.

గురూపదిష్ట మార్గేణ యోగ మార్గముపన్యసేత్ ॥

ఇట్టి యోగమును గురువుచే జెప్ప బడిన మార్గము ననుసరించి యభ్యసించ వలయును. లేదేని శరీరమునకే నష్టము గలుగును.

## భక్తి.

పూజ్యుల యందనురాగము గలిగి యుండుటయే భక్తి. ఎవడు నా యందు భక్తి గలిగి యుండునో వాడే నాకు ప్రియుడని భగవంతుడు గూడ జెప్పెను. భక్తుడు జీవుడనియు, ఈశ్వరుడుపాసనీయుడనియు భక్తి యోగము జెప్పుచున్నది. భక్తునకు భక్తి యందే సదా యానందము గలుగుచున్నది. భక్తుడెల్లప్పుడును దనపూజ్య దేవతను మనోవాక్కాయకర్మలచే యారాధించుచు భగవదనుగ్రహమునే గోరుచుండును.

పురాణములన్నిటి యందును భక్తి మిగుల సులభ సాధ్యమైనట్లు జెప్ప బడినది; కాని మహాభారతమందు మాత్రము కత్తి

సాము వలె కష్టసాధ్యమనియు, ధర్మబద్ధమనియు గిన్పట్టెను.
ఆత్మ పురుషుడు; భక్తి స్త్రీ. భక్తిగలిగిన వానిని పరమే శ్వరుని యనుగ్రహము బొందిన వాడనియే నిశ్చయించ వచ్చును. కావున ధర్మము లన్నిటిలో భక్తి యను ధర్మమే శ్రేష్ఠమైనదని యు యాశ్రయించిన వారిని రక్షించు ననియు గీతాభిప్రాయము.

## దైవపిత్ర్యములు.

యాంతి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాంతి పితృవ్రతాః
భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినో౽పి మాం॥

ఇంద్రాది దేవతలను భక్తిశ్రద్ధలతో బూజించు వారింద్రాది లోకములను, పితృదేవతల నాశ్రయించు వారు పితృలోకములను, భూతములను బూజించు వారు భూతగణములను, నన్ను భక్తిశ్రద్ధలచే బూజించు వారు నన్నే బొందెదరు.

దైవ పితృకములను ప్రతివాడును చేయ దగినవి. వీటి యాచరణమును గూర్చి యొక ఇతిహాసము వర్ణింప బడినది.

పూర్వము నారదుడు బదరికాశ్రమమున తపమాచరించుచున్న నరనారాయణ ఋషులను జూడదలచి బోయెను. అప్పుడు వారు దైవ పిత్ర్యకర్మలను జేయుచుండిరి. ఇది జూచి నారదుడిట్లడిగెను "మీరు ప్రపంచమునకు కారణులై యుండియు యీకర్మల నేదుకు జేయుచున్నారు"

నారాయణుడిట్లనెను- ఇది సనాతనమగు పరమ రహస్యము ఏదియు గాని పరమ పురుషుని వలన నవ్యక్తముదయించినది. అది వ్యక్తములైన యన్నిటి యందును నెలకొని యుండును. అదియే నర నారాయణులమైన మాయుత్పత్తి స్థానము. సద సదాత్మకమగు ఆ సర్వాత్మనే మేము బూజ చేయుచుందుము,

మేము దైవమనియు, పిత్ర్యమనియు సర్వకర్మలందును

బూజింప బడు నది యాత్మ యనియే యెఱుంగుము. ఆత్మ కన్న భిన్నములగు దైవపిత్ర్యములుండవు. ఇట్లు చేయుమని జెప్పుట యతని శాసనమని దెలుసు కొనుము. మఱియు దైవారాధన మంతయు ఆత్మకు సంబంధించిన దనియు, పిత్ర్యమంతయు శరీర మునకు సంబంధించినదనియు, జీవునకు, శరీరమునకు దైవపిత్ర్య ములంటవనియు యెఱుగుము.

దైవ పిత్ర్య కర్మలు చేయుటయేఆత్మారాధన యను జ్ఞాన మున్నచో యవి పరిహాసాస్పదములుగా గనుపించవు. కర్మలు చేయకయే యాత్మారాధన చేయుట కష్టసాధ్యమనుటకు మన మన అనుభవమే సాక్షిగా నుండ గలదు. మన మెట్టియారాధన చేయు చున్నను ఆత్మారాధన యను భావమును గలిగి యుండి శాస్త్ర విహిత కర్మల చేయుటయే సర్వోత్తమము. ఇట్లు చేయమేని ధర్మ పథమునకు దప్పిన వారమగుదుము. ఈసందర్భ మున గీతయు "యెవరి కొఱకుచేయ బడినయారాధనలైనను నన్నే చెందు చున్నవ" ని జెప్పు చుండుటచే మనకిక సంశయింప బని లేదు.

## ఆచార్యుడు

—

ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్వ దర్శిన॥

---

తత్వవిదులైన జ్ఞాననిష్ఠుల నాశ్రయించి ప్రార్థించి బ్రహ్మజ్ఞానము దెలుసు కొనుము. వారుపదేశింతురు; అని చెప్ప బడినది.

సద్గురువుల యొక్క ఉదేశము వినాగా నేదియు సిద్ధించ దని భగవదాశయము.

శరీరమేతౌ సృజతః పితా మాతా చ భారత
ఆచార్యశస్తు యజ్జన్మ తత్సత్యం వై తథామృతం॥

తలిదండ్రులు శరీరమును మాత్రము చేసెదరు; ఆత్మకు రూపము లేదు. గురువుచే యుపదేశింప బడి పరమార్థ భూతమును నాశవర్జితమునగు బ్రహ్మజ్ఞాన విద్య చేత గలిగిన క్రొత్త జన్మయే సత్యమును, నాశము లేనిదని చెప్ప బడినది.

నవినా గురు సంబంధం జ్ఞానస్యాధిగమస్స్మృతః
గురుః ప్లావయితా నిత్యం జ్ఞానం ప్లవ ఇవోచ్యతే ॥

గురువు వినాగా జ్ఞానము గలుగదు. జ్ఞానమను యోడ నెక్కించి గురువు సంసార సాగరమును దాటించును.

శిశువు గర్భ నరకము నతిక్రమింప లేక "నేనిట నుండి వెడలినచో పుణ్యమే జేయుదు ననియు, యింకను యెన్నో ప్రమాణములను జేయును. ఐనను యివతలికి రాక "ఆచార్యునిచే జ్ఞానోపదేశమగుదును" అనుట తోడనే భూపతన మగు చున్నాడు కావున దా జేసిన ప్రమాణమును బూర్తి జేయుటకు గాను ప్రతి మనుజుడు ప్రయత్నము జేయ వలసి యున్నది. గురు సేవ జేయక పొందు ఫలమంతయు వ్యర్థమగును. ఆచార్య సేవయు, ధర్మాచరణయు గల ప్రతి వానికి గీతార్థము లెస్సగా బోధపడును.

## మానవుడు.

---

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥

వేల కొలది ప్రజలలో జ్ఞాన సిద్ధి కొఱకు ప్రయత్నించు వాడొకడు. ప్రయత్నించు వారిలో నొకడు మాత్రమే నన్ను నిశ్చయముగా నెఱుగు చున్నాడు.

దేవ దానవ గంధర్వాది రాక్షస కోటిలో మనుజులే భగవదనుగ్రహ పాత్రులని గీతా భారతములు నొక్కి చెప్పు చున్నవి.

శ్వేత ద్వీప వాసులగు మానవులు మిక్కిలి శక్తి సంపన్నులయి నట్లు జెప్ప బడినది. మానవత్వ విషయమై మానవులెంత నీచముగా భావించు చున్నారో భగవంతుడంత గౌరవముగా భావించు చున్నాడు. వాసనల విడచిన మానవులే యాత్మారాధన పరులనియు, భక్తులనియు కొని యాడ బడుచున్నారు శరీరములు తుచ్ఛములనియు, క్షణ భంగురములనియు భావించు వారు శ్వేత ద్వీప వాసులై చంద్ర వర్చస్సు గల మానవులను జ్ఞాపకము జేసు కొన దగును. ఎందుకన? వారు మానవాధికారము, శరీరము గలిగి దేవ దుర్లభమైన శక్తిని సంపాదించిరి. దీని కంతయు మూలము స్వ ధర్మాచరణమే యని మనము గుర్తెరిగినచో గీత లోని యనేక సంశయములు నివారణమగును.

ముద్గలుడు, సప్త ప్రస్థుడు, సుదర్శనుడు మొదలగు వారు సకుటుంబముగా స శరీరముతో యుత్తమ గతి బొందుటకు ధర్మాచరణమే హేతువుగా నున్నది.

లోక సేవాసక్తులై, ఇంద్రియ నిగ్రహము గలిగి సర్వము భగవదధీనము జేయు పురుషులు పునరావృత్తి రహిత స్థలమునకే బోవుదురు.

కావున మానవత్వమును నీచముగా జూడక వచ్చినభాగుండును; బ్రతికి సుఖము లేదని చెడ్డ తలపులు బెట్టు కొనక దేశ సేవా పరులు, స్వ ధర్మాచరణ పరులగుటకు బ్రతి వారును బ్రయత్నించ దగును.

## గీతాసారము.

న చ శ్రేయోను పశ్యామి హత్వా స్వ జన మాహవే॥

నా వారిని జంపి మంచి నెంత మాత్రము జూడ లేను. అని యర్జునుడు చింతించెను. చింతించుట, లేక విషాద పడుట మానవులకు

పరిపాటియై మిక్కిలి యశాంతి ప్రదముగా నున్నది. నేను, నాది, ఉన్నది, లేదు, పుట్టును, పుట్టదు ఈ మొదలగు మనో వికారములే విషాదమునకు జన్మస్థానములుగా నున్నవి.

అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే
గతాసూ న గతాసూంశ్చ నానుశోచంతి పండితాః ॥

ఉన్న వారి కొఱకు, పోయిన వారి కొఱకు పండితులు దుఃఖింపరు. (మొత్తము మీద దేని యొక్కయు వృద్ధి క్షయముల కైనను వికారమును బొందకుండుటకును విషాదమును జయించుట)

గీత లోని పండిత శబ్దమునకర్థము చదువు కొనిన వాడని యెంత మాత్రము గాదు. పండిత శబ్దము మహాభారతమునందు వెవ్వేరు అర్థములందు ప్రయోగింప బడినను గీత యందు మాత్రము సర్వ సమత్వ బుద్ధి గల వాని యందే పండిత శబ్దము వ్యవహరింప బడినది పరమార్థ జ్ఞానమును సంపాదించు కొన ప్రయత్నించు కొను వానికి సమత్వ బుద్ధి యొక్కడవసరముగా నున్నది. సమత్వ బుద్ధి సర్వ దుఃఖములను సమయింప జేసి ఆత్మ శ్రేయమున కెక్కుడు దోడు పడును. ఇట్లు సమత్వ బుద్ధి గలిగి ఈశ్వరార్పణముగా కర్మ చేయుటచే సమాధి సిద్ధించును. ఇదియే శరీర కర్తవ్యము.

లోకేస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ
జ్ఞాన యోగేన సాంఖ్యానాం కర్మ యోగేన యోగినాం ॥

సాంఖ్యులకు జ్ఞానయోగమనియు, యోగులకు కర్మయోగ మనియు పూర్వము నాచే రెండు నిష్ఠలు జెప్ప బడినవి.

సంసార సాగరమును దాట గోరు వారు శరీరమును నిర్వ్యాపారముగా నుండ నీక ఫలాపేక్షను వదలి కర్మలను జేయుచునే యుండ వలయును. కర్మలను చేయక పోయినచో కర్మ రహితత్వమే సిద్ధించదు.

న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే
తత్స్వయం యోగ సం సిద్ధః కాలే నాత్మని విందతి॥

ఈ లోకము నందు జ్ఞానముతో సమమైనది మఱొకటిలేదు. ఆ జ్ఞానమును కాలాను గుణముగా దానే తన యందు బొందు చున్నాడు. స్వ ధర్మ విహితములగు కర్మల నాచరించు చుండుట చేతనే క్రమముగా జ్ఞాన ప్రాప్తి యగు చున్నది. ఎవుడాత్మానందము గలుగునో యవ్వుడు దానంతట నడియే కర్మ ఫలము లందలి యాసక్తి వదలి పోవు చున్నది.

కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియై రపి
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాత్మ శుద్ధయే॥

చిత్త శుద్ధి కొఱకు కర్మ యోగులు ఫలాసక్తిని వదలి మనస్సు చేతను, శరీరము చేతను, బుద్ధి చేతను అహంకార రహితము లగు నింద్రియముల చేతను కర్మలను జేయుదురు.

ఇట్టి వాడే కర్మ సన్యాసి యని బిలువ దగి యున్నాడు.

జ్ఞేయ స్స నిత్య సన్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతీ
నిర్ద్వంద్వో హి మహా బాహో సుఖంబంధా త్ప్రముచ్యతే॥

ద్వేషము, కోరిక ఈ మొదలగు నవి లేక కర్మలనాచరించు యోగి నిత్య సన్యాసి యన బడును. ఇట్టి వాడనాయాసముగా కర్మ బంధనములనుండి ముక్తు డగు చున్నాడు.

ఎప్పుడు కర్మ ఫలములను గోరడో యప్పుడు పరమ సుఖి యగును. ఇట్లు కర్మ ప్రవాహమున బడి బోవుచు ఫలముల నొదలిన వాడు ఆత్మ చింతన చేయుట కంతేని యను కూలముగా నుండును.

యతో యతో నిస్సరతి మనశ్చంచల మస్థిరం
తత స్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్॥

చంచల మగు మనస్సు ఏయే విషయములందు దిరుగు

చుండునో ఆయా విషయముల నుండి వెనుద్రిప్పి యాత్మయం దుండునట్లు తన స్వాధీనము జేసుకొనవలయును. ఇది కర్మయోగాభ్యాస పరునకు సులభ సాధ్యముగా నుండును.

గీత యొక్క సారమును యిదియే. ఎన్ని జన్మములకైనను సాధించ దగిన దిదియే. ప్రపంచము నంతను క్షణములో దిరిగి వచ్చు శక్తిగల మనస్సును నియమింప గలవాడు ప్రపంచమే దానగుచున్నాడు. మనస్సును ఆత్మ సాన్నిధ్యమున నుంచుచో యాత్మవంతుడు అనగా బ్రహ్మభూతుడు యగును.

ధ్యానయోగము చేత మనస్సు నిశ్చలమై విజ్ఞాని యగును.

బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే
వాసుదేవ స్సర్వమితి సమహాత్మా సుదుర్లభః ॥

జ్ఞాన సంస్కారము గలయనేక జన్మములైన తర్వాతమనుష్యుడు జ్ఞానియై సర్వము దేవ స్వరూపమని నన్ను శరణు బొందును.

ఇదియే యనేక జన్మములతో గూడిన విజ్ఞానము. ఈ విజ్ఞానము ఆధ్యాత్మిక అధిభౌతిక విచారములకు మూలము. వీటి విచారము గావించిన పిదప—

ఓ మిత్యేకాక్షరంబ్రహ్మ వ్యాహరన్ మామను స్మరన్
యః ప్రయాతి త్యజన్ దేహం సయాతి పరమాం గతిం ॥

పరబ్రహ్మ వాచకమైన ఓంకారమను యేకాక్షరము నుచ్చరించుచు, ఓంకార స్వరూపుడనైన నన్ను జింతించుచు నెవడు దేహమును వదలుచున్నాడో వాడు పరమోత్కృష్టమగు మోక్ష పదమును బొందుచున్నాడు.

కావున జ్ఞాన విజ్ఞానములత్యవసరములు; వీటికి సర్వసాధనము క్రింద వ్రాయబడు రీతినుండ దగును.

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్ ॥

చేయ బడు నవి, భుజించ బడునవి, హోమము చేయబడు నవి, ఇచ్చు నవి, తపస్సు ఈ మొదలగు నవి యేవేవి గలవో యవి యన్నియు నాకు (ఈశ్వరుడు) సమర్పించుము.

ఇట్లు భగవంతుడు పరమావధిని దెలిపియున్నాడు. అన్నిటి యందును నేనున్నాను; నా యందన్నియు నున్నవి; అని భావింప వలయును.

యద్యద్విభూతి మత్సత్వం శ్రీమదూర్జిత మేవవా
తత్తదేవావ గచ్ఛత్వం మమ తేజోంశ సంభవమ్ ॥

ఐశ్వర్యవంతమై, బలపరాక్రమములుగలిగి, ఉత్సాహపూరితమై, కాంతి గలిగి యున్నవన్నియు నా తేజస్సు నుండి పుట్టిన విగా దెలుసు కొనుము.

ఈ వాక్యము వలన ప్రపంచము నందు సామాన్యములైనవి కొన్నియు, విశేషములైనవి కొన్నియు నున్నట్లు దెలియు చున్నది. ఇందు విశేషములైన వాటిని భగవదీయములని భావించుట గూడ యొక విధమగు యుపాసన. ఈ యుపాసనమందు కృతార్థుడై ద్వంద్వ భావముల నొదలి సర్వము నేనని దెలియు వాడు విశ్వరూపుని దెలుసు కొనును. ఈ భావమే గీత యంతయు జదివిన వారికి దెలియు చున్నది.

భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవం విధోర్జున
జ్ఞాతుం ద్రష్టుం చ తత్వేన ప్రవేష్టుం చ పరంతప॥

విశ్వరూప ధరుడ నైన నన్ను నితరాసక్తి లేని యచంచల భక్తి చేత మాత్రమే దెలుసు కొన వచ్చును; చూడ వచ్చును; పొందవచ్చును. ఈశ్వరప్రాప్తికిభక్తి కన్నను వేరుసాధనమే లేదు.

యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి
శుభా శుభ పరిత్యాగీ భక్తిమాన్ యః స మే ప్రియః ॥

సంతోషమునను, ద్వేషమునను, దుఃఖమునను, ఆశను,

శుభాశుభములను, సతీతుడై యెవడు నా యందు భక్తి గలిగి యుండునో వాడె నాకు ప్రియుడు,

అని భగవంతుడు జెప్పి యుండుటచే సర్వము నొదలు కొని భగవద్భక్తుడైన పిదప క్షేత్ర క్షేత్రజ్ఞ విషయమును గుర్తింప గలడు.

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వ క్షేత్రేషు భారత
క్షేత్ర క్షేత్రజ్ఞయో ర్జ్ఞానం యత్తజ్జ్ఞానం మతం మమ ॥

సర్వ శరీరములందును క్షేత్రజ్ఞుడను (ఆత్మను) నేనని (ఈశ్వరుడు) తెలుసు కొనుము. దీనిని తెలుసు కొనుటయే జ్ఞానము భక్తితో గూడిన జ్ఞానానంతరము గుణత్రయముల నాలోచించి గుణములను మించిన వాడు గావలయును.

ఊర్ధ్వం గచ్ఛంతి సత్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః
జఘన్య గుణ వృత్తిస్థా అధో గచ్ఛంతి తామసాః ॥

సత్వ గుణ ప్రధానులు దేవాది లోకములను, రజోగుణము గల వారు మనుజ లోకములను, తమో గుణము గల వారు అధో లోకములను అనగా మృగ పక్ష్యాది జన్మములను బొందుదురు. కావున గుణములను వదలిననే గాని పురుషోత్తమ ప్రాప్తి గాదు.

యో మామేవమసమ్మూఢో జానాతి పురుషోత్తమం
స సర్వవిద్భజతి మాం సర్వ భావేన భారత॥

మోహమును వదలి పురుషోత్తముడ నగు నన్ను సేవించిన వాడు సర్వజ్ఞుడై నన్ను పొందును.

విషాదమునకు విరుగుడు స్వ ధర్మాచరణమందు ప్రీతి; దీనికి బలము సత్కర్మములను జేయుట; పర్యవసానము జ్ఞాన ప్రాప్తి యగుట; జ్ఞానమున కవధి: కర్మ ఫలత్యాగము చేయుట; ఇదియే ధ్యానము గుదురుట కాధారము; ధ్యానము యొక్క ఫలమే విజ్ఞానము; విజ్ఞానముకర్థము పర బ్రహ్మమును దెలియుట; పర

బ్రహ్మమును దెలుసుకొనుటయే తెలుసుకొనదగిన దానిని దెలుసు కొనుట; మఱియు ఈశ్వరుని యొక్క విభూతి యోగమును గుర్తెరుగుట; ఈ విభూతి జ్ఞానము చేతనే పరమేశ్వరుని విశ్వ రూపునిగా సందర్శించుట; పరమేశ్వరుని విశ్వ రూపునిగా సందర్శించిన వాడే భక్తుడు.

విశ్వాసము గల భక్తునకు శరీరము, జీవుడు, శివుడు వీరి యొక్క వివరము విశదమగును.

స్వధర్మములని ప్రారంభింప బడిన కర్మముల నాచరించి ఫల త్యాగము జేయుటయే మోక్ష సన్యాస మన బడును.

స్వధర్మాచరణమందు మొదట కృతార్థులైన వారికే చివరను గీత జ్ఞానోపదేశము జేసినది.

గీత ముఖ్యముగా ఆత్మను గురించియు, మహా భారతము శరీర కర్తవ్యమును గురించియు బోధించినవి. మహాభారతము దా జెప్పిన దానిని కండ్లు మూసుకొని జేయు మనుటయే గాని సంశయ హేతువులకు స్థానమే యివ్వదు. గీత యట్లు గాక చేయు దాని యందలి పరమార్థమును గను గొని జేయు మనును. గీతా భారతములకు గల ముఖ్యభేద మిదియే యై యున్నది.

అందరి హృదయములందును ఈశ్వరుడున్నాడు. అతనినే శరణు బొందుము. రహస్యమున కన్న రహస్యతరమైన యీ విషయమును నీకు జెప్పితిని. సంపూర్ణముగా విని విమర్శించి నీవు దోచినట్లు జేయుము.

(భగవంతుడు తిరిగి దన యభిప్రాయమును విశద పరచు చున్నాడు) నీకు హితము జెప్పెదను వినుము. "మన్మనా భవ" నాయందు మనసు గల వాడవు గమ్ము. "సర్వ ధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ" అన్ని ధర్మములను విడచి నన్నే శరణు బొందుము ఈ రెండును గీత యొక్క పరమ రహస్యములు.

## భగవద్గీత - శైవము.

ఆరాధ్యుడ (లింగధారి బ్రాహ్మణులు) నగుట నేను భగవద్గీతను శివ పరమనియే భావించుచున్నాను.

భగవచ్ఛబ్దము శివ పరముగా వ్యవహరింప బడినదనుటను క్రింది శ్లోకమును గమనించ దగును.

నిరీక్ష్య భగవాన్ దేవీం హ్యుమాం మాం చ జగద్ధిత।
శతక్రతుం చాభివీక్ష్య స్వయ మాహ స శంకరః ॥

శ్రీకృష్ణః అను. ౧౩

ఉపమన్యు చరిత్ర లోని కొన్ని విషయములను పరిశీలించి జూడగా భగవచ్ఛబ్దము శ్రీ సదాశివపరముగానే యున్నది.

" ఈశ్వర స్సర్వ భూతానాం " సర్వ భూతములందును ఈశ్వరుడున్నాడు. ఇచ్చట శివునకు ప్రసిద్ధముగా వ్యవహరించబడు ఈశ్వర శబ్దమే ప్రయోగింప బడినది. (గీత. ౧౮-౬౧)

శత రుద్రీయ మందలి శివ మాహాత్మ్యము, అర్జునుని పాశుపతాస్త్ర సంపాదన, స్వప్నమున శ్రీకృష్ణుడర్జునునకు పాశుపతాస్త్రమును పునః ఇప్పించుట, శివుని కారణముగా కథా నాయకులైన పంచ పాండవులు జనిమించుట, ఇత్యాది మహా భారతాతంర్గత విషయములు శివ ప్రాశస్త్యమును వేనోళ్ల జాటుచున్నవి.

శంకరుడని జెప్ప బడు వాని మాహాత్మ్యమును నాకు జెప్పుము. అని ధర్మజుడు భీష్మని యడిగెను.

భీష్ముడు - నేను మహాదేవుని యొక్క మాహాత్మ్యమును వర్ణింప నసమర్థుడను. "బ్రహ్మ విష్ణు సురేశానాం స్రష్టా చ ప్రభురేవ చ" అతడు బ్రహ్మ విష్ణ్వాదులను పుట్టించు వాడును

ప్రభువును నయ్యున్నాడు. ఇట్టి మహాను భావుని, పుట్టుక, మురలితనము, మరణము వీటికి లోబడిన మానవులు దెలియ జాలరు. "ఋతే నారాయణాత్పుంస శంఖచక్ర గదా ధరాత్" శంఖ చక్ర గదాద్యాయుధ ధరుడగు శ్రీమన్నారాయణ మూర్తి దప్ప మఱెవ్వరు సదా శివుని గూర్చి యేమియు దెల్ప జాలరు. శ్రీ కృష్ణుడే నారాయణమూర్తియై బదరి కాశ్రమ మందు శివుని గూర్చి తపస్సు జేయుచుండును.

"రుద్ర భక్త్యా తు కృష్ణేన జగద్వ్యాప్తం మహాత్మనా" రుద్రుని మీది భక్తి చేత నే శ్రీకృష్ణుడు ప్రపంచమునందు వ్యాపించి యున్నాడు. శ్రీ కృష్ణుడు దివ్య చక్షు సంపన్నుడు; యోగము చేత సర్వమును జూడ గలడు. కావున ఇప్పుడతడే నీకు శివ మాహాత్మ్యమును గూర్చి జెప్ప గలడు; శ్రద్ధగా వినుము.

ఈ విషయము చేత సర్వ ధర్మ విదుడగు భీష్ముడు గూడ శివ మాహాత్మ్య వర్ణనకసమర్థుడని దెలియు చున్నది.

అప్పుడు శ్రీ కృష్ణుడు "ఉపస్పృశ్య శుచి ర్భూత్వా కథయా మాస ధీమత," ఉదకమును స్పృశించి శుచిర్భూతుడై శివ మాహాత్మ్యమును ధర్మజునకు జెప్పటకారంభించెను.

నేను పుత్రప్రాప్తికొఱకు హిమవంతమునకు బోవుచుండగా శివానుగ్రహ పాత్రుడైన ఉపమన్యుమహర్షి శివమాహాత్మ్యమును గూర్చి నాకు జెప్పెను. అది మిక్కిలి యద్భుతముగా నున్నది. దాని నట్లు విని హిమవంతమునకు బోయి తపమాచరించితిని. అంతట సదా శివుడు ప్రత్యక్షమై సాంబుడను పేరు గల పుత్రుడు బుట్ట గలడని వరమిచ్చి యింకను నీ కిష్టములైన వరముల గోర కొను మనగా యిట్లు గోరితిని.

ధర్మే దృఢత్వం యుధి శత్రు ఘాతం
యశ స్తథాగ్ర్యం పరమం బలం చ

యోగ ప్రియత్వం తవ సన్నికర్షం
వృణే సుతానాం చ శతం శతాని॥

ధర్మమునందు నిశ్చయత్వము, యుద్ధము నందు శత్రుజయము, ప్రశస్తమగు కీర్తి, ఉత్తమమైన బలము, యోగమునందు ప్రీతి, నీ సాన్నిధ్యము, నూర్ల కొలది పుత్రులు గావలయు నని గోరితిని.

ఈ వరములు శ్రీ కృష్ణుని వంటి వాడు గోరుట కెంతేని దగి యున్నవి. ఎందుకనఁ? అతడు ధర్మ సంస్థాపకుడగుట ధర్మమును, దుష్ట శిక్షకుడగుట శత్రు జయమును గోర దగి యున్నవి. ఇక సుకీర్తి నెల్లరును యభిలషింప దగినదే. వీటి తర్వాత బలము, యోగము కోర బడెను. తర్వాత ఇన్ని యున్నను లాభము లేదని దలచి ఈశ్వరుని సాన్నిధ్యము నభిలషించెను. స్థితి నిబంధనమ ప్రజ మూలము గావున పరిమితి లేని సంఖ్యలలో సంతానమును తుదను గోరెను.

ఇది గమనించిన వారు సంతాన నిరోధమును జేయ వలయు నను వారిని నిరసించక మానరు.

శ్రీ కృష్ణుడు గోరిన వరములతనికే గాదు; ఎల్లరికి దేశ కాల భేదము లేక అనుసరింప దగి యున్నవి.

శ్రీ కృష్ణుడు గోరిన వరములను శివుడిచ్చిన తర్వాత పార్వతీ దేవి యెనిమిది వరములను గోరు కొమ్మనెను.

ద్విజేష్వకోపం పితృతః ప్రసాదం
శతం సుతానాం పరమం చ భోగం
మయే ప్రీతిం మాతృతశ్చ ప్రసాదం
శమ ప్రాప్తి మావృణే చాపి దాక్షిణ్యం॥

బ్రాహ్మణులందు కోపము లేకుండుట, తండ్రి యొక్క యనుగ్రహము, నూర్ల కొలది సంతానము, ఉత్తమ మగు భోగము

నులమందు ప్రీతి, తల్లి యొక్క యనుగ్రహము, శాంతి, దాక్షిణ్యము వీటిని వరములుగా గోరుకొని యింటికి తిరిగి వచ్చితిని. నీవును ఆ సదాశివునినే శరణు బొందుమని శ్రీకృష్ణుడు ధర్మజునకు జెప్పి విరమించెను.

శైవులారా! శ్రీకృష్ణుని శివరహస్య వేదియని మనము దెలుసుకొనినచో బాధయే లేదు. అతని ధర్మములు మోక్ష దాయకములగుట మనకే గాక యందరికి నాచరణీయములు.

## ముఖ్య విషయము.

గీత భగవంతుని శిక్షా వాక్యము; అదిబోధపడుటకు సదుపదేశము, పెద్దల సేవ అత్యవసరములు. "మేధావీ వృద్ధ సేవయా" పెద్దల సేవ జేయుటచే బుద్ధి శాలి యగు నని విదురుడు జెప్పెను. మఱియు ధర్మజుడును "యుద్ధశాస్త్రవిదే త్వం వృద్ధాః నోపాసితా త్వయా" అర్జునా! నీవు యుద్ధ శాస్త్ర విదుడవే గాని వృద్ధులను సేవింప లేదనెను. అంజనేయుడును భీమునితో "త్వయా నోపాసితా వృద్ధాః" నీచేత వృద్ధుల సేవ జేయ బడ లేదని మందలించెను. ఇట్లు భారతము పలు స్థలములందు పెద్దల సేవ జేయ వలయునని దృఢముగా జెప్పినది; కావున ప్రతి వాడును గీతా ధర్మమును పెద్దల సదుపదేశము వలననే దెలుసుకొనుటకు ప్రయత్నించ వలయును.

గీతా తత్వాభ్యాసకులు ద్వేష బుద్ధిచే శైవ వైష్ణ వాది మతములను నిందించక సమత్వ బుద్ధి గలిగి యుండ దగును. ఎందుకన? "సర్వ భూతేషు సౌహృదం" భూతముల యన్నిటియందును స్నేహభావముంచ వలయు నని గీత ముఖ్యముగా బోధించుచున్నది. ఒక దేశీయుడు మఱొక దేశీయుని, ఒక భాష గల వాడు మఱొక భాషగల వానిని, ఒక మతస్థుడు మఱొక మత

స్థుని, వీరే గాక మాకన్నియు సమమే యను వారు గూడా పరులను నిందించుట, హాస్యము సేయుట గర్హించ దగిన విషయ మే: కాని సంతసించ వలసినది గాదు. ఇట్టి వారు తమ తమ పకర్మ్యముల నెంత వఱకు మాను కొనరో యంత వఱకు గీతా పారాయణము సఫలము గాదు.

సనత్సుజాతుడిట్లు జెప్పెను- జ్ఞానము, శాంతము, సత్యము ఈ మొదలగు ౧౨ గుణములలో కొన్నియైన నెవరియందుగలవో యతడు "సర్వామిమాం పృధివీం సంప్ర శిష్యాత్" ఈ భూమండలము నంతను శాసింప గలడు. కావున గీతా శాస్త్రిము గూడా పై సద్గుణములనే బోధించు చుండుటచేవాటి నాచరించవలయును.

బి. ఏ. పట్ట పరీక్ష యందు కృతార్థులును, ఉపాధ్యాయులును, బ్రహ్మచారులును నగు బ్రహ్మశ్రీ కోరంగి వేంకటరామ శర్మగారు పదునాలుగు సంవత్సరముల నుండి బందరు పురమున ప్రతివారము గీతను బోధించు చున్నారు. వారి బోధ వలన వందల కొలది శ్రోతలు గీతా ధర్మ పరాయణులై యుందురని మేము విశ్వసించు చున్నాము.

గీత కిట్టి విపరీతార్థములను జేయక నేను వ్రాసిన మహా భారత ప్రమాణములను ఇతర విషయములను జూచి శర్మ గారి వలెనే గీతా ప్రచారము జేయ వలయు నని బోధపరులైన వారిని కోరు చున్నాను.

పండితులైన వారు తమకు తెలిసిన దానిని యితరులకు బోధించ వలయును. మేము బోధించినను బోధ పడదను పండితులకే యేమియు తెలియుదేమో యని నా నమ్మకము.

రత్నమును రాయి యని బార వేయు మూర్ఖుని వలె గీతా రత్నమును మూర్ఖుడు విడచి పెట్టి ఉభయ లోకములకు మూరుడగు చున్నాడు.

ప్రపంచ ప్రఖ్యాతి జెందిన గ్రంథములలో గీత మొదటిది. అది సిద్ధాంతముల సారము. అందు స్వ ధర్మమును గురించి ముఖ్యముగా బోధ చేయ బడినది.

విషాదము స్వ ధర్మమును నశింప జేయును. కర్మ శరీర కర్తవ్యము. కర్మను చేయు వారికి చిత్త శుద్ధి గలుగును. నీతి సర్వమున కాధారము. జ్ఞానము మోక్ష దాయకము. భక్తి వలన సంసారము నుండి కడ తేరును. దైవపితౄముల వశ్య కర్తవ్యములు. వీటి నాచరించుట వలన ఆత్మ వెలుగును. ఆచార్యుడు జ్ఞాన దాయకుడు. మానవుడే తరించును. మానవత్వమునందు జ్ఞానోపార్జన చేయలేని పలువిధజన్మము లెత్తుచు పరమాత్ముని యనుగ్రహమును బొంద లేడు.

సముద్రము వలె గంభీరమైన గీతకు అనుభవమును, శాస్త్రి ప్రమాణములను దోడు పరచి విజ్ఞులు బోధ చేయుదురు గాక.

ప్రతి విషయమందు గుణ దోషములుండుట స్వభావము. అట్లే నేను వ్రాసిన దాని యందును గుణ దోషములుండ వచ్చును. సహృదయులగు పెద్దలు గుణములనే గ్రహింతురనినమ్ముచున్నాను.

ధర్మో రక్షతి.

---

ఇట్లు, ముదిగొండ బుచ్చయ్యలింగ శాస్త్రి.

# వైద్యసార సంగ్రహము.

ద్వితీయ ముద్రణము.

గ్రంథ కర్త:

వైద్య కలా విశారద ముదిగొండ మల్లనారాధ్యులు.

వి. పి ఖర్చుల సహా ౨-౮-౦

---

అనేక ప్రాచీన వైద్య గ్రంథములను పరిశోధించి సరళమైన భాషలో వైద్యుల కత్యంతోపయుక్తముగా నుండునట్లు వ్రాయబడినది. వివిధ వ్యాధుల యొక్క లక్షణములు, చికిత్సలు విశదముగా తెలుపబడినవి. వైద్య విద్యయందు కుతూహలము గల ప్రతి వారును ఒకమారు చదివి చూడదగిన సర్వోత్తమ గ్రంథమని ధృఢముగా జెప్పుచున్నాము.

ద్వితీయముద్రణమగుటయే దాని ప్రాశస్త్యమును దెలుపును.

డిమ్మీ సైజు: 300 పేజీలకు పైగా నున్నది.

వలయువారు:

పంచాక్షరీ ప్రెస్ అండ్ బుక్ డిపో,

చౌట్ల మహరాజుగంజ్

హైద్రాబాద్ దక్కన్.

# విషయ సూచిక.



సూచన: తిలకు గారి గీతారహస్యము (ఆంధ్రానువాదము) లో గీతాశ్లోకములకు వ్రాయ బడిన తాత్పర్యమే యథారీతిగా యిందు (సమారగీత) వ్రాయ బడినది.

గీతనుదహరించిన మహాభారత శ్లోకములు ౧-౨ ప్రతుల జూచి వ్రాయుట తటస్థించినది. జిజ్ఞాసులు ఏదేనొక శ్లోకమునకు జెందిన భాగమును జూడ దలచిన నీప్రతి లోనైనను ౧-౨ అ. ఎచ్చుతచ్చుగా జూచుకొనిన ఉదాహృతశ్లోకము, భాగము లభ్యమగును.

మఃదిగొండ బుచ్చయ్య లింగ శాస్త్రి గారి
పంచాక్షరీ ప్రెస్సు నందు
సుముద్రితము.
చౌట్ల మహారాజు గంజు.
హైద్రాబాదు దక్కన్.

1932 అక్టోబరు 9.

శ్రీ శివాభ్యాంనమః

గురవే సర్వ లోకానాం భిషజే భవ రోగిణాం
నిధయే సర్వ విద్యానాం దక్షిణామూర్తయే నమః॥

నారాయణ పరం బ్రహ్మ నారాయణ పరంతపః
నారాయణ పరో దేవః సర్వం నారాయణ స్సదా॥

---

# శ్రీ కుమార గీత

(యనుభగవద్గీత)

---

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్॥

## విషాద యోగము.

౧

ధృతరాష్ట్ర ఉవాచ.

శ్లో॥ ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సఞ్జయ॥ ౧

సంజయ ఉవాచ.

దృష్ట్వాతు పాండవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా
ఆచార్యముపసఙ్గమ్య రాజా వచనమబ్రవీత్॥ ౨
పశ్యైతాం పాణ్డుపుత్రాణా మాచార్య మహతీం చమూమ్
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా॥ ౩
అత్ర శూరా మహేష్వాసా భీమార్జున సమా యుధి
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః॥ ౪

శ్రీభగవానువాచ.

ప్రజహాతి యదాకామాన్సర్వాన్ పార్థ మనోగతాన్
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే॥ ౫౫

శ్రీభగవంతుడు చెప్పుచున్నాడు - ఓ పార్థా మనస్సునందున్న కోరికల నన్నిటిని అనగా వాసనలను వదలి తనయందే సంతుష్టుడై యెప్పుడుండునో అప్పుడు వానిని స్థితప్రజ్ఞుడని చెప్ప వలయును.

ప్రజ్ఞా ప్రతిష్ఠా భూతానాం ప్రజ్ఞాలాభః పరో మతః
ప్రజ్ఞా నిశ్శ్రేయసీ లోకే ప్రజ్ఞా స్వర్గో మనస్సతాం॥
ప్రజ్ఞయా ప్రాపితార్థోహి బలిరైశ్వర్య సంక్షయే
ప్రహ్లాదో నముచిర్మంకి స్తస్యాః కిం విద్యతే పరమ్॥

సృగాల కాశ్యప సంవాదము. శాంతి. ౧౮౦ - ౧

బలి, ప్రహ్లాదుడు, నముచి, మంకి మొదలగువారు ప్రజ్ఞ చేతనే కృతార్థులైరి. కావున ప్రజ్ఞకన్న విలువగలది మఱియొకటియును లేదు.

నాధర్మః శ్లిష్యతే ప్రాజ్ఞం పయః పుష్కర పర్ణవత్
అప్రాజ్ఞ మధికం పాపం శ్లిష్యతే జతు కాష్టవత్॥
యథాంధ స్స్వగృహే యుక్తో హ్యభ్యాసాదేవ గచ్ఛతి
తథా యుక్తేన మనసా ప్రాజ్ఞో గచ్ఛతి తాం గతిమ్॥

శాంతి ౨౫౫ - ౭

ప్రజ్ఞావంతుడధర్మమునకు గురిగాడు. గ్రుడ్డివాడభ్యాసవశమున స్వగృహమున నిరాటంకముగ సంచరించి నటుల ప్రాజ్ఞుడు విషయముల మధ్య

నిరాటంకముగ సంచరించును.

: దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః
: వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే ॥ ౫౬

దుఃఖమునందెవరి మనస్సు ఖేదము నొందదో, సుఖమునందెవరికి నాసక్తిలేదో, అనురాగము, భయము, క్రోధము నెవరికి లేవో, వానిని స్థితప్రజ్ఞుఁడగు ముని యని చెప్పుచున్నారు.

భైషజ్య మేతద్దుఃఖస్య యదేతన్నాను చింతయేత్
చింత్యమానం హిచాభ్యేతి భూయశ్చాపి ప్రవర్తతే॥
ప్రజ్ఞయా మానసం దుంఖం హన్యాచ్ఛారీరమౌషధైః
ఏతద్విజ్ఞాన సామర్థ్యం నచాప్తై సమతా మియాత్॥

శాంతి. ౨౦౫ - ౨

(దుఃఖ హేతువగు విషయమును మరచిపోవుటచే దుఃఖము నివారణమగును) ప్రజ్ఞచే మనోదుఃఖములను, ఔషధముచే శారీరక దుఃఖములను బోగొట్టుకొనవలయును. ఇదియే విజ్ఞానమనంబడు.

: యః సర్వత్రానభిస్నేహస్తత్తత్ప్రాప్య శుభాశుభమ్
: నాభినందతి నద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ ౫౭

అన్ని విషయములయందు నెవరిమనస్సు నిస్సంగమైనదో, కాలానుసారముగ ప్రాప్తములగు శుభాశుభములయం దెవరికి నానందము గాని, విషాదము గాని లేవో, వారియొక్క బుద్ధిస్థిరమైనది (అని చెప్ప వలయును)

పాపం ప్రజ్ఞాం నాశయతి క్రియమాణః పునః పునః
నష్టః ప్రజ్ఞః పాపమేవ నిత్యమారభతేనరః ॥

పుణ్యం ప్రజ్ఞాం వర్ధయతి క్రియమాణం పునః పునః
వృద్ధప్రజ్ఞః పుణ్యమేవ నిత్య మారభతేనరః ॥
పుణ్యం కుర్వన్పుణ్య కీర్తిః పుణ్య స్థానం స్మగచ్ఛతి ॥
ఉద్యోగ. ౩౮ - ౯౩

పాపముచే ప్రజ్ఞ నశించును. ప్రజ్ఞ నశించిన కొలది పాపము వృద్ధి యగును. పుణ్యము ప్రజ్ఞను వృద్ధి బొందించును ప్రజ్ఞ వృద్ధి నొందిన పుణ్యము వృద్ధి పొందును.

యదా సంహరతే చాయం కూర్మోంగానీవ సర్వశః
ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ ౫౮

తాబేలు తన (హస్తపాదాది) అవయవముల నన్నిటిని ప్రక్కలకు ముడుచ కొనునటు లెవఁడింద్రియముల యొక్క (శబ్ద స్పర్శాది) విషయములనుండి తనయింద్రియముల నుపసంహరించు కొనునో యతనిబుద్ధి స్థిర మయినది (అని చెప్ప వలయును)

ఇంద్రియాణ్యుప సంహృత్య కూర్మోంగానివసర్వశః
క్షీణేంద్రియ మనోబుద్ధి ర్నిరీహః సర్వ తత్వవిత్ ॥
అనుగీత. అ - ౪౯

తాబేలు తన సర్వావయవములను దనలో నిముడ్చుకున్నట్లు - సర్వేంద్రియ ప్రవృత్తుల నింద్రియములయందిముడ్చుకున్న వాడు తత్వవేత్త యనిగుర్తెరుగ వలయును.

యథా కూర్మ ఇవాంగాని ప్రసార్య విని యచ్ఛతి

ఏవమేవేంద్రియగ్రామం బుద్ధిః సృష్ట్వా నియచ్ఛతి ॥

శాంతి. ౨౪౬ - ౧౪

తాబేలునకు ఇంద్రియములు స్వాధీనమందున్నట్లు, బుద్ధి స్వాధీనమందు ఇంద్రియములు గలవు, ఇంద్రియములను గురించి భారతమునందు తాబేలు దృష్టాంతములు చాలా గలవు.

ఇంద్రియాణాం రజస్యేవ ప్రళయప్రభవావుభౌ
పరీక్ష్య సంచరేద్విద్వాన్ యథావచ్ఛాస్త్రచక్షుషా ॥
జ్ఞానేంద్రియాణీంద్రియార్థాన్నోపసర్పంత్యతర్షులం।
హీనైశ్చ కరణైర్దేహీ న దేహం పునరర్హతి ॥

శాంతి. ౨౧౩ - ౨౦

విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః
రసవర్జం రసోప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ॥ ౫౯

నిరాహారుఁడగు వానికి విషయములు నివర్తించినను వాని యందున్న రసము, అనఁగా అభిలాష వదలదు; కాని పరబ్రహ్మముయొక్క యనుభవము గలిగిన పిదప (సర్వవిషయములును, వానియందున్న) అభిలాషయు వదలిపోవును.

శాంతి ౨౦౪ మనుబృహస్పతి సంవాదము నందీశ్లోకమే గలదు.

ఉపవాసైః ప్రశస్తానాం దీర్ఘం సుఖమనంతకం ॥

శాంతి. అ. ౧౭౧

ఉపవాస పరాయణులకనంత సుఖములు గలుగును

దురంతేష్వింద్రియార్థేషు సక్తాః సీదంతి జంతవః
యేత్వసక్తా మహాత్మానః తేయాంతి పరమాంగతిం ॥

శాంతి. ౨౧౫ - ౧

దురంతములగు ఇంద్రియములకు స్వాధీనుల యినవారు నంశిచెదరు.

యతతో హ్యాపి కౌంతేయ పురుషస్య విపశ్చితః
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః ॥ ౬౦

ఓకుంతీ పుత్రా ! కారణమేమన (ఇంద్రియదమనార్థమే) ప్రయత్నించు విద్వాంసులయొక్క మనస్సును సైత మీదుండగ ములగు నింద్రియములు బలాత్కారముగ పెడత్రోవలకుం గైకొని పోవును.

తాని సర్వాణి సంధాయ మనష్షష్ఠాని మేధయా
ఆత్మతృప్త ఇవాసీత బహు చింత్యమచింతయన్ ॥

శాంతి. ౨౪౯-౫

బుద్ధిచే జ్ఞానేంద్రియ సహితమగు మనస్సును నియమించి విచారముడిగి యుండ వలయును.

కించ - ఇంద్రియాణి ప్రమాదీని బుద్ధ్యా సంయమ్య యత్నతః
సర్వతో నిష్పతిష్ణూని పితా బాలాని వాత్మజాన్ ॥

తండ్రి పుత్రుల నియమించి నట్లు బలిష్ఠము లగు నింద్రియముల నియమించ వలయును.

వాగ్వేగో మనసో వేగో నింద్యా వేగస్తథైవచ
ఉపస్థోదరయోర్వేగో మృత్యు వేగశ్చ దారుణః
హర్షా వేగశ్చ బలవాన్ విద్యా వేగశ్చ దుర్జయః
రసవేగశ్చ దుర్వార్యః శ్రోత్రవేగశ్చ దుస్సహః ॥

శాంతి. ౧౫౮-౫

పైన జెప్పబడిన ఇంద్రియ వేగముల నన్ని

టిని యణగ గొట్టవలయును.

బుద్ధిః కర్మగుణై ర్హీనా యదామనసి వర్తతే
తదా సంపద్యతే బ్రహ్మతత్రైవ ప్రళయంగతం ॥ శాంతి

బుద్ధి కర్మగుణములచేహీనమై మనస్సుయందు నిలచినప్పుడు బ్రహ్మభూతుడగును.

తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః
వశేహి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ ౬౧

(కాన) ఈయింద్రియముల నన్నింటిని వశపఱచుకొని యుక్తుడవును, మత్పరాయణుడవును నయి యుండవలయును. ఈరీతిగ నింద్రియను లెవరికి స్వాధీనము లైనవో వారి యొక్క బుద్ధియే స్థిర మయినది యగును (అని జెప్ప వలయును)

పంచేంద్రియస్య మర్త్యస్య ఛిద్రంచే దేకమింద్రియం
తతోఽస్య స్రవతి ప్రజ్ఞాదృతేః పాత్రాదివోదకం ॥
ఉద్యోగ. విదురనీతి.

చలానిహీమాని షడింద్రియాణి
తేషాంయ ద్యద్వర్ధతే యత్ర యత్ర ॥
తత స్తతః స్రవతే బుద్ధి రస్య
ఛిద్రోదకుంభా దివ నిత్య మంభః ॥
ఉద్యోగ, ౩౫- ౪౮

పంచేంద్రియములలో దేనికి స్వేచ్ఛ గలిగినను చిల్లి వడిన కుండలో నీరు నిలువనట్లు - ప్రజ్ఞక్రమేణనశించును. కావున నే యింద్రియమునకు గూడ స్వేచ్ఛ నివ్వదగదు.

: ధ్యాయతో విషయా౯ పుంసః సంగ స్తేషూపజాయతే
: సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోభిజాయతే॥ ౬౨

విషయముల చింతించు పురుషునకు నావిషయముల యందు సంగము (సంబంధము) వృద్ధి పొందుచుండును. ఈసంగమునుండి కామము, అనగా విషయములు తనకు కావలయుననుకోరిక, యుత్పన్న మగును. ఈ కామము తృప్తిపొందుట కవకాశము కలిగె నేని యాకామమునుండియే క్రోధము పుట్టును.

: క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతి విభ్రమః
: స్మృతి భ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశా త్ప్రణశ్యతి ॥ ౬౩

క్రోధమునుండి సమ్మోహము, అనగా అవివేకము, బయలు వెడలును సంమోహమునుండి స్మృతిభ్రమ; స్మృతి భ్రంశము నుండి బుద్ధినాశము బుద్ధినాశమువలన పురుషునియొక్క సర్వస్వమును నశించును.

మనో యస్యేంద్రియ స్యేహ విషయా న్యాతి సేవితుం
తస్యోత్సుక్యం సంభవతి ప్రవృత్తిశ్చోపజాయతే ॥
తతస్సంకల్ప బీజేన కామేన విషయేషుభిః
విద్ధః పతతిలోభాగ్నౌ జ్యోతిర్లోభాత్పతంగత్ ॥ అధ్యా

ఇంద్రియ విషయములను సేవించుటకై బోయినప్పుడు త్సాహము గలుగును. అంతట సంకల్పాత్మకమగు కామముచే విషయములను బాణముల వలన గొట్టబడిన వాడై మిడుతవలే లోభాగ్నియందు బడి నశించును.

అభిధ్యావై ప్రధమం హంతి చైనం
కామక్రోధా గృహ్యచైనంతు పశ్చాత్
ఏతేబాలానమ్మృత్యవే ప్రాపయంతి
ధీరాస్తు ధైర్యేణ తరంతి మృత్యుం ॥

ఉద్యోగ. ౧-౧౧

విషయాపేక్ష మొదట పతన పథమునకు దీసుకొని పోవును. పిదప కామక్రోధాధులు దానికి సహాయపడి నశింప జేయును. పురుషులు మృత్యు వశులగుటకిదియే కారణము. ధీరులు ధైర్యముచే మృత్యువును తరింతురు.

తత్క్రోధం మాదృశః క్రోధముత్సృజే ల్లోక నాశనం
క్రుద్ధః పాపం నరః కుర్యాత్ క్రుద్ధో హన్యాద్గురూ నపి ॥
క్రుద్ధః పరుషయా వాచా శ్రేయసోప్యవ మన్యతే
వాచ్యా వాచ్యౌహి కుపితో న ప్రజానాతి కర్హిచిత్ ॥
నాకార్యమస్తి క్రుద్ధస్య నావాచ్యం విద్యతే తథా
హింసాత్క్రోధాదవధ్యాస్తు వధ్యాన్ సంపూజ యీతచ॥
ఆత్మాన మపిచ క్రుద్ధః ప్రేరయత్యేమ సాదనం ॥

యుధిష్ఠిర వచనము. అరణ్య. అ. ౨౯

ధర్మరాజు జెప్పుచున్నాడు - క్రోధిగురువు నైన జంపును; మఱియు జేయ రాని యేపని నైన చేయును. తుదకు దాను నరకమున గూలుట కైన సంశయించక నాత్మహత్య గావించు కొనును.

: రాగద్వేషవియుక్తైస్తు విషయా నింద్రియైశ్చరన్
: ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి ౬౪

కాని తనయాత్మ, అనఁగా అంతఃకరణము, స్వాధీనముగ సుండువాఁడు, రాగద్వేషములనుండి విముక్తములును, తనకు స్వాధీనములై యున్నవియు నగు నింద్రియములచేత విషయములలో సంచరించుచు నున్నను, చిత్తము చేతను ప్రసన్నుఁడగును.

రాగద్వేష వినిర్ముక్తాః ఐశ్వర్యం దేవతా గతాః
రుద్రాః సాధ్యాస్తథాదిత్యా వసవోథ తథాశ్వినా ॥
యోగైశ్వర్యేణ సంయుక్తా ధారయంతి ప్రజా ఇమాః ॥
శౌనకుడు - అరణ్య. ౨౯ - ౭౦

రాగద్వేషముల నొదలినవారు దేవత్వము మును బొంది ప్రజలను బోషించుచున్నారు.

సంకల్పా జ్జాయతే కామః సేవ్యమానో వివర్ధతే
యదా ప్రాజ్ఞో విరమతే తదా సద్యః ప్రణశ్యతి ॥
శాంతి. ౧౬౩ - ౭౧

సంకల్పమువలన కామము బుట్టి సేవించుటచే వృద్ధి జెందుచున్నది.

రాగాభిభూతః పురుషః కామేన పరికృష్యతే
ఇచ్ఛా సంజాయతే తస్య తతస్తృష్ణా వివర్ధతే॥
తృష్ణాహి సర్వపాపిష్ఠా నిత్యోద్వేగకరీ స్మృతా
అధర్మ బహులా చైవ ఘోరాపాపాను బంధినీ ॥
అరణ్య. ౨-౩౪

రాగాదులకు వశుడైన వాడు కామాదులచే నాకర్షించ బడి లోభగతుడై పాప పంకమందు జిక్కు కొనును.

ప్రసాదే సర్వ దుఃఖానాం హానిరస్యోప జాయతే
ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవ తిష్ఠతే ॥ ౬౫

చిత్తము ప్రసన్న మగునేని, యతని యొక్క దుఃఖములన్నియు నశించును. కారణ మేమన వారియొక్క బుద్ధియు తత్కాలముననే స్థిర మగును.

పరమం పరమాత్మానం దేవమక్షయ మవ్యయం
విష్ణు మవ్యక్త సంస్థానం విభుం తం దేవసత్తమం
తస్య మాయాపి నద్ధాంగా జ్ఞాన భ్రష్టా విచేతసః
మానవా జ్ఞాన సమ్మోహా త్తతః క్రోధం ప్రయాతివై ॥
క్రోధాత్కామ మవాప్యాథ లోభ మోహశ్చ మానవాః
మాన దర్పాదహంకార మహంకారా త్తతః క్రియా
క్రియాభిస్స్నేహ సంబంధాన్ స్నేహాచ్ఛోక మనంతరం
సుఖ దుఃఖ క్రియారంభాజ్జన్మా జ్జన్మ కృత క్షణాః ॥
శాంతి. ౨౧౩ - ౨

ఈశ్వరుని మాయచే జ్ఞానభ్రష్టులై, మోహ వశులగుచు, కామ క్రోధ లోభములకు లోబడి, జన్మ పరంపరలందు దిరుగు చున్నారు. కావున భగవద్భక్తి శూన్యతమే సర్వానర్థములకు మూల కారణమని దెలుసు కొన వలయును.

నాస్తి బుద్ధి రయుక్తస్య నచాయుక్తస్య భావనా
న చాభావయత శ్శాంతి రశాంతస్య కుత స్సుఖమ్ ॥ ౬౬

పూర్వోక్త ప్రకారముగ యోగి యుక్తుఁడు కాని వానికి (స్థిరమైన) బుద్ధియు, భావనయు, అనఁగా దృఢ బుద్ధిరూపమగు నిష్ఠయు నుండదు. భావన లేని వారికి శాంతి యుండదు. శాంతి లేని వారికి సుఖ మెచ్చోనుండి వచ్చును

నాహం తథా భీరు చరామిలోకే
యథా త్వం మాం తర్జయసే స్వ బుద్ధ్యా
విప్రోస్మి ముక్తోస్మి వనేచరోస్మి
గృహస్థ ధర్మ వ్రత వాన్ స్తథాస్మి॥
రాజ్యం పృధివ్యాం సర్వస్యామథ వాపి త్రివిష్టపే
తథాబుద్ధి రియం వేత్తి బుద్ధిరేవ ధనం మమ ॥
లింగై ర్బహుభిరవ్యగ్రై రేకా బుద్ధిరుపాసతే
నానా లింగాశ్రమస్థానాం యేషాం బుద్ధి శమాత్మికా॥
తేభావమేకమాయాంతి సరిత స్సాగరం యథా
బుధ్యాయం గమ్యతే మార్గః శరీరేణ నగమ్యతే॥

అను గీత. ౩౩ - ౧

నేను గృహస్థాశ్రమ మందుండి ముక్తుడనైతిని నాబుద్ధి సర్వము దెలుసుకొనుటకు సమర్థమైనది. నాబుద్ధియే నాకు ధనము. అందరికి బుద్ధి శమాత్మక మైనది. నదులన్నియు సముద్ర గతములైనట్లు విషయములన్నియు బుద్ధి గతములే యగుచున్నవి బుద్ధి శక్తిచే పొందిన ఫలము శరీరముచే పొంద

శక్యము గాదు.

ఇంద్రియాణాం హి చరతాం యన్మనో ను విధీయతే
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావ మివాంభసి ॥ ౬౭

(విషయములయందు) సంచరించు మనస్సు, అనగా ఇంద్రియములను వెనుక లగ్నమయి యుండు మనస్సు— ఏటియందున్న నావను గాలి వలె — పురుషుని యొక్క బుద్ధిని హరించును.

నాత్మా శక్యతే ద్రష్టుం ఇంద్రియైః కామ గోచరైః
ప్రవర్తమానైరనఘైః దుష్టై రకృతాత్మభిః॥
తేషాంతు మనసా రశ్మీన్ యదా సమ్యగ్నియచ్ఛతి
శాంతి. ౨౪౭ - ౧౪

ఇంద్రియములాత్మను జూడ జాలవు; కావున మనస్సుచే నియమించ వలయును.

తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః
ఇంద్రియా ణీంద్రియార్థేభ్యః తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥ ౬౮

కావున నోమహాబాహూ! అర్జునా! ఇంద్రియములను విషయములనుండి మరల్చి వశపఱచుకొనువాని బుద్ధియే స్థిర మయినది (అని చెప్పవలయును).

విముక్తాత్మా తథాయోగీ గుణదోషై ర్నలిప్యతే
ఏవమేవ కృత్స్నప్రజ్ఞో నదోషై ర్విషయాన్ శ్చరన్ ॥
అసజ్జమాన స్సర్వేషు కథంచ నన లిప్యతె॥
వ్యాసుడు. శాంతి ౨౪౫ - ౧౫

కృతప్రజ్ఞుడు విషయములందు సంచరించినను విషయములచే స్పృశింప బడడు.

యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తిసంయమీ
* యస్యాం జాగ్రతి భూతాని సానిశా పశ్యతో మునేః ॥ ౬౯

జనులకు నేదిరాత్రియో దానియందు స్థితప్రజ్ఞుఁడు మేల్కొను చున్నాఁడు. సర్వప్రాణులు మేల్కొనుసమయ మీజ్ఞానికి రాత్రిగాఁ దోఁచును

ఆపూర్యమాణ మచల ప్రతిష్ఠం
సముద్ర మాపః ప్రవిశంతి యద్వత్
తద్వత్కామాయం ప్రవిశంతి సర్వే
స శాంతి మాప్నోతి నకామకామీ ॥ ౭౦

నలు వైపులనుండియు (ఉదకముచేత) నిండింపఁబడినను లేశమున్ను దాఁటని సముద్రమునందు జలమంతయుఁ జేరినట్లు, ఎవ్వనియందు విషయములన్నియు (అతని శాంతిని చెడఁగొట్టకుండ)

---

* ఈ శ్లోకమున విరోధాభాసాలంకారము. అజ్ఞాన మన నంధకారమనియు, జ్ఞానమన ప్రకాశమనియు, నర్థము. (గీత. ౧౮. ౧౧) "అజ్ఞానుల కేది యక్కఱ లేదని తోఁచునో, అనగా వారికి నేది యంధకారమో, యది జ్ఞానికి కావలసి యుండును; మఱియు సజ్ఞానులు దేనియందనురక్తు లగుదురో (అనగా అజ్ఞానులకు వెలుతురుగా నుండునది జ్ఞానికి చీకటిగ దోఁచును. అది జ్ఞానులకు నక్కఱ లేనిది యగును" అని యీశ్లోకమున కర్థము.

ఉదాహరణము — జ్ఞానులు కామ్యకర్మలు తుచ్ఛములనుకొందురు. వానియందే సామాన్యులు సుఖులై యుందురు. మఱియుజ్ఞానులకుగావలసిన నిష్కామకర్మ యితరులకక్కఱలేదు

(ఈ విషయము తిలకాచార్యుని గీతారహస్యము నుండి గ్రహించ బడినది.)

ప్రవేశించునో, యతండే (నిజమగు) శాంతిం బొందును. విషయేచ్ఛను జెందినవారు (శాంతిని పొందుట) దుర్లభము.

(శాంతి. ౨౫౧ అ.) వ్యాసమహర్షి శుకునకు అన్ని ధర్మములలో ఇంద్రియ దమనధర్మమే ఉత్తమమని జెప్పి - యుండే "అపూర్వ్యమాణ" అను దాని యథాతథాగా నుడిపి దానితర్వాత క్రింది శ్లోకమును జెప్పెను.

సకామ కాంతో నతు కామ కామః
సవై కామాత్స్వర్గ ముపైతి దేహీ॥ ౯

వాడు తన కామములెల్ల నోడ గూడుటచే మిక్కిలి సుఖము నొందుచున్నాడు కామకామియగు వాడట్లు గాడు వాడు స్వర్గమును బొందినను మరల నందు బడిపోవ గలడు.

విహాయ కామాన్యస్సర్వాన్పుమాంశ్చరతి నిస్పృహః
నిర్మమో నిరహంకారః సశాంతి మధి గచ్ఛతి॥ ౭౧

కర్మల నన్నింటిని వదలి నిస్పృహుండై (వ్యవహారమున) సంచరించు చు మమత్వము నహంకారము లేని పురుషునకే శాంతి లభించును.

యః కామానాప్నుయాత్సర్వాన్యశ్చైతాన్కేవలాన్ త్యజేత్
ప్రాపణాత్సర్వకామానాం పరిత్యాగో విశిష్యతే॥ ౧౨
నివర్తస్వ విధిత్సాభ్యః శామ్య నిర్విద్య కాముక
అసకృచ్చాసి నికృతో నచ నిర్విద్యసె తతః॥ ౧౯
యది నాహ వినాశస్తే యద్యేవం రమసే మయా
మా మాం యోజయ లోభేన వృథా త్వం విత్త కాముక॥
నూనంహి హృదయం కామ వజ్రసార మయం ధృఢం

యదనర్థ శతారిష్టం శతధా న విదీర్యతే ॥ ౪౩
కామ జానామి తే మూలమ్ సంకల్పాత్కిల జాయసే
న త్వాం సంకల్ప యిష్యామి సమూలో న భవిష్యసి ॥
త్వయా హి మే ప్రణుసన్న స్య గతి రన్యా న విద్యతే
తృష్ణాశోక శ్రమాణాంహి త్వం కామ ప్రభవ స్సదా॥
పరిత్యజామి కామ త్వాం హిత్వా సర్వ మనో గతీః
న త్వం మయా పునః కామ వత్స్యసె నచ రంస్యసె॥
యద్య త్యజతి కామానాం తత్సుఖస్యాభి పూర్యతే
కామానృవశ గో నిత్యం దుఃఖమేవ ప్రపద్యతే ॥ ౪౬
అన్మనా సప్తమం కామం హత్వా శత్రు మివోత్తమం
ప్రాప్యావధ్యం బ్రహ్మ పురమ్ రాజే వస్యామహం సుఖీ॥
ఏతామ్ బుద్ధిమ్ సమాస్థాయ మంకీ సర్వేదమా గతః
సర్వాన్ కామాన్ పరిత్య జ్య ప్రాప్య బ్రహ్మమహాత్సుఖం॥
మంకి గీత. శాంతి. అ. ౧౭౭

మంకి యను బ్రాహ్మణుడు దనకు ప్రియము లగు రెండు వృషభములు మరణించగా విరక్తుడై కామమును నిరసించి ముక్తుడయ్యెను. అతడు జేసిన కామ తిరస్కారము పై శ్లోకములందు వర్ణించబడినది దాని యర్థమే క్రింద వ్రాయ బడు చున్నది.

ఓ కామమా! విషయముల నుండి మరలుము. విద్యాహీనురాలా! శాంతిని బొందుము. అనేక పర్యాయము లపకారము ను బొందియు నాతోడనే యుండుటకు గోరుదువు. ఓ ద్రవ్యాపేక్ష పరురాల వగు కామమా! నన్ను లోభము నందు

బడ వేయును. నిన్నీశ్వరుడు వజ్రమయముగా జేసి యున్నాడు. సర్వానర్థములతో గూడుకొని యున్న నీవు నూరు దునుకలుగా నేల గావు? ఓ కామమా! నీ మూలము తెలియును నీవు సంకల్పము వలన వృద్ధిబొందుదువు నీచేతులలో జిక్కిన నాకు వేరుగతిలేదు ఆశ దుఃఖము ఆయాసము వీటి కన్నిటికి నీవు కారణము కామవశుడు దుఃఖముల నొందును నిన్ను వదలి నేను రాజువలె సుఖముగా నుండగలను. మఱియు బ్రహ్మపదమును పొందగలను.

: ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి
: స్థిత్వాస్యామంతకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి॥ ౭౨

ఓ పార్థా! బ్రాహ్మీస్థితి యనగ నిదియే. ఇట్టి స్థితి లభించిన పిదప నెవరును మోహము నొందరు; మఱియు నంత్యకాలమునందు, అనగా: మరణ సమయము నందు సయితమీస్థితి యందే యుండును గాన నతనికి బ్రహ్మనిర్వాణము, అనగా బ్రహ్మమందు కలసి పోవుట యను స్వరూపము గల మోక్షము, లభించును.

శ్రీర్హి మానార్థ సంవాసాత్సాచాపి పరిపంథిని
బ్రాహ్మీ సుదుర్లభా శ్రీర్హి ప్రజ్ఞాహీనేన క్షత్రియ॥
సనత్సుజాతీయము. ౧-౪౨

గౌరవము నపేక్షించి కర్మలు జేయు నతడు సంపదల బడయును. కాని ఆసంపదలు బ్రహ్మానంద ప్రాప్తికి నిరోధము గలిగించును. ప్రజ్ఞానహీనుడు బ్రహ్మ పదవిని పొందజాలడు.

సాంఖ్య యోగము
ముగిసెను.

౧ యుద్ధ రంగమున బంధు మిత్రాదుల నే చంపవలయునను యేమోహముచే అర్జునుడు విషాదమును బొంది కర్తవ్య భ్రష్టుడగుటకు సిద్ధపడెనో, యామోహము విషాదము లెస్సగా రెండవ యధ్యాయమున బరిహరింప బడినవి.

౨ యుద్ధానంతరము (సన్యాసమే సర్వ శ్రేయ మనియు, కర్మ పరతంత్రత అధః పతనమునకు మూల మనియు, విశ్వసించి సన్యసింప దలచు ధర్మ జునకు. దేవస్థాన వ్యాస వాసుదేవాది మహాత్ములు సుక్షత్రియు నకు సుశాసన మూలమున లభించునంత సఫలము సన్య సించుటచే గలుగదని సుమారు ౨౯ అధ్యాయముల గ్రంధము జెప్పి నిష్కామ ధర్మ మహిమ జేసిరి. అచ్చట జెప్పబడిన సాంఖ్యధర్మ సూక్ష్మములన్నియు, గీతలోని సాంఖ్య యోగమున జూడ దగును.

౩ సాంఖ్య యోగమున మొదటి ౩౦ శ్లోకములలో ఆత్మ యవినాశి యనియు, అది ఒకటే యనియు శరీర పతనము దప్పని సరి యనియు, సమత్వ (లేక సామ్య) బుద్ధియే, శ్రేష్ఠ మైనదనియు, సాంఖ్యములోని తుది తత్వములు బోధించ బడినవి. పిదప ౨౩ శ్లోకములలో, స్వధర్మాచరణకన్న గొప్ప ధర్మ మొకటి లేదనియు, స్వధర్మ పరిహరించిన వారు కీర్తిని చంపుకొని బాపమును బొందుదురనియు, జెప్పి కర్మ తత్వములోని కొన్ని యంశములు సూక్ష్మముగా దెలుప బడెను. తదనంతరము అర్జుని చే స్థితప్రజ్ఞుని లక్షణ మడుగ బడగా: ౧౮ శ్లోకములలో, బాహ్యాంతరము లందెవడు జితేంద్రియుడో వాడే స్థితప్రజ్ఞుడనియు, పూర్వోక్తమైన (ధర్మమును) యోగయుక్తుడుగాని వానికి ప్రజ్ఞ కుదురదనియు, మొత్తము ౬౨ శ్లోకములలో సాంఖ్యము విరమించ బడినది.

శ్రీ శివాభ్యాం నమః

# శ్రీ కుమారగీత

## కర్మయోగము.

### తృతీయోఽధ్యాయః

కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయః॥

---

అర్జున ఉవాచ.

జ్యాయసీ చేత్కర్మణ స్తే మతా బుద్ధిర్జనార్దన
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ॥ ౧
వ్యామిశ్రేణైవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే
తదేకంవద నిశ్చిత్య యేన శ్రేయోహమాప్నుయామ్॥ ౨

అర్జునుఁ డడుగుచున్నాఁడు - ఓ జనార్దనా! కర్మకంటె (సామ్య-) బుద్ధియే శ్రేష్ఠమని నీమత మగునేని, ఓ కేశవా! నన్ను (యుద్ధమను) ఘోరకర్మయందేల ప్రవర్తింపఁ జేయుచున్నావు.

మాపులవు వ్యామిశ్రమునలె, అనఁగా: వ్యర్థముగుదానివలె నున్న భాషణచే నాబుద్ధిని నీవు భ్రమ చెందించుచున్నావు. ౨

యదిదం వేద వచనం కురు కర్మ త్యజేతిచ
కాంగతిం విద్యయా యాంతి కాంచ గచ్ఛంతి కర్మణా॥

శుక ప్రశ్న శాంతి. ౨౪౧

కర్మ జేయుమనియు, వలదనియు వేదమే రెండు విధముల జెప్పుచున్నది. ఈరెండు విషయలలో నేది గ్రహింప దగినది? మఱియు విద్య (జ్ఞానము) చేత (కర్మ చేయక పోవుటచే) మనుష్యులేదిక్కునకు బోవుదురు? కర్మచేయుటచే నేదిక్కునకు బోవుదురు? ఈవిషయము నాకు దెల్పుమని శుకుడు తండ్రిని ప్రశ్నించెను.

శ్రీభగవానువాచ.

లోకేస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయా నఘ
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేనయోగినామ్ ॥ 3

భగవంతుఁడు సెప్పుచున్నాఁడు - ఓ పాపహీనుఁడవగు నర్జునుఁడా పూర్వమునందు (అనఁగా రెండవయధ్యాయమునందు) జ్ఞానయోగముచే సాంఖ్యులకును, కర్మయోగముచే యోగులకును నీలోకమున రెండునిష్ఠలు నాచేఁ జెప్పఁబడినవి.

మోక్షేహి త్రివిధా నిష్ఠాదృష్టాన్యైర్మోక్షవిత్తమైః
జ్ఞానం లోకోత్తరం యచ్చ సర్వత్యాగశ్చ కర్మణాం ॥
జ్ఞాననిష్ఠాంవదంత్యేకే మోక్షశాస్త్రవిదో జనాః
కర్మనిష్ఠాం తథైవాన్యే యతయ స్సూక్ష్మదర్శినః ॥
ప్రహాయోభయ మప్యేవం జ్ఞానం కర్మ చ కేవలం
తృతీయేయం సమాఖ్యాతా నిష్ఠా తేన మహాత్మనా ॥

సులభా జనక సంవాదము. శాంతి. 3౨౧ - 3౫

మోక్షప్రాప్తి. కొఱకు మూఁడు విధములగు

నిష్ఠలను మోక్ష శాస్త్రజ్ఞులు జెప్పు చున్నారు. అవి యేవనగా—

౧ - జ్ఞానమును సంపాదించి కర్మ త్యాగము జేయుట దీనినే కొందఱు జ్ఞాన నిష్టయని జెప్పుదురు.

౨ - మఱి కొందఱు సూక్ష్మధర్మములు కర్మ నిష్ఠయే శ్రేష్ఠమైనదని జెప్పుగారు; (కాని జ్ఞానము కేవల కర్మ, యను నీ రెండు నిష్ఠల వదలి)

3 - మూడవదగు జ్ఞానముచే నాసక్తిని బోగొట్టుకొని కర్మలను జేయు నిష్ఠయే మహాత్ము లగు పంచశిఖా చార్యులచే నాకు జెప్ప బడినది. నిష్ఠ యనగ, తత్పరత లేక గా ఆదర్శ విషయ మందు నిమగ్నుడై యుండుట.

ద్వావిమా వధ సంధానా యత్ర వేదాః ప్రతిష్ఠితాః
ప్రవృత్తి లక్షణో ధర్మో నివృత్తౌచ సుభాషితః ॥
వ్యాసుడు. శాంతి. ౨౪౧

వేదములు రెండు ప్రతిష్ఠితములగు మార్గ ముల నేర్పరచెను.

౧ - ప్రవృత్తి ధర్మమనియు, ౨ - నివృత్తి ధర్మమనియు. ప్రవృత్తి యనగా విషయాదులందు నిమగ్నుడై యుండుట. నివృత్తి యనగా విషయా

దులయందు నిమగ్నుడు గాకుండుట. ఇదియే శ్రేయ
మగు మార్గము.

న కర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోశ్నుతే
నచ సన్న్యసనా దేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥ ౪

(కాని) కర్మలను ప్రారంభింపక పోవుట మాత్రముచేత
నెవ్వరికిని నైష్కర్మ్యమును సిద్ధింపదు. కర్మలయొక్క సన్న్యా
సము (త్యాగము) చేయఁబడినంత మాత్రముచేతనే మోక్షము
లభింపదు.

వేదే వచనముక్తంతు కురు కర్మ త్యజేతిచ ॥
శుకప్రశ్న శాంతి. ౨౪౨

వేదములందు కర్మ జేయుమనియు, చేయ
వద్దనియు, జెప్ప బడినది. ఈ రెండిటిలో యేవచన
మాశ్రయించ దగినది.

బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థోథ భిక్షుకః
యథోక్తా చారిణ స్సర్వే గచ్ఛంతి పరమాం గతిమ్॥

వ్యాసుడు శుకునకిట్లు జెప్పుచున్నాడు.
బ్రహ్మచారియు, గృహస్థుడును, వానప్రస్థుడును,
భిక్షుకుడును, దమతమకు విహితములగు కర్మల
నాచరించి రేని యుందఱును బరమగతిని బొందుదురు.

౧- బ్రహ్మచారి "ఆశ్రమా దాశ్రమే ష్వేవ
శిష్యోవ ర్తేత కర్మణా" మనస్సును కర్మలందుంచి
తెలివి గలిగి గురుకుల వాసము జేయవలయును.

౨- గృహస్థు "సర్వాత్మనాతు కుర్వీత గృహస్థః కర్మ నిశ్చయం" కర్మల నన్నింటిని (నిష్కామయా) జేయ వలయును.

3 - బ్రహ్మచర్య గృహస్థా శ్రమములందలి విహితములగు స్వకర్మల నాచరించి వానప్రస్థాశ్రమమును స్వీకరించిన వాడు పూర్వకృత కర్మలచే బవిత్రుడై బ్రహ్మ భూతుడగును. "ఆశ్రమాదాశ్రమం పుణ్యం పూతో గచ్ఛతి కర్మభిః"

స్వకర్మభి శ్శంసితానాం ప్రకృత్యా శంసితాత్మనామ్
ఋజూనామ్ శమ నిత్యానామ్ స్వేషుకర్మసు వర్తతామ్॥
సర్వ మానంత్యమేవాసీ దితిన శ్శాశ్వతీ శ్రుతిః ॥

గోకాపిలీయము. శాంతి. ౨౬౯

స్వకర్మలయందాసక్తి, ఇంద్రియ నిగ్రహము, ఋజు స్వభావము, అంతరింద్రియ నిగ్రహము, ఈ గుణములు గల వారికి సర్వము సమృద్ధమైన దని శృతి బలుకు చున్నది.

గ్రామ్యం దృశ్యంచ సత్యంచ యదిదం కర్మ విద్యతే
ఏతదేవ వ్యవస్యంతి కర్మాకర్మేతి కర్మిణః ॥
మోహ మేవ నియచ్ఛంతి కర్మణా జ్ఞాన వర్జితాః
నైష్కర్మ్యం నచలోకేస్మిన్ ముహూర్తమపి లభ్యతే॥
కర్మణా మనసా వాచా శుభంవా యదివా శుభం

జన్మాది మూర్తి భేదాంతం కర్మ భూతేషు వర్తతే ॥
అశ్వమేధ. ౨౦

గ్రహించ తగినది, చూడ దగినది, సత్యమైన దిని, యగు యేకర్మ గలదో దానినే కర్మపరాయణులు కర్మ యని యకర్మ యని జెప్పుదురు.

జ్ఞాన శూన్యులు కర్మ చేయుటచే మోహమునే పొందు చున్నారు. కర్మ లేక లోకమందు క్షణమైన యుండదు మనోవాక్కాయములచే శుభాశుభములలో నేది యొనర్చినను, పుట్టినది మొదలు చచ్చు వఱకు భూతములందు కర్మ వర్తించుచునే యుండును.

నహి కశ్చిత్క్షణ మపి జాతు తిష్ఠ త్యకర్మకృత్
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజై ర్గుణైః ॥ ౫

కారణ మేమనః ఎవరైనను (ఏదో యొక కర్మ) చేయకుండ క్షణమాత్రమైన నుండలేరు. ప్రకృతియొక్క గుణములు పరతంత్రుఁడగు ప్రతిమనుజుని (ఒకానొకప్పుడైనను) కర్మను చేయునట్లు ప్రవర్తింపఁ జేయుచున్నవి.

ఏతే ప్రధానస్య గుణాః స్త్రయః పురుష సత్తమ
కృత్స్నస్య చైవ జగతః తిష్ఠంత్యనపగా స్సదా ॥
యాజ్ఞవల్క్య జనక సంవాదము. శాంతి. ౩౧౫

సత్వరజస్తమో గుణములే సర్వ జగత్తును నడిపించు చున్నవి. అధ్యాత్మ నిష్ఠులు సత్వగుణ

ముత్తమ స్థానమును, రజో గుణము మధ్యమస్థానమును, తమోగుణమధమ స్థానమును బొందించు నని జెప్పుదురు.

"సాత్త్విక స్యోత్తమం స్థానం రాజసస్యేహ మధ్యమం
తామస స్యాధమం స్థానం ప్రాహురధ్యాత్మచింతకాః॥"

మఱియు, కేవల సత్వ గుణము దేవత్వమును, రజో గుణము మనుష్య త్వమును, రజస్తమో గుణములు మృగపశ్వాది జన్మములను గలిగించును. త్రిగుణాతీతుఁడు శాశ్వతపదవిని బొందుదురు; ప్రకృతి సంబంధములగు త్రిగుణములే సర్వ కర్మలకు కారణమై యున్నవి

"కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసాస్మరన్
ఇంద్రియార్థా న్విమూఢాత్మా మిథ్యాచారస్సఉచ్యతే॥ ౬

(హస్త పాదాది) కర్మేంద్రియములను నియమించు కొని, మనస్సుచే నేమూఢుఁ డింద్రియముల యొక్క విషయములను చింతన చేయు చుండునో, వానిని మిథ్యాచారుఁడని చెప్పుదురు.

జాజిలి కౌశికుఁడు, మొదలగు వారు బ్రాహ్మణులై నియమవంతులయ్యును అహంకారాదులచే జెడి తులాధార ధర్మ వ్యాధాదుల వద్ద ధర్మ సూక్ష్మముల గ్రహించిరి. కర్మేంద్రియముల నియమము జ్ఞానమునకు సాధనమాత్రమే గాని జ్ఞానము గాజాలదు.

యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేర్జున
కర్మేంద్రియైః కర్మయోగ మసక్తః సవిశిష్యతే ॥ ౭

కాని, యోయర్జునా! మనస్సుచే నింద్రియములను నిరోధించి యనాసక్తమగు బుద్ధితో కర్మేంద్రియములచే (మాత్రము) కర్మ నాచరించువాని యోగ్యత గొప్పది.

కర్మేంద్రియములు కర్మయోగమందు నిబద్ధములై యున్నను, జనకుడు, తులాధారుడు ధర్మవ్యాధుడు మొదలగు వారు జ్ఞానులై, అహంకారావేశులైన వారికి జ్ఞన బోధ జేసి యుండిరి.

తేనాహం సాంఖ్యముఖ్యేన సుదృష్టార్థే న తత్వతః
శ్రావిత స్త్రివిధమ్ మోక్షమ్-నచ రాజ్యాద్విచాలితః ॥
జనక సులభా సంవాదము. శాంతి. ౩౨౦

నేనుసాంఖ్య వేత్తయగు పంచశిఖాచార్యుల వారిచే మోక్ష ప్రాప్తికి మూడు విధములగు మార్గముల దెలుసుకొని రాజ్య భార గ్రహణము నుండి చలించుట లేదు.

వేదాహమ్ జాజిలే ధర్మమ్ సరహస్యం సనాతనమ్ ॥
శాంతి. ౨౬౨

నేను సనాతనమగు ధర్మను సరహస్యముగా సంసారమందుండియే దెలుసుకొంటిని; యని తులాధారుడు జాజిలికి జెప్పెను.

ధృతి మాసాత్మవాన్ బుద్ధిం నిగృహ్ణీయా దసంశయమ్

మనో బుద్ధ్యై నిగృహ్ణీయాద్విషయాన్మన సాత్మనః ॥
నిగృహీ తేంద్రియ స్యాస్య కుర్వాణ స్సమనో వశే
దేవతా స్తత్ప్రకాశంతే హృష్టా యాంతి తమీశ్వరమ్ ॥
తాభిః స్సంసక్త మనసో బ్రహ్మ తత్సం ప్రకాశతే
ఏతైశ్చాపగతై స్సత్వే బ్రహ్మ భూయాయ కల్పతే ॥
వార్ష్ణేయాధ్యాత్మము. శాంతి: ౨౧౫

ధైర్యము, పరిశుద్ధమైన ఆత్మయు గలవాడు సందేహము లేక మొదట బుద్ధి నరికట్ట వలయును. పిదప మనస్సును గూడ నిరోధించ వలయును. ఈ ప్రకారమే యింద్రియముల నెల్ల నిగ్రహించు కొనిన వానికి నా యింద్రియములు (అనగా నింద్రియ దేవతలు) ప్రకాశించు చున్నవి. ఇంద్రియములు మనస్సులో లీనము కాగా నట్టి వారికి బ్రహ్మమెంతయు ప్రకాశించు చున్నది. ఇంద్రియగుణము లెల్ల నశించి యాత్మ తన శుద్ధసత్వమును మరల బొందగా నది బ్రహ్మ భూయమగును.

నియతం కురు కర్మత్వం కర్మజ్యాయో హ్యకర్మణః
శరీరయాత్రాపిచ తే న ప్రసిద్ధ్యే దకర్మణః ॥ ౮

(స్వధర్మానుసారముగ) నియతమైన, అనగా నియమింపబడిన, కర్మను నీవు సేయుము. కారణ మేమన: కర్మను చేయక పోవుట కంటె చేయుటయే మిక్కిలి మంచిది ఇంతియ కాక బాగుగ విచారించ కొనుము) కర్మచేయకపోయితి వేని (తినుట

యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేర్జున
కర్మేంద్రియైః కర్మయోగమసక్తః సవిశిష్యతే ॥ ౭

కాని, యోయర్జునా! మనస్సుచే నింద్రియములను నిరోధించి యనాసక్తమగు బుద్ధితో కర్మేంద్రియములచే (మాత్రము) కర్మ నాచరించువాని యోగ్యత గొప్పది.

కర్మేంద్రియములు కర్మయోగమందు నిబద్ధములై యున్నను, జనకుడు, తులాధారుడు ధర్మవ్యాధుడు మొదలగువారు జ్ఞానులై, అహంకారావేశులైన వారికి జ్ఞానబోధ జేసి యుండిరి.

తేనాహం సాంఖ్యముఖ్యేన సుదృష్టార్థేన తత్త్వతః
శ్రావిత స్త్రివిధమ్ మోక్షమ్-నచ రాజ్యాద్విచాలితః ॥
జనక సులభా సంవాదము. శాంతి. ౩౨౦

నేను సాంఖ్యవేత్తయగు పంచశిఖాచార్యుల వారిచే మోక్షప్రాప్తికి మూడు విధములగు మార్గముల దెలుసుకొని, రాజ్యభార గ్రహణము నుండి చలించుట లేదు.

వేదాహమ్ జాజిలే ధర్మమ్ సరహస్యం సనాతనమ్ ॥
శాంతి. ౨౬౨

నేను సనాతనమగు ధర్మను సరహస్యముగా సంసారమందుండియే దెలుసుకొంటిని; యని తుల్లాధారుడు జాజిలికి జెప్పెను.

ధృతిమాసాత్మవాన్ బుద్ధిం నిగృహ్ణీయా దసంశయమ్

మనో బుద్ధ్యా నిగృహ్ణీయా ద్విషయానాత్మ న సాత్మనః ॥
నిగృహీ తేంద్రియ స్యాస్య సర్వాణ స్సమనో వశే
దేవతా స్త త్ప్రకాశంతె హృష్టా యాంతి తమీశ్వరమ్ ॥
తాభి స్సంసక్త మనసో బ్రహ్మ తత్సం ప్రకాశతె
ఏతైశ్చాపగతై స్సర్వే బ్రహ్మ భూయాయ కల్పతె ॥
వార్ష్ణే యాధ్యాత్మము. శాంతి: ౨౧౫

ధైర్యము, పరిశుద్ధ మైన ఆత్మయు గలవాడు సందేహము లేక మొదట బుద్ధి సరికట్ట వలయును. పిదప మనస్సును గూడ నిరోధించ వలయును. ఈ ప్రకారమే యింద్రియముల నెల్ల నిగ్రహించు కొనిన వానికి నాయింద్రియములు (అనగా నింద్రియ దేవతలు) ప్రకాశించు చున్నవి. ఇంద్రియ ములు మనస్సులో లీనము కాగా నట్టి వారికి బ్రహ్మమెంతయు ప్రకాశించు చున్నది. ఇాద్రియగుణము లెల్ల నశించి యాత్మ తన శుద్ధసత్వమును మరల బొందగా నది బ్రహ్మ భూయమగును.

నియతం కురు కర్మత్వం కర్మజ్యాయో హ్యకర్మణః
శరీరయాత్రాపిచ తే న ప్రసిద్ధ్యే దకర్మణః ॥ ౮

(స్వధర్మానుసారముగ) నియతమైన, అనగా నియమింపబడిన, కర్మను నీవు సేయుము. కారణ మేమన: కర్మను చేయక పోవుట కంటె చేయుటయే మిక్కిలి మంచిది ఇంతియ కాక బాగుగ విచారించ కొనుము) కర్మచేయకపోయితి వేని (తినుట

కైనను లభింపకపోవును. అందుచే) నీయొక్క శరీర సంరక్షణయు సంభవింపదు.

> అథచేదాత్మ భాగ్యేషు నాన్యేషామ్ సిద్ధిమశ్నుతే
> తస్మాత్కర్మైవ కర్తవ్యం నాస్తి సిద్ధిరకర్మణః॥
> శాంతి ౧౦-౪

చేయబడిన కర్మ యొక్క ఫలమే యనుభవించబడును. ఇతరుల కర్మ ఫలములు మనకెంత మాత్రము పయోగించవు. ఇందుచే సత్కర్మమే జేయదగినది. కర్మ హీనునకు మోక్షమెంత మాత్రము లభించదు.

"అవేక్షస్వ యథా సైన్వైః కర్మభిర్వ్యావృతం జగత్"

ధర్మనందనా! కొందఱు యువకులు మోక్షకాములై యడవులలోనికి బోయిరి వారిని పక్షి రూపముతో ఇంద్రుడుజూచి యిట్లు బలికెను.

> కర్మాణి వైదికాన్యస్య స్వర్గః పంథాః క్రతూత్తమః
> కథం మే సర్వ కార్యాణి మంత్ర సిద్ధాని చక్రిరే॥
> శాంతి. ౧౧౮

జాత కర్మ మొదలు కొని మరణాంతము ప్రతిను బ్రాహ్మణునకే వేదవిహిత కర్మలు విధింపబడినవో యవి యన్నియు కళ్యాణ ప్రదములైనవి. మఱియు మంత్ర సిద్ధములైనవి

ఓ ఋషి పుత్రులరా "అథ వేకర్మ నింద యో మనుష్యాః కాపథం గతాః" కర్మను నిందించిన వారు కుమార్గముల పాలైరి; కావున మీ సపుకటైన సరిగా రాని మీరు కర్మ రహితులై చెడి పోకుడు. లేక కర్మయే మేము జేయుచుందు రేని తిండి దొరుకుటయే దుర్లభ మగును "సాయం ప్రాతర్వి భజ్యాన్నమ్ స్వకుటుంబే యథా విధి" ప్రాత స్సాయం కాలము లందు స్వకర్మచే సంపాదింప బడిన యన్నమును యథావిధి విభజించి యారగించు వారు విఘశాసను లన బడుదురు. ఈ ప్రకారముగా యాయువకులకు ఇంద్రుడు బోధించి యింటికి బంపెనని యర్జునుడు ధర్మజునకి దెలిపెను.

"సర్వాత్మనాతు కర్తవ్యతగ్ ప్రాస్థః కరమ నిశ్చయమ్" (శాంతి. ౨౫౫ - ౫) అని పరాశర గీతయందు అన్ని విధముల చేతను కర్మ జేయ వలయు నని జెప్ప బడిన ది. మఱియు "విగుణంచ పునః కర్మ జ్యాయ ఇత్యను శుశ్రుమ" గుణ రహితమగు కర్మ యైనను శ్రేష్ఠమని తులాధారుడు జెప్పెను. "ఆద్యవంతః కర్మాణి శరీరమ్ కర్మ బంధనమ్" (అశ్వమేధ. 33-2) కర్మలాద్యంతము లు గలవి, మఱియు శరీరము కర్మలచే బంధింప బడి యున్నది; కావున శరీర యాత్ర జరుగు చున్నంత వఱకు కర్మ చేయక తప్పదు.

యజ్ఞార్థాత్కర్మణో న్యత్ర లోకో యం కర్మ బంధనః
తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగః సమాచర ॥ ౯

యజ్ఞముకొఱకు చేయఁబడిన కర్మలు దక్క నితరములగు కర్మలచే నీ లోకము బంధింపఁ బడుచున్నది. అందుకై; అనఁగా: యజ్ఞార్థమయి (చేయతగిన) కర్మలను (నైతము) ఫలాశను విడలి చేయుము,

యజ్ఞార్థాని హి సృష్టాని యథార్థా శ్రూయతే శృతిః
ఏవమ్ పూర్వతరా స్సర్వే ప్రవృత్తా శ్చైవ మానవాః॥
గో కాపిలీయము. శాంతి. ౨౬౮

పశవశ్చాథ ధాన్యంచ యజ్ఞస్యాంగ మితి శృతిః ॥ అనగా యజ్ఞమునకు పసుధాన్యములు అంగములని శృతి జెప్పుచున్నది. "యజ్ఞో యష్టవ్య ఇత్యేవ యోయజత్యఫలేప్సయా" యజ్ఞములు నిష్కామయా తప్పక చేయ దగినవి

గార్హస్థ్య యజ్ఞ ధర్మలలో యేవి యుత్తమములని ధర్మరాజుడు భీష్ముని ప్రశ్నింపగా రెండిటిలో యజ్ఞధర్మ ముత్తమమైనదని భీష్మునిచే చెప్ప బడినది.

చాతుర్వర్ణ్యస్య కర్మాణి చాతుర్వర్ణ్యంచ కేవలమ్
అసృజత్సహి యజ్ఞార్థే పూర్వ మేవ ప్రజాపతిః ॥
భీష్ముడు. అను. ౭౮-౫

యజ్ఞము కొఱకై ప్రజాపతి పూర్వమందే నాలుగు వర్ణముల యొక్క కర్మలు, వర్ణములు

వీటిని సృష్టించెను.

యజ్ఞమే విష్ణువని యుండుటచే, యజ్ఞము (అనగా ఈశ్వరుడు) కొఱకే కర్మలు జేయవలయు నని శ్రీశంకరాచార్యుల వారు వ్రాసిరి.

సహ యజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః
అనేన ప్రసవిష్యధ్వ మేషవో స్త్విష్టకామధుక్॥ ౧౦

పూర్వమున, యజ్ఞముతోడనే ప్రజల సృజించి బ్రహ్మదేవు డిట్లు చెప్పెను. (ఈయజ్ఞములయొక్క) యోగముచే మీరు వృద్ధినొందుదురు గాక; యది మీకు కామధేనువు, అనగా: ఇష్టములగు మనోరథముల పూర్ణము చేయునది అగుగాక;

మమ త్వం నాభితో జాతః ప్రజాసర్గకర ప్రభుః
సృజ ప్రజాస్త్వం వివిధా బ్రహ్మన్ స జడ పండితాః॥
నారాయణుడు, శాంతి, ౩౪౯ - ౧౪

ఓ బ్రహ్మా! ప్రజల సృష్టించుటకు గాను నీవు నా నాభి కమలము నుండి బుట్టితివి; కావున మూర్ఖులను, పండితులను గలిపి సృష్టి జేయుము.

వేదవేదాంగసంయుక్తాన్ యజ్ఞాన్ యజ్ఞాంగ సంయుతాన్
నిర్మమే లోకసిద్ధ్యర్థం బ్రహ్మ లోక పితామహః॥
అష్టాభ్యః ప్రకృతిభ్యశ్చ జాతమ్ విశ్వమిదం జగత్॥

వేద వేదాంగములను, యజ్ఞయజ్ఞాంగములను యెనిమిది ప్రకృతులాధారముగా బ్రహ్మ సృష్టించెను.

ప్రజాపతిః ప్రజాః సృష్ట్వా కర్మతాసు విధాయచ

వర్ణే వర్ణే సమాధత్త హ్యేకైకం గుణ భాగ్గుణం॥
అశ్వత్థామ. సౌప్తిక. ౩-౧౮

ప్రజాపతి ప్రజలను సృష్టించి, వారలకు కర్మలనిర్ణయించి, ప్రతివర్ణమునందు గుణవిశేషముల గల్పించెను.

సృష్టాః ప్రజా ఇమాః సర్వా బ్రహ్మణా పరమేష్ఠినా।
శాంతి. ౩౪౯ అ.

పృథివీ సర్వ భూతానాం జనిత్రీ తద్విధా స్త్రియః
పుమాన్ ప్రజాపతిస్తత్ర శుక్రం తేజో మయం విదుః।
శాంతి. ౧౯౦-౧౪

భూతములకన్నిటికి భూమి యెట్లు మాతృదేవతయో, ఆట్లే, స్త్రీలుఁ గూడ. — ప్రజాపతి పురుషుడు, శుక్రము తేజోమయము.

ప్రజలు, కర్మలునొ పర్యాయము సృష్టింప బడినట్లు మన కనుభవము చేతనే విశద పడుచున్నది. ఇట్టి కర్మలను నిరాదరణగా జూడ దగదు.

: దేవాన్భావయతా నేన తే దేవా భావయంతు వః
: పరస్పరం భావయంతః శ్రేయః పర మవాప్స్యథ ౧౧

యజ్ఞములచేత దేవతలను మీరు గౌరవింప వలసినది. దేవతలు మీకును సమృద్ధి నిత్తురు గాక; ఇట్లు పరస్పరమును సంభావన చేసికొందురేని మీయిరువురకును పరమమగు శ్రేయః ప్రాప్తి యగును.

తతోథ వరదో దేవ స్తా స్సర్వా నమరాన్ స్థితాన్
అశరీరి బభాషేదం వాక్యం స్వస్థో మహేశ్వరః।

యేన యః కల్పితో భాగః స తథా సముపాగతః
ప్రీతోహం ప్రదిశామ్యద్య ఫలమావృత్తి లక్షణం ॥
ఏతద్వో లక్షణం దేవా మత్ప్రసాద సముద్భవం
స్వయం యజ్ఞై ర్యజమానాః సమాప్త వరదక్షిణైః॥

యుగే యుగే భవిష్యధ్వం ప్రవృత్తి ఫలభాగినః
యజ్ఞైర్యే చాపి యక్ష్యంతి సర్వ లోకేషువై సురాః ॥
కల్పయిష్యంతి వో భాగాన్ తే నరా వేద కల్పితాన్
యో మే యథా కల్పితవాన్ భాగ మస్మిన్మహాక్రతౌ॥

స యథా యజ్ఞ భాగార్హో వేదసూత్రే మయా కృతః
యూయం లోకాన్ ధారయధ్వం యజ్ఞ భాగ ఫలోచితాః॥
సర్వార్థ చింతకా లోకే యథాధికార నిర్మితాః
యాః క్రియాః ప్రచరిష్యంతి ప్రవృత్తి ఫల సత్కృతాః॥
అభిరాప్యాయిత బలా లోకాన్ వై ధారయిష్యథ
యూయంతు భావితా యజ్ఞైః సర్వ యజ్ఞేషు మానవైః ॥

మాం తతో భావయిష్యధ్వమేషావో భావనా మమ
ఇత్యర్థం నిర్మితా వేదా యజ్ఞాశ్చౌషధిభి స్సహ॥
ఏభి స్సమ్యక్ప్రయుక్తైర్హి ప్రీయంతే దేవతా క్షితౌ
నిర్మాణమేతద్యుష్మాకం ప్రవృత్తి గుణ కల్పితం ॥
మయా కృతం సురశ్రేష్ఠా యావత్కల్ప క్షయా దిహ
చింతయధ్వం లోకహితం యథాధికార మీశ్వరాః॥
నారాయణీయము. ౩౪౦ అ. ౫౪ మొ. ౬౩ శ్లో. వ.

ఓ దేవతలారా! యజ్ఞములందు మీకొరకి కివ్వబడిన భాగములన్నియు నాకే జెందినవి.

వేదములందు మీకివ్వవలసినదని జెప్పబడిన భాగముల నన్నిటిని గ్రహించి ప్రపంచమును రక్షించుడు. మీరు యజ్ఞములందు మన్నింపబడి నన్ను మన్నించుడు. ఇట్లు మీకొరకు నాచే ప్రవృత్తి మార్గమేర్పరచ బడినది.

యజ్ఞములను గురించి భగవంతుడు అర్జునునకుపదేశించినట్లు నారాయణుడు దేవతలకుపదేశించెను

ఇష్టాన్భోగాన్హి వో దేవా దాస్యంతే యజ్ఞ భావితాః
తైర్దత్తాన ప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవసః॥

కారణ మేమన: యజ్ఞములచే సంతుష్టులగు దేవతలు మీచే కోరబడిన (సమస్తమైన) భోగములను మీకు నిచ్చెదరు. వారు మీకిచ్చిన వారికి మరల నీయక తాముమాత్రమే యుపభోగించువారు సత్యముగ చోరులగుదురు.

యజ్ఞ ప్రారంభము

ఏతాని సహ యజ్ఞేన ప్రజాపతిరకల్పయత్ ‘
తేన ప్రజాపతిర్దేవాన్ యజ్ఞేనా యజత ప్రభుః ॥

శాంతి. ౨౬౪ - ౨౧

ప్రజాపతి యజ్ఞములతో పశువులను, ధాన్యములను కల్పించి దాను స్వంతముగా దేవతల కొరకు యజ్ఞముల జేసెను.

తతో జగ్రాహ స శ్వాంగం జీవితార్థీ మహామునిః
సదారస్తాము పాహృత్య వనే భోక్తుమియేషసః ॥
అథాస్య బుద్ధిరభవత్ విధినాహం శ్వజాఘనీం
భక్షయామి యథా కామం పూర్వం సంతర్ప్య దేవతాః ॥
తతోగ్నిముప సంహృత్య బ్రాహ్మేణ విధినా మునిః
ఐంద్రాగ్నేయేన విధినా చరుం శ్రపయత స్వయమ్ ॥
తతస్సమారభత్కర్మ దైవం పిత్ర్యం చ భారత
ఆహూయదేవాదింద్రాదీన్ భాగం భాగం విధిక్రమాత్ ॥

భీష్ముడు. శాంతి. ౧౪౧ - ౨౩

కొండొకప్పుడు భయంకరమగు కరువు (దుర్భిక్షము) ప్రాప్తమై యెక్కడను యొక్కగింజ గూడ లభించకుండెను. దుర్భిక్షగ్రస్తులై బ్రాహ్మణులు మొదలగు వారు యజ్ఞయాగాది క్రతువులు జేయక పోవుటచే దేవతలు వర్షము గురింపించరైరి ఇట్టి భయంకర సమయమున మహాముని యగు విశ్వామిత్రుడు ఆకటి బాధకాగ జాలక మిక్కిలి బాధ పడెను అతడొకనాడు అర్ధరాత్రి సమయమున యొక ఛండాలునింటిలో ప్రవేశించి యచట నున్న కుక్క మాంసము నపహరించుకొని వచ్చి యథారీతిగా యజ్ఞము జేసి దేవతలకు భాగముల నిచ్చిన తోడనే దేవతలు తృప్తులై వర్షము

గురిపించిరి. పిదప సస్యములన్నియు వృద్ధిగా ఫలించి దుర్భిక్ష దోషమును నశింప జేసెను.

దీని బట్టి జూచిన యజ్ఞములు లోక కళ్యాణ ప్రదములనియు, దనకు లభించిన యేపదార్థమునైనను దేవతార్పణము జేయ వచ్చు ననియు దెలియును. ముందు భగవంతుడు గూడ పత్రంపుష్పం ఫలం యని పైయభిప్రాయమునే దెలిపెను.

ఆచార సంభవో ధర్మో ధర్మే వేదా ప్రతిష్ఠితాః
వేదైర్యజ్ఞా సముత్పన్నా యజ్ఞై ర్దేవా ప్రతిష్ఠితాః॥
వేదాచార విధానోక్తైః యజ్ఞైర్ధార్యంతి దేవతాః॥

హనుమద్వాక్యము. అరణ్య ౧౨౦-౧౦

ఆచారము వలన ధర్మము, ధర్మము నందు వేదములు ప్రతిష్ఠింప బడినవి. వేదముల వలన యజ్ఞములు గలిగినవి. యజ్ఞములందే దేవతలు ప్రతిష్ఠింప బడినారు. వేదాచార విధానములచే జెప్పబడిన యజ్ఞముల చేత దేవతలు ధరింపబడుచున్నారు.

యజ్ఞాయ సృష్టాని ధనాని ధాత్రా
యజ్ఞాయ సృష్టః పురుషో రక్షితాచ
తస్మాత్సర్వం యజ్ఞ ఏవోపయోజ్యం
ధనం నకామాయ హితం ప్రశస్తం॥

శాంతి. ౨౬-౨౫

యజ్ఞము కొఱకు ధనము, పురుషుడు, రక్షకుడు సృష్టింప పడిరి; కావున సర్వము యజ్ఞము కొఱకే నుపయోగ పరచ వలయును. తన దుర్విషయముల సార్థక పరచు కొనుటకై ధనము నుపయోగించ జనదు.

యజ్ఞశిష్టాశిన స్సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః
భుంజతే తే త్వఘం పాపాయే పచన్త్యాత్మకారణాత్ ॥౧౩

యజ్ఞము చేయఁగా మిగిలిన ద్రవ్యమును గ్రహించు గృహస్థులు సర్వ పాపముల నుండియు ముక్తులగుదురు. (యజ్ఞమును చేయక) తన కొఱకు మాత్రమే (అన్నమును) వండుకొని భక్షించు పాపాత్ములు పాపమును భక్షించుచున్నారు

ఆత్మార్థే పాచయేనా న్నం న వృథా ఘాతయేత్పశూన్ ॥
యుధిష్టిరః అరణ్య. ౨-౫౯

తన కొఱకు మాత్రమే నన్నము వండు కొనరాదు. యజ్ఞము వినాఁగా పశు సంహారము జేయరాదు. ఈ విషయమై భారతిమందనేక ప్రమాణములు గలవు.

పంచ మహా యజ్ఞములు (దేవ, పితృ, మనుష్య, బ్రహ్మ, భూత యజ్ఞములైదు) జేయుటచే తట్టుగుట, నూరుట, విసరుట, కాల్చుట, ఊడ్చుట నను నైవిధములగు పాపములు నశించును.

స్వదార నిరతో నిత్యం శిష్టాచారో జితేంద్రియః

పంచభిశ్చ మహా యజ్ఞైః శ్రద్ధధానా యజేదిహ॥

బ్రహ్మ. అశ్వమేధ. ౮౫-౧౬

: అన్నాద్భవంతి భూతాని పర్జన్యాదన్నసంభవః
: యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః॥ ౧౪

ప్రాణులన్నియు నన్నముచేతనే పుట్టుచున్నవి. అన్నము పర్జన్యుఁడు వర్షించుటవలన పుట్టుచున్నది. పర్జన్యుఁడు యజ్ఞమువలన పుట్టుచున్నాఁడు. కర్మలనుండి యజ్ఞముద్భవిల్లుచున్నది.

యజ్ఞాత్ప్రజా ప్రభవతి నభసోంభ ఇవామలం
అగ్నౌ ప్రాస్తాహుతిస్సమ్యగ్బ్రహ్మన్ ఆదిత్యముపగచ్ఛతి॥
ఆదిత్యాజ్జాయతే వృష్టిః వృష్టేరన్నం తతః ప్రజాః
తస్మాత్తస్మిన్ ప్రతిష్ఠితాః పూర్వే సర్వాన్ కామాంశ్చ లేభిరే॥
అకృష్టపచ్యా పృథివీ ఆశీర్భిర్వీరుధో భవన్॥

తులాధారుడు. శాంతి. ౨౬౮-౧౧

ఆకాశమునుండి స్వచ్ఛమగు నీళ్లు లభించినట్లు యజ్ఞములనుండి ప్రజలుద్భవిల్లుచున్నారు. అగ్నియందు వేల్చబడిన యాహుతులు సూర్యుని పొందుచున్నవి. సూర్యునివలన వర్షము, వర్షమువలన అన్నము, అన్నమువలన ప్రజలు జన్మించుచున్నారు. మానవులు పూర్వమందు యజ్ఞములచేతనే అవాప్తకాములైరి.

: కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్
: తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్॥ ౧౫

కర్మ, బ్రహ్మనుండి, అనగా: ప్రకృతినుండి పుట్టినదని తెలిసికొనుము. ఈ బ్రహ్మ మక్షరము నుండి, అనగా పరమేశ్వరునుండి బయలువెడలినది. కాన సర్వగతమగు బ్రహ్మమే యజ్ఞమునం దెప్పుడు నధిష్ఠించియున్నది (అని తెలిసికొనుము.)

అనుయజ్ఞం జగత్సర్వం యజ్ఞశ్చాను జగత్సదా॥

శాంతి. ౨౬౭

యజ్ఞమున ననుసరించి జగత్తు, జగత్తు ననుసరించి యజ్ఞము ఈ ప్రకారముగా నెల్లప్పుడు నియమింపబడినది.

ఈ అధ్యాయమందనేక యజ్ఞ విషయములు వివరింపబడినవి.

: ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతేహ యః
: అఘాయు రింద్రియారామో మోఘం పార్థ స జీవతి ॥ ౧౬

ఓ పార్థా! యిట్లు (జగత్తుయొక్క ధారణార్థమై) ఆరంభింపబడిన చక్రమును (అనగా: కర్మలయొక్క, లేక యజ్ఞములయొక్క ఘటీయంత్రమును) జగత్తునందు ప్రవర్తింపజేయని వాని యాయుష్యము పాపరూపమయినది. కాన నీయింద్రియ లంపటులయొక్క (అనగా: దేవతలకు నీయక స్వయముగనే సుఖబడువారియొక్క) జీవనము వ్యర్థమగును!

అహంకారము వలన బుట్టిన పంచభూతములు అధ్యాత్మ ఆదిభౌతిక ఆధిదైవికములు, అండజ ఉద్భిజ స్వేదజ జరాయుజములు, విషయములు, రోగ

శోకములు, ఈమొదలగు వాటిచే కాలచక్రము నిండి యున్నదని వర్ణింప బడినది. ఇట్టి కాలచక్రమునందు జిక్కువడి కామక్రోధ లోభాదులకు లోబడి జెడి పోవుచుందురు. ఇంద్రియ నిగ్రహపరు లీకాల చక్రమును జయింతురు. అశ్వమేధ. ౪౨-౫౮

మహదాది విశేషాంతం అసక్త ప్రభవావ్యయం
మనోజవం మనః కాంతం కాల చక్రం ప్రవర్తతే॥
ఏతద్ద్వంద్వ సమాయుక్తం కాల చక్ర మచేతనం
విసృజేత్సంక్షిపేచ్చాపి బోధయేత్సామరం జగత్॥
కాల చక్రప్రవృత్తించ నివృత్తించైవ తత్వతః॥
యస్తు వేద నరో నిత్యం నస భూతేషు ముహ్యతి॥
అశ్వమేధ ౪౫-౮

కాల చక్రము యొక్క ప్రవృత్తి నివృత్తుల దెలుసు కొనిన వాడు మోహము నొందడు.

స్వదార నిరతో నిత్యం శిష్టాచారో జితేంద్రియః
పంచభిశ్చ మహాయజ్ఞైః శ్రద్ధధానో యజేదిహ
దేవతాతిథి శిష్టాశీ నిరతో వేదకర్మసు
ఏవం యుక్తో జయేత్స్వర్గం గృహస్థః సంశిత వ్రతః॥
అశ్వమేధ. ౪౫-౧౯

సదాచారనిరతుడగుచు శిష్టాచార పరాయణుడై ఇంద్రియ నిగ్రహము చే శ్రద్ధవహించి పంచమహాయజ్ఞములను జేసి దేవతాతిథి ముఖ్యులతృప్తిపరచుచు వేద కర్మలందాసక్తిగల వాడు స్వర్గమును జయించును.

: యస్త్వాత్మరతి రేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః
: ఆత్మ న్యేవచ సంతుష్ట స్తస్య కార్యం నవిద్యతే॥ ౧౭

కాని కేవల మాత్మయందె రతుఁడును, ఆత్మయందె తృప్తుఁడును, ఆత్మయందె సంతుష్టుఁడు నైనవానికి (స్వీయములని చెప్పఁదగిన) కార్యము లేవియునుండవు.

: నైవ తస్య కృతే నార్థో నాకృతే నేహ కశ్చన
: న చాస్య సర్వభూతేషు కశ్చి దర్థవ్యపాశ్రయః ౧౮

కావున నిక్కడ (అనఁగా: ఈ జగత్తు నందు) నే విషయమయినను చేయుటచే నతనికి లాభ మేమియు నుండదు. చేయకపోవుటచే నష్టము నైత ముండదు. సర్వభూతములయందును తనకు స్వీయములని చెప్పఁదగిన యర్థము లేవియు నాగియుండవు.

ఆత్మన్యేవాత్మనాజాతః ఆత్మనిష్ఠో ప్రజోఽపివా
ఆత్మన్యేవ భవిష్యామి నమాంతారయతి ప్రజా॥

మేధావి - శాంతి ౧౭౫ - ౩౬

సర్వమాత్మయందే గలుగుచున్నది. నన్నెవరు నుద్ధరింపజాలరు. ఇట్లని మేధావి తండ్రికి జెప్పెను.

జాయతే తీర్థ మాత్మైవ మాస్మ దేశాతిథి ర్భవ॥

తులాధారః శాం. ౨౬౨ - ౪౨

ఆత్మయందే సర్వతీర్థములున్నవి గనుక వేరు తీర్థముల బరిభ్రమించ నవసరము లేదు.

: తస్మా దసక్త స్సతతం కార్యం కర్మ సమాచర
: అసక్తో హ్యాచర న్కర్మ పర మాప్నోతి పూరుషః॥ ౧౯

తస్మాత్, అనఁగా జ్ఞాని కీర్తిగ నేవిధపుగు నపేక్ష యు నుండ నందున, నీవు సైతము (ఫలమునందు) ఆసక్తి నుంచక (నీయొక్క) కర్తవ్యకర్మల ను తప్పక చేయవలె యును. కారణ మేమనః ఆసక్తిని విడచి కర్మచేయు చుండు వానికి పరమగతి లభించు ను.

కృత్వైవ కర్మాణి మహాంతి శూరాః
తపోదమాచార విహార శీలాః
దేవానృషీన్ ప్రేతగణాంశ్చ సర్వాన్
సంతర్పయిత్వా విధినా పరేణ॥
స్వర్గం పరం పుణ్యకృతో నివాసం
క్రమేణ సంప్రాప్స్యథకర్మభి స్త్వైః॥

మార్కండేయః అరణ్య. ౨౦౪ - ౧౯

సదాచారపరాయణులైన ధర్మజ్ఞులు విధ్యుక్తములగు కర్మల నాచరించియే స్వర్గమును బొందిరి.

అభిమానకృతం కర్మ నైతత్ఫలవదుచ్యతే
త్యాగయుక్తం మహారాజ సర్వ మేవమహాఫలం॥

శాంతి. ౧౨-౧౬

అభిమానముచే చేయ బడిన కర్మ ఫల కారి గాదు. త్యాగబుద్ధిచే జేయబడిన కర్మ మహాఫలకారి యగును.

: కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః
: లోక సంగ్రహ మే వా పిసంపశ్యన్ కర్తుమర్హసి ౨౦

జనకాదులచే నిటులే కర్మలచేతనే సిద్ధి సంపాదింప బడినది. అట్లు లోకసంగ్రహ దృష్టితో కర్మ చేయుటయే సిపుచితమైనపని.

విశాఖ యూపే దేవానాం సర్వేషామ గ్నయ స్థితాః
తస్మాద్విద్ధి మహారాజ దేవాః కర్మ ఫలే స్థితాః
అనాస్తికానాం భూతానాం ప్రాణదాః పితరశ్చయే
తేపి కర్మైవ కుర్వంతి విధింసంప్రేక్ష్య పార్థివ
వేదవాదా పవిద్ధాంశ్చ తాన్విద్ధి భృశనాస్తికాన్॥
నకులః శాంతి. ౧౨-౨

దేవతలు పితృదేవతలు గూడ ప్రియముతో కర్మలు జేయుచున్నారు. వేదనిందకులు అనగా కర్మనిందకులు నాస్తికులే యై యున్నారు.

లోక సంగ్రహ సంయుక్తం విధాత్రా విహితం పురా
సూక్ష్మ ధర్మార్థ నియతం సతాంచరితముత్తమం॥
భీష్మః శాంతి. ౨౫౯-౨౬

ఉత్సృజ్య రాజ్యం భైక్ష్యార్థం కృత బుద్ధిం నరేశ్వరం
విదేహరాజ మహిషీ దుఃఖితా యదభాషత॥

పూర్వము నిత్యముక్తుడగు జనకుడు రాజ్యాది భోగముల విడచి సన్యసించి లేచిపోవుటకునిశ్చయించు కొనగా యతని భార్యయరుదెంచి యీపని దగనిదని యు లోకసంగ్రహార్థమైననుకర్మజేయక తప్పదనియు దృఢముగ జెప్పెను. శాంతి. ౧౮

కర్మణా పునరేవాహం సుఖమాగామి లక్షయే॥
కీటోపాఖ్యానము అనుశాసన. ౧౧౭-౨౩

ఒకసమయమున ప్రాణ భయముచే బరుగిడి పోవుచున్న పురుగును జూచి నీవతి వికారమగు రూపమును గలిగి లోకమున కెంత మాత్రముపయోగింపకున్నావు. ఇట్టి నీకింత ప్రాణ భయమెందులకని వ్యాసమహర్షి ప్రశ్నింపయది యిట్లనెను. మహాత్మా యెంతటి అధమ దశయందున్నను ప్రాణములపై మమత దక్కువ గాదు. మఱియు యెట్టిరూపమందున్నను విధ్యుక్తకర్మాచరణచే సత్ఫలమును బడయవచ్చును. మఱియు—

తిర్యగ్యోన్యా శ్శూద్రతామభ్యుపైతి
శూద్రోవైశ్యత్వం క్షత్రియత్వంచ వైశ్యః
వృత్తశ్లాఘీ క్షత్రియో బ్రాహ్మణత్వం
స్వర్గం పుణ్యం బ్రాహ్మణ స్సాధు వృత్తః॥

పశు పక్షి మృగాదుల నుండి శూద్రత్వము, దీని నుండి క్రమముగ వైశ్య క్షత్రియ బ్రాహ్మణత్వములు సాధు వృత్తిచే సిద్ధించి స్వర్గము లభించును. కావున ప్రాణముల ప్రయత్న పూర్వకముగ రక్షించు కొనుటకు బ్రయత్నించు చున్నాను.

వృద్ధాచ పూజితామాతా బ్రాహ్మణశ్చార్చితో మయా॥
నేనుపూర్వజన్మమున శూద్రకులమునధనికుడనై యుం
టిని కానిఅసాధువృత్తిచే యీనీచజన్మమెత్తితిని ఐనను
వృద్ధురాలగు తల్లిని బూజించుటయు, బ్రాహ్మణసేవ
జేయుటయు యను సుకృత ద్వయముచే పూర్వ
జ్ఞానమును గలిగి యున్నాను.

: యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః।
: సయత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే॥ ౨౧

శ్రేష్ఠుడు (అనగా ఆత్మజ్ఞానియగు కర్మయోగి) చేయుపనినే యితరులు (సామాన్యజనులు) సైతము చేయుదురు. అతడు ప్రమాణముగ గ్రహించిన విషయమునె లోకులనుసరింతురు.

యద్యదాచరతే శాస్త్రమర్థ్యం సర్వప్రవృత్తిషు
యస్య యత్రహ్యనుష్ఠానం తత్రతత్ర నిరామయం॥

కపిలః - శాంతి. ౨౬౮ - ౨౦

అన్ని విషయములందును అర్థయుక్తమగు శాస్త్రానుసారము నడచుకొనువారికట్టి బాధగలుగదు.

ధర్మరాజు ధర్మములు శిధిలములైనప్పుడెట్లు నడచుకొనవలయునని ప్రశ్నింప భీష్ముడిట్లుజెప్పెను.

లోకయాత్రా మిహైకేత ధర్మం ప్రాహుర్మనీషిణః
సముద్దిష్టం సతాం ధర్మం స్వయమూహేత పండితః॥

ఆపద్ధర్మ పర్వము. శాంతి. ౧౪౨ - ౧౯

బుద్ధిమంతులు ఆచారమునే ధర్మమని చెప్పిరి. మఱియు కుశలుడగు మనుజుడు సత్పురుషుల నడవడిని స్వయముగా జూచియిదమిద్ధమని నిర్ణయించుకొన వలయును.

బ్రాహ్మణానేవ సేవేత విద్యా వృద్ధా స్తపస్వినః
శ్రుతచారిత్ర వృత్తాఢ్యాన్ పవిత్రం హ్యేతదుత్తమం॥

బ్రాహ్మణులను విద్యావృద్ధులను సుచరిత్రలు దెలిసిన వారిని (శ్రేష్ఠులు గావున) సేవించదగును

చరణక్షాళనే కృష్ణో బ్రాహ్మణానాం స్వయంహ్యభూత్
సభా. ౫

ధర్మజుని రాజసూయయజ్ఞమందు శ్రీకృష్ణుడు స్వయముగ శ్రేష్ఠులగు బ్రాహ్మణ పాద ప్రక్షాళమునకు బూనుకొనెను.

ప్రమాణమప్రమాణంవై యఃకుర్యా దబుధో జనః
నసప్రమాణతామర్హో ద్విపాద ఽసనోఽపిసః॥
అనుశాసన. ౧౬౨

ప్రమాణము నప్రమాణముగ జేయుదుర్జనుడు ప్రమాణభూతుడు గాడు.

నమేపార్థాస్తి కర్తవ్యం త్రిషులోకేషు కించన,
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవచ కర్మణి॥ ౩

ఓపార్థా! నాకు ముల్లోకములలో కర్తవ్యము లేదు; ఇదివరలో లేనిదియు, ఇప్పుడు సంపాదించు కొనతగినదియు

నగు వస్తువేమియు లేదు. అయినను నేను కర్మలను చేయు చునే యున్నాను.

: యదిహ్యహం నవర్తేయం జాతుకర్మణ్యతంద్రితః
: మమవర్త్మానువర్తంతే మనుష్యాః పార్థసర్వశః॥ ౨౩

కారణ మేమన ఓపార్థా! నేనొకవేళ కర్మల నల క్ష్యభావమున చేయకపోయితి నేని మనుజులందఱును నన్ని విధముల చేతను నామార్గమునె యనుకరింతురు.

: ఉత్సీదేయురిమేలోకా నకుర్యాం కర్మచేదహమ్
: సంకరస్యచకర్తాస్యా ముపహన్యామిమాః ప్రజాః॥ ౨౪

నేను కర్మలను చేయక పోతినేని యీలోకము లుత్స న్నములగును. నేను సంకరము చేయువాఁడ నగుదును. ప్రజ లకు నావలన ఘాత కలుగును.

కృత్వా పౌర్వాహ్ణికం కృత్యం స్నాత శ్శుచిరలంకృతః
ఉపతస్థే వివస్వంతం పావకంచ జనార్దనః
ఋషభం పృచ్ఛ మాలభ్య బ్రాహ్మణా నభివాద్యచ
అగ్నిం ప్రదక్షిణం కృత్వా పశ్యన్ కళ్యాణమగ్రతః॥
ఉద్యోగ. ౮౧

కౌరవపాండవులకు సంధి సమకూర్చదలచి హస్తినాపురికి ప్రయాణమగుటకు బూర్వము శ్రీకృ ష్ణుడు పూర్వాహ్ణిక కృత్యముల నాచరించి శుచియై విధ్యుక్త కర్మల నాచరించెను.

మయా ప్రమాణంహి కృతం లోక స్సమను వర్తతే
ప్రమాణానిహి పూజ్యాని తత స్తం పూజయామ్యహం॥
శాంతి. నారాయణీయము వాసుదేవః ౩౪౧-౫౫

నేను దేనిని ప్రమాణముగ నంగీకరింతునో లోకము దానినే ప్రమాణముగ గ్రహించును. ప్రమాణములు పూజ్యములు గావున నేవాటిని గౌరవింతును.

ఉత్సీదేరన్ ప్రజాస్సర్వా నమనుష్యాః కర్మచేద్భువి
తథా హ్యేతానవర్ధేరన్ కర్మచేదఫలం భవేత్॥

అరణ్య. ౩౨-౧౧

కర్మ చేయక పోయినచో ప్రజలు నశింతురు. ఇట్లని యర్జునునకు ద్రౌపది చెప్పినది.

నీవు నాయందు ప్రవేశించి కామవికారమును గలిగించుటచే వర్ణసంకరాది దోషములు గలుగును కావున నట్లు జేయకుమని నిత్యముక్తుడైనను జనకుడు వర్ణసంకరమగు నను భయముచే సులభతో బలికెను చూ. శాంతి. ౩౧౯-౪౯

సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత
కుర్యాద్విద్వాం స్తథాసక్తః చికీర్షు ర్లోకసంగ్రహమ్॥ ౨౫

కాన నోయర్జునా! లోకసంగ్రహమును చేయవలయునని తలంచుచున్న జ్ఞాని (వ్యావహారికమగు) కర్మయందు నాసక్తులగు నజ్ఞానుల వలెనే కర్మచెయును; కాని యాసక్తిని వదలి యాచరింప వలయును.

న బుద్ధిభేదం జనయే దజ్ఞానాం కర్మసంగినామ్
జోషయే త్సర్వకర్మాణివిద్వాన్ యుక్తస్సమాచరన్॥ ౨౬

కర్మలయందాసక్తిగల యజ్ఞాని బుద్ధిని జ్ఞాని చెడగొట్టగూడదు (తాను) యుక్తుఁడు, అనఁగా యోగయుక్తుఁడును, సర్వకర్మలను చేయువాఁడును నయి లోకులను సంతోష పూర్వకముగ నా కర్మలను చేయునట్లు చేయవలయును.

కర్మయందాసక్తి గలిగి దానిని జేయు వారి బుద్ధినందునుండి మరలింప కొందరు ప్రయత్నింతురు. ఇంత మాత్రమున కర్మను వీడక సత్ప్రమాణాను సారముగ కర్మ జేయదగును. ఇందుకు లక్ష్యమే మన

ప్రతంమంత్ర కృతం బ్రహ్మన్ నాపరాధోస్తి మేక్వచిత్॥
అశ్వమేధ. ౨౫-౨౭

యజ్ఞమందు హింస చేయవచ్చునని గూడదని యతియధ్వర్యులు వివాదపడిరప్పుడధ్వర్యుడిట్లనెను. మహాత్మా! ఇందునా యపరాధములేదు ఎందుకందువా వేదోక్త కర్మనే నేశేయించు చున్నాను

నరనారాయణులు తపమాచరించుసమయము న నారదుడు వారల సమీపించి దైవపిత్ర్య కార్యములనాచరించుట జూచి యిట్లనెను.

యజంతే త్వామహరహర్నానా మూర్తి సమాస్థితం
పితామాతాచ సర్వస్య జగతశ్శాశ్వతో గురుః
కతం త్వద్యజసె దేవం పితరం కం నవిద్మహే॥
నారాయణీయము. శాంతి. ౩౩౫ - ౨౭

అన్ని మూర్తులంగ గలనిన్నందరు పూజింతురు. నీవు ప్రపంచమునకు గురువువు తల్లి తండ్రివి నై యున్నావు. ఇట్టి నీకు దేవుడెవరో, పితరులెవరో మేము దెలియజాలకున్నాము

ఈ ప్రమాణముచే జగత్కర్తయు కర్మ చేయుచున్నాడనియు చేయ వలసిన అవసరమున్నదనియు దేటపడు చున్నది.

ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః
అహంకార విమూఢాత్మా కర్తాహ మితిమన్యతే॥ ౨౭

ప్రకృతియొక్క (సత్త్వము, రజస్సు, తమస్సు అను, గుణ ములచే సర్వ విధము లగు కర్మలను చేయబడుచుండ, అజ్ఞాని యహంకారముచే నేను కర్తనని యనుకొను చున్నాడు.

ప్రకృతిః కురుతే దేవీ భవం ప్రళయ మేవచ
దివసాంతే గణానేతా నశ్యైత్యైకోవ తిష్టతి॥
వసిష్ఠః శాంతి. ౩౦౮ - ౩౧

ప్రకృతియే సృష్టి ప్రళయములను జేయు చున్నది. దివసాంతమున సూర్యుడు రశ్మిజాలంబుల నాకర్షించు కొను నట్లు ప్రళయ కాలమున ప్రకృతి త్రిగుణముల నాకర్షించు కొనినొక్కటియేయుండును.

ప్రకృతిః కురుతే కర్మ శుభాశుభ ఫలాత్మకం
ప్రకృతిశ్చ తదశ్నాతి త్రిషు లోకేషు కామగా॥

ప్రకృతియే శుభాశుభ కర్మలు జేయును. త్రిలోక సంచారియగు ప్రకృతియే యనుభవించును.

ఇది క్షరాక్షర విచారమందు గలదు.

యస్తు కర్తారమాత్మానం మన్యతె సాధ్వసాధువా
తస్య దోషవతీ ప్రజ్ఞా అతత్వజ్ఞేతి మేమతిః॥

ప్రహ్లాదః శాంతి. ౨౨౨-౧౫

ఎవడాత్మను కర్తగా భావించునో వాని ప్రజ్ఞ దోషసహితమనియు, వాడు తత్వమును దెలియనివాడనియు, నామతము.

యదిస్యాత్పురుషః కర్తా శక్రాత్మ శ్రేయసే ధృవం
ఆరంభాస్తస్య సిధ్యేయుః నతుజాతుపరాభవేత్॥

ఓయింద్రా! తన శ్రేయస్సుకొరకు నిశ్చయము గపురుషుడే కర్తయగుచో నతనిప్రయత్నములు తప్పక సిద్ధింప వలసి యుండెను కాని సిద్ధింపకున్నవి.

పర్యాయై ర్హన్యమానానామభియోక్తా నవిద్యతె
దుఃఖమేతత్తు యద్ద్వేష్టా కర్తాహమితి మన్యతే॥

నముచి. శాంతి. ౨౨౬ - ౧౩

క్రమముగ ప్రాప్తములగు వాటికి చేయుంచువాడొకడు లేడు. ద్వేషింప బడు నేను కర్తనని భావించుటయే దుఃఖము.

బ్రహ్మ-- యదుత్పన్నో మహాన్పూర్వ అహంకార స్సఉచ్యతే॥

అశ్వమేధ. ४౧-౫

ఈయధ్యాయములహంకార ప్రాధాన్యమును జెప్పను.

ప్రకృతే స్త్రిగుణాయాస్తు సేవనాత్త్రిగుణో భవేత్॥

శాంతి. ౩౦४ - ౧౦

ప్రకృతి త్రిగుణాత్మకము దీనిని సేవించుటచే త్రిగుణాత్మకుడగును.

: తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః
: గుణాగుణేషు వర్తంత ఇతి మత్వా నసజ్జతే ॥ ౨౮

కాని యోమహాబాహూ:అర్జునా! గుణములను,కర్మలను తనకంటె భిన్నములుగ నున్నవి యనుతత్త్వమును తెలిసికొన్న వాడు (జ్ఞాని) ఇదియంతట తామే ప్రవర్తించు చున్నగుణముల యొక్కయాట యని యెఱింగి దానియందాసక్తుడు కాడు.

: ప్రకృతేర్గుణ సమ్మూఢాః సజ్జంతే గుణకర్మసు । ౨౯
: నాసకృత్స్నవిదో మందాన్ కృత్స్నవిన్న విచాలయేత్ ॥

ప్రకృతియొక్క గుణముచే భ్రష్టులయినవారు గుణకర్మములయందే యాసక్తులగుదురు ఇట్టి యసర్వజ్ఞులును మందులును నయినవారిని సర్వజ్ఞుడగువాడు తనయొక్క కర్మత్యాగము చేత పెడత్రోవలో ప్రవేశపెట్టి చెఱుపరాదు.

సత్త్వం రజస్తమశ్చేతి గుణానేతాన్ప్రచక్షతే
ఏతే సర్వశరీరేషు తిష్ఠంతి విచరంతిచ ॥
ఏతాన్ గుణాంస్తు క్షేత్రజ్ఞో భుంక్తేనైభిస్సభుజ్యతే
నిర్గుణో గుణభుక్చైవ గుణస్రష్టా గుణాధికః ॥

భీష్మః శాంతి. ౩౪౦-౨౯

సత్త్వరజస్తమోగుణములు శరీరములందుండి తిరుగుచుండును. క్షేత్రజ్ఞుడీగుణముల ననుభవించునే గాని దానాగుణములచే ననుభవించబడడు. నిర్గుణుడగు ఈశ్వరుడు గుణములకంటె నధికుడు.

గుణముల పుట్టించు వాడు, గుణముల ననుభవించు వాడు, గుణాధికుడగు నిర్గుణుడే గుణభోక్త యగును

గుణాగుణేషు జాయంతే తత్రైవ నివిశంతిచ
ఏవం గుణాః ప్రకృతితో జాయంతే నివిశంతిచ ॥

శాంతి. ౩౦౫-౨౩

గుణములు గుణములందే పుట్టి యచటనే నివసించి యుండును. గుణములు ప్రకృతిచే బుట్టుచు నచటనే నివసించును.

గుణాగుణేషు లీయంతే తదైకా ప్రకృతిర్భవేత్
క్షేత్రజ్ఞోపి యదాతాత క్షేత్రే సంప్రవిలీయతే॥

శాంతి. ౩౦౮-౧౬

ఎప్పుడు క్షేత్రజ్ఞుడు క్షేత్రమందు లీనమగునో అప్పుడే గుణములు గుణములందు లీనమగును.

జిజ్ఞాసులు ౩౦౪ - ౩౦౮ అధ్యాయముల జూడదగును.

మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః॥ ౩౦

(కావున నోపార్థా!) అధ్యాత్మ బుద్ధితో సర్వకర్మల నాకు సమర్పణము చేసి (ఫలముయొక్క) ఆశను, మమత్వమును వదలి, నీవు విసుగుఁజెందక యుద్ధమును చేయుము.

యే మే మత మిదం నిత్య మనుతిష్ఠంతి మానవాః
శ్రద్ధావంతో౽నసూయంతో ముచ్యంతే తేపి కర్మభిః॥ ౩౧

దోషము నెంచుచు కాలక్షేపము సేయక శ్రద్ధావంతులై నాయీయుపదేశాను సారముగ నిత్యమును కర్మల నాచరించు

వారు నైతము కర్మబంధముల నుండి ముక్తులగుదురు.

సర్వస్య జగత స్తాత సారాసార బలా బలం
సర్వం జానాతి ధర్మాత్మా మతమేషాంచ కేశవః ॥
యమాహకృష్ణో దాశార్హః సోస్తు సేనాపతిర్మమ ॥
యుధిష్ఠరః ఉద్యోగ. ౧౫౦-౩౩

సర్వ విషయములు దెలిసిన కేశవుడు జెప్పినట్టు విని యతని యాజ్ఞాను సారముగా సేనాపతిని నియమించు కొందము.

యథాహి సర్వాస్వాపత్సుపాసి వృష్ణీ నరిందమ।
తథైవ పాండవాస్త్వాః పాహ్యస్మాన్మహతో భయాత్॥
యుధష్ఠరః ఉద్యోగ. ౭౧-౪

కృష్ణా సర్వాపదలనుండి యాదవుల రక్షించినట్లు ఈరణరంగము నుండి మమ్ముల రక్షించుము.

యే త్వేత దభ్యసూయంతో నాను తిష్ఠంతి మే మతమ్
సర్వజ్ఞాన విమూఢాం స్తాన్విద్ధి నష్టా నచేతసః॥ ౩౨

కాని యసూయగలవారలై యీ నామతము నాచరింపనివారు సర్వజ్ఞానవిమూఢులై, అనఁగా యథార్థమయిన మార్గ లగునవివేకులై, చెడినారని తెలిసికొమ్మ

సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతే ర్జ్ఞా నవా నపి।
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి॥ ౩౩

జ్ఞానియగు పురుషుఁడుస్వభావానుసారముగనే ప్రవర్తించుచున్నాఁడు. సర్వభూతములును (తమతమ) ప్రకృతి ననుసరించు చున్నవి (అక్కడ) నిగ్రహము, అనఁగా బలాత్కారమేమి చేయగలదు?

కర్మణా మనసా వాచా యోద్విష్యాద్విష్ణుమవ్యయం
మజ్జంతి పితరస్తస్య నరకేశాశ్వతీ స్సమాః॥

శాంతి. ౩౪౭-౬

మనో వాక్కాయ కర్మలలో దేనిచే నైన భగవంతుని ద్వేషించినవాని పితరులు శాశ్వతముగా నరకమందు గూలుదురు.

యథోక్తాచారిణస్సర్వే గచ్ఛంతి పరమాంగతిం॥ శాం. ౨౭౩

చెప్పినట్లాచరించు వారు సద్గతిని బొందుదురు.

మమధర్మార్థ యుక్తంహి శ్రుత్వా వాక్య మనామయం
నచేదాదాస్యతే బాలోదిష్టస్య వశమేష్యతి॥

విదురుని గూర్చి భగవద్వచనము. ఉద్యోగ. ౯౨-౨౫

విదురా ధర్మార్థ యుక్తమైన నావాక్యమును విననిచో దుర్యోధనుడు దైవ వశగతుడగును.

ఉపస్థిత వినాశేయం నూన మద్య వసుంధరా
యథాహి మేవచః కర్ణనోపైతి హృదయం తవ॥
సర్వేషాం తాత భూతానాం వినాశే ప్రత్యుపస్థితే॥
అనయో నయసంకాశో హృదయాన్నాప సర్పతి॥

కృష్ణః ఉద్యోగ. ౧౪౨-౪౬

కర్ణా నాశకాలము సమీపించినది. నామాట నీహృదయమున కెక్కుట లేదు

సభామధ్యేచయ్ద్రూపం మాయయా కృతవానసి
తత్తథైవ పునః కృత్వా సార్జునో మామభిద్రవ॥

దుర్యోధనః ఉద్యోగ. ౧౬౦-౫౪

సభ యందెట్టి మాయ గావించితివో యట్టి మాయతో యర్జునుసి బురస్కరించుకొని రమ్ము.

భగవదాజ్ఞా ప్రకారము నడచుకొనిన పాండవులు జయమును, నడచుకొనని కౌరవులు మరణమును బొందిరి.

ఇంద్రియ స్యేంద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ,
తయోర్న వశ మాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపంథినౌ ॥ ౩౪

ప్రతీంద్రియమునందును, వాని (శబ్దస్పర్శాది) విషయముల యందును, రాగద్వేషములు (రెండును) వ్యవస్థితములై యుండును. ను, అనగా: అవి యెప్పుడు నట్లేయుండును. ఈ రాగద్వేషములవ వశమైనవాడు కాగూడదు. కారణమేమన: అవియే శత్రువులగుచున్నవి.

శిశ్నోదరకృతే ప్రాజ్ఞః కరోతి విఘసం బహు
మోహరాగ వశాక్రాంతః ఇంద్రియార్థ వశానుగః ॥
హీయతే వధ్యమానోపి నరో హరిభి రింద్రియైః
విమూఢ సంజ్ఞో దుష్టాశ్వై రుద్భ్రాంత ఇవ సారధిః ॥
శౌనకః అరణ్య. ౨

ఇంద్రియవిషయములకు తెలివిగలవాడుగూడ వశుడై, దుష్టాశ్వములచే యీడ్వ బడిన సారధి వలె చెడిపోవును.

క్రోధశ్శత్రు. శరీరస్థః మనుష్యాణాం ద్విజోత్తమ
యః క్రోధమోహసౌ త్యజతి తందేవా బ్రాహ్మణం విదుః॥
బ్రాహ్మణీ. అరణ్య

కౌశికా మనుష్యుల శరీరమందుగల క్రోధమే పరమశత్రువు కావున క్రోధమోహముల విడచిన వారినే బ్రాహ్మణులని తెలుసుకొనుము.

ఈ బ్రాహ్మణస్త్రీయే కౌశికుని ధర్మముల తెలుసుకొనుటకు ధర్మవ్యాధు నొద్దకు బంపెను.

ఇంద్రియాణీంద్రియార్థాంశ్చ సర్వానాత్మని సంస్థితాన్
మన్ల భత్వంచ మోక్షస్య విజ్ఞాయ శృతి పూర్వకం॥
శాంతి. ౩౦౧-౨౫

తనయందు గల ఇంద్రియములను శృతిపూర్వకముగా తెలుసుకొనక మోక్షములభించుటదుర్లభము.

ఇంద్రియాణీంద్రియార్థేభ్యో నివర్త్య మనసాశుచిః॥
శాంతి ౩౦౭-౧౦

ఇంద్రియములను విషయములనుండి మరలించి మనస్సుచే శుచిర్భూతుడగుటయే వ్రతము.

కామక్రోధా శరీరస్థా ప్రజ్ఞానంతౌ విలుంపతః
యాభ్యాం హి దేవాస్వర్యాతుః స్వర్గస్యాపిదధుర్ముఖమ్॥
గాంధారి. ఉద్యోగ. ౧౨౯ - ౩౨

ధృతరాష్ట్ర మహారాజా కామ క్రోధములు ప్రజ్ఞానమును (సామాన్యులకు తెలివిని, వేత్తలకు బ్రహ్మమును) లోపింప జేయును. కామ క్రోధ వశులకు స్వర్గద్వారము మూయ బడి యుండును.

ఇంద్రియైరింద్రియార్థేషు వర్తమానైరనిగ్రహైః
తైరియం తాప్యతేలోకః నక్షత్రాణి గ్రహైరివ॥ ఉద్యోగ

విషయాసక్తములగు నింద్రియములచే లోకము గ్రహములచే నక్షత్రములు వలెనె తపింపచేయబడు చున్నది.

: శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
: స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః. ౩౫

పరకీయమగు ధర్మము సుఖముగ నాచరించుటవలనైనను, దానికంటె తనధర్మమే, అనగా: చాతుర్వర్ణ్యవిహితమగు కర్మయే, విగుణము, అనగా: దోషసహితమయినను మిక్కిలి శ్రేయస్కరమయినది. స్వధర్మానుసారముగ (ప్రవర్తించినపుడు) మరణించినను కల్యాణము గలదు. (కాని) పరులధర్మము భయంకరమైనది.

ప్రథమం బ్రహ్మణః పుత్రం ధర్మమాహుర్మనీషిణః
ధర్మిణః పర్యుపాసంతే ఫలం పక్వమివాశయం॥

అనుశాసన. ౧౬-౩౫

జ్ఞానులు ధర్మమును బ్రహ్మయొక్క మొదటి పుత్రునిగా జెప్పుచున్నారు. ధర్మపరాయణులు పండుటకు సిద్ధముగా నున్న కాయను వలెనె ధర్మ సేవ జేయుచున్నారు.

తైస్తైః శరీరముత్సృష్టం ధర్మమేకోను గచ్ఛతి
తస్మాద్ధర్మ సహాయశ్చ సేవితవ్యః సదానృప॥
ప్రాణీ ధర్మ సమాయుక్తో గచ్ఛేత్స్వర్గ గతిం పరాం
తథైవా ధర్మ సంయుక్తో నరకం చోపపద్యతే॥

అనుశాసన. ౧౧౧-౧౪-౧

అంత కాలమునందు ధర్మము మాత్రమే వెంట వచ్చును.

ధర్మ ఏవకృతశ్శ్రేయా౯ ఇహలోకే పరత్రచ
ప్రతిపద్య నరో ధర్మం స్వర్లోకేచ మహీయతే ॥

పరాశరగీత. శాంతి. ౨౯౦-౬

ఇహపరములందును ధర్మమునకు తుల్యమగు నది లేదు. భారతమంతయు ధర్మమునే బోధించును

నీవు రసగంధాది ద్రవ్యముల విక్రయించు చుందువు. ఇట్టి నీకు నిష్ఠారూపమగు బుద్ధి యెట్లు ప్రాప్తమైనదని జాజలిఋషి ప్రశ్నింపగా తులాధారుడిట్లనెను.

వేదాహం జాజిలే ధర్మం సరహస్యం సనాతనం
సర్వభూతహితం మైత్రం పురాణం యంజనా విదుః
అద్రోహేణైవ భూతానాం అల్పద్రోహేణవా పునః
యావృత్తి స్సపరో ధర్మః తేన జీవామి జాజలే॥

శాంతి. ౨౬౨-౬

ఓమహర్షి సర్వభూత హితమగు ధర్మమునెవ రెఱుగుదురో నట్టి వారి ధర్మమునే నెఱుగుదును. సర్వభూతములకు ద్రోహరహితముగాగాని, స్వల్ప ద్రోహసహితముగా యేవృత్తి యుండునో, యదియే పరమధర్మము. అట్టి ధర్మము నే నెఱుగుదును.

ఈయధ్యాయము ధర్మ రహస్యముల దెలుపును.

విగుణంచ పునః కర్మ జ్యాయ ఇత్యేను శుశ్రుమ॥

విగుణ రూపమగు కర్మ గొప్పది, ఇట్లు నే వింటినని, తులాధారుడు జెప్పెను.

అర్జున ఉవాచ.

: అథ కేన ప్రయుక్తోయం పాపం చరతి పూరుషః,
: అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః. ౩౬

అర్జునుఁడు చెప్పుచున్నాఁడు:—ఓ వార్ష్ణేయా! (ఓ కృష్ణా!) ఇప్పుడు (ఈ విషయమును చెప్పుము) తనకిష్టము లేక పోయినను బలాత్కారము చేసినటుల మనుజుఁడు పాపము నెవరి ప్రేరణచే చేయును.

శ్రీ భగవానువాచ.

: కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః,
: మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్. ౩౭
ఈ విషయమునందు రజోగుణమువలన బుట్టినదియు మిక్కిలి యాహారపుష్టి గలదియు, మిక్కిలి పాపియు, క్రోధముగ పరిణమించునదియు నగు నీ కామమే శత్రువని యెఱుంగుము.

జితేంద్రియో ధర్మపరః స్వాధ్యాయ నిరత శ్శుచిః
కామక్రోధా వశేయస్య తం దేవా బ్రాహ్మణం విదుః॥
బ్రాహ్మణి. అరణ్య. ౨౩౨-౩౫

ధర్మపరుడై ఇంద్రియనిగ్రహము గలిగి స్వాధ్యాయనిరతుడై కామక్రోధములు వశమందు గలవాడు బ్రాహ్మణుడన బడును.

కామక్రోధాహి పురుషమర్థేభ్యో వ్యపకర్షతః
తౌతు శత్రూ వినిర్జిత్య రాజా విజయతే మహీం॥ ఉద్యోగ.

కామ క్రోధములు పురుషుని ప్రజ్ఞానమును లోపింప జేయును. కామ క్రోధములు వశమందు గలరాజు రాజ్యమును వశమందించుకొన గలడు.

: ధూమే నావ్రియతే వహ్ని ర్యథాదర్శో మలేనచ,
: యథోల్బే నావృతో గర్భ స్తథా తేనేద మావృతమ్. ౩౮

పొగచే నగ్నియు, దుమ్ముచే నద్దమును గప్పఁబడినట్లును, మావిచే గర్భ మావరింపఁ బడినట్లును దీనిచే నీసమస్తము నావరింపఁబడినది.

: ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్యవైరిణా,
: కామరూపేణ కౌంతేయ దుష్పూరే ణానలేన చ. ౩౯

ఓ కౌంతేయా! తృప్తినొందనిదియు, జ్ఞానికి నిత్యవైరియు, కామరూపియు నైనయీయగ్నిచేత జ్ఞాన మెల్లప్పుడు నాచ్ఛాదింపఁబడియుండును.

: ఇంద్రియాణి మనో బుద్ధి రస్యాధిష్ఠాన ముచ్యతే,
: ఏతై ర్విమోహయ త్యేష జ్ఞాన మావృత్య దేహినమ్. ౪౦

ఇంద్రియములును, మనస్సును, బుద్ధియు ననునవి దీనికి నధిష్ఠానములని, అనఁగా: వాసస్థానములని, చెప్పఁబడినవి ఇవి వీనియాశ్రయముచే జ్ఞానము నావరించుకొని మనుజునకీ మోహమును గలుగఁ జేయుచున్నవి.

: తస్మా త్త్వ మింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ,
: పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్ ౪౧

కాన నోభరత శ్రేష్ఠా! ఇంద్రియములను మొదటనిగ్రహించుకొని, జ్ఞానమును (అధ్యాత్మమును), విజ్ఞానమును (విశిష్టమగుజ్ఞానమును) నశింపఁజేయునీపాపుల నేవు సమూలముగ నశింపఁజేయుము.

ఏ హారేణహి సంవీతః శిశ్నోదర పరాయణః
జాత్యంధ ఇవ పంథానం ఆవృతాత్మాన బుధ్యతే॥
పరాశరగీత శాంతి. ౨౯౫-౩

షడింద్రియాణి విషయం సమాగచ్ఛంతివై యదా
తథా ప్రాదుర్భవంత్యేషాం పూర్వసంకల్పజం మనః॥

ఎపుడాయింద్రియములు విషయములను పొంగునో నపుడు మనుజులకు పూర్వమునందు సంకల్పించబడిన మనస్సు పుట్టుచున్నది.

కామము సంకల్పముచేగలుగును కావున సత్సంకల్పముచే కామమును జయించవలయును.

ఇంద్రియాణి పరాణ్యాహురింద్రియేభ్యః పరం మనః,
మనసస్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు సః. ౪౨

ఇప్పుడేమని చెప్పుచున్నాడనగా: (స్థూలమగు బాహ్య పదార్థములను బట్టి యా పదార్థములను తెలిసికొనెడి) ఇంద్రియములు పరములు అనగా శ్రేష్ఠములు. ఇంద్రియముల కంటె శ్రేష్ఠమయినది మనస్సు; మనస్సు కంటెను శ్రేష్ఠమైనది (వ్యవసాయాత్మకమగు బుద్ధి; బుద్ధికంటెను శ్రేష్ఠమైనది ఆత్మ

ఇంద్రియేభ్యః పరహ్యర్థాః అర్థేభ్యః పరమం మనః
మనసస్తు పరాబుద్ధి బుద్ధేరాత్మా మహాన్పరః॥
మహతః పరమవ్యక్తః అవ్యక్తాత్పరతోమృతం
అమృతాన్నపరాకించిత్ సాకాష్ఠా సాపరా గతిః॥
శాంతి. ౨౪౬-౩

వ్యాస మహర్షి శుకునకు జెప్పిన విధము - సర్వేంద్రియములను ఆత్మ గనిపెట్టును. కానిఇంద్రి

యములాత్మను గసిపెట్ట జాలవు. ఇంద్రియములు - మనస్సు- బుద్ధి- మహత్తు- అవ్యక్తము- వీటియన్నిటి కన్న అమృతము గొప్పది యనియు, దీనివిమించినది లేదనియు, ఇదియే నిష్ఠ, ఇదియే గతి యనియు, దెలుసు కొన దగును

చిత్తమింద్రియ సంఘాతాత్పరం తస్మాత్పరంమనః
మనసస్తు పరాబుద్ధిః క్షేత్రజ్ఞో బుద్ధితః పరః ॥

అసితుడు శాంతి. ౨౭౫-౬

స్థావరజంగమాత్మకమగు ప్రపంచ సృష్టియందువిషయములు జెప్ప బడినవి. భారతమంతా యర్ధప్రతి పాదకములగు శ్లోకముల నేకములు గలవు.

అహంకారాత్పరా బుద్ధిర్బుద్ధేరాత్మా తథాపరః
తస్మాత్తు పరమవ్యక్తం అవ్యక్తాత్పురుషః పరః॥

అశ్వమేధ ౫౦-౫౫

అహంకారము, బుద్ధి, ఆత్మ, అవ్యక్తము, ఈనాలిగిటికన్న పురుషుడు త్తముడు.

ధైర్యోపపత్తిః వ్యక్తిశ్చ విసర్గః కల్పనా క్షమా
సదసచ్చాశుతాచైవ మనసో నవవైగుణాః
ఇష్టానిష్ట విపత్తిశ్చ వ్యవసాయ సమాధితా
సంశయ ప్రతిపత్తిశ్చ బుద్ధేః పంచగుణాన్ విదుః ॥

వ్యాసః శాంతి. ౨౫౫-౯

ఓర్పు, వివేకము, జ్ఞప్తి, మరపు, కల్పన, క్షమ, మంచి చెబ్బరల విషయమున నభిని వేశము,

యనునివి మనోగుణములు.

మంచి చెడు తలంపులను రెంటిని నాశనము చేయుట. (సుషుప్తి) పట్టుదలసమాధి, నిశ్చయము ప్రత్యక్ష ప్రమాణముచే నెఱుఁగుట యను నివి బుద్ధి గుణములగు చున్నవి. ఈ యధ్యాయము పృథ్వి మొదలగు వాటి గుణముల జెప్పెను.

ఉవాచ వచనం దేవో బుద్ధింవై ప్రభురవ్యయః
బ్రహ్మాణం ప్రవిశస్వేతి లోక సృష్ట్యర్థ సిద్ధయే॥
వాసుదేవః నారాయణీయము శాం. తి. ३४౧-३४

శ్రీమన్నారయణమూర్తి బుద్ధిని స్మరించినంత మాత్రమున యది ప్రత్యక్షమయ్యెను. అప్పుడు దానితో భగవంతుడిట్లనెను. ఓబుద్ధీ నీవు బ్రహ్మనుపొంది లోకసృష్టిని గావించుము మఱియు "సృజేమాః వివిధ ప్రజాః" వివిధ రూపములు గల ప్రజలను సృష్టించుము.

సృష్టికి ప్రథమమునందు ఈశ్వరుడు, బుద్ధి, మాత్రమే గలవు. కావున బుద్ధికంటెపరుడీశ్వరుడని తెలియ దగులను.

ఏవం బుద్ధేః పరం బుధ్వా సం స్తభ్యాత్మాన మాత్మనా,
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్. ४३

ఓమహాబాహుఁడవగు నర్జునా! ఇట్లు బుద్ధికంటె పరమం దున్న యాత్మను తెలిసికొని నియంతట నీవే ధైర్యము తెచ్చుకొని సులభముగ పట్టఁబడని కామమను శత్రువును సంహరింపుము.

యేచ మూఢతమాలోకే యేచబుద్ధేః పరంగతాః
తేనరా సుఖమేధంతే క్లిశ్యంత్యంతరితో జనాః॥ శాంతి

చిత్తమింద్రియ సంఘాతాత్పరం తస్మాత్పరం మనః
మనసస్తు పరా బుద్ధిః క్షేత్రజ్ఞో బుద్ధితః పరః॥
శాంతి. ౨౭౬

మనో నవమమేషాంతు బుద్ధిస్తు దశమీ స్మృతా
ఏకాదశస్త్వనంతాత్మా ససర్వః పరఉచ్యతే॥
వ్యాసః శాంతి. ౨౫౨-౧౦

పంచభూతముల యొక్క సమూహమును జెప్పుచు తొమ్మిదవది మనస్సు, పదియవది బుద్ధి, పదునొకండవదనంతమగుయాత్మ, ఇంతకన్న వేరగునది లేదని చెప్పబడినది.

భగవంతుడను గీతలలో బ్రాహ్మణీబ్రాహ్మణచరితనొకటి యర్జునునకు జెప్పగా యర్జునుడిట్లు ప్రశ్నించెను.

క్వాను సా బ్రాహ్మణీ కృష్ణ క్వచాసౌ బ్రాహ్మణర్షభః
యాభ్యాం సిద్ధిరియం ప్రాప్తా తావుభౌ వద మేచ్యుత॥

కృష్ణా నీవు చెప్పిన బ్రాహ్మణీబ్రాహ్మణులెవరు ఎవరిచే యీసిద్ధి పొందబడినది వారిని దెలుపుము.

౧౬ శ్రీ భగవానువాచ.

మనో మే బ్రాహ్మణం విద్ధి బుద్ధిం మే విద్ధి బ్రాహ్మణీం
క్షేత్రజ్ఞ ఇతి యశ్చోక్తః సోహమేవ ధనంజయ॥
అశ్వమేధ. ౩౪-౧౧

ధనంజయా నామనస్సును బ్రాహ్మణునిగను, నాబుద్ధిని బ్రాహ్మణినిగను, క్షేత్రజ్ఞుడని యెవనిని జెప్పుదురో యట్టివానిని నేనెయని దెలుసుకొనుము

అశ్వమేధపర్వమందు బ్రాహ్మణగీతలు ౧౫అధ్యాయములు గలవు. ఈయధ్యాయములందు బ్రాహ్మణబ్రాహ్మణీ సంవాదము పంచభూతములు, పంచవాయువులు, దశేంద్రియములు, ఇంద్రియ కర్తవ్యములు, అంతర్యజ్ఞములు, విషయవచనము, యజ్ఞపశువిచారము పరశురామశాంతి, ఇంద్రియముల జయించిన అలర్కుని చరిత్ర, జనకుని ధర్మదేవత పరీక్షించుట, మనోబుద్ధి క్షేత్రజ్ఞుల విచారము, ఈవిషయములభివర్ణించ బడినవి.

ఇంద్రియైర్మనసస్సిద్ధి ర్నబుద్ధిం బుధ్యతే మనః
నబుద్ధిర్బుధ్యతే వ్యక్తం సూక్ష్మం త్వేతాని పశ్యతి॥
శాంతి. ౨౦౪-౨౦

ఇంద్రియములచే మనస్సిద్ధి గలుగును మనస్సు బుద్ధిని దెలుసు కొన లేదు బుద్ధి యవ్యక్తమును గనుగొన లేదు. సూక్ష్మమనునది యన్నిటిని జూచు నని మనువు బృహస్పతికి జెప్పెను ఈమనుబృహస్పతి సంవాదమందనేక సూక్ష్మములు గలవు.

క్షేత్రజ్ఞుడగు పరమ పురుషుని యధీనములో నుండు మనోబుద్ధులు నిలచినచో కామమును జయించ గలడు కామము మహాపాపపురుషుడుగా గీతయందు జెప్పబడినది. ఇట్టి కామమును జయించ వలయు నన నాత్మను స్వాధీనమందుంచు కొన వలయును. ఉంచు కొననివారు కంపన జిక్కిన కాకి వలె విడివడ లేరు.

౨—౩ అధ్యాయములు అనగా సాంఖ్యకర్మ యోగములు అంతమునందు కామమును జయించుమనియే బోధించినవి.

కర్మ యోగము
ముగిసెను.

శ్రీశివాభ్యాంనమః

# శ్రీ కుమారగీత

## జ్ఞాన యోగము

### చతుర్థాధ్యాయము.

జ్ఞానాగ్నిస్సర్వ కర్మాణి భస్మసాత్కురుతేర్జున ॥

---

శ్రీభగవానువాచ.

ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహ మవ్యయమ్,
వివస్వాన్మనవే ప్రాహ మను రిక్ష్వాకవే బ్రవీత్. ౧

శ్రీభగవంతుఁడు సెప్పుచున్నాఁడు.— అవ్యయమును, అనఁగా ఎప్పుడును నశింపనిదియు, లేక త్రికాలాబాధితమైనదియు, నిత్యమునైన ఈ (కర్మ) యోగమును నేను వివస్వంతునకు చెప్పితిని. వివస్వంతుడు (తనపుత్త్రుఁడగు) మనువునకు చెప్పెను. మనువు (తనపుత్త్రుఁడగు) నిక్ష్వాకువునకు చెప్పెను.

ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః,
సకాలేనేహ మహతా యోగో నష్టః పరంతప. ౨

ఈపరంపరగా ప్రాప్తమైన దీనిని (యోగమును) రాజర్షులు తెలిసికొనిరి. శత్రుతాపనా! (అర్జునా!) క్రిందట నీయోగము లోకమునందు నశించెను.

స ఏవాయం మయా తేద్య యోగః ప్రోక్తః పురాతనః,
భక్తోసి మే సఖాచేతి రహస్యం హ్యేత దుత్తమమ్. ౩

ఆ సర్వరహస్యములలో నుత్తమముగా నకర్మయోగమార్గమే నా భక్తుఁడవును, స్నేహితుడవును, యగు నీకిప్పుడుపదేశించితిని.

ఈ యోగము జ్ఞాననిష్ఠ కర్మనిష్ఠలుగలదిగను, ప్రవృత్తి నివృత్తి లక్షణములు గలదిగను, వేదార్థము బోధపడు నట్లుగను శ్రీకృష్ణునిచే నర్జునునకు బోధించ బడి నటుల జనమేజయునకు వైశంపాయను డిట్లు జెప్పు చున్నాడు.

సముపోఢేష్వనీకేషు కురు పాండవయోర్మృధే
అర్జునే విమనస్కేచ గీతా భగవతా స్వయం॥

యుద్ధము నందు విషాదమును బొందిన యర్జునునకు భగవంతుడు గీతనుపదేశించెను.

ఈ యోగము సృష్ట్యాదియందు నారాయణునిచే సూర్యునకుపదేశింప బడెను. ఈ యోగ పారంపర్యము అంతరించుటయు మొదలగునవి, నారయణీయము ౧౩౯ వ అధ్యాయమునందు ౮౭ శ్లోకములతో జెప్పబడి యున్నది.

ఈ ధర్మము యేకాంతికుల ధర్మము: దీనినే యర్జునునకు గీతలయందు భగవంతుడు బోధించెను. మఱియు "ధార్యతే స్వయమీశేన రాజన్నారాయణేనచ" స్వయముగా నారాయణుడే ధర్మమును ధరించెను.

"యదాసీన్మానసం జన్మ నారాయణ ముఖోద్గతం
బ్రహ్మణః పృధివీ పాల తదానారాయణస్స్వయం

తేనధర్మేణకృతవాన్ దైవంపిత్ర్యంచ భారత॥ ”

నారదుడిట్లు జెప్పుచున్నాడు— ఈధర్మమును సరించియే నారాయణుడు దైవ పిత్ర్యములను జేసియున్నాడు.

ఈ ధర్మమును ఫేనపులవలన వైఖానసులు వీరిచే సోముడు పొందిరి అంతట అంతర్ధానమయ్యెను.

కృతయుగమునందు బ్రహ్మవలన రుద్రుడు రుద్రుని వలన వాలఖిల్యులు పొందిరి పిమ్మట నంతర్ధానము నొందెను.

పిమ్మట నారాయణుని వలన సుపర్ణఋషి యీ ధర్మమును పొందుటచే దీనిని త్రిసుపర్ణ మనియెదరు; వీరిచే వాయువు, వాయువుచే విఘశాసనులగు ఋషులును పొందిరి; పిమ్మట యంతరించెను. ఇట్లీయంతర్ధానములు మఱికొన్ని గలవు.

ఈ ధర్మమును రాజర్షులు ధర్మ పరిపాలన కొఱకై పరంపరగ నుపదేశములను పొందుచుండిరి.

తత్రైషధర్మః కథితః స్వయం నారాయణేనహ
పితామహాయ శుద్ధాయ యుగాదౌ లోక కారిణే॥
పితా మహశ్చ దక్షాయ ధర్మమేతం పురాదదౌ
తతో జ్యేష్ఠేతు దౌహి_త్రే ప్రాదాద్దక్షో నృపోత్తమ।
ఆదిత్యే సవితుర్జ్యేష్ఠే వివస్వాన్ జగృహే తతః
త్రేతాయుగాదౌచ తతోవివస్వాన్మనవే దదౌ॥
మనుశ్చ లోకభృత్యర్థం సుతాయేక్ష్వాకవే దదౌ
ఇక్ష్వాకుణా చ కథితో వ్యాప్య లోకానవస్థితః॥
గమిష్యతి క్షయాంతేచ పునర్నారాయణం నృప॥

నారాయణునిచే బోధింపబడిన నీధర్మమును

బ్రహ్మ తన పుత్రుడగు దక్షాదులకు బోధించెను. ఈధర్మము అంతమునందు నారాయణుని యేపొందెను.

అర్జున ఉవాచ.

అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః
కథ మేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవా నితి. ౪

అర్జునుఁ డడుగుచున్నాఁడు — వివస్వంతుఁడుపూర్వకాలమునఁ బుట్టెను. నీవీకాలమునఁ బుట్టితివిగదా? "ఈయోగమును నేను వివస్వంతునకు చెప్పితి" నను నీమాటను నేనెట్లు నమ్మగలను?

శ్రీ భగవానువాచ.

బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున
తా న్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప. ౫

శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాడు— ఓయర్జునా! నీవు నేనును ననేక జన్మము లెత్తితిమి. వాని నన్నింటిని నే నెఱుంగుదును. ఓపరంతపా! నీవెఱుంగవు. (ఇదియే మన కిద్దఱకును గలభేదము)

భగవదవతారము.

హంసః కూర్మశ్చ మత్స్యశ్చ ప్రాదుర్భావా ద్విజోత్తమ
వారాహో నారసింహశ్చ వామనో రామ ఏవచ
రామో దాశరథి శ్చైవ సాత్వతః కల్కి రేవచ॥

శ్రీ భగవానువాచ శాంతి. ౩౪౦-౧౦౩

ఈ అధ్యాయమునందు మత్స్య కూర్మాద్యవతారములు, ఆయాయవతారములందలి కార్యములు, కాల నియమములు వర్ణింపబడినవి. దీని బట్టి జూచిన భగవదవతారములు విలాసమాత్రములని తెలియ గలము

అజో౽పి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరో౽పి సన్
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా. ౬

నేను (సర్వ) భూతములకునధిపతిని; జన్మనిరహితుడను; కాన నా యొక్క యాత్మ స్వరూప మెప్పుడును వికారమును పొందకపోయినను, నా యొక్క ప్రకృతినే యధిష్ఠించినే నా మాయచే జన్మించుచున్నాడను.

ప్రకృతి పురుషుల విశేషములు.

చలాంతు ప్రకృతిం ప్రాహుః కారణం క్షయ సర్గయోః
అక్షేప సర్గయోః కర్తా నిశ్చలః పురుష స్మృతః ||
శాంతి. ౩౧౯ - ౪౩

చలనస్వభావముగల ప్రకృతి సృష్టిసంహారములకు కారణమనియు, నిశ్చలుడగు పురుషుడు కర్తయనియు, జనకునకు యాజ్ఞవల్క్య బోధించెను.

శ్రీభగవానువాచ.- నవై రాత్ర్యాం నదివసె నసతి నాసతి నవ్యక్తె నచావ్యక్తె వ్యాస్థితె ఏవము స్వాయువస్థాయాం నారాయణ గుణాశ్రయా దజరాసురా దనిన్ద్రియా దగ్రాహ్యా దసంభవాత్ సత్యాదహింస్రా ల్లలామా ద్వివిధప్రవృత్తి విశేషాద వైరాదక్షయా దమరాదజరాదమూర్తితః సర్వ వ్యాపినః సర్వ కర్తుశ్చాశ్వత స్తమసః పురుషః ప్రాదుర్భూతో హరి రవ్యయః||
శాంతి. ౩౪౩ - ౫

రాత్రి పగలు సత్తు అసత్తు వ్యక్తావ్యక్తము గానిసమయమునందు నారాయణమూర్తిగుణాశ్రయంబు

వలన సత్యాది యహింసల వలన హరియను పురుషు డుద్భవించెను.

నారాయణీయమందు అర్జునునకు భగవానుడు యవతారవిశేషంబుల గూర్చిబోధించెను.

యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత,
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్.

ఓ భారతా! ఎప్పుడు ధర్మము చెడి యధర్మము ప్రబలమగుచున్నదో యప్పుడప్పుడు నేను స్వయముగ జన్మము (అవతారమును) నెత్తుచున్నాను.

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే.

సాధువుల సంరక్షణకొరకును దుష్టుల నశింపచేయుటకొరకును, ప్రతి యుగమునందును, ధర్మసంస్థాపనము జేయుటకును జనిమించుచున్నాను.

యదాచ సురకార్యంతే అవిషహ్యం భవిష్యతి
ప్రాదుర్భావం గమిష్యామి తదాత్మజ్ఞాన చైతికం
ఏవముక్త్వా హయశిరాస్తత్రైవాంతర ధీయతే॥

శ్రీభగవాన్ శాంతి. ౩౪౧-౫

దైవకార్యములు సహింపరాని దుస్థితి నొందినప్పుడు నేనవతరించుచున్నానని హయగ్రీవుడంతర్ధానమయ్యెను.

శ్రీకృష్ణావతారము.

స్వవంశ విస్తర కరం జనయిష్యతి మానసః
వసుదేవ ఇతిఖ్యాతం పుత్ర మానక దుందుభిం॥

తస్య పుత్రశ్చతుర్బాహు ర్వాసుదేవో భవిష్యతి॥
దాతా బ్రాహ్మణ సత్కర్తా బ్రహ్మ భూతోద్విజప్రియః॥
మహేశ్వరః అనుశాసన. ౧౪౭-౩౯

వంశ వృద్ధికరుడగు వసుదేవునకు చతుర్బాహు వగు వాసుదేవుడుదయించి, శత్రుసంహారముగావించి బ్రాహ్మణప్రియుడగునని మహేశ్వరుడు పార్వతికి జెప్పెను.

ధర్మాచార్యుడగు శ్రీకృష్ణుడు.

ధర్మాణాం దేశకస్సాక్షాత్సభవిష్యతి ధర్మభాక్
ధర్మవిద్భి స్సదై వేశో నమస్కార్య స్సదోద్యతైః॥
ధర్మ ఏవ పరో హిస్యాత్ తస్మి సభ్యర్చితే విభౌ
సహిదేవో మహాతేజాః ప్రజా హితచికీర్షయా
ధర్మార్థం పురుష వ్యాఘ్రః ఋషి కోటీస్ససర్జహ॥
అనుశాసన. ౧౪౭-౪౯

౭ ధర్మస్వరూపుడగు శ్రీకృష్ణుడే ధర్మాచార్యుడై యున్నాడు మఱియు ప్రజాహితము గోరి యతడు ధర్మాభివృద్ధికిగాను సనత్సుజాతాది ఋషులనేకుల సృష్టించెను ఇంతియెగాక స్వయముగా ధర్మోద్ధరణము గాను యవతరించెను. ఇట్టి ధర్మమయుని సేవించుటచే ధర్మపరాయణులగుదురు.

అశ్వత్థామ శ్రీకృష్ణార్జునుల మీద నారాయణాస్త్రము బ్రయోగించి యది నిష్ఫలమగుటచే యరణ్యములోనికి బారిపోయి

విచారించు చుండగా వ్యాసమహర్షి యతనితో నిట్లనెను.

త్ావేతౌ పూర్వ దేవానాం ప్రథమౌ ప్రథితావృషీ
లోకయాత్రా విధానార్థం సంజాయేతే యుగే యుగే॥
ద్రోణ. ౨౦౨-౯౧

దేవతలలో మొదటివారగు నరనారాయణులు (శివారాధనచే) జయించరానివారై ప్రతియుగమందు యవతరించు చుందురు కావునసీవు వారిని జయించలేవు

ధర్మ సంస్థాపనార్థాయ దైతేయానాం వధాయచ
జగతో ధారణార్థాయ విజ్ఞాప్యం కురుమే విభో॥
భీష్మ. ౬౫-౬౮

భీష్ముడు యుద్ధసమయమందు దుర్యోధనునకు వాసుదేవ మాహాత్మ్యమును జెప్ప దలచి — గంధమాదన మందు బ్రహ్మ దేవతలకు, ఋషులకు బోధించిన రీతి యిట్లు జెప్ప దొడగెను.

నారాయణుడు ధర్మసంస్థాపనార్థము, రాక్షస (దుష్ట) సంహారము కొరకు, లోక సంగ్రహార్థము యవతరించును. ఆతనినే శ్రీకృష్ణుడని దెలుసు కొనుము.

ద్వాపరస్య యుగస్యాంతే ఆదౌ కలియుగస్యచ
సాత్వతం విధిమాస్థాయ గీతస్సంకర్షణేన యః॥
స ఏష సర్వం సురమర్త్య లోకం సముద్రకక్షాంతరితాః పురీశ్చ
యుగేయుగే మానుషం చైవవాసం పునః పునస్సృజతే విశ్వకర్మా॥
భీష్మ॥ ౬౬-౪౧

ద్వాపర కలియుగముల మధ్య భగవంతుడు మానుష భావమును పొందు చుండును,

జగతోఽనుగ్రహార్థాయ యాచితో మే జగత్పతిః
మానుషం లోకమాతిష్ఠ వాసుదేవ ఇతి శ్రుతః॥
అసురాణాం వధార్థాయ సంభవస్వ మహీతలే॥

దేవా! నీవు జగదనుగ్రహము కొరకు మనుజలోకమందు వాసుదేవుడవుగా యవతరించి రాక్షసుల సంహరించుము.

పరమ పురుషుడు ధర్మ సంస్థాపన కొరకు పుట్టినవాడై, ధర్మోద్ధరణ గావించుచున్నాడని, దృఢ భక్తిగలవారలు, పునర్జన్మ బాధ నొందరు.

సైంధవునకు వరదానము చేయునప్పుడు శివుడు జెప్పినది-

అసతాం నిగ్రహార్థాయ ధర్మ సంరక్షణాయచ
అవతీర్ణో మనుష్యాణాం అజాయత యదు క్షయే
సఏవ భగవాన్విష్ణుః కృష్ణేతి పరికీర్త్యతే॥ అరణ్యా. ౨౭౧

దుష్టశిక్షణకు, ధర్మ రక్షణకు యదు వంశమున బుట్టిన విష్ణుమూర్తియే కృష్ణుడని గీర్తింప బడును.

నారాయణ పరో ధర్మః పునరావృత్తి దుర్లభః
ప్రవృత్తి లక్షణశ్చైవ ధర్మో నారాయణాత్మకః॥
శాంతి. ౩౪౭-౮౦

నారాయణుడే ముఖ్యమగు ధర్మము. ఇదియే పునరావృత్తి రహితమయినది. ప్రవృత్తి లక్షణముగాగల ధర్మము, నారాయణ సంబంధమని తెలియదగును.

ధర్మస్య సేతుం బధ్నామి చలితే చలితే యుగే
తాస్తా యోని ప్రవిశ్యాహం ప్రజానాం హితకామ్యయా॥
అశ్వ. ౫౪.౧౩

ధర్మచలనము గలిగిన ప్రతి యుగమందును, నానా యవతారముల నెత్తి ధర్మమునకు సేతువు గట్టినను.

యదా వేద శ్రుతిర్నష్టా మయా ప్రత్యాహృతా పునః
సవేదా స్సశ్రుతీకాశ్చ కృతాః పూర్వం కృతే యుగే॥
శాంతి. ౩౩౯-౧౧

కృతయుగమందంతర్ధానమైన వేదములు నాచే పునరుద్ధారము చేయబడినవి. (ఇట హిరణ్యాక్షుని కథ యను సంధించుకొనునది.)

యథాధర్మో గ్లాతి వంశే సురాణాం
తథా కృష్ణో జాయతే మానుషేషు
ధర్మేస్థిత్వా సతువై భావితాత్మా
పరాంశ్చ లోకా నపరాంశ్చ పాతి॥ అను. ౧౫౮-౧౩

యథావిశ్వాని భూతాని వృష్ట్యా భూయాంసి ప్రావృషి
సృజంతే జంగమస్థాని తథా ధర్మా యుగే యుగే॥
శాంతి. ౨౩౭-౪౧

వర్షా కాల మందు భూతములన్నియు జనించునట్లు ప్రతి యుగమందును ధర్మములన్నియు జనించును.

ధర్మస్సతాం హితః పుంసాం ధర్మ శ్చైవాశ్రయ స్సతాం
ధర్మాల్లోక స్త్రయ స్తాత ప్రవృత్తా స్సచరా చరాః॥
నారాయణీయము. శాంతి. ౩౦౯-౭

సత్పురుషులకు ధర్మము హితమగుటయే గాక ఆశ్రయము కూడనైయున్నది. ధర్మము చేతనే స్థావర జంగమాత్మకమగు ప్రపంచము నడచు చున్నది.

జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః,
త్యక్త్వా దేహం పున ర్జన్మ నైతిమా మేతి సో ర్జున. ౯

ఓయర్జునా! నాయొక్క యిట్టి దివ్యములగు జన్మ కర్మల యందున్న తత్త్వమును తెలిసికొనువాఁడు దేహ త్యాగానంతరము ఇందుతిరిగి జన్మము నెత్తక నాతో నైక్యము నొందును.

సిద్ధా హ్యేతే భాగాః పురా హ్యేకాంతినో భవ
తమో రజోభి నిర్ముక్తా మాం ప్రవేక్ష్యంత్యసంశయం ॥

శాంతి. ౩౪౮-౨౦

ఏకాంత భక్తులు రజస్తమో గుణముల నుండి ముక్తులై నన్ను బొందుదురు.

వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః,
బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః. ౧౦

రాగమును, భయమును, క్రోధమును, పోగొట్టుకొని మత్పరాయణులయి నన్నాశ్రయించిన యనేకులట్లు జ్ఞానరూపమగు తపస్సుచే శుద్ధులై నాలో నైక్యము నొందిరి.

యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్,
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః. ౧౧

ఎవరు నన్ను నేప్రకారముగ భజించుచున్నారో వారికి నేను తదను సారముగనే ఫలము నిచ్చుచున్నాను. ఓ పార్థా! ఎటులైనను మనుష్యులు నాయొక్క మార్గమునే యవలంబించి నన్నుం జేరుదురు.

క్షీరోదధే రుత్తరతః శ్వేతద్వీపో మహాప్రభః
తత్ర నారాయణ పరాః మానవాః చంద్ర వర్చసః
ఏకాంత భావోపగతాః తే భక్తాః పురుషోత్తమం
తే సహస్రార్చిషం దేవం ప్రవిశంతి సనాతనం ॥

ఋషయః శాంతి. ౩౩౭-౨౭

క్షీరసముద్రోత్తరభాగమందు గల శ్వేతద్వీపమందు నారాయణమూర్తి ధ్యానము గావించు చంద్ర వర్చస్సు గల మానవులు ఏకాంతభావమును బొందినవారై, సనాతనుడగు బురుషోత్తమునందు ప్రవేశింతురు.

మానవులు (మాత్రము) బురుషోత్తమునందు ప్రవేశింతురని జెప్పుటచే మఱొకజన్మయందా యధికారము లేదనియు, మాన జన్మయుత్తమమైనదనియు దేటపడు చున్నది.

ఉపభోగైరపిత్యక్తం నాత్మానం సాదయేన్నరః
చాండాలత్వేపి మానుష్యం సర్వథా తాత శోభనం॥
ఇయం హి యోనిః ప్రథమాం యాం ప్రాప్య జగతీపతే
ఆత్మావై శక్యతే త్రాతుం కర్మభి శుభలక్షణైః
కథం న విప్రనశ్యేమ యోనితో స్యా ఇతి ప్రభో।
కుర్వంతి ధర్మం మనుజాః శ్రుతి ప్రామాణ్య దర్శనాత్।
యోనఃర్లభతరం ప్రాప్య మానుష్యం ద్విషతే నరః
ధర్మావమంతా కామాత్మాభవేత్సఖలు వంచతే॥

పరాశరగీత. శాంతి. అ౨౯౭

పరాశరుడు జనకునకు మనుష్యత్వమును గురించి యిట్లు జెప్పుచున్నాడు. భోగముల ననుభవించుట లేదని మానవుడు చావ జనదు. ఛండాలత్వమందయినను మానవత్వము శ్రేయస్కరమే యైయున్నది. మనుష్యత్వదశలో ఆత్మను శుభకర్మలచే గాపాడుకొనవచ్చును. పొంద శక్యము గాని మనుష్యత్వమును పొంది యెవడు ద్వేషించునో వాడు ధర్మద్వేషియు, వంచకుడు గాగలడు.

"మనుష్యయోని మిచ్ఛంతి సర్వభూతాని సర్వశః॥" మఱియు సర్వభూతములు మనుష్య జన్మనెత్తుటకే గోరును.

భగవంతుడు ఋషులతో నిట్లు జెప్పుచున్నాడు - మీరు నన్ను జూడ లేరు. శ్వేతద్వీపమందు గల చంద్ర వర్చస్సుతో ప్రకాశించు మానవులు నన్ను పొందుదురు.

యదహం మానుషీం యోనింస్పృగాలః ప్రాప్స్యామ్యహం

సంతుష్టశ్చాప్రమత్తశ్చ యజ్ఞదాన తపోరతః
క్షేత్రాణ్యేతాని ధర్మాణాం వర్జ్యే వర్జయిత్వా తథా॥
కాశ్యప సృగాల సంవాదము. శాంతి ౧౮౦

కాశ్యపా! నేను సృగాలజన్మనొదలి మానుష జన్మపొందిన సంతోషింతును. ఎందుకందువేని? మనుష్య జన్మయందు యజ్ఞ యాగాది కర్మలు జేసి సుఖించ గలను.

కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః,
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా. ౧.౨

(కర్మబంధముయొక్క నాశమును కోరువారికేగాక, కేవల) కర్మఫలమునుగోరు లోకమునకును (పై) కర్మఫల మీ మనుష్య లోకమునందు శీఘ్రముగ నే ప్రాప్తమగును కాన నిహలోకమున దేవతలను పూజించుచున్నారు.

ఇహ చింతా బహువిధా ధర్మాధర్మస్య కర్మణః
కర్మభూమిరియం లోకే ఇహ కృత్వా శుభాశుభం॥
శుభైః శుభమవాప్నోతి తథా శుభమథాన్యథా ॥
ఇహ ప్రజాపతిః పూర్వం దేవాస్సర్షి గణాస్తథా
ఇష్ట్వేష్ట్వా తపసః పూతా బ్రహ్మలోకా ముపాసితాః॥
శాంతి. ౧౯౨

ఇచట ధర్మాధర్మముల విచారము నానావిధ ములుగా నుండును. మనము నివసించు యీభూమి కర్మభూమి; అనగా కర్మలు చేయ దగిన స్థలము. ఇచట శుభాశుభ కర్మల చేసి శుభాశుభ కర్మల ఫలము ననుభవింతురు.

బ్రహ్మ, దేవతలు, ఋషులు, మొదలగు వారు గూడా యజ్ఞ దానతపో ఫలముల చేతఁ యనుభవింప బడుచున్న యాయా పదవుల బొందిరి.

: చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః,
: తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్. ౧౩

బ్రాహ్మణుఁడు, క్షత్రియుఁడు, వైశ్యుఁడు శూద్రుఁడు ననునాల్గు వర్ణములవ్యవస్థను గుణములయొక్కయు, కర్మలయొక్కయు భేదములఁబట్టి నేనేసృజించితిని. నేను దానికి కర్తను నగుదును, అకర్తను అనఁగా: దానిని చేయని యవ్యయుఁడను నగుదునని తెలిసికొనుము.

వక్త్రాద్భుజాభ్యామూరుభ్యాం పద్భ్యాంచైవ ప్రజజ్ఞిరే
సృజతః ప్రజాపతేర్లోకానితి ధర్మ విదో విదుః ॥
ముఖజా బ్రాహ్మణాస్తాత బాహుజాః క్షత్రియాః స్మృతాః
ఊరుజా ధనినో రాజన్ పాదజాః పరి చారకాః ॥
చతుర్ణామేవ వర్ణానామాగమః పురుషర్షభ
అతోన్యేత్వతిరిక్తా యేతేవై సంకరజా స్మృతాః ॥

పరాశరగీత. శాంతి. ౨౯౬

దేవతలందు గూడా నాలుగు వర్ణములు గలవు.

ఆదిత్యాః క్షత్రియాస్తేషాం విశశ్చ మరుతస్తథా
అశ్వినౌతు స్మృతౌ శూద్రా తపస్యుగ్రే సమాస్థితా
స్మృతాస్త్వంగిర దేవాః బ్రాహ్మణ ఇతి నిశ్చయః
ఇత్యేతత్సర్వ దేవానాం చాతుర్వర్ణ్యం ప్రకీర్తితమ్॥

శాంతి. ౨౦౮-౨౩

ఆదిత్యులు క్షత్రియులు, సప్తమరుత్తులు వైశ్యులు, అశ్వినీ దేవతలు శూద్రులు, అంగీరసాదులు బ్రాహ్మణులు నైయున్నారు.

చతుర్ణామపి వర్ణానామాశ్రమ సవిశేషతః
కరోతి సతతం శాంతిం సావిత్రీముత్తమాం పఠన్
నతేషాం విద్యతే దుఃఖం గచ్ఛంతి పరమాం గతిం॥

అను..౧౫౦-౭౬

నాలుగాశ్రమములలో నాలుగు వర్ణములను జెందిన యెవనైనను సావిత్రీ (గాయత్రి) స్మరణ చేతను, కీర్తనచేతనుత్తమగతి నొందుదురు.

బ్రాహ్మణే వేదమగ్ర్యంతు క్షత్రియే తేజ ఉత్తమం
దాక్ష్యం వైశ్యేచ శూద్రేచ సర్వ వర్ణానుకూలతా॥
అదాంతో బ్రాహ్మణో సాధుః నిస్తేజాః క్షత్రియోధమః
అదక్షో నింద్యతే వైశ్యః శూద్ర ప్రతికూలవాన్॥

సౌప్తిక. ౩-౧౯

బ్రాహ్మణున కధ్యయనము, క్షత్రియునకు శౌర్యము, వైశ్యునకు దాక్షిణ్యము, శూద్రునకందరి యందు ప్రీతి, స్వధర్మము లయి యున్నవి.

క్రోధి యగు బ్రాహ్మణుడు, తేజో హీనుడైన రాజు, సమర్థుడు గాని వైశ్యుడు, వ్యతిరేకాచరణము గల శూద్రుడు, అధములన బడుదురు.

తతః కృష్ణో మహాభాగ పునరేవ యుధిష్ఠిరః
బ్రాహ్మణానాం శతం శ్రేష్ఠం ముఖాదేవాసృజత్ప్రభుః॥
బాహుభ్యాం క్షత్రియశతం వైశ్యానామూరుతః శ్శతమ్
పద్భ్యాం శూద్రశతంచైవ కేశవో భరతర్షభ॥
సఏవమ్ చతురో వర్ణాన్ సముత్పాద్య మహాతపాః

అధ్యక్షం సర్వభూతానాం ధాతారమకరోత్స్వయం॥
శాంతి. ౨౦౪-౩౧

శ్రీకృష్ణ మూర్తి ప్రతి వర్ణమందును నూరుగిరిని బుట్టించి వారందరికి బ్రహ్మను యధ్యక్షునిగా చేసెను.

"శరీరావయవములు, ఆహార విహారములు, సమములయి యుండగా వర్ణభేద మెట్లు గలిగెను?" యిట్లని భారద్వాజఋషి భృగుమహాఋషిని బ్రశ్నింపగా యత డిట్లు బ్రత్యుత్తరమిచ్చెను.

నవిశేషోస్తి వర్ణానామ్ సర్వం బ్రాహ్మ మిదం జగత్
బ్రహ్మణా పూర్వ సృష్టంహి కర్మభి ర్వర్ణతాం గతమ్॥
శాంతి. ౧౮౮-౧౦

వర్ణ విశేషమేమియు లేదు; ఈ ప్రపంచమంతయు బ్రహ్మమయము. పూర్వము బ్రహ్మచే సృష్టింప బడిన కర్మలచే వర్ణ విశేషములేర్పడినవి.

కామ భోగ ప్రియా స్తీక్ష్ణాః క్రోధనాః ప్రియ సాహసాః
త్యక్త స్వధర్మా రక్తాంగా స్తే ద్విజాః క్షత్రతాం గతాః॥

కామభోగాసక్తులై, స్వధర్మత్యాగము జేసి రక్తాంగులైన ద్విజులు క్షత్రియులయిరి.

గోభ్యో వృత్తిం సమాస్థాయ పీతాః కృష్యుప జీవినః
స్వధర్మా న్నాను తిష్ఠంతి తే ద్విజాః వైశ్యతాం గతాః॥

గోపరిపాలనచే జీవించుచు, కృషిజీవనము గలిగి పీత వర్ణులగు ద్విజులు వైశ్యులయిరి.

హింసానృత ప్రియాలుబ్ధాః సర్వ కర్మోపజీవినః
కృష్ణాః శౌచపరిభ్రష్టాః తే ద్విజాః శూద్రతాం గతాః॥

హింస చేయుటచే, అసత్యముబలుకుటచే, లోభియగుటచే శౌచాచారహీనుడగుటచే ద్విజుడు శూద్రుడగును.

ఇత్యేతైః కర్మభిఃర్వ్యస్తా ద్విజాః వర్ణాంతరం గతాః॥

మహాభారత మందు వర్ణ విచక్షణ యనేక విధముల చేయ బడి యున్నది.

చాతుర్వర్ణ్య యజ్ఞములు.

ఆలంభ యజ్ఞా క్షత్రాశ్చ హవిర్యజ్ఞా విశస్మృతాః
పరిచారయజ్ఞా శ్శూద్రాస్తు తపోయజ్ఞా ద్విజాతయః॥

శాం. ౨౩౧-౬౪

అశ్వమేధాదియజ్ఞములరాజులు, హవిర్యజ్ఞముల వైశ్యులు సేవా యజ్ఞముల శూద్రులు, తపో యజ్ఞముల బ్రాహ్మణులు, జేయ దగినవి.

వర్ణేభ్యోపి పరిభ్రష్టో నవైసమ్మానమర్హతి
వర్ణోత్కర్షమవాప్నోతి నరః పుణ్యేన కర్మణా॥

శాం. ౨౯౧-౪

వర్ణచ్యుతుడు సమ్మానార్హుడు గాడు. పుణ్య కర్మలు వర్ణోత్కర్షను గలిగింపగలవు.

చతుర్ణాం యత్రవర్ణానాం ధర్మవ్యతికరో భవేత్
నతత్రవాసం కుర్వీత శ్రేయోర్థీవై కథంచన॥ ౩౬

శ్రేయోభిలాషి వర్ణసంకరమగుచోట నుండరాదు.

అకర్తారమమూర్తంచ భగవానాహ తీర్థవిత్
యోజంతుః స్వకృతై స్తైస్తైః కర్మభిః నిత్యమంఖితః॥
బధ్యతే మధ్యతేచైవ కర్మభిర్మంథవత్సదా॥

శాం. ౩౩౦-౫౪

---

న మాం కర్మాణి లింపంతి న మే కర్మ ఫలే స్పృహా,
ఇతి మాం యోఽభిజానాతి కర్మభి ర్న స బధ్యతే. ౧౪

నన్ను కర్మలు బాధింపవు. కారణ మేమి యన నాకు కర్మ ఫలము నందిచ్ఛ లేదు. నన్నిట్టివానినిగఁ దెలిసికొనిన వాని సైతము కర్మలు బాధింప నేరవు.

నహింసయతి యః ప్రాణాన్ మనోవాక్కాయ హేతుభిః।
జీవితార్థాపనయనైః కర్మభిర్న స బధ్యతే॥

శాం. ౧౭౫-౭

ఎవడు మనోవాక్కాయ కర్మలచే హింస చేయడో, వాడు జీవుల నశింప జేయువానిచే నైన హింసింప బడడు.

కర్మణా మనసా వాచా యే నహింసంతి కించన
యే నసజ్జంతి కస్మింశ్చిత్ తే నబధ్యంతి కర్మభిః॥
ప్రాణాతిపాతాద్విరతాః శీలవంతో దయాన్వితాః
తుల్య ద్వేష్య ప్రియాదాంతాః ముచ్యంతే కర్మబంధనైః॥

మహేశ్వరః అను. ౧౪౪-౭

మనోవాక్కాయములచే హింస సేయని వారు, దేని యం దాసక్తి లేని వారు, దుర్మరణముల బొందనివారు, శీలవంతులు, దయావంతులు, శత్రుమిత్రత్వములు సమముగా గల వారు, కర్మ బంధమునుండి ముక్తులగుదురు.

ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వై రపి ముముక్షుభిః,
కురు కర్మైవతస్మా త్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్.

దీనిని తెలిసికొని పూర్వపు ముముక్షువులు సైతము కర్మను జేసిరి. కావున పూర్వకాల మందలి పూర్వులును, వారిపూర్వు లును చేసినకర్మలనే నీవును చేయుము.

బ్రాహ్మణేషుచ వృత్తిర్యా పితృపైతామహోచితా
తమన్వేహి మహాబాహో ధర్మస్యైతేహి దేశికాః॥

అనుశాసన. ౧౬౭

బ్రాహ్మణులందే ధర్మము గలదో, పితృ పితామహుల కేది యుచితమో, దానిని వెదకుము. ఎందుకన బ్రాహ్మణులు, పితృపితామహులు ధర్మాచార్యులయి యున్నారు.

తస్మాదేకాంతముత్సృజ్య పూర్వైః పూర్వతరైశ్చయః
పంథా నిషేవిత సద్భిః సనిషేవ్యో విజానత॥ శాం. ౧౩

విషాదపీడితుడయిన ధర్మరాజుతో సహదేవుడిట్లుచెప్పెను నీ యేకాంతవృత్తిని విడచి పెట్టుము; మఱియు నీపూర్వపూర్వతర పురుషులచే సత్పురుషులచే నే మార్గము స్వీకరింప బడెనో యది తెలుసుకొని యనుసరించుము.

కిం కర్మ కి మకర్మేతి కవయోప్యత్ర మోహితాః,
తత్తేకర్మ ప్రవక్ష్యామియత్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్. ౧౬

కర్మయేదియో, యకర్మయేదియో తెలిసికొను విషయమున బుద్ధిమంతులం సైతము భ్రమం జెందుదురు; కాని దేనిని తెలిసి కొనుటచే పాపమునుండి ముక్తుడ వగుదువో యాకర్మను నీకు చెప్పుచున్నాను.

కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః. ౧౭

కర్మయొక్క గతి గహనమైనది; (కాన) ముందుగ కర్మ యనంగ నేమియో, వికర్మ (విపరీతమైనకర్మ) యన నేమియో, అకర్మ (కర్మలను చేయక పోవుట) యన నేమియో తెలిసి కొన వలయును.

కథం కర్మ శుభం కుర్యాం కథం ముచ్యేపరా భవాత్
కర్మాస్తస్య ఘోరస్య బహుధా నిర్ణయో భవేత్॥
ఆరణ్య. ౨౦౭-౨౧

శుభకర్మ నెట్లు జేయదగును? పరాభవమునుండి ముక్తి యెట్లుగలుగును? ఘోరమగు యాకర్మ ఇట్టిదట్టిదని నిర్ణయించుట దుసాధ్యము; ఎందుకన యిది బహు విధములుగా నున్నది.

"ఏకర్మలు ప్రాయశ్చిత్తమునకు దగినవి? ఏకర్మలు జేసి ముక్తి నొందవచ్చు" నని ధర్మజుడు వ్యాసమహర్షిని ప్రశ్నింప యతడిట్లు జెప్పెను. శాం. ౩౪

అకుర్వన్ విహితం కర్మ ప్రతిషిద్ధానిచాచరన్
ప్రాయశ్చిత్తీయతేహ్యేవం నరోమిథ్యాను వర్తయన్॥

విహితములగుకర్మల నాచరించక, నిషేధ కర్మల జేయువాడు ప్రాయశ్చిత్తార్హుడగును.

"కింకర్మ పురుషఃకృత్వా శుభం పురుష సత్తమ" ఏకర్మ జేసి పురుషుడు శుభమును పొంద గలడని ధర్మజుని ప్రశ్న.

కురుతే యాదృశం కర్మ తాదృశం ప్రతిపద్యతే
నిరంతరంచ మిశ్రంచ లభతే కర్మ పార్థివ॥
కల్యాణం యదివా పాపం నతు నాశోస్య విద్యతే॥
శాం. ౨౯౧

ఏ విధమగు కర్మ నాచరించిన యావిధమగు ఫలము పొంద బడునని, భీష్ముడు మూడధ్యాయములందు జెప్పెను.

కర్మ ణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మయః;
స బుద్ధిమా న్మనుష్యేషు సయుక్తఃకృత్స్న కర్మకృత్.

కర్మ యకర్మ యనియు, అకర్మే కర్మ యనియు నెవడీక్షించునో యాపురుషుడు మనుష్యులందఱిలోను జ్ఞానియు

యుక్తుఁడు, అనఁగా: యోగయుక్తుఁడును, సర్వకర్మలను చేయు చున్నవాఁడును నగును.

ఈ శ్లోకమునకు శ్రీశంకర భగవత్పాదాచార్యుల వారు విపుల వ్యాఖ్యానము వ్రాసి యున్నారు.

ఈ శ్లోకార్థము స్థూల బుద్ధి పరాయణులకు బోధ బడుట కష్టమని జెప్పుటకు గాను - శ్లోకమందు "యుక్తః - బుద్ధిమాన్" యను రెండు పదములు ప్రయోగింప బడినవి. కావున యారెండు శబ్దముల యర్థము వివరముగ దెలుసు కొనదగినది. ఇందుచే వాటి యర్థము భారతమందెట్లు నిర్వచించ బడెనో జూడ దగును.

దృశ్యం పశ్యతి యః పశ్యన్ సచక్షుష్మాన్ సచబుద్ధిమాన్
అజ్ఞాతానాంచ విజ్ఞానాత్ సంబోధా ద్బుద్ధిరుచ్యతే॥
శాంతి. ౧౪ - ౨౧

ఎవడు జూచుచు జూడ దగిన దానినే జూచునో వాడు నేత్రములు బుద్ధియు గలవాడగును. మఱియు దెలియని వాటిని దెలుసు కొనుటయు, బోధించుటయు - బుద్ధి యనబడును.

యుక్తస్యతు మహారాజా లక్షణాన్యుప ధారయ
లక్షణంతు ప్రసాదస్య యథా తృప్తః సుఖంస్వపేత్॥
నిర్వాతేతు యథా దీపో జ్వలేత్స్నేహ సమన్వితః
నిశ్చలోర్ధ్వ శిఖస్తద్వద్యుక్త మాహుర్మనీషిణః॥
పాషాణ ఇవ మేఘోత్థైర్యథా బిందుభిరాహతః
నాలం చాలయితుం శక్యస్తథాయుక్తస్య లక్షణం॥
శాం. ౩౧౭

గాలి వీవని స్థలమున దీప మేవిధముగా చలించక నిశ్చలముగా నిలచి యుండునో, వర్షపాతముచేత పాషాణ మెట్లు

కదలడో యజ్ఞే యుక్తుడగు వాడు నిర్వికారముగాసంచరించును.

స్వే(శమాణాం ఫలం తాత కర్మణా స్తత్ఫలం విదుః
అకర్మణః ఫలం చైవ సఏవ పరమవ్యయః॥

శాం. ౨౮౦-౨౨

ఆశ్రమములకు, ఆయా కర్మలకు, తగిన ఫలము విష్ణువనియు, అకర్తలకును, నాశనము లేని విష్ణువే ఫలమనియు, వృత్త గీతలోని విష్ణు మాహాత్మ్యమున జెప్పబడినది.

ఆయా కర్మలకును యంతము లేని పరమాత్ముని వలన ఫలము గలిగినదని జెప్పుటచే ప్రాజ్ఞులు కర్మాకర్మల దెలుసుకొన సమర్థులు.

శ్రీమద్భగవద్గీతయందును "యుక్తః కర్మ ఫలంత్యక్త్వా శాంతి మాప్నోతి నైష్ఠికీం॥" యని కర్మ ఫలత్యాగి శాంతి బొందునని చెప్పబడియున్నది. కర్మ ఫలమును యుక్తుడగు వాడే విడచి పెట్ట గలడు. వాడే శాంతిని గూడ బొంద గలడు. కావున యుక్తత్వ మెంత యవసరమో దేటబడు చున్నది.

ఇంతియే గాక కర్మా కర్మలను గురించి రాజధర్మ పర్వమందు గూడ యిట్లు జెప్ప బడినది.

అల్పంహి సారభూయిష్టం యత్కర్మో దారమేవతత్
కృతమేవ కృతాచ్ఛ్రేయో నపాపీయో స్త్యకర్మణః॥

శాం, ౪౫-౨౪

సారభూయిష్టమగు కర్మ స్వల్పమైనను యౌదార్యము గలది యగును. ఏదేని కర్మ జేయకుండుట కన్న చేయుట మేలగును. కర్మ చేయక పోవుట కన్న మఱొక పాపము లేదు.

: యస్య సర్వే సమారంభాః కామసంకల్పవర్జితాః,
: జ్ఞానాగ్ని దగ్ధకర్మాణం తమాహుః పండితంబుధాః॥ ౧౯

ఎవరియొక్క సమారంభములు, అనగా: ప్రయత్నము లన్నియు ఫలేచ్ఛాశూన్యములుగ నుండునో యతనినే జ్ఞానాగ్నిచే దగ్ధమయిన కర్మలు గల పండితుడని జ్ఞాతలు చెప్పుచున్నారు.

యస్య ప్సర్వే సమారంభాః నిరాశిర్బంధనా ద్విజ
త్యాగే యస్య హుతం సర్వం సత్యాగీ సచ బుద్ధిమాన్॥
శాం. ౧౮౯-౧౧

ఎవని సర్వ ప్రయత్నములు త్యాగమందు హుతమగునో, వాడు త్యాగి, బుద్ధిశాలి యని భారధ్వాజ ఋషికి భృగువు జెప్పెను.

: త్యక్త్వా కర్మ ఫలాసంగం నిత్య తృప్తో నిరాశ్రయః
: కర్మణ్యభి ప్రవృత్తోపి నైవ కించిత్కరోతి సః॥ ౨౦

కర్మఫలాసక్తిని వదలి సదా తృప్తుడును నిరాశ్రయుడు, అనగా ఇట్టిలాభము కొఱకీకర్మను చేయుచున్నానని కర్మఫలముల యొక్క సాధనములకు నాశ్రయభూతమగు బుద్ధిని వదలి వేయు వాడు, కర్మలుచేయుట యందు మగ్నుడైనను నేమియుచేయుడు (అని చెప్ప వలయును)

: నిరాశిర్యత చిత్తాత్మా త్యక్త సర్వ పరిగ్రహః
: శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్॥ ౨౧

ఫలవాసనను వదలి వేసిన వాడును, చిత్తమును నియమించిన వాడును, సర్వసంగ ముక్తుడు నైన వాడు శారీరకములు మాత్రమే యగు, అనగా శరీరముచేగాని కర్మేంద్రియముల చేతనే గాని కలుగు, కర్మలను చేయుచున్నను వానికి పాపముండదు.

: యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః
: సమః సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి ననిబధ్యతే ॥ ౨౨

యదృచ్ఛచేతనే ప్రాప్తమయిన దానిచేతనే సంతుష్టుడును (వార్షము శ్లోకము మొదలుగా గల) ద్వంద్వముల నుండి ముక్తుడును మాత్సర్య శూన్యుడును, (కర్మలు) సిద్ధించినను, సిద్ధింపకపోయినను, సమానమే యనుకొను వాడును, (కర్మలను) చేసినను (వానిపాపపుణ్యములచే) బంధింప బడడు.

: గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థిత చేతసః
: యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే ॥ ౨౩

సంగరహితుడును, (రాగ ద్వేషముల నుండి) ముక్తుడును, (సామ్య బుద్ధి రూపమగు) జ్ఞానమునందు స్థిరచిత్తుడును, (కేవల) యజ్ఞము కొఱకని మాత్రమే చేయు వాడును నగు పురుషుని యొక్క కర్మ సమగ్రముగా లయము నొందును.

ఈ నాలుగు శ్లోకములందు జెప్ప బడిన నిత్య తృప్త నిరాశ్రయాది గుణములు భారతమందంతటను జ్ఞానులదు లక్షణములుగ జెప్ప బడినవి. ఇచట అనగా భగవద్గీత యందు కర్మాసక్తులవు ఆవశ్యకములుగా వర్ణింప బడినవి. ఈ రెండిటి సంబంధమును, అనగా కర్మ జ్ఞానములను గురించి వ్యాసమహర్షి యిట్లు జెప్పెను.

జ్ఞానాగ మేన కర్మాణి కుర్వన్ కర్మసు సిద్ధ్యతి॥

శాం. ౨౩౮-౧౧

జ్ఞానము ద్వారకర్మలను జేయుచు కర్మలందు సిద్ధినిబొందును.

జ్ఞానవత్వేచ కర్మాణి కుర్వన్ సర్వత్ర సిద్ధ్యతి॥ ౩౦

జ్ఞానము గలుగుట యందే కర్మలను జేయుచు యంతట సిద్ధిని బొందు చున్నాడు.

ఏషా పూర్వతరా వృత్తిర్బ్రాహ్మణస్య విధీయతే
జ్ఞానవానేవ కర్మాణి కుర్వన్ సర్వత్ర సిధ్యతి ॥
తత్ర చేన్న భవేదేవం సంశయః కర్మసిద్ధయే॥ శాం. ౨౩౮-౧

ఈవృత్తి పూర్వమునుండియు బ్రాహ్మణునకు విధింప బడి యున్నది. జ్ఞానియే కర్మలనాచరించుచు సర్వత్రసిద్ధి బొందును జ్ఞానికి కర్మ సిద్ధి గలుగగను సంశయమవసరము లేదు.

వైఖనసా వాలఖిల్యాః సైకతాశ్చ తథా పరే
కర్మభిస్తేపరానందాః ధర్మ నిత్యాః జితేంద్రియాః ॥
గతాః ప్రత్యక్ష ధర్మాణః తే సర్వే వనమాశ్రితాః ॥
వ్యాసః శాం. ౨౪౪ - ౨౧

వైఖానసాది ఋషులనేకులు సత్కర్మల చేతనే తరించిరి. మఱియు "ఆశ్రమాదాశ్రమం పుణ్యం పూతో గచ్ఛతి కర్మభిః" క్రమముగా అన్ని యాశ్రమ ధర్మల నెరవేర్పుటచే పవిత్రుడగును యని జెప్ప బడి యున్నది.

: బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్
: బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా॥ ౨౪

అర్పణము, అనగా హవనము అను క్రియా బ్రహ్మము, హవిస్సు, అనగా అర్పింప బడు ద్రవ్య బ్రహ్మము, బ్రహ్మాగ్ని యందు బ్రహ్మచే హోమము చేయ బడినవి. కర్మ (అంతయు నీరీతిగ) బ్రహ్మమని దృఢబుద్ధి గల వారు బ్రహ్మమునే పొందుదురు

బ్రహ్మచారీ స వై షష్ఠ య ఇంద్రియ జయే రతః
అపేత వ్రత కర్మా తు కేవలం బ్రహ్మణి స్థితః
బ్రహ్మ భూతశ్చరన్ లోకే బ్రహ్మచారీ భవేత్స్వయం
బ్రహ్మైవ సమిధ స్తస్య బ్రహ్మాగ్నిర్బ్రహ్మ సంభవః॥
ఆపో బ్రహ్మ గురుర్బ్రహ్మ స బ్రహ్మణి సమాహితః॥

ఇంద్రియ జయమందాసక్తి గల వాడు బ్రహ్మచారి యగును. కర్మత్యాగి బ్రహ్మస్థితుడగును. బ్రహ్మభూతుడై చరించువాడు స్వయముగా బ్రహ్మచారి యగును. ఇట్టి బ్రహ్మవేత్తకు అగ్ని, సమిధలు, ఉదకము, గురువు ఇట్టివన్నియు బ్రహ్మమయములగును.

"ఏకశ్శాస్తా నద్వితీయోస్తి శాస్తా యో హృచ్ఛయస్త మహమను బ్రవీమి" శాసకుడొకడే; ఎవడు హృదయమందు గలడో వానిని జెప్పెద గురువు, బంధువు, శ్రోత, ద్వేష్ట, యొక్కడే; కాని మఱియొకడు లేడు. ఇందుకేతిహాస మొకటిగలదు.

దేవర్షయశ్చ నాగాశ్చప్యసురాశ్చ ప్రజా పతిమ్
పర్యపృచ్ఛన్నుపాసీనాః శ్రేయోనః ప్రోచ్యతామితి ॥

దేవతలు మొదలగు వారు బ్రహ్మతో "శ్రేయము దేనిచే గలుగునో యది మాకు జెప్పు" డని బలికిరి.

"ఓమిత్యేకాక్షరం బ్రహ్మతేశ్రుత్వా ప్రాద్రవన్ దిశః ॥"
ఓమ్ ఇట్లొక యక్షరమే బ్రహ్మమని జెప్పగా దేవతలు మొదలగు వారందరు నానాదిక్కులకు బరుగిడిరి.

అప్పుడు సర్పములకు దంశభావము, రాక్షసులకు డంబము, దేవతలకు దానము, ఋషులకింద్రియ నిగ్రహము స్వభావములైనవి.

ఏకం శాస్తార మాసాద్య శబ్దే నైకేన సంస్కృతాః
నానావ్యవసితా స్సర్వే సర్ప దేవర్షి దానవాః ॥

ఒకనినే నియామకునిగా బొంది, యొక శబ్దముచేతనే సంస్కరింప బడి, దేవదానవసర్పములు, నానాత్వమును బొందెను గనుక ఆసక్తి యెట్టిదో ఫలమట్టిది లభ్యమగును.

పాపేన విచరన్ లోకే పాపచారీ భవేత్యుత
శుభేన విచరన్ లోకే శుభచారీ భవత్యుత ॥

పాపాచరణచే పాపాత్ముడు, శుభాచరణచే శోభనవంతుడు గాగలడు

దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే
బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి॥ ౨౫

అనేకులు (కర్మ) యోగులు (బ్రహ్మ బుద్ధికి బదులు) దేవాదుల నుద్దేశించి యజ్ఞమును జేయుచున్నారు. మఱియు ననేకులు బ్రహ్మాగ్ని యందు యజ్ఞముల చేతనే యజ్ఞములను యజించుచున్నారు.

శ్రోత్రాదీనీంద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి
శబ్దాదీన్విషయా నన్య ఇంద్రియాగ్నిషు జుహ్వతి॥ ౨౬

కొందఱు శ్రోత్రము మొదలయిన యింద్రియములను సంయమ రూపమగు నగ్నిహోత్రముసందు హోమము చేయుచున్నారు. మఱికొంద ఱింద్రియ రూపమగు నగ్నిహోత్రమున (ఇంద్రియముల యొక్క) శబ్దము మొదలగు విషయములను హోమము చేయుచున్నారు.

సర్వాణీంద్రియ కర్మాణి ప్రాణ కర్మాణిచాపరే
ఆత్మసంయమ యోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే॥ ౨౭

మఱికొంద ఱింద్రియములయొక్కయు ప్రాణముల యొక్కయు కర్మల నన్నింటిని (అనగా: వ్యాపారములను) జ్ఞానముచే ప్రజ్వలిత మయిన యాత్మసంయమన రూపమగు యోగాగ్నిహోత్రమునందు హోమము చేయుచున్నారు.

శ్రోత్రం త్వక్చక్షుషీ జిహ్వా నాసికా చరణౌ కరౌ
ఉపస్థం పాయురితి వా హోతౄణి దశ భామిని॥ ౧

అశ్వమేధ, బ్రాహ్మణగీత.

చెవులు, చర్మము, కండ్లు, నాలుక, ముక్కు, కాలు చేతులు, ఉపస్థ, పాయువు ఈపదియు హోమము జేయు నవి.

( పై వాటి గుణములు) శబ్ద స్పర్శ రూప రస గంధములు, వచనగమనములు, రేతోమూత్రపురీషములు ఈపదియుహవిస్సులు.

దిక్కులు, వాయువు, సూర్య చంద్రులు, పృథివి, అగ్ని విష్ణువు, ఇంద్రుడు, ప్రజాపతి, మిత్రుడు వీరగ్నులు.

దశేంద్రియాణి హోతౄణి హోమింషి దశ భామిని
విషయా నామ సమిధో హూయంతేతు దశాగ్నిషు।

పదింద్రియములను హోమము జేయువారు పదియగ్నులంద పది విషయములను సమిధలను హోమము జేసిన వారగుదురు.

ఈ ప్రకారముగా సప్త, పంచ, చాతుర్హోత్ర విధానములు జెప్ప బడినవి.

ద్రవ్య యజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాపరే
స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞాశ్చ యతయః సంశితవ్రతాః॥

ఇట్లు తీక్ష్ణముగా వ్రతాచరణ చేయు యతులు ఒకరు ద్రవ్యరూప యజ్ఞమును, మఱొకరు తపోరూపయజ్ఞమును ఇంకొకరు యోగరూపమగుయజ్ఞమునుఇంకొకరుస్వాధ్యాయ రూపమగు యజ్ఞ మును,ఇతరులుజ్ఞానరూపమగు యజ్ఞమును చేయుచున్నారు.

అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేపానం తథాపరే
ప్రాణాపాన గతీ రుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః॥

ప్రాణాయామమునందు తత్పరులగుచు ప్రాణాపానముల రెంటి యొక్క గతులను నిరోధించి కొందఱు ప్రాణవాయువును అపానమందును, కొందఱపాన వాయువును ప్రాణ వాయువునందును హోమము చేయుచున్నారు.

లోక యజ్ఞః క్రియాయజ్ఞో గృహయజ్ఞ స్సనాతనః
పంచభూత మయోయజ్ఞో నృ యజ్ఞశ్చైవ పంచమః॥

స్కాన్దే ప్రోక్త. ౧౪-౧

లౌకిక క్రియ గృహ యజ్ఞాదుల జేయు వారు పంచ హోత్ర లగు ప్రాణాపానాదుల గుర్తింప వలయును.

ప్రాణాపాన వుదానశ్చ సమానో వ్యానఏవచ
పంచహోతౄం స్తథై తాన్వై పరం భావం విదుర్బుధాః॥
బ్రాహ్మణః అశ్వ. ౨౩-౨

ప్రాణాది పంచ వాయువులు పంచ హోతలని వీటి భావమును బుధులెఱుఁగుదురు.

పంచవాయువులు బ్రహ్మ వద్దకు బోయి "మాలోగొప్ప యెవ" రని ప్రశ్నించగా బ్రహ్మ యిట్లు జెప్పెను.

ఏక ఏవసుమైవాత్మా బహుధాప్యుపచీయతే
పరస్పరస్య సుహృదో భావయంతః పరస్పరమ్
స్వస్తి వ్రజత భద్రంవో ధారయధ్వం పరస్పరమ్॥

ఓ పంచవాయువులారా! మీరందఱెవరికి వారే శ్రేష్ఠులై యున్నారు; ఎందుకనః మీరందఱును వాయాత్మ యొక్క అంశలేయై యున్నారు.

ప్రాణాత్ప్రణీయతే ప్రాణీ వ్యానాద్వ్యాయచ్ఛతేతథా
గచ్ఛత్యపానోథశ్చైవ సమానో హృదయ స్థితః
ఉదానాదుచ్ఛ్వసితిచ ప్రతిషేదాచ్చ భాషతే
ఇత్యేతే వాయవః పంచ చేష్టయంతీహ దేహినమ్॥
భృగుభారద్వాజ సంవాదము. శాం. ౧౮౪

ధారణంచైవ మనసః ప్రాణాయామశ్చ పార్థివ
ఏకాగ్రతాచ మనసః ప్రాణాయామ స్తథైవచ
ప్రాణాయామోహి సగుణః నిర్గుణం ధారయేన్మనః॥
యాజ్ఞవల్క్యః శాం. ౩౧౭-౯

ప్రాణాయామము సగుణమనుటచే మనస్సును నిర్గుణముగా ధరించ వలయును.

ప్రాణాయామైరథప్రాణాన్ సంయమ్య స పునః పునః
ఏవంపూర్వం ప్రసన్నాత్మా లభతేయద్యదిచ్ఛతి॥ అక్ష్వ ౪ ౭-౪

ప్రాణాయామ పరాయణులు ఈప్సితార్థముల బొందగలరు

అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి
సర్వేప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపిత కల్మషాః॥ ౩౦

అనేకులాహారమును నియమించు కొని ప్రాణములనే ప్రాణములందు హోమము చేయు చున్నారు వీరందఱును యజ్ఞములచే క్షీణపాపులును, యజ్ఞ వేత్తలును—

యజ్ఞ శిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనమ్
నాయం లోకో స్త్యయజ్ఞస్య కుతోన్యః కురుసత్తమ॥ ౩౧

(మఱియు) అమృతాశనులు అనగా యజ్ఞమును చేయగా మిగిలిన పదార్థమును భుజించు వారు నగుటచే సనాతనమగు బ్రహ్మమును బొందుదురు. యజ్ఞము చేయని వారికిహలోకమే సిద్ధము గానేరదు. ఓకురుశ్రేష్ఠ! ఇక పరలోక మెట్లు వచ్చును?

ప్రాదేశమాత్రే హృ నిస్సృతం యత్తస్మిన్
ప్రాణానాత్మయాజీ జుహోతి
తస్యాగ్నిహోత్రం హుతమాత్మ సంస్థం
సర్వేషు లోకేషు సదేవకేషు॥ శాం. ౨౪౫-౨౫

ఆత్మ యను యాజి హృదయమందు ప్రాణములను హోమము జేయు చున్నాడు. సర్వము హుతము జేయు శక్తి గల యగ్ని దనయందున్నట్లు ఆత్మ యాజి భావింప వలయును.

నాయం లోకో స్త్యయజ్ఞానాం పరశ్చేతి వినిశ్చయః
వేదవాద విదశ్చైవ ప్రమాణముభయంతథా॥ శాం ౨౭౭-౪౦

: ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే
: కర్మజాన్విద్ధి తాన్సర్వా నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే॥

ఈరీతిగ ననేక విధములగు యజ్ఞములు బ్రహ్మముఖమునుండియే వెలువడినవి. అన్నియు కర్మల వలన వెలువడిన వని తెలిసికొంటివేని ముక్తుడ వగుదువు.

ద్రవ్య మయములనియు, ఆత్మీయములనియు ముఖ్యముగా యజ్ఞములు రెండు విధములు. ధాన్యములు మొదలగు వాటిచే చేయ బడు నవి ద్రవ్యమయములు; కామ క్రోధాదుల శమింప జేసుకొని యుండుట ఆత్మీయములనియు జెప్పబడును.

యజ్ఞములందు పశు విశసనము చేయ వచ్చునని దేవతలు, చేయగూడదని ఋషులు తగవులాడి తుదకు దీర్పు జెప్పవలసినదిగ ఉపరిచరవసువు నద్దకు బోగా యతడిట్లు జెప్పెను.

"ఛాగేనా జేన యష్టవ్య మేవముక్తం వచస్తథా॥" పశు సహితముగానే యజ్ఞములు జేయ వచ్చును.

యజ్ఞమున జేయబడుపశువిశసనముగూర్చి మొదటినుండియు తగవులున్నట్లు చెలియు చున్నది.

: శ్రేయాన్ ద్రవ్య మయాద్యజ్ఞాత్ జ్ఞాన యజ్ఞః పరంతప
: సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరి సమాప్యతే॥ ౩౩

ఓపరంతపా! ద్రవ్య మయమగు యజ్ఞము కంటె జ్ఞాన మయమగు యజ్ఞము శ్రేష్ఠమైనది. కారణ మేమన: ఓపార్థా! అన్ని విధముల నన్ని యజ్ఞములకును జ్ఞానమునందే పర్యవసానము.

శాకల్య స్సంశితాత్మావై నవ వర్ష శతాన్యపి
అరాధయామాస భవం మనో యజ్ఞేన కేశవ॥

శివమాహాత్మ్యఖండము. అను. ౧౪-౧౦౧

కేశవా! శాకల్యుడనుఋషి శివుని మనో యజ్ఞము చేతనే యారాధించెను.

నమో బ్రాహ్మణ యజ్ఞాయ యేచ యజ్ఞ విదో జనాః
స్వయజ్ఞం బ్రాహ్మణాః హిత్వా క్షత్రియజ్ఞ మహాస్థితాః॥
తులాధారః శాం. ౨౬౩-౫

నేను యజ్ఞ నిందపడను గాను. యజ్ఞ వేత్త లభించడు. యజ్ఞార్థము నమస్కారము. బ్రాహ్మణులు స్వయజ్ఞముల విడచి క్షత్రియజ్ఞముల నవలంబించినారు.

అగస్త్య మహర్షి ద్వాదశ సంవత్సర యజ్ఞ దీక్షాస్వీకారము జేసి యజ్ఞము జేయ మొదలు బెట్టెను. అప్పుడు వర్షములు పడ కుండుట జూచి ఋషులు భయ పడగా అగస్త్యుడిట్లనెను.

చింతా యజ్ఞం కరిష్యామి విధిరేష సనాతనః॥
స్పర్శ యజ్ఞం కరిష్యామి విధిరేష సనాతనః
యది ద్వాదశ వర్షాని నవర్షిష్యతి వాసవః॥
బీజైర్గృహీతం కరిష్యామి నాత్ర విఘ్నో భవిష్యతి
స్వయమింద్రో భవిష్యామి జీవయిష్యామిచ ప్రజాః॥
అశ్వ. ౯౨-౧౫

ఓ ఋషులారా! జడియవడదు; సనాతన విధుల ననుసరించి చింతా స్పర్శ బీజ యజ్ఞముల జేసి హితమొనరించెద. ఇంద్రుడు వర్షింపకున్న నేను స్వయముగా యింద్రుడనై వర్షించెదను.

ఈప్రకారముగా పశు రహితముగా చేయ బడిన యజ్ఞము లనేకములు గలవు.

యది యజ్ఞాంశ వృక్షాంశ్చ యూపాంశ్చోద్దిశ్య మానవాః
వృథా మాంసాని ఖాదంతి నైష ధర్మ ప్రశస్యతే॥
సురామత్స్యాన్మధుం మాంసమాసవంకృసరౌదనం
ధూర్తైః ప్రవర్తితం హ్యేతన్నైతద్వేదేషు కల్పితమ్॥
మానాన్మోహాచ్చలోభాచ్చ లౌల్యమేతత్ప్రకల్పితమ్॥

విష్ణుమేవాభి జానంతి సర్వ యజ్ఞేషు బ్రాహ్మణాః
పాయసై స్సుమనోభిశ్చ తస్యాపి యజనం స్మృతమ్॥
విచఖ్యుగీత. శాం. ౨౬౫-౧

యజ్ఞమందలి హింస సనాతన ధర్మ గాదు; మరేమన? ధూర్త ప్రతిపాదితము. పాయసాదులచే విష్ణువును బూజించుటయే యజ్ఞమన బడును

జ్ఞాన సంపన్న సత్వానాం తత్సుఖం విదుషాం మతం॥
అనుగీత. ౪౨-౪౫

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్వదర్శినః॥ ३४

అజ్ఞానము ప్రణిపాతము చేతను, ప్రశ్న చేతను, సేవచేతను తత్త్వవేత్తలగు జ్ఞానులు నీకుపదేశింతురను విషయమును జ్ఞప్తి యందుంచు కొనుము.

యత్ జ్ఞాత్వా న పునర్మోహమేవం యాస్యసి పాండవ
యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథోమయి॥ ३५

ఓ పాండవా! ఏజ్ఞానము గలుగుటచే నన్ని భూతములు నీలోనుండు నవిగను, నాయందుండు నవిగను నీకుగాన్పించునో, యాజ్ఞానము గలిగిన పిదప నీకిట్టి మోహమెన్నటికిని గలుగదు.

గురవోహి పరం ధర్మం యం బ్రూయు స్తం తథాచర
గురూణాం హి ప్రసాదా ద్ధి శ్రేయః పర మవాప్స్యసి॥
కామంద అంగరిష్ట సంవాదము. శాం. ౧౨౩-౪౭

గురువులు జెప్పిన ప్రకారము నడచు కొనుము. గురుకృపచే యుత్కృష్టమగు శ్రేయమును బొంద గలవు.

"నేనుపదేశముబొందుటచే ధన్యుడ నయితి" నని బోధ్యుడు జెప్పెను. ఉపదేశమును బొందుటచే మోహము నశించును.

భగవ దుపదేశముచే యర్జునుని మోహమడుగంటెను. శాం. ౧౬౫

తపస్వినాం ధర్మవతాం విదుషాంచోప సేవనాత్
ప్రాప్స్యసే విపులాం బుద్ధిం తదా శ్రేయోభి తప్స్యసే॥
శాం. ౩౦౯-౪౪

తపోవంతులు, ధర్మ వంతులు, పండితులు ఇట్టి వారల సేవచే విస్తారమగు శ్రేయమును పొంద గలవు.

అపిచేదసి పాపేభ్యః సర్వేభ్యః పాప కృత్తమః
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి॥ ౩౬

పాపాత్ములందరి కంటెను మిక్కిలి పాపాత్ముడవయి ప్పటికిని ఈజ్ఞాన నౌక చేత సర్వ పాపములను దాట గలవు.

యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసా త్కురుతేర్జున
జ్ఞానాగ్నిః సర్వ కర్మాణి భస్మ సాత్కురుతే తథా॥ ౩౭

ప్రజ్వలించిన అగ్నిహోత్రము కట్టెలనన్నిటిని భస్మముచేయు నట్లు ఈ జ్ఞాన రూపమగు నగ్ని హోత్రము సర్వ కర్మల యొక్క (శుభాశుభములను కర్మ బంధములను) భస్మము జేయును.

అథజ్ఞానప్లవం ధీరో గృహీత్వా శాంతి మాత్మనః
ఉన్మజ్జంశ్చ నిమజ్జంశ్చ జ్ఞాన మేవాభి సంశ్రయేత్॥
వ్యాసః శాం. ౨౩౭-౧

ధీరుడు ఆత్మశాంతి గలిగి జ్ఞానమును నావను సంపాదించు కొని యెన్ని నిరోధములు గలిగినను దానిని విడువ రాదు.

జ్ఞానం ప్లావయతే సర్వం యోజ్ఞానంహ్యను వర్తతే
జ్ఞానాదపేత్య యావృత్తిః సా వినాశయతి ప్రజాః॥
కపిలః శాం. ౨౬౫-౫౦

జ్ఞానహీనవృత్తి నశింప జేయును.

నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే
తత్స్వయం యోగ సంసిద్ధః కాలేనాత్మని విందతి॥ ౩౮

జ్ఞానము వలె పవిత్రమైనది యీలోకము నందు నిజముగా మఱి యొకటి లేనే లేదు. అజ్ఞాన కాలమున (కర్మ) యోగము సిద్ధించిన వాడు కాలక్రమమున స్వయముగ తనయందు సంపాదించు కొనును.

కామం కాలేన మహతా ఏకాంతిత్వముపాగతైః
శక్యోద్రష్టుం సభగవాన్ ప్రభామండల దుర్దృశః॥

నారాయణీయము. శాం. ౩౩౭

ఏకాంతిత్వమును పొందిన భక్తులచే కొంత దీర్ఘ కాలము నందు చూడ శక్యము గాని భగవంతుడు చూడ బడును.

ఇష్టదత్తం తపోధీతం వ్రతాని నియమాశ్చ యే
సర్వమేతద్వినా శాంతిం జ్ఞానస్యాంతం నవిద్యతే ॥
తస్మాత్ జ్ఞానేన శుద్ధేన ప్రశాంతాత్మా జితేంద్రియః
నిర్మమో నిరహంకారో ముచ్యతే సర్వ పాప్మభిః॥

అశ్వ. ౪౪-౨౧

తపోధ్యయనాదులు నశించును; కాని జ్ఞానము నశించదు కావున పరిశుద్ధ జ్ఞానముచే జితేంద్రియుడయి మమకార అహంకారముల నొదలిన పత్తమున పాపముక్తుడగును.

శ్రద్ధావాన్ లభతేజ్ఞానం తత్పరః సంయతేంద్రియః
జ్ఞానం లబ్ధ్వా పరాంశాంతిమచిరేణాధి గచ్ఛతి॥ ౩౯

ఈజ్ఞానము శ్రద్ధావంతుడును, నింద్రియ సంయమనము చేసి కొనిన వాడును, వాని యందే తత్పరుడైన వానికే కలుగును. మఱియు జ్ఞానమును సంపాదించు కొనును నేని వెంటనే యతనికి పరమ శాంతి గలుగును.

శ్రద్ధావైవస్వతీ సేయం సూర్యస్య దుహితా ద్విజ
సావిత్రీ ప్రసవిత్రీచ బహి ర్వాఙ్మనసీ తతః॥
వాగ్వృద్ధం త్రాయతే శ్రద్ధా మనో వృద్ధంచ భారత
శ్రద్ధా వృద్ధం వాఙ్మనసి నయజ్ఞ స్త్రాతు మర్హతి॥
శాం. ౨౬౩-౮

శ్రద్ధయను నది సూర్య పుత్రి యనియు, యది గాపాడి నట్లు యజ్ఞమైనను గాపాడ దనియు తులాధారుడు జెప్పెను.

మనో వాక్కా యికైర్ధర్మైః కురుశ్రద్ధాం సమాహితః
నివృత్త్వా ప్రవృత్త్వా సంప్రధార్య గుణాగుణాన్॥
శాం. ౩౦౯-౧౧

నివత్తి ప్రవృత్తులలో దేని యందైనను గుణా గుణములను గ్రహించి మనో వాక్కాయ ధర్మలచే శ్రద్ధా పరుడు గావలయును.

అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి
నాయం లోకో స్తి న పరో నసుఖం సంశయాత్మనః॥ ౪౦

కాని జ్ఞానమును శ్రద్ధయు లేక సంశయము నొందు వాడు నాశనమగును. సంశయము నొందు వారికిహ లోకమును, పర లోకమును లేవు; సుఖమును లేదు.

అశ్రద్ధధాన ఏవైకో దేవానాం నార్హతే హవిః
తస్యైవాన్నం నభోక్తవ్యమితి ధర్మ విదో విదుః॥
అశ్రద్ధా పరమం పాపం శ్రద్ధా పాప ప్రమోచినీ॥
శాం. ౨౬౩-౧౪

శ్రద్ధా హీనునిచే యివ్వ బడిన హవి స్సును దేవతలు గై కొనరు. శ్రద్ధాహీనుని చేతి యన్నమును భుజించ రాదు. అశ్రద్ధగా నుండుట యెక్కువ పాపము; శ్రద్ధగానుండుట పుణ్యము.

"సంశయ స్స్వగమస్తత్ర నిశ్చయస్తత్ర దుర్గమః॥" సంశ

యాత్మునగుట సులభము; నిర్ణయము మాత్రము కష్టము, అనుగీత

న సంశయ మనారుహ్య నరో భద్రాణి పశ్యతి
సంశయం పున రారుహ్య యది జీవతి పశ్యతి॥
శాం. ౧౪౦-౩౪

సంశయము బొందక శుభముల బొంద లేడు, సంశయమును బొంది జీవించి యుండినచో మంగళముల బొంద గలడు.

అతత్త్వజ్ఞస్య శాస్త్రాణాం సతతం సంశయాత్మనః
అకృత వ్యవ సాయస్య శ్రేయోబ్రూహి పితామహ॥
యుధిష్ఠరః శాం. ౨౭౭-౧

"శాస్త్ర తత్త్వము దెలియని వానికి, సంశయాత్మునికి, వ్యవసాయము జేయని వానికి శ్రేయ మెట్లు గలుగు" నని ధర్మజుని ప్రశ్న.

గురు పూజాచ సతతం వృద్ధానాం పర్యు పాసనం
శ్రవణం చైవ శాస్త్రాణాం కూటస్థం శ్రేయ ఉచ్యతే॥

గురు వృద్ధుల సేవ, శాస్త్ర శ్రవణము పుంజీభావము జెందిన శ్రేయమని వ్యాస ప్రోక్తము.

యోగ సన్న్యస్త కర్మాణం జ్ఞాన సంఛిన్న సంశయమ్
ఆత్మ వంతం నకర్మాణి నిబధ్నంతి ధనంజయ॥ ౪౧

ఓ ధనంజయా! (కర్మ) న్యాసయించి కర్మలను, అనగా కర్మ బంధనములను వదలుకొని జ్ఞానముచే విడగొట్ట బడిన సంశయములు గల యాత్మజ్ఞానికి కర్మలు బంధింప లేవు.

తస్మాదజ్ఞాన సంభూతం హృత్స్థం జ్ఞానాసి నాత్మనః
ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠ భారత॥ ౪౨

కావున నీహృదయమందున్న యజ్ఞానము మూలమునగలిగిన యీసంశయమును జ్ఞానరూపమగు కత్తితో నఱికి వైచి (కర్మ) యోగము నాశ్రయించుము. ఓ భారతా! (యుద్ధమునకు) నిలువుము.

తదర్థముక్తంతపవితదిజ్యాతాభ్యామసౌపుణ్యముపైతివిద్వాన్
పుణ్యేనపాపంవినిహత్యపశ్చాత్సంజాయతేజ్ఞానవిదీపితాత్మా॥
జ్ఞానేనచాత్మానముపైతివిద్వాన్ సచాన్యథావర్గఫలానుకాంక్షీ
అస్మిన్ కృతంతత్పరిగృహ్యసర్వంఅముత్రభుక్త్వాపునరేతిమార్గం॥
సనత్సుజాతీయము. అ. ౨

కృచ్ఛ్ర చాంద్రాయణాది రూపం బైన తపస్సును, జ్యోతిష్టోమాది యజ్ఞా చరణంబు ఈశ్వర ప్రీణనార్థంబనియే వేద మతంబు అట్లు కర్మముల నాచరించు నతడు తన్మహిమమున ప్రాప్త పుణ్యుడై పాపము బోగొట్టి జ్ఞానప్రకాశిత చిత్సదానందా ద్వితీయ బ్రహ్మస్వ రూపుడగును; కావున వేదోక్త విధి నాచరించుటచే శ్రేయస్సు గలదు. కేవల వేదాధ్యయనముచే శ్రేయస్సులేదు.

వేదోక్త విధి ప్రకారము నాచరించు నతడు జ్ఞానియై పర మాత్మ స్వరూప సాక్షాత్కారము గాంచును. అట్లుగాక స్వర్గాది ఫలాపేక్ష బుద్ధితో గర్మముల నాచరించు వాడు సంపా దిత పుణ్య ఫలంబులతో స్వర్గంబునకేగి పుణ్యసమాప్తిగాగా మరల నీలోకమును పొంది జనన మరణాది రూపమగు. సంసార చక్ర మున జిక్కువడి పరిభ్రమించు చుండును.

జ్ఞాన యోగము ముగిసెను.

---

శ్రీ మ ద్భా గ్య న గ ర స్థి త
శ్రీమదుద్భటారాధ్యవంశ భారద్వాజస గోత్ర వైద్యకలా
వి శా ర ద - ము ది గొం డ మ ల్ల నా రా ధ్య పుత్ర
ముదిగొండబుచ్చయ్య లింగారాధ్యేన, భగవద్గీతా
మహాభారత ప్రమాణవచనైః ప్రకటితా.

శ్రీపంచాక్షరీప్రెస్ హైద్రాబాద్ ద॥

శ్రీ శివాభ్యాం నమః

# శ్రీ కుమార గీత.

## కర్మ సన్యాస యోగము.

### పఞ్చమా ధ్యాయము.

---

అర్జున ఉవాచ.

సన్యాసం కర్మణాం కృష్ణ పున ర్యోగం చ శంసని
యచ్ఛ్రేయ ఏతయో రేకం త న్మే బ్రూహి సునిశ్చితం ॥

అర్జునుడ డుగుచున్నాడు.- ఓకృష్ణా! ఒకసారి సన్యాస-
మును, మఱియొకసారి కర్మయోగమును, (అనగా: కర్మలను
చేయుచుండ వలయు నను మార్గమును,) నుత్తమ మని చెప్పుచు
౨౧ న్నావు; అయినను నీ రెంటిలోను నిజముగ నేది శ్రేయమో,
అనగా: మిక్కిలి ప్రశస్తమైనదో నిశ్చయముగ నాకు చెప్పుము

శ్రీకృష్ణ ఉవాచ.

సన్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరా వుభౌ
తయో స్తు కర్మసన్యాసాత్ కర్మయోగో విశిష్యతే ॥ ౨

శ్రీ భగవంతుడు చెప్పుచున్నాడు.- కర్మ సన్యాసము, కర్మ యోగము, నను నీరెండు మార్గములు, లేక, నిష్ఠలు, నిశ్శ్రేయసకరములే, అనగా: మోక్షమును లభింపజేయునవియే; కాని, (అనగా: మోక్షదృష్టిచే రెండును సమానమయిన యోగ్యతలు గలవియైనను) ఈ రెంటిలోను కర్మ సన్యాసముకంటె కర్మ-యోగమే యధికమైనది.

కుర్వతే యే తు కర్మాణి శ్రద్ధధానా విపశ్చితః
అనాశీర్యోగసంయుక్తా స్తే ధీరా స్సాధు దర్శినః ॥
అశ్వ. ౫౦- ౬-౪

ఏ జ్ఞానులు శ్రద్ధతో ఫలాశ నుంచక (కర్మ) యోగ మార్గము నవలంబించి, కర్మలను జేయుచున్నారో వారే సాధు దర్శులగు (బాగుగ నెఱింగినవారుగ) యున్నారు. అని కర్మ యోగ మార్గము బాగుగ ప్రతిపాదింప బడినది.

తదుక్తం వేదవాదేషు గహనం వేద దర్శిభిః
వేదాంతేషు పున ర్వ్యక్తం కర్మయోగేన లక్ష్యతే ॥
శాంతి ౨౩౫- ౧౧

వేద వేత్తలచే వేదవాదముల యందు గహనముగా జెప్ప బడినట్టిదియు; వేదాంతముల యందు స్పష్ట మైనట్టిదియు, కర్మయోగము చే జూడబడును.

జ్ఞేయ స్స నిత్యసన్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి
నిర్ద్వంద్వో హి మహాబాహో సుఖం బంధాత్ప్రముచ్యతే।
సాంఖ్యయోగౌ పృథ గ్బాలాః ప్రవదంతి న పండితాః
ఏక మప్యా స్థిత స్సమ్య గుభయో ర్విందతే ఫలం ॥ ౪
య త్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం త ద్యోగై రపి గమ్యతే
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి ॥ ౫

ఎవడు (దేనిని) ద్వేషింపడో, మఱియు (దేనిని) కోరడో వాడు (కర్మ చేయుచున్నను) నిత్య సన్యాసియే యని తెలిసి కొన వలయును. కారణ మేమన: ఓ. మహా బాహూ!

అర్జునా! ఎవడు (సుఖ దుఃఖాది) ద్వంద్వముల నుండి ముక్తుడగునో, వాడనాయాసముగనె (కర్మలయొక్క యన్ని) బంధముల నుండియు ముక్తుడగును. ౩

సాంఖ్యము, (కర్మ సన్యాసము) యోగము, (కర్మ యోగము) నను నీ రెండునువేరైనవి యని మూర్ఖులు చెప్పుదురు. పండితు లట్లు చెప్పరు. ఈ రెంటిలో నేమార్గమున నైనను బాగుగ ప్రవర్తించినచో రెంటి యొక్క ఫలమును లభించును. ౪

ఏ (మోక్ష) స్థానమును సాంఖ్యులు చెందుదురో, యా స్థానము నే యోగులు, (అనగా: కర్మయోగులు నై తే ము చెందుదురు. సాంఖ్యము, యోగము, వేఱు కావని తెలిసి కొనినవాడే నిజమగు తత్వము నెఱింగిన వాడని చెప్పఁబడును. ౫

## సాంఖ్య యోగములు.

పంచవింశతి తత్త్వాని తుల్యా న్యుభయత స్సమం
యోగే సాంఖ్యే పి చ తథా విశేషం తత్ర మే శృణు ॥
శుకానుప్రశ్నే వ్యాసః శాంతి ౨౩౬- 30

సాంఖ్యమునకు, యోగమున కును, ౨౫ తత్వములు సమానములు. సాంఖ్య, యోగము లందు విశేషము వినుము.

సాంఖ్యుల లక్షణము- "విషయా త్ప్రతిసంహార స్సాంఖ్యానాం విద్ధి లక్షణం" విషయముల నుండి మరల్చుకొనుట సాంఖ్య లక్షణమని తెలియుము. అహంకారమమకారములు లేకుండుట, సంశయములు లేకుండుట, సర్వభూతములయందు సమత్వము, లోలత్వములేకుండుట, దృఢవ్రతము, సుఖ దుఃఖముల యందు సమత్వము, "అహింసా సర్వభూతానా మిదం సాంఖ్యో

విముచ్యతే" సర్వభూతములకు హింస గలుగ జేయని వాడు ముక్తుడగును.

సన్నియమ్యేంద్రియగ్రామం కోష్ఠే భాండ మనా ఇవ
ఏకాంతం చింతయే న్నిత్యం యోగా న్నోద్వేజయే న్మనః॥
యేనో పాయేన శక్యేత సన్నియంతుం చలం మనః
తం చ యుక్తో నిషేవేత న చైవ విచలే త్తతః॥

యోగము వలనఇంద్రియమును నిగ్రహించి, యేకాగ్ర మనస్సు గల వాడు గావలయును. ఎట్టి యుపాయముచే మనస్సు నిశ్చలమగునో యట్టి యుపాయమును చింతించ వలయును. యుక్తుడై యుండ వలయునే గాని, చలనము జెందగూడదు.

కావునః సాంఖ్య, యోగములు రెండును, ముక్తి సాధనములని భారతాభిప్రాయము. సాధనమందు మాత్రము వేరు, వేరు విధములుగా బోధించినదని తెలియ వలయును.

ఈ రెండు విద్యలకు దృష్టాంతము నారాయణుడే యని భారతము నందు గలదు.

ప్రార్థయంత శ్చ తం విప్రా వదంతి గుణ బుద్ధయః
సమ్య గుక్తా స్తథా యోగా స్సాంఖ్యా శ్చామితదర్శనాః॥
అమూర్తే స్తస్య కౌంతేయ సాంఖ్యం మూర్తి రితి శ్రుతిః।
శాంతి ౩౦౦-౧౧॥

దేవతలు, విప్రులు, నారాయణుని యనుగ్రహముచే సాంఖ్య, యోగములను పొందిరి. అమూర్తమగు దేవునకు సాంఖ్యమే మూర్తియని శ్రుతిజెప్పు చున్నది.

సాంఖ్యం విశాలం పరమం పురాణం
మహార్ణవం విమల ముదార కాంతం
కృత్స్నం చ సాంఖ్యం నృపతే మహాత్మా
నారాయణో ధారయతే ప్రమేయం ॥ ౧౧౩

సర్వ సద్గుణ సంపన్న మగు సాంఖ్యమును నారాయణుడె ధరించుచున్నాడు.

ప్రత్యక్ష హేతవో యోగా స్సాంఖ్యా శ్శాస్త్రవినిశ్చయాః
ఉభే చైతే మతే జ్ఞానే నృపతే శిష్టసమ్మతే ॥ శాంతి ౩౦౦- ౭
అనుష్ఠితే యథా శాస్త్రం నయేతాం పరమాం గతిం॥ ”
సాంఖ్యయోగా మయా ప్రోక్తా శాస్త్రసవ్యయనిదర్శనాత్
యదేవ శాస్త్రం సాంఖ్యోక్తం యోగదర్శన మేవతత్ ॥ ౩౦౭-౪౭
తత్వాని చ చతుర్వింశ త్పరిసంఖ్యాయ తత్వతః
సాంఖ్యా స్సహ ప్రకృత్యా తు నిస్తత్త్వః పంచవింశకః ॥ ౩౦౬
పంచవింశతి తత్వాని తుల్యాన్యు భయత స్సమం
యోగే సాంఖ్యే పి చ తథా విశేషం తత్ర మే శృణు ॥ ౨౩౬-౨౯
యదేవ యోగాః పశ్యంతి సాంఖ్యై స్తదనుగమ్యతే
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స బుద్ధిమాన్ ॥ ౩౦౫
యోగీ స సర్వా నభిభూయ మర్త్యాన్
నారాయణాత్మా కురుతే మహాత్మా ॥ ౩౦౧- ౬౧
సాంఖ్యా రాజన్ మహాప్రాజ్ఞా గచ్ఛంతి పరమాం గతిం
జ్ఞానేనా నేన కౌంతేయ తుల్యం జ్ఞానం న విద్యతే ॥ ౩౦౨

సాంఖ్యులుత్తమ గతిని బొందుదురు. సాంఖ్య జ్ఞానమునకు సమానంబగు జ్ఞాన ముండ నేరదు.

: సన్న్యాసస్తు మహాబాహో దుఃఖ మాప్తు మయోగతః

: యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి॥ ౬

ఓమహాబాహూ! (కర్మ) సన్న్యాసమును గైకొన్నను యోగము వినాగా, అనగా: కర్మ లేకయే మోక్షము సిద్ధించుటదుర్లభము. ఏ ముని కర్మ యోగ యుక్తుడగునో యతడు బ్రహ్మము నొందుటకు నాలస్య ముండదు.

: యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః
: సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే॥ ౭

యోగయుక్తుడును, శుద్ధమైన యంతఃకరణ గలవాడును, తన మనస్సును, నింద్రియములను, జయించిన వాడును, సర్వభూతముల యందున్న యాత్మయే తన యాత్మ యను కొనువాడును, నగు పురుషుడు, సర్వకర్మలను జేయుచున్నను, కర్మల యొక్క పాపపుణ్యముల నుండి యలిప్తుడుగ నుండును.

: నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్
: పశ్యఞ్శృణ్వన్స్పృశఞ్జిఘ్రన్నశ్నన్గచ్ఛన్స్వపఞ్శ్వసన్
: ప్రలపన్విసృజన్గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి
: ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్॥ ౯

యోగ యుక్తుడును తత్త్వవేత్తయు నగు పురుషుడు, "నే నేమియు చేయుట లేదు" అని యను కొన వలయును; మఱియు చూచుచు, వినుచు, స్పృశించుచు, అఘ్రాణించుచు, భుజించుచు, సంచరించుచు, నిద్రించుచు, శ్వాసోచ్ఛ్వాసములను విడుచుచు, ౯ సంభాషించుచు, విసర్జించుచు, గ్రహించుచు నేత్రముల తెఱచుచు, మూసికొనుచు, నుండియు, నింద్రియములు (మాత్రము) తమ తమ విషయముల యందు ప్రవర్తించుచున్న వను కొనుచు, (మెలగ వలయును) ౯

భారతమునందు యోగమును గురించి అనేక

పర్యాయములు బోధింపబడినవి; ఇపుడు సాంఖ్య యోగములను గురించి చెప్పబడు చున్నవి.

"సాంఖ్యే యోగే చ మేతాత విశేషం వక్తు మర్హసి" (శాంతి ౩౦౧-౧) అనిధర్మరాజు భీష్ముని సాంఖ్య, యోగములలోనివిశేషముల జెప్పుమనెను.

భీష్ముడిట్లు జెప్పుచున్నాడు. ధర్మనందనా! సాంఖ్యులు, యోగులు "స్వపక్షోద్భావనాయవై" తమ పక్షమును సాధించుకొనుటకై పలువిధంబుల వాదించుకొనియెదరు; "విరక్తో విషయేషు యః" విషయముల యందు విరక్తులగువారు, "ఊర్ధ్వం స దేహా త్సువ్యక్తం విముచ్యే దితి నా న్యథా" దేహముతో ఊర్ధ్వ గతిని పొందుదురని సాంఖ్యులు జెప్పుదురు. నీవంటి శిష్టులగువారు శిష్ట వాక్యము లను విశ్వసించెదరు. యోగులు ప్రత్యక్ష కారణ ములను, సాంఖ్యులు శాస్త్ర ప్రమాణములను, విశ్వసింతురు; కాని నాకీ రెండును ప్రమాణములు. ఈ రెంటిని యాచరించువారు, "నయేత పరమాం గతిం" ఉత్తమ గతిని బొందుదురు.

"తుల్యం శౌచం తపోయుక్తం దయా భూతేషు చానఘ
వ్రతానాం ధారణం తుల్యం దర్శనం న సమం తయోః ॥"

తపస్సుతో గూడిన శౌచము, సర్వభూతములందును

దయ, వ్రతాచరణము, సాంఖ్య యోగ పద్ధతులకు సమానములు. దర్శనము మాత్రము సాంఖ్య, యోగములకు సమానము గాదు.

"రాగం మోహం తథా స్నేహం కామం క్రోధం చ కేవలం
యోగాచ్ఛిత్వా తతో దోషాః పంచైతా న్ప్రాప్నువంతితం"

రాగ మోహ స్నేహ కామ క్రోధములను దోషముల నైదింటిని యోగముచే పోగొట్టుకొని పరమాత్మను పొందుదురు.

బలముగల మత్స్యములు, మృగములు, బంధనములనుండి, విడిపోయినట్లు యోగ మార్గావలంబులు లోభజములగు బంధనముల నుండి విముక్తులై పరశివుని బొందుదురు. బల హీనములగు చేపలు, మృగములు జాలములందు బడి నశించినట్లు యోగ బలము లేనివారు లోభాదులవాత బడి నశించెదరు. మఱియు అగ్ని వాయు సహాయముచే, నడవుల గాల్చినటుల యోగబలముచే, యోగి దోషముల నన్నిటిని నశింప జేయుచు.

"తత్వ జ్ఞాత బలో యోగీ దీప్తతేజా మహాబలః
అంతకాల ఇవా దిత్యః కృత్స్నం సంశోషయే జ్జగత్ ॥"

యోగబలము గలవాడు ప్రకాశమానుడు మహాబలముగలవాడునై అంతకాలము నందలి సూర్య

నివలె సర్వ జగత్తును శోషింప జేయగలడు. లేని-చో దుర్బలుడు నదీ వేగమున బడి పోయినటుల యోగబలము లేనివాడు "విషయై ర్హ్రియతేవశః" విషయ వశుడగును. యోగ బలము గలవాడు నది యందలి గజమువలె విషయముల వశపరచుకొనును. విషయవశపరుడు "పున స్సోగ్రం తప శ్చరేత్" తిరిగి యుగ్రతపస్సుచే విషయముల నణచుకొనును. అప్రమత్తుడగు ధనుస్సు గలవాడు లక్ష్యమును వేధించినటుల యుక్తుడగు యోగి మోక్షమునుపొందును. మఱియు పూర్ణమగు తైలపాత్రయందు మనస్సు నిలిపి సోపాన మధిష్టించిన విధమున యుక్తుడగు యోగి మోక్షసాధకుడగును. ధారణాసామర్థ్యము గల యోగి యుత్తమ స్థాన మలంకరించును.

"ప్రవేశ్యాత్మని చాత్మానం యోగీ తిష్ఠతి యోచలః
పాపం హంతి పునీతానాం పద మాప్నోతి సోజరం॥ "

చంచల స్వభావ ముడిగిన యోగి యాత్మ యందాత్మను బ్రవేశింపం జేసి పాపంబుల నుడిగి పవిత్రులుండు నట్టి నాశ రహిత మగు స్థానము నందుండును.

కృష్ణుడు, జనకుడు, యాజ్ఞవల్క్యుడు, పంచశిఖాచార్యుడు, శుకుడు, వ్యాసుడు.- వీరందరును, సాంఖ్య యోగ బోధకులు.

బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః
లిప్యతే న స పాపేన పద్మపత్ర మివాంభసా ॥ ౧౦
కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియై రపి
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాత్మశుద్ధయే॥ ౧౧

బ్రహ్మార్పణము చేసి యాసక్తి శూన్యముగ కర్మలను జేయు వానికి పద్మపత్రమునకు నీరంటుకొననట్లు పాపమంటుకొనదు. ౧౦ కాన కర్మయోగి ( నేను చేయుచున్నా నను నహంకార బుద్ధిని వదలి ) శరీర మాత్రముతోను, మనస్సు మాత్రముతోను, బుద్ధి మాత్రము తోను, ఇంద్రియ మాత్రము తోను నాసక్తిని వదలి యాత్మశుద్ధ్యర్థమయి కర్మలను చేయుచునే యుండును. ౧౧

"ఇమాం చ యో వేద విమోక్షబుద్ధి
మాత్మాన మన్విచ్ఛతి చాప్రమత్తః
న లిప్యతే కర్మఫలై రనిష్టైః
పత్రం బిసస్యేవ జలేన సిక్తం॥ శాంతి ౧౯౯ - ౪౫

మోక్షబుద్ధి గలిగి యప్రమత్తుడై యాత్మను దెలిసికొనువాడు అనిష్టఫలములు గల కర్మలచే నీటి యందలి తామర వలె నంట నేరడని, పంచశిఖాచార్యులు జనకునకు జెప్పెను.

"స్పర్శ రూప రసా ద్యేషు సంగం గచ్ఛంతి బాలిశాః" శాంతి ౨౧౧ - ౧౦. మూర్ఖులగు వారు శబ్ద స్పర్శ రూపాదులయందు సంగమును గలుగ జేసుకొని జెడిపోవుదురు. సంగమును వదలి జేయువారే ధన్యులు.

శాంతి ౩౦౨- ౧౫. సులభా జనక సంవాదము.
ఒక సమయమునందు యోగినియగు సులభ జనకుడు ముక్తుడగునా కాదా: యని పరీక్షింపదలచి సర్వ భాష్య వేత్తల సభయందు, తన యోగ బలిమిచే

" సత్వం సత్వేన యోగజ్ఞా ప్రవివేశ మహీపతే.
నేత్రాభ్యాం నేత్రయో రస్య రశ్మీ న్సంయమ్య రశ్మిభిః
సా స్మ సంచోదయిష్యంతీ యోగబంధై ర్బబంధహ ॥ "

జనకుని యవయవముల యందు దన యవయవముల ప్రవేశపెట్టి యోగ బంధమునుబంధించగా ,, యోగినీ! నిత్యముక్తుడనగు నన్నిట్లు పరీక్షింపజనదు. ఇది సంకరజనకము గాన సివిటుల జేయం జనదు." అను జనకుని వచనముల విని సులభ జెప్పుచున్నది.

" యథా పుష్కరపర్ణస్థం జలం తత్పర్ణ మస్పృశత్
తిష్ఠత్య స్పృశతీ తద్వ త్త్వయి వత్స్యామి మైథిల ॥ "

జనకా! నీటియందలి తామరవలె నీయందు న్నాను. నీవు నిత్యముక్తుడవని నమ్మితిని; ఇంకను "నేను" అను జ్ఞానము నీకు నశించినది గాదు అను చరిత్ర గలదు.

కావున: యోగులగువారు సంగమును వదలి జేయునట్టి కర్మలు ఫలదాయకములు గానేరవు.

: యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతి మాప్నోతి నైష్ఠికీం
: అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే॥ ౧౨

: సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ
: నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్న కారయన్ ॥ ౧౩

యుక్తుడగువాడు, అనగా: యోగయుక్తుడగు వాడు, కర్మఫలములను వదలివేసినందున తుదకు పూర్ణమగు శాంతిని పొందును; మఱియు అయుక్తుడగు వాడు, అనగా: యోగయుక్తుడు కాని వాడు, కామము యొక్క వాసనచే, అనగా: సంబంధముచే, ఫలాశయందు సక్తుడైనందున (పుణ్యపాపములచే) బంధింప బడును. ౧౨ సర్వకర్మలను మనస్సుచే (సాక్షాత్తుగ గాదు) సన్న్యసించిన జితేంద్రియుడగు దేహధారి (పురుషుడు) తొమ్మిది ద్వారములు గల్గినయీ (దేహరూపమగు) నగరమునం దేమియు చేయకయు, నేమియు చేయింపకయు సుఖముగ నుండును. ౧౩

పింగళగీత శాంతి ౧౭౪ - ౫౯

పింగళయను వేశ్య తన ప్రియుని రాకకై యొకనాటి రాత్రి మిక్కిలి ప్రొద్దగు నంత వరకు కాచియుండి, సకాలమునకు రాని వానిఁగూర్చి వెఱ్ఱిదాన నయిన నేను యాతనినే వెఱ్ఱివాడని దలంచుట తగునా యని చింతించి, "ఏకం స్థూణం నవద్వారం అపిధాస్యామ్యగారకం" ఒంటికంబముపై కట్టబడిన ఈయింటి యొక్క తొమ్మిది వాకిళులు మూసుకొని జీవునికి వాసస్థానమై విషయములచే పీడింపబడుచున్న యీ దేహముయొక్క గతుల మాన్పి సుఖనిద్ర గాంచెదఁ.

“ నవద్వారపురం గత్వా హంసో హి నియతో వశీ ॥ ”
శాంతి ౨౩౯- ౩౧. నవద్వార పురమును బొంది నియమింపబడిన హంస వశీ యనియు, చరా చర ప్రపంచమునకు ఈశ్వరుడనియు జెప్పబడినది.

: న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః
: న కర్మ ఫల సంయోగం స్వభావస్తు ప్రవర్తతే ॥ ౧౪

ప్రభువు, అనగా: నాత్మ లేక, పరమేశ్వరుడు లోకుల కర్తృత్వమునుగాని, కర్మలను గాని, కర్మఫలముల సంబంధమును గాని, నిర్మింపడు. స్వభావము, అనగా: ప్రకృతియే (సమస్తమును) చేయుచున్నది. ౧౪

“ అర్థా నిష్టా న్కామయతే స్వభావః
సర్వా న్ద్వేష్యా న్ప్రద్విషతే స్వభావః
కామద్వేషా నుద్భవత స్స్వభావాత్
ప్రాణాపానౌ జంతు దేహా న్నివేశ్య ”. అశ్వ ౨౫-౨

స్వభావ మనునదియే ఇష్టమైన అర్థములను కోరుచున్నది. స్వభావమే ద్వేషించ దగువాని నన్నిటిని ద్వేషించుచున్నది. స్వభావముచేత ప్రాణాపానములు, జంతువుల దేహములం దుంచబడి కామాదులను బుట్టించుచున్నవి.

“ అక్షరం చ క్షరం చైవ ద్వైధీ భావో యమాత్మనః
అక్షరం తత్ర సద్భావ స్స్వభావః క్షర ఉచ్యతే ”
అశ్వ ౨౫- ౨౩ యతిః

ఆత్మకు క్షరాక్షరములని రెండు భావములు. సద్భావ మనునదియక్షరము క్షరమనునది స్వభావము.

: నాదత్తే కస్యచి త్పాపం నచైవ సుకృతం విభుః
: అజ్ఞానేనా వృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః ॥ ౧౫

విభువు, అనగా సర్వ వ్యాపియగు నాత్మ, లేక పరమేశ్వరుడు, ఎవరి యొక్క యు పాపమును గాని, పుణ్యమును గాని పొందడు. జ్ఞాన మజ్ఞానమను ముసుగుచే నావరింప బడి నందున (అనగా: మాయచే) ప్రాణి మోహము నొందుచున్నాడు. ౧౫

"అజ్ఞానా న్నిరయం యాంతి తథా జ్ఞానేన దుర్గతిం" శాంతి ౧౫౯- అజ్ఞానము వలన నరక, దుర్గతులను బొందును. "లోభ ప్రభవ మజ్ఞానం" లోభము వలన అజ్ఞానము సంభవించును. ఇట్టి యజ్ఞానమునకు పరమ కారణ మగు లోభమును వదలిన వారై జనకుడు, యావనాశ్వుడు, మొదలగువారు, దివమును పొందిరి. "తస్యాజ్ఞానాద్ధిలోభోహి లోభాదజ్ఞానమేవచ" అజ్ఞానము వలన లోభము లోభము వలన అజ్ఞానమును సంభవించును.

"ఏక శ్శత్రు ర్నద్వితీయోస్తి శత్రు రజ్ఞానతుల్యః పురుషస్య రాజన్ । యేనావృతః కురుతే సంప్రయుక్తో ఘోరాణి కర్మాణి సుదారుణాని" శాంతి ౨౯౭- ౧౫

మనుజునకు అజ్ఞానతుల్యమగు శత్రువు లేదు. అజ్ఞానావృతుడు సర్వపాపకర్మలను జేయును.

: జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః
: తేషా మాదిత్యవ జ్జ్ఞానం ప్రకాశయతి తత్పరం ॥ ౧౬
: తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః

: గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః ॥ ౧౭
కాని యజ్ఞానమును స్వీయమగు జ్ఞానముచే బోగొట్టుకొనిన
వారి జ్ఞానము సూర్యునివలె పరమార్థతత్వమును ప్రకాశింపజేయు
చున్నది. ౧౬ మఱియు నాపరమార్థతత్వమందే బుద్ధి లీనమై
యంతఃకరణము దానియందే రమించుటంజేసి తన్నిష్ఠులు తత్పరా
యణులు నగువారియొక్క పాపము జ్ఞానముచే నిశ్శేషముగ దగ్ధ
మగును. అట్టివారికి పునర్జన్మములేదు.

"తదర్థముక్తం తప ఏతదిజ్యా తాభ్యామసౌ పుణ్యముపైతిజంతుః
పుణ్యేనపాపం వినిహత్య పశ్చాత్ న జాయతే జ్ఞానవిదీపితాత్మా॥
జ్ఞానేన చాత్మానముపైతి విద్వాన్న చాన్యథావర్గఫలానుకాంక్షీ
అస్మిన్ కృతం తత్పరిగృహ్య సర్వంఅముత్ర భుక్త్వాపునరేతిమార్గం"

కృచ్ఛ్ర చాంద్రాయణాది తపస్సును, జ్యోతి
ష్టోమాది యజ్ఞాచరణంబును, ఈశ్వర ప్రీణనార్థమని
వేదమతము. అట్లు కర్మల నాచరించునతడు తన్మహి
మంబున ప్రాప్తపుణ్యుడై, పాపము బోగొట్టుకొని,
జ్ఞాన ప్రకాశిత చిత్స దానందాద్వితీయ బ్రహ్మ
స్వరూపుడగును. కావున వేదోక్తవిధి నాచరించుట
వలన శ్రేయస్సు గల్గును గాని కేవల వేదాధ్యయన
మువలన శ్రేయము గలుగదు వేదోక్త విధి ప్రకా
రముల నాచరించు వాడు జ్ఞానియై పరమాత్మస్వ
రూప సాక్షాత్కారము గాంచును. అట్లు గాక
స్వర్గాది ఫలాపేక్షాబుద్ధితో గర్మల నాచరించువాడు
సంపాదిత పుణ్యఫలంబుతో స్వర్గంబున కేగి, పుణ్య

సమాప్తికాగా, మఱల నీలోకమును బొంది జనన మరణాదిరూప సంసార చక్రమునఁ బడి యజ్ఞానివై పరిభ్రమించుచుందువు. సత్సుజాతీయం.

: విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
: శుని చైవ శ్వపాకే చ పండితా స్సమదర్శినః ॥ ౧౮
: ఇహైవ తైర్జిత స్స్వర్గో యేషాం సామ్యే స్థితం మనః
: నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మా ద్బ్రహ్మణి తేస్థితాః ॥

పండితులగు (జ్ఞానులగు) వారియొక్క దృష్టి విద్యా వినయ యుక్తుడగు బ్రాహ్మణునియందును, గోవునందును, ఏనుగునందును, కుక్కయందును, చండాలునందును సమానముగానే యుండును ౧౮ ఈ రీతిగ సామ్యావస్థయందు స్థిరమైనమనస్సు గలవారీ జన్మమందే మృత్యులోకమును జయించుచున్నారు. కారణమేమనః బ్రహ్మము నిర్దోషము సమమును కాన (సామ్య బుద్ధిచే) ఏ పురుషుడు (ఎప్పుడును) బ్రహ్మమందే యుండును. అనగాః అక్కడనే బ్రహ్మభూతుడై యుండును. ౧౯

" విద్యాభిజన సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శుని చైవ శ్వపాకే చ పండితా స్సమదర్శినః ॥
స హి సర్వేషు భూతేషు జంగమేషు ధ్రువేషు చ
వసత్యేకో మహానాత్మా యేనసర్వ మిదం తతం " శాంతి॥

స్థావర జంగమాత్మకములగు అన్ని భూతములయందు వసించునట్టి యాత్మను జ్ఞానులు అందరియందును సమముగా జూచెదరు.

: నప్రహృష్యేత్ప్రియంప్రాప్య నోద్విజేత్ప్రాప్యచాప్రియం
: స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవి ద్బ్రహ్మణి స్థితః ॥ ౨౦

బాహ్య స్పర్శే ష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖం ॥
స బ్రహ్మయోగ యుక్తాత్మా సుఖ మక్షయ మశ్నుతే॥ ౨౧
యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే ।
ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః ॥ ౨౨

ప్రియమును, అనగా ఇష్టమైన వస్తువు ప్రాప్తమైన పిదప యానందమును జెంద గూడదు. మఱియు అప్రియము ప్రాప్తమయినపుడు ఖేదము నొందగూడదు. ఇట్టి స్థిరమైన బుద్ధి గలిగి మోహమును జెందని పురుషుడే బ్రహ్మవేత్తయనియు, బ్రహ్మమందు స్థితుడనియు (చెప్పవలయును). ౨౦ బాహ్య పదార్థములతో (ఇంద్రియములవు) సంయోగమునందు, అనగా విషయోపభోగమునందు, ఆసక్తము గాని మనస్సు గల వానికే యాత్మయందున్న సుఖము లభించును. ౨౧ బాహ్య పదార్థముల యొక్క సంయోగము చేతనే కలుగు భోగములవు వాదియు నంతమును లేమిచే నవి దుఃఖములకే కారణ మగును. ఓ కౌంతేయా! వానియందు బుద్ధిమంతుడు తత్పరుడు గాడు. ౨౨

౨౩ శక్నోతీ హైవ యస్సోఢుం ప్రాక్ఛరీర విమోక్షణాత్
కామ క్రోధోద్భవం వేగం స యుక్త స్స సుఖీ నరః ॥ ౨౩
యోంత స్సుఖోంతరా రామ స్తథాంత ర్జ్యోతి రేవ యః
స యోగీ బ్రహ్మ నిర్వాణం బ్రహ్మభూతో ధిగచ్ఛతి॥ ౨౪
లభంతే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః
ఛిన్న ద్వైధా యతాత్మాన స్సర్వభూతహితేరతాః ॥ ౨౫

శరీరమును విడిచి పెట్టువఱకును, అనగా: ఆమరణాంతము, కామక్రోధములచే గలుగు వేగము నిహలోకమునందే సహించుటవు (ఇంద్రియ సంయమనము చే) సమర్థుడగు వాడే ముక్తుడును, (నిజమైన సుఖియు నగును. ౨౩ ఇట్లు (బాహ్యములగుసుఖదుఃఖముల నపేక్షింపక) అంతఃకరణమునందే సుఖము ననుభవిం

చువాడును, తనలో తానే యారామము నొందువాడును, అంతః ప్రకాశము నొందిన వాడు నగు (కర్మ) యోగి, బ్రహ్మరూపు డగును. అతనికే బ్రహ్మ నిర్వాణము, అనగా: బ్రహ్మానందుకలసి కొనుట యను మోక్షము ప్రాప్తమగును. ౨౪ ఏ ఋషీశ్వరులు ద్వంద్వబుద్ధి వదలిరో, అనగా: అన్ని వస్తువుల యందును నొక పరమేశ్వరుడే యున్నాడను తత్వము తెలిసిరో, యెవరి పాపములు నశించినవో, యెవరాత్మ సంయమనముచే సర్వభూతముల కును హితము చేయుటయందు తత్పరులైరో వారికి బ్రహ్మనిర్వాణ రూపమగు మోక్షము లభించును. ౨౫

కామక్రోధ వియుక్తానాం యతీనాం యతచేతసాం
అభితో బ్రహ్మ నిర్వాణం వర్తతే విదితాత్మనాం ॥ ౨౬
స్పర్శాన్కృత్వాబహిర్బాహ్యాంశ్చక్షుశ్చైవాంతరేభ్రువోః
ప్రాణాపానౌ సమౌకృత్వా నాసాభ్యంతరచారిణౌ ॥ ౨౭
యతేంద్రియ మనోబుద్ధిర్మునిర్మోక్షపరాయణః
విగతేచ్ఛాభయక్రోధో యస్సదా ముక్త ఏవ సః ॥ ౨౮

కామక్రోధ రహితుడును, ఆత్మసంయమనము గలవాడును, ఆత్మజ్ఞాన సంపన్నుడు నగు యతికి అభితః అనగా: అంతటను, లేక, యెదుట నుంచినట్లు అనగా: కూర్చున్న ప్రదేశము నందే బ్రహ్మనిర్వాణ రూపమగు మోక్షము లభించును. ౨౬ బాహ్య పదార్థములతో (ఇంద్రియముల యొక్క సుఖ దుఃఖదములగు) సంయోగములు లక్ష్యముచేయక, దృష్టిని కనుబొమ్మల మధ్యనుంచి మఱియు ముక్కునుండి బయటికి వచ్చుచున్న ప్రాణమును, అపానమును సమానముగ చేసినట్టియు, ౨౭ ఇంద్రియములు, మనస్సు, బుద్ధియను వానిని సంయమించినట్టియు, ఇచ్ఛ, భయము క్రోధము నను వానిని వదలినట్టియు, మోక్షపరాయణుడగు నట్టియు ముని యెప్పుడును ముక్తుడనియే చెప్ప వలయును ౨౮

శాంతి ౩౩౩ శుకగమనము.

సపునర్యోగ మాస్థాయ మోక్షమార్గోప లబ్ధయే ।
మహాయోగీశ్వరోభూత్వా సోత్యక్రామద్విహాయసా ॥

గీతలందు ౭౦ శ్లో॥ మొ॥ ౭౮ వ శ్లో వరకు జెప్పబడిన ముక్తుని లక్షణములే నారదోపదేశము వలన పొంది విరక్తుడై, మహా యోగియై, తండ్రితో జెప్పి యాకాశ మార్గమున —

తతస్తస్మిన్పదే నిత్యే నిర్గుణే లింగవర్జితే ।
బ్రహ్మణి ప్రత్యతిష్ఠత్స విధూమోగ్నిరివజ్వలన్ ॥

పొగ లేని యగ్ని వలె బోవుచున్న పుత్రుడగు శుకుని విడలేక విలపించుచు వెను వెంట జను వ్యాసునకు సదాశివుడు ప్రత్యక్షమై యిట్లుబోధించెను

" పినాకహస్తో భగవా నభ్యాగచ్ఛత శంకరః
త మువాచ మహాదేవ స్సాంత్వ పూర్వ మిదం వచః ॥

పుత్ర శోకాభి సంతప్తం కృష్ణ ద్వైపాయనం తథా
అగ్నే ర్భూమే రపాం వాయో రంతరిక్షస్య చైవహి ॥

వీర్యేణ సదృశః పుత్రః పురా మత్త స్త్వయా వృతః
స తథా లక్షణో జాత స్తపసా తవ సంభృతః ॥

మమచైవ ప్రసాదేన బ్రహ్మ తేజోమయ శ్శుచిః
స గతిం పరమాం ప్రాప్తో దుష్ప్రాపా మజితేంద్రియైః ॥

ఛాయాం స్వపుత్రసదృశీం సర్వతో నపగాం తథా
ద్రక్ష్యసే త్వం చ లోకే స్మి న్మత్ప్రసాదా న్మహాముసే॥

భూమ్యగ్నులతో సమానమగు తేజస్సుగల పుత్రుని నాయనుగ్రహమువలన బొందితివి. శుకుడు నాప్రసాదము వలన శుచిమంతుడు బ్రహ్మతేజోమయుడు నగుచు జితేంద్రియులు పొందునట్టి పదవిని పొందియున్నవాడు. నీపుత్రసదృశమగు ఛాయను నాయనుగ్రహముచే జూడగలవు.

భోక్తారం యజ్ఞతపసాం సర్వలోక మహేశ్వరం
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి॥

(సర్వ) యజ్ఞములకును తపస్సులకు భోక్తను, (స్వర్గము మొదలుగాగల) సర్వలోకములకును గొప్ప యధిపతిని, సర్వభూతములకు స్నేహితుడను నైనట్టి నన్ను (ఈ విధమున) తెలిసికొనువాని శాంతి నొందుచున్నాడు.

"అదర్శనే తిష్ఠతిరూప మస్య పశ్యంతి చైనం సుసమిద్ధ సత్వాః హీనో మనీషీ మనసా భిపశ్యతే యఏవం విదురమృతా స్తేభవంతి॥"

,, యోగిన స్తం ప్రపశ్యంతి భగవంతం సనాతనం " పరబ్రహ్మస్వరూపము చర్మచక్షురింద్రియాదుల కగోచరమైనను; యాగాది కర్మలచే మలినరహితమగు మనస్సుతో యోగులు జూచుచున్నారు అట్టివారు ముక్తులయ్యెదరు. సనత్సుజాతీయం.

కర్మసన్న్యాసయోగమను పంచమాధ్యాయము
సమాప్తము.

శ్రీశివాభ్యాం నమః

# శ్రీ కుమారగీత.

## ధ్యాన యోగము.

---

### షష్ఠమాధ్యాయము.

---

శ్రీ భగవానువాచ.

అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః।
స సన్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్న చాక్రియః॥ ౧
యం సన్యాస మితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాండవ
న హ్యసన్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన॥ ౨

కర్మఫలము నాశ్రయింపక (అనగా: ఫలాశను మనస్సునందు స్థిరపడనీయక) ఎవడు (శాస్త్రానుసారముగ తనకు విహితమగు) కర్తవ్య కర్మల చేయుచున్నాడో యతనినే సన్యాసియనియు కర్మయోగి యనియును చెప్పవలయును. నిరగ్ని: అనగా అగ్నిహోత్రాదికర్మలను వదలి వేయు వాడు గాని, లేక, అక్రియుడు గాని, అనగా: ఏ కర్మలను చేయక స్వస్థముగ గూర్చుండు వాడు గాని (నిజముగ సన్యాసియు, కర్మయోగియు) కాదు

౨. పాండవా! దేనిని సన్యాసమని చెప్పుచున్నారో అదియె (కర్మ) యోగమని తెలిసి కొనుము. కారణ మేమన: సంకల్పమును, అనగా: కామ్యబుద్ధిరూపమగు ఫలాశను, సన్న్యసించిన (త్యజించిన) గాని (కర్మ) యోగి కానేరడు.

సులభ యను యోగిని తన యోగ బలముచే జనకునియందు ప్రవేశింపగా జనకుడు సర్వ బంధకర

మగు రాజ్యమును జేయుచున్నాననుచు నిట్లు జెప్పెను

" తస్మాద్ధర్మార్థకామేషు తథా రాజ్యపరిగ్రహే
బంధనాయతనేష్వేషు విద్ధ్యబంధే పదేస్థితం ॥
రాజ్యైశ్వర్యమయః పాశ స్స్నేహాయతన బంధనః
మోక్షాశ్మనిశితే నేహ ఛిన్న స్త్యాగాసినా మయా ॥ "

ఓ యోగినీ! వినుము చతుర్వర్గము నందు, రాజ్యమునందు బద్ధుడనై యున్నను, బద్ధుడ గానట్లు భావించి " మిథిలాయాం ప్రదీప్తాయాం న మే దహ్యతి కించన " అనగా: మిథిల కాలుచున్నను నాకు కాలనట్లే యున్నది. ) మఱియు, త్యాగమను కత్తిచే యీ స్నేహ పాశములను నఱికి వేసి, స్వార్థమునకుగాక; దేవతలు, పితరులు, సర్వభూతములు, అతిథులు మొదలగు వారికొఱకు సర్వ వ్యవహారముల నడుపుచున్నాను. , నాహ మాత్మార్థ మిచ్ఛామి గంధాన్ ఘ్రాణ గతా నపి " గంధాదుల గ్రహించు నట్టినాసికాదులు, గంధాదుల బొందినను, నా కొఱకు గాదని దలంచుచు,

" సుఖీ సోహ మవాప్తార్థ స్సమలోష్టాశ్మకాంచనః
ముక్తసంగ స్థ్సితో రాజ్యే విశిష్టోన్యై స్త్రిదండిభిః ॥"

నేను సుఖవంతుడనై యన్నిటి యందు సమానబుద్ధి గల్గి త్రిదండులతో కాలము గడుపుచున్నాను. ముక్త

సంగుడు సంసార చక్రము నందు పరిభ్రమించినను, వాని నేమియు నంటనేరవు.

ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే ॥ ౩
యదా హి నేంద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే
సర్వ సంకల్ప సన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే ॥ ౪

(కర్మ) యోగారూఢుడు కావలయునని యిచ్ఛయించు మునికి కర్మ యనునది (శమమునకు) కారణము, అనగా: సాధన మని చెప్పబడినది; మఱియు నా పురుషుడే యోగారూఢు డగునేని, అనగా: పూర్ణుడైన యోగి యగునేని యతనికి శమమే (కర్మకు) కారణమని చెప్పబడును. ౩

కారణమేమన: ఎప్పుడింద్రియములు (శబ్దస్పర్శాది) విషయములతోడను, కర్మలతోడను ననుషంగ ముండవో, ఎప్పుడు సర్వ సంకల్పములను అనగా: కామ్యబుద్ధి రూపమగు ఫలాశను- (సాక్షాత్కర్మలను గాదు) సన్న్యాసము చేయునో యప్పుడతనిని యోగారూఢుడ ని చెప్పుదురు. ౪

యోగ సిద్ధిని పొంద దలచిన వారికి కర్మల త్యవసరములు.

"కర్మయుక్తా న్ప్రశంసంతి సాత్త్వికా నితరాం స్తథా
ఆనందః కర్మణాం సిద్ధిః ప్రతిపత్తిః పరాగతిః ॥"

అసితుడను ఋషి నారదున కిట్లు జెప్పెను. కర్మయుక్తులు, సాత్త్వికులు, ప్రశంసింప బడుదురు. కర్మలయొక్క సిద్ధి ఆనందదాయకము. ప్రతిపత్తి యనునది ఉత్తమగతిని గలుగ జేయును.

" వేదస్యోపనిషత్సత్యం సత్యస్యోపనిషద్దమః
దమస్యోపనిషద్దానం దానస్యోపనిషత్తపః
తపసోపనిషత్త్యాగ స్త్యాగస్యోపనిషత్సుఖం
సుఖస్యోపనిషత్స్వర్గ స్స్వర్గస్యోపనిషచ్ఛమః ॥ "

వేదము సత్యము దానము తపస్సు త్యాగము సుఖము స్వర్గము, వీని యన్నిటి కంటెను శమము, అనగా: అంతరింద్రియనిగ్రహము, సర్వమునకు ఉపనిషద్రూపము ( అనగా: రహస్యము. ) అని యున్నది. కావున యోగికి శమ మత్యావశ్యకము. మఱియు, బలహీనుడు నదీ వేగమునకు నిలువనేరనటుల ఇంద్రియ నిగ్రహము లేని యోగి విషయములచే నీడ్వబడును. అందువలన యోగి సంకల్పములను త్యాగము చేయ వలయును. ఏల ననగా!

" బలహీన స్తథా యోగీ విషయై ర్హ్రియతే వశః "
నిగ్రహము లేని యోగి విషయములచే నీడ్వబడును.

ఉద్ధరే దాత్మనా త్మానం నాత్మాన మవసాదయేత్
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః ॥ ౫
బంధు రాత్మాత్మన స్తస్య యేనా త్మైవాత్మనా జితః
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతా త్మైవ శత్రువత్ ॥ ౬

( మనుజుడు ) తనంతట తానే తన్ను నుద్ధరించు కొనవలయును. తాను తనను ( ఎప్పుడును ) చెడగొట్టుకొన గూడదు. కారణ మేమనః ( ప్రతి మనుజుడును ) తనకు తానే బంధువు ( అనగా: సహాయము చేయువాడు ) గాని, శత్రువుగాని యగును ౫
అని చెప్ప బడినది.

ఎవడు తనను తానే జయించెనో, వాడు తనకు తానే బంధువగుచున్నాడు. ఎవడు, తనను తానే తెలిసికొనలేడో, వాడు తనకు తానె శత్రువగుచున్నాడు. ౬

ఈ రెండు శ్లోకముల యందలి యాత్మోద్ధరణముయొక్క అవసరముల జూడ ముక్తులు మొదలుకొని సర్వాశ్రమముల వారికి, సర్వ వర్ణముల వారికిని, యాత్మ బోధను సమర్థత జూపి చెప్ప బడినది.

నిత్య ముక్తుడగు జనకునిలో సులభ, యోగముచే బ్రవేశించగా జనకుడామెతో-

నీవెవరిదానవు? ఇపుడు నీవు నాలో బ్రవేశించుట వలన సర్వ సంకరములు గలుగుచున్నవనియె.

" ఆత్మన్యేవాత్మనా త్మానం యథా త్వమనుపశ్యసి
ఏవమేవాత్మనాత్మానం యథా త్వమనుపశ్యసి॥
ఏవమేవాత్మనాత్మాన మన్యస్మిన్ కిం న పశ్యసి
యద్యాత్మానం పరస్మింశ్చ సమతా మధ్యవస్యసి॥
అథమాం కాసి కస్యేతి కిమర్థ మనుపశ్యసి " శాం. ౩౨౦-

జనకా! ఆత్మయందాత్మచే నాత్మను ఆత్మచేత నాత్మను నీవెటుల జూచుచున్నావో అప్రకారముగానె ఇతరులయందును ఆత్మచేతను ఆత్మనెందులకు జూడవు. మఱియు పరుల యందలి యాత్మను, సమత్వముగా నెందులకు జూడవు నన్ను ఎవరి దానవని యెందులకడిగితివి యని సులభ యడిగిన జన

కుడు ఆత్మకు నీ నా భేదము కల్పించుట యజ్ఞాన-
మని గ్రహించి మారాడకుండెను.

ఆది పర్వములో శకుంతలో పాఖ్యానమున
వివాహమాడి మఱచియుండు దుష్యంతుని గురించి
శకుంతల జెప్పిన వాక్యము.

" ఆత్మనో బంధు రాత్మైవ గతి రాత్మైవ చాత్మనః
ఆత్మనైవాత్మనో దానం కర్తుమర్హాసి ధర్మతః ॥ "

రాజా! ఆత్మకు బంధువు, గతియు, నాత్మ
యేయైయున్నది. వివాహధర్మమును బట్టి యాత్మ
చేతనే యాత్మకు దానము చేయుటకు తగుదువని,
గార్హస్థ్యము నందును ఆత్మదాన మత్యవసర మని
బోధ పడుచున్నది.

" వశ్యేంద్రియం జితాత్మానం ధృతదండం వికారిషు " ఉద్యోగం

ఇంద్రియజయము, ఆత్మజయము, వికారుల
యందు దండన ఈ గుణములుగల రాజును, శ్రీ దేవి
వదలనేరదని యుండుటచే రాజులకును ఆత్మనియమ
నము శ్రేయోదాయకము.

దుర్భిక్షము వలన నాకలిచే బాధ పడునట్టి
విశ్వామిత్రుడు చండాల వాటిక యందలి కుక్క
మాంసమును గ్రహించిన, చండాలుడు దీని తినగూడ
దని నిషేధింప విశ్వామిత్రుడిట్లనియె.

" ఏవం విద్వా నదీనాత్మా వ్యసనస్థో జిజీవిషుః
సర్వోపాయై రదీనాత్మా దీన మాత్మాన ముద్ధరేత్ ॥ "
శాంతి ౧౪౧- ౧౦౦ విశ్వామిత్రః

వ్యసనము పొంది జీవింపదలచిన విద్వాంసుడయినను సర్వోపాయములచే దీనమైన దన యాత్మ నుద్ధరించుకొన వలయును.

" అహ మాత్మా హి లోకానాం విశ్వేషాం పాండునందన
తస్మా దాత్మాన మేవా గ్రే రుద్రం సంపూజయామ్య హం
యద్య హం నా ర్చయేయం వై ఈశానం వరదం శివం
ఆత్మానం నా ర్చయే త్కశ్చి దితి మే భావితాత్మనః "
నారాయణీయం శాంతి. ౩౪౧ - ౨౨

అర్జునా! సర్వలోకములకు నేనాత్మస్వరూపుడను అందు చేతనే ముందుగా ఆత్మ స్వరూపు డగు రుద్రుని పూజించుచున్నాను. నేను వరదుడగు పరశివుని బూజించనిచో నాత్మారాధనమే లేదనియు, రుద్రారాధనయే ఆత్మారాధన యనియు దెలియుము.

" ఆత్మాన మాత్మనా శ్వాస్య మా శుచః పురుషర్షభ "
విదురః శ్రీ ప. ౨-౮

ఆత్మచేతనే యాత్మ నోదార్పు నునుట చేత దుఃఖితుల దుఃఖ శమనమున కాత్మయే ముఖ్యము.

జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానాపమానయోః ॥ 7
జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః

యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః॥ ౭
సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థద్వేష్యబంధుషు
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే॥ ౯

తన యాత్మను, అనగా: అంతఃకరణమునుజయించిన వాని యొక్కయు, శాంతి కలిగిన వాని యొక్కయు, పరమాత్మ శీతోష్ణములు, సుఖదుఃఖములు, మానాపమానములు అనువాని యందు సమాహితమైనది అనగా: సమమైనదియు, స్థిరమైనదియు నగుచున్నది. ౮ ఎవని యొక్క యాత్మ జ్ఞానము చేతను, విజ్ఞానముచేతను, అనగా: వివిధమగు జ్ఞానము చేతను తృప్తినొందినదో, యెవడు తన యింద్రియముల జయించెనో, యెవడుకూటస్థుడాయెనో, అనగా: మూలమునను జేరినాడో, యెవడు మట్టిగడ్డ, రాయి, బంగారము మొదలగు వానిని సమానముగ దలచునో: యా (కర్మ) యోగినె "యుక్తు" డని అనగా: సిద్ధావస్థ నొందిన వాడని చెప్పుదురు. ౯ స్నేహితుడు, శత్రువు, ఉదాసీనుడు మధ్యస్థుడు, ద్వేషీ, యోగ్యుడు, బంధువు నను వారి యందును, సాధువులయందును, దుష్టులయందును, నెవని బుద్ధి సమమైనదో యతడే విశేషమైన యోగ్యత గల వాడని చెప్పబడియును. ౯

యోగియగువాని చర్యలనుగురించి "ముక్తసంగ స్థితస్తో రాజ్యే" జనకుడు నే ముక్తసంగుడనై రాజ్య మేలు చున్నాడ నని జెప్పెను. తులాధారుడు "జ్ఞానం విజ్ఞానినః కేచి త్పరం పారం తితీర్షవః" జ్ఞాన విజ్ఞానములచే తృప్తులగువారు సంసార సాగరము సులభముగా దాటగలరనియెను

ద్వంద్వా రామేషు భూతేషు య ఏకో రమతే మునిః

విద్ధి ప్రజ్ఞాన తృప్తం తం జ్ఞానతృప్తో న శోచతి ॥
శాంతి ౩:౦ - ౨౪

ద్వంద్వభూతములగు సర్వ భూతములయందు క్రీడించు నట్టి వానిని ప్రజ్ఞాన తృప్తు డనియు, జ్ఞాన తృప్తుడు దుఃఖితుడు గాడనియు, శుకునికి వ్యాసుడు బోధించెను

యోగీ యుంజీత సతత మాత్మానం రహసి స్థితః
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః॥ ౧౦
శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజినకుశోత్తరం ॥ ౧౧
తత్రైకాగ్ర్యం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః
ఉపవిశ్యాసనే యుంజ్యా ద్యోగ మాత్మవిశుద్ధయే ॥ ౧౨
సమం కాయశిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశ శ్చా నవలోకయన్ ॥ ౧౩
ప్రశాంతాత్మా విగతభీ ర్బ్రహ్మచర్యవ్రతే స్థితః
మన స్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః ॥ ౧౪

యోగి అనగా: కర్మ యోగి యైన వాడే కాంతము నందు నొంటరిగ నుండి చిత్తమును, నాత్మను స్వాధీన పఱచుకొని ఏవిధ మయిన కోరికలను గోరక పరిగ్రహమును అనగా: బంధనమును వదలి, యెప్పుడు నంతః కరణమును యోగాభ్యాసముననే ప్రవర్తింపజేయువలయును. ౧౦ మొదట దర్భాసనమును, దానిపై కృష్ణాజినమును, నందుపై వస్త్రమును పఱిచి విస్తారమున్నతమును మిక్కిలి పల్లమును కాని తనయాసనమును శుద్ధమగు ప్రదేశమున పఱిచి, ౧౧ చిత్తము యొక్కయు నింద్రియముల యొక్కయు

వ్యాపారముల నిరోధించి, మనస్సు నేకాగ్రము చేసి యాత్మశుద్ధ్య
ర్థమై యా యాసనముపై గూర్చుండి యోగము నభ్యసింప వల
యును. ౧౨ కాయమును, అనగా: వెన్నును, తలను, కంఠ
మును సమముగను, అనగా: నిలువుగను, సరళముగను, నిశ్చల
ముగను నిలిపి స్థిరుడై దిక్కులు చూడక తన నాసికచివర దృష్టి
నుంచి, ౧౩ భీతిని చెందక శాంతమగు అంతఃకరణముతో
బ్రహ్మచర్యవ్రతమును పాలించుచు మనస్సును సంయమించికొని
చిత్తమును నాయందే యుంచి నాయందే తత్పరుడయి యుక్త
డగుచు కూర్చుండవలయును. ౧౪

యుంజన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి ॥ ౧౫
నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంతమనశ్నతః
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున ॥ ౧౬
యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా ॥ ౧౭

ఇట్లెప్పుడును యోగాభ్యాసము చేయుచుండుటచే, మన
స్సు స్వాధీనమగుటవలన (కర్మ) యోగికి నాయందుండు నట్టియు
తుదకు నిర్వాణపదమును, అనగా నాయొక్క స్వరూపమునందు
లయమును చేయునట్టియు శాంతి కలుగును. ౧౫ ఓ యర్జునా!
ఈ యోగ మధికముగ తిండి తినువానికిని, బొత్తిగ తినని వానికిని,
ఎప్పుడును నిద్ర పోవు వానికిని, ఎల్లప్పుడును మేల్కొని యుండు
వానికిని, సిద్ధింపదు ౧౬ ఎవని కాహార విహారములు తగునటు
లుండునో, కర్మాచరణము తగు మాత్ర ముండునో, నిద్రయు,
మేల్కొనుటయు నెవరికి విపరీతముగ నుండదో, యట్టివానికి (ఈ)
యోగము దుఃఖమును పోగొట్టును. అనగా: సుఖదాయకమగును.

యోగి గాభోవు నతను ( వేదేషు చాష్టగుణితం యోగ మాహు ర్మనీషిణః ) వేదమునందెనిమిది రెట్లు జెప్పంబడిన యోగమును ప్రారంభించునపుడు పంచ దోషములను విసర్జించ వలయును.

" ఇంద్రియగ్రామ మఖిలం మనస్యభినివేశ్య హ
మన స్తథైవా హంకారే ప్రతిష్ఠాప్య నరాధిప!
అహంకారం తథా బుద్ధౌ బుద్ధిం చ ప్రకృతా వపి
ఏవంహి పరిసంఖ్యాయ తతో ధ్యాయంతి కేవలం॥ శాం ౩౧౭

ఇంద్రియములను మనస్సుయందు మనస్సహంకారమునందు అహంకారమును బుద్ధియందు బుద్ధిని ప్రకృతియందు ఈవిధముగా నియమించుకొని ధ్యానమును గావింపవలయునని యాజ్ఞవల్క్యుడు జనకునకుపదేశించెను. ఇట్టివాడు యతచిత్తుడనబడును.

శాంతి ౩౦౧- ౫౧ ధర్మనందనా! యోగాభ్యాసనక్తుడు " యథా కశ్చిద్వనం ఘోరం బహుసర్పసరీసృపం " అనేకములగు సర్పములు గలిగి, కంటకాదులచే పోరానిదియై ఆహార పదార్థములు జిక్కక కాలిపోయిన వృక్షములు గలదై దొంగలున్నట్టి ఘోరారణ్యమును ప్రవేశించి,

" యోగమార్గం తదా సాద్య యః కశ్చిద్వ్రజతే ద్విజః
క్షేమేణో పరమే న్మార్గా ద్బహుదోషో హి స స్మృతః"

యోగము నభ్యసించిన వాడు సుఖమును బొందును. ఏల నన! యోగము బహుదోష భూయిష్ఠమగుటచే, "దుస్థేయ మకృతాత్మభిః" ఆత్మ నియమము లేని వారిచే యోగము పొందుట దుస్తరమని ధర్మరాజునకు భీష్ముడు చెప్పెను,

> యోగ మేకాంతశీల స్తు యథా విందతి తచ్ఛృణు
> దిష్టపూర్వాం దిశం చింత్య యస్మి న్సన్నివసే త్పురే
> పురస్యాభ్యంతరే తస్య మన స్థాప్యం న బాహ్యతః ॥
>
> ఆశ్వ ౧౯- 33

యోగి యేకాంతశీలుడై తన శరీరమను పురమందు మనస్సు నుంచుకొని వెలుపల సంచరింపనీక యోగము నారంభించ వలయును.

శాంతి ౩౦౧ పరాశరగీత. అన్నము పిండి, తైల వర్జితముగా నొక మారు భుజింపుచు, పక్ష మాస, ఋతు, సంవత్సరాదులు "అపః పీత్వా పయోమిశ్రా యోగీ బలమవాప్నుయాత్" ఉదక మిశ్రితములగు క్షీరముల సేవించిన యోగి బలవంతుడగును. అరణ్య పర్వమున-

> తతో విహారై రాహారై ర్మోహిత శ్చ యథేప్సయా
> మహామోహాసుఖే మగ్నో నాత్మాన మవబుధ్యతే ॥

ఆహార విహారములను స్వేచ్ఛగా జరుపుకొని యోగి సుఖమను మోహమగ్నుడై యాత్మను గనజాలడు.

సుస్థేయం క్షుర ధారాసు నిశితాసు మహీపతే
ధారణాసు తు యోగస్య దుస్థేయ మకృతాత్మభిః॥
భీష్మః శాంతి ౩౦౧ - ౫౪

ధర్మజా! యోగము కొఱకు ధారణాదుల ప్రారంభించుట "కత్తులపై సాము" యని దలంపనలయు. కావున: నియమింపబడని యాత్మపరులకు ధారణ దుస్సాధ్యము.

యదా వినియతం చిత్త మాత్మన్యే వా వతిష్ఠతే
నిస్పృహ స్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా॥
యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా
యోగినో యతచిత్తస్య యుంజతో యోగ మాత్మనః॥ ౧౯

ఎవనియొక్క నిరోధింపబడిన మనస్సాత్మ యందు యెప్పుడును స్థిరముగుచున్నదో, యెవఁడట్టి యుపభోగమునందును నిచ్ఛ యెప్పుడు నుండదో, యప్పుడు వాడు యుక్తుడని చెప్పబడును. ౧౮ చిత్తము నిగ్రోధించి యోగము నభ్యసించు యోగి యొక్క స్థితి, గాలిలేని ప్రదేశమునందుంపబడిన దీపము యొక్క జ్యోతి వలె నిశ్చలముగ నుండును. ౧౯

యత్రో పరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా
యత్ర చైవా త్మనా త్మానం పశ్య న్నాత్మని తుష్యతి॥ ౨౦
సుఖ మాత్యంతికం యత్త ద్బుద్ధిగ్రాహ్య మతీంద్రియం
వేత్తి యత్ర న చైవా యం స్థిత శ్చలతి తత్వతః॥ ౨౧
యం లబ్ధ్వా చా పరం లాభం మన్యతే నాధికం తతః
యస్మిం స్థితో న దుఃఖేన గురుణా పి విచాల్యతే॥ ౨౨

: తం విద్యాద్దుఃఖసంయోగ వియోగం యోగసంజ్ఞితం
: స నిశ్చయేన యోక్తవ్యో యోగో నిర్విణ్ణచేతసా ॥ ౨౩

యోగానుష్ఠానముచే నిరుద్ధమయి చిత్తమెక్కడ రమించు
చున్నదో, యెక్కడ తన్ను తాను చూచుకొని యాత్మయందె
సంతుష్టుడగుచున్నాడో, ౨౦ ఎక్కడ ( కేవలము ) బుద్ధి
గమ్యమును, నింద్రియములకు నగోచరమును నగు నత్యంత సుఖము
వారి వారి యనుభవమునకు గోచరమగునో, యెక్కడ వాడు ఒక
సారి స్థిరుడగు నేని, తత్వము నుండి యెప్పుడును ప్రచ్యుతుడు
కాడో, ౨౧ అటులే యేస్థితి ప్రాప్తమయినపిదప దానికంటె
నేవిధమయిన లాభము నతని మనస్సున కిష్టము కాదో, యెక్కడ
స్థిరుడగు నేని యెట్టి గొప్ప దుఃఖము లయినను ( అతనిని ) చలింప
చేయ నేరవో; ౨౨ అట్టి వానికి దుఃఖ సంయోగ వియోగము,
అనగా: యోగమను పేరు కల్గిన స్థితి కల్గునని తెలుసుకొనుచున్నా
రు. మఱియు నీయోగము మనస్సునందు విసుగు జెందక నెప్పుడు
ను నాచరించి తీరవలయును. ౨౩

" నిర్వాతే తు యథా దీపో జ్వలే త్స్నేహసమన్వితః "

వాయు సంచారము లేని స్థలము నందున్న
స్నేహముతో గూడిన దీపము వలె. యుక్తుడగు వాని
యాత్మ చలించ నేరదు. శాంతి. ౩౧౦

పట్టాభిషేకానంతరము ధర్మజుడు శయనగృ
హమందు శయనించిన శ్రీకృష్ణుని జూచి యిట్లనియె.

" నిగృహీతో హి వాయుస్తే పంచకర్మా శరీరగః
ఇంద్రియాణి ప్రసన్నాని మనసి స్థాపితాని తే ॥

వాక్చ సత్వం చ గోవింద బుద్ధ్యా సంకేతితాని తే
సర్వే చైవ గుణా దేవ క్షేత్రే క్షేత్రే నివేశితాః॥
నేంగంతి తవ రోమాణి స్థిరా బుద్ధి స్తథా మనః
కాష్ఠ కుడ్య సిరా భూతో నిరీహ శ్చాసి మాధవ॥
యథా దీపో నివాతస్థో నిరింగో జ్వలతే పునః
తథా సి భగవన్ దేవ పాషాణ ఇవ నిశ్చలః॥
యథా శ్రోతు మిహార్హామి రహస్యం చ తే యది
ఛింధి మే సంశయం దేవ ప్రపన్నాయా భియాచతే॥ "

కృష్ణా! నీ యింద్రియముల స్వస్థానములయం దుంది లోమములనైనను కదల నీక మనోబుద్ధులను స్థిరపరచుకొని వాయుశూన్య దీపమువలెచలింపక, పాషాణము వలె కదలకుండ నుండుటకు కారణమును జెప్పు మని యాచించెను.

" శరతల్పగతో భీష్మః శామ్య న్నివ హుతాశనః
మాం ధ్యాతి పురుషవ్యాఘ్ర తతో మే తద్గతం మనః॥ "

ధర్మజా! శర తల్ప గతుం డగు భీష్ముడు, (చల్లారుచున్న యగ్నివలె యున్న వాడై) నన్ను ధ్యానించుచున్నందున నాయొక్క మనస్సతనిని పొంది నదియనిజెప్పెను. ఇయ్యది పరస్పరధ్యానయోగము

" తదా త మనుపశ్యేత యస్మిన్ దృష్టే న కథ్యతే
హృదయస్థో ంతరాత్మేతి జ్ఞేయో జ్ఞ స్తాత మద్విధైః॥
విధూమ ఇవ సప్తార్చి రాదిత్య ఇవ రశ్మిమాన్

వైద్యుతో౽గ్నిరివాకాశే దృశ్యతే౽త్మా తథా౽త్మని॥"

శాంతి 302-౧౮

ధూమ రహితమగు నగ్ని వలెను, ఆకసమునందు సూర్యుని వలెను, విద్యుత్సంబంధమగు నగ్ని వలెను నుండునట్టియు హృదయాంతర్గత మైనట్టిదియు నగు నాత్మ మావంటి వారిచే జూడబడు నని జనకునకు వసిష్ఠుడు బోధించెను.

పరశురాముడు కార్తవీర్యాది క్షత్రియుల దునుమాడుచున్న సమయమునందు పితృదేవతలు, యాకాశవాణియు ఇట్లు బోధించిరి.

అనుగీత, ౩౯- "రామ రామ నివర్తస్వ కం గుణం తాత పశ్యసి" రామా! ఇట్టి హత్యనుండి మఱలుము. దీనియందేమి గుణము జూడగలిగితివి. బ్రాహ్మణుడవయి యుండి యింత ఘోరము జేయంజనదు.

రామా! పూర్వకాలమున అలర్కుడను రాజు జగత్తునంతటి జయించి యొకచోట గూర్చుండి యెందరిని జయించినను యింద్రియములతో గూడిన యీ మనస్సును జయించలేక పోయితి. చపల స్వభావమగు మనస్సుచే సర్వజనులును వంచింప బడుచున్నారు.

కావున నేసీ బాణంబులచే మనంబును జయించెదనని ధనువున బాణమును సంధింపగా మనస్సు యిట్లనియె.

" నే మే బాణా స్తరిష్యంతి మా మలర్క కథంచన
తవైవ మర్మ భేత్స్యంతి భిన్నమర్మా మరిష్యసి
అన్యాన్బాణాన్సమీక్షస్వ యై స్త్వం మాం సూదయిష్యసి"

అలర్కా! వినుము ఈ బాణములు నన్నేమియు చేయజాలవు నీవు వేయు బాణములచే భిన్నమర్మములు గలవాడవై చనిపోదువు. గాన ఏ బాణములచే నేమడియుదునో యా బాణముల నాలోచింపుము అని జెప్పిన యలర్కుడిటులాలోచించెను. ఘ్రాణము గంధములను, జిహ్వ రసములను, త్వక్కు స్పర్శలను, శ్రోత్రము శబ్దములను, దృక్కు రూపములను, బుద్ధి విషయము లను గ్రహించుటంజేసి వికారములు సంభవించుచున్నవి. కావున వీటిని ముందుగా బాణములచే సంహరించెదను అనియెను. అంతనింద్రియము లన్నియు " నే మే బాణా స్తరిష్యంతి " యని మనస్సు జెప్పినటులే జెప్పిన అలర్కుడాలోచించి " నా ధ్యగచ్ఛ త్పరం శ్రేయో- యోగా న్మతిమతాం వర " ఇంద్రియాది విజయమునకు యోగముకన్న వేఱు గతిగానక,

"స ఏకాగ్రం మనః కృత్వా నిశ్చలో యోగ మాస్థితః
ఇంద్రియాణి జఘానాశు బాణేనైకేన వీర్యవాన్
యోగేనాత్మాన మావిశ్య సిద్ధిం పరమికాం గతః ॥"

ఏకాగ్రముగా మనస్సును గావించుకొని నిశ్చలుడయి యోగమును పొంది యొక బాణముచేతనే ఇంద్రియములను జయించి యోగముచే నాత్మను బొంది యుత్తమమగు సిద్ధిని బొందెను. గావున: పరశురామా! ఈ క్షత్రియ వధను మాని యలర్కుని వలె యోగమును పొంది సుఖియింపుమని జెప్పి పితరు లంతర్ధానమును పొందిరి. ఇంద్రియ జయమునకు యోగమే ప్రధానమని యనుగీత జెప్పుచున్నది.

సంకల్పప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వా నశేషతః
మనసై వేంద్రియగ్రామం వినియమ్య సమంతతః ॥ ౨౪

శనై శ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్ ॥ ౨౫

యతో యతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరం
తత స్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్ ॥ ౨౬

ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమం
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూత మకల్మషం ॥ ౨౭

యుంజ న్నేవం సదా త్మానం యోగీ విగతకల్మషః
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యంతం సుఖ మశ్నుతే ॥ ౨౮

సంకల్పము నుండి బయల్పడు కోరిక లన్నింటిని, అనగా:

శాసనలను నిశ్శేషముగ త్యజించి సర్వేంద్రియములను నలు ప్రక్క-లను బోనీయక మనస్సుచే నియమించియు, ౨౪ ధైర్యముతో గూడుకొన్న బుద్ధిచే క్రమక్రమముగ శాంతుడగుచు నుండవలయును. మఱియు మనస్సు నాత్మయందు స్థిరపరచి యేవిచారమును మనస్సు లోనికి రానీయక యుండవలయును. ౨౫ ఈ రీతిగ చిత్తము నేకాగ్రము చేయుచుండగా చంచలమును నస్థిరమును నగు మనస్సు బాహ్య విషయములకు బరుగెత్తునప్పుడెల్ల నిరోధించి దానినాత్మవ నధీనమైనదానిగనే చేయవలయును. ౨౬

ఈ ప్రకారముగ శాంతచిత్తుడును, రజోగుణశూన్యుడును, పాపశూన్యుడును, బ్రహ్మభూతుడు నయిన (కర్మ) యోగికి, యుత్తమమగు సుఖము ప్రాప్తమగును. ౨౭ ఇట్లెల్లప్పుడును, నాత్మవిషయక మగు యోగాభ్యాసము జేయు (కర్మ) యోగి పాపముల నుండి ముక్తుడై బ్రహ్మ సంయోగము వలన ప్రాప్తమగు నత్యంతసుఖమును సులభముగ ననుభోగించును. ౨౮

మానసం సర్వభూతేషు వర్తతే వై శుభాశుభం
అశుభేభ్య స్సదా క్షిప్య శుభేష్వే వా వతారయేత్ ॥

శాంతి- ౩౧౦- ౧౫

సర్వ భూతముల యందును శుభా శుభాత్మక మగు మనస్సుండును. అశుభములనుండి మనస్సును విడదీసి శుభములయందుంచవలయును.

స్థిరీకృత్యేంద్రియగ్రామం మనసా మిథిలేశ్వర
మనో బుద్ధ్యా స్థిరం కృత్వా పాషాణ ఇవ నిశ్చలః ॥

శాంతి ౩౦౮

మనస్సుచే నింద్రియ సముదాయమును స్థిర పరచి

మనస్సును బుద్ధిచే స్థిరపరచి పాషాణమువలె చలించనివాడు యోగి యనబడును. విదుర॥ త్రి॥ప. 3

యతో యతో మనో దుఃఖా త్సుఖా ద్వా విప్రముచ్యతే
తత స్తతో నియమ్యైత చ్ఛాంతిం విందేత వై బుధః ॥

సుఖ దుఃఖములవలన ఎచ్చటెచ్చట నుండి మనస్సు మరలుచున్నదో, మరల యచ్చటచ్చటనే మనస్సును నిలిపినవాడు శాంతిని బొందును.

యతో యతో నివర్తతే తత స్తతో విముచ్యతే
నివర్తనాద్ధి సర్వతో న వేత్తి దుఃఖ మణ్వ పి॥ ఉద్యో. విదుర॥

మనస్సు నెచ్చటి నుండి మరల్చిన నచ్చట సుఖము గలుగును. మనస్సును మరలించుటచే అణుమాత్రమును దుఃఖమును బొందనేరడు.

గురుశిష్యసంవాదమున గురుబోధచే శిష్యుడు

కృతకృత్యశ్చ స తదా శిష్యః పరమలోద్వహా
తత్పదం పరమం ప్రాప్తో యత్ర గత్వా న శోచతి ॥

కృతార్థుడై ఎచ్చటికి వెళ్ళిన విచార మందడో యట్టి స్థానమునలంకరించెనని జెప్పిన శ్రీకృష్ణుని యర్జునుడు ఆ గురు శిష్యు లెవరని ప్రశ్నించెను.

అహం గురు ర్మహాబాహో మన శ్శిష్యం చ విద్ధి మే
త్వత్ప్రీత్యా గుహ్య మేత చ్చ కథితం తే ధనంజయ ॥
పూర్వ మప్యేత దేవోక్తం యుద్ధకాల ఉపస్థితే
మయా తవ మహాబాహో తస్మా దత్ర మనః కురు ॥

నవను వాడే గురువు మనస్సే శిష్యుడు నీయందలి ప్రీతిచే యీవిధమును ఉపదేశించితిని దీనినాచరణలో పెట్టుము. సర్వపాపముల నుండి ముక్తుడవై మోక్షమును బొందగలవు. యుద్ధసమయమున గూడ దీనినే జెప్పియుంటిని. గాని మఱచితివి. ఇపుడైన మనస్సు నిలిపి ధన్యుడవగుమని వాసుదేవుడానతిచ్చెను.

వాసుదేవః అనుగీత ౫౧- ౪౩

గీతా పాఠకులు మనస్సుచే సర్వ ధర్మముల వదలి మానసికముగ నీ ధర్మములవరిచికొనిన ధన్యులగుదురు. ఇదియే, వాసుదేవ రహస్యము.

సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః॥ ౨౯
యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి॥ ౩౦
సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వ మాస్థితః
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే॥ ౩౧
ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః॥ ౩౨

ఎవని యాత్మ (ఈరీతిగ) యోగయుక్తమయినదో యతని దృష్టి యంతటను సమమయినది యగును గాన, సర్వభూతముల యందు తానును, తనయందు సర్వభూతములును (నున్నట్లు) వానికి కాన్పించును. ౨౯ నే (పరమేశ్వరుడగు పరమాత్మ) నన్ని చోట్ల నున్నానని తెలిసికొననట్టియు, నాయందు సమస్తమున్న

టని తలచునట్టియు మనుజునకు నే నెప్పుడును కాన్పింపక పోను.
అతడును నాకెప్పుడును కనబడక యుండడు. ౩౦

ఏకత్వబుద్ధిని (అనగా: సర్వభూతాత్మైక్యత్వ బుద్ధిని)
మనస్సునందుంచుకొని, సర్వభూతములయందుండు నన్ను (పర
మేశ్వరుని) భజించు (కర్మ) యోగి వ్యవహారముల నన్నింటిని
చేయుచున్నను నాయందె యుండును ౩౧ ఓ యర్జునా! సుఖ
మునుగాని, దుఃఖమునుగాని తనవలె యితరులకు సమ (ఆత్మౌ
పమ్య) దృష్టిచే నన్నిటిని సమానముగ జూచు (కర్మ) యోగి
పరముడుగ (ఉత్కృష్టునుగ) నెన్నబడుచున్నాడు ౩౨

సర్వభూతాత్మభూతో హి వాసుదేవో మహాబలః
పృథివీ వాయు రాకాశ మాపో జ్యోతిశ్చ పంచమం
తే సమేతా మహాత్మానశ్శరీర మితి సంజ్ఞితం॥ శాం॥ ౩౩౯
స హి సర్వేషు భూతేషు జంగమేషు ధ్రువేషు చ
వసత్యేకో మహానాత్మా యేన సర్వ మిదం తతమ్॥ శాం॥ ౨౩౮
సమేన సర్వభూతేషు నిస్స్పృహేణ నిరాశిషా
శక్యా గతిరసంగంతుం సర్వత్ర సమదర్శినా॥ అను॥ ౫౧-౪౦
సర్వభూతస్థ మాత్మానం స సర్వగతిరిష్యతే
యో విద్వాన్సహవాసంచ వివాసంచైవ పశ్యతి॥ అశ్వ॥ ౬
సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని
యదా పశ్యతి భూతాత్మా బ్రహ్మ సంపద్యతే తదా॥ శా॥ ౨౩౮
సర్వభూతా న్యహం దేహే పశ్యన్మనసి చాత్మనః
యోగే బుద్ధిం శ్రుతే సత్వం మనో బ్రహ్మణి ధారయన్
విహరిష్యామ్య నాసక్తః సుఖీ లోకాన్నిరామయః॥
మంకిగీత శాం॥ ౧౭౭

మంకియను బ్రాహ్మణుడు కామాదులను నిర

సించినవాఁడై నాయొక్క దేహమునందు సర్వ భూత ములను జూచుచు, యోగమునందు బుద్ధిని, శ్రుత మునందు సత్త్వమును, బ్రహ్మయందు మనస్సును, ధరించిన వాఁడనై ఆసక్తి లేక సుఖవంతుఁడ నగుచు బాధారహితుఁడనై విహరించుచున్నాననియె.

మహాత్ములందరు సర్వ భూతముల యందు తాము, తమ యందు సర్వ భూతములు నున్నటుల దెలిసికొని సుఖింతురు.

అర్జున ఉవాచ.

యోఽయం యోగ స్త్వయా ప్రోక్త స్సామ్యేన మధుసూదన
ఏతస్యాహం న పశ్యామి చంచలత్వా త్స్థితిం స్థిరాం॥ ౩౩
చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢం
తస్యాహం నిగ్రహం మన్యే వాయో రివ సుదుష్కరం॥ ౩౪

ఓ మధుసూదనా! నీవు చెప్పిన సామ్యబుద్ధిచే ప్రాప్తమగు ఈ కర్మయోగము మనస్సు చంచల మగుటచే స్థిరముగ నుండునట్లు గన్పట్టదు. ౩౩ కారణమేమన, కృష్ణా! మనస్సు చంచలమైన దియు, పట్టుకొనుటకు సాధ్యము గానిదియు, బలిష్ఠమైనదియు, దృఢమైనదియు, (అనగా: స్వాధీనము చేసికొనుటకు సాధ్యము కానిదియు) గాన వాయువును మూటకట్టుటవలె దీనిని నిగ్రహిం చుట మిక్కిలి దుష్కరముగ గన్పట్టుచున్నది. ౩౪

శ్రీభగవానువాచ.

అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలం
అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే ॥ ౩౫

అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః
వశ్యాత్మనా తు యతతా శక్యో౽వాప్తు ముపాయతః ॥ ౩౬

శ్రీభగవంతుడు చెప్పుచున్నాడు. ఓ మహాబాహువగునట్టి యర్జునుడా! మనస్సుచంచలమైనది యగుటచే దాని నిగ్రహించుట దుర్ఘటమనువిషయమున సందేహ మేమియు లేదు. గాని, యో కౌంతేయా! అభ్యాసము చేతను, వైరాగ్యము చేతను, దానిని స్వాధీనము చేసికొనవచ్చును. ౩౫ అంతఃకరణము స్వాధీనమున లేని వాడీ సామ్యబుద్ధిరూపమగు యోగమును సాధించుట కష్టమని నాతలంపు. కాని యంతఃకరణమును స్వాధీనములోనుంచుకొని, ప్రయత్నము జేయుచుండు వేని యుపాయముచే దీనిని సాధింపవచ్చును. ౩౬

స సాంఖ్యధారణం చైవ విదిత్వా౽త్మా నరర్షభ
జరామృత్యుం యోగేన తత్పరేణాంతరాత్మనా॥
గచ్ఛే త్ప్రాప్య క్షయం కృత్స్న మజన్మ శివ మవ్యయం
శాశ్వతం స్థాన మచలం దుష్ప్రాప మకృతాత్మభిః ॥
శాంతి ౩౧౭-

జనకమహారాజా! తెలిసినవాడు సాంఖ్యధారణమువలనను, యోగమువలనను మృత్యుంజయుడగుచు శాశ్వతస్థానమును పొంద గలడు ఆత్మను మరచినవానిచే నైపదము పొంద శక్యముగాదని యాజ్ఞవల్క్యుడు జెప్పెను.

అర్జున ఉవాచ.

అయతిః శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి ॥ ౩౭
కచ్చిన్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్రమివ నశ్యతి
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి ॥ ౩౮

ఏతం మే సంశయం కృష్ణ ఛేత్తు మర్హస్యశేషతః,
త్వదన్య స్సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే ॥ ౩౯

శ్రీభగవానువాచ.

పార్థ నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే
నహి కల్యాణకృ త్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి ॥ ౪౦

అర్జునుడు చెప్పుచున్నాడు.- ఓ కృష్ణా! శ్రద్ధయుండినను అయతియగువాడు (అనగా: ప్రకృతిస్వభావానుసారముగ బాగ్ణమగు ప్రయత్నము లేక సంయమము కానందున, యెవని మనస్సు సామ్యబుద్ధిరూపమగు (కర్మ, యోగమునుండిచలించినదో వాడు) యోగసిద్ధిని పొందక యేగతిని పొందును? ౩౭ ఓ మహాబాహుడవగు శ్రీకృష్ణా! మోహగ్రస్తుడగుటచే బ్రహ్మప్రాప్తిమార్గమునందు స్థిరుడు కాక, యిటు నటు గూడ చెడి పోయిన పురుషుడు చెదరి పోయిన మేఘము వలె (అమధ్యనే) నశించడు గదా? ౩౮ ఓ కృష్ణా! యీ నా సంశయమును నీవే నిశ్శేషముగ దీర్పవలయును. ఈసంశయమును దీర్చుటకు నీవు దక్క మఱియొక డెవడును దొరకడు. ౩౯ శ్రీ భగవంతుడు చెప్పుచున్నాడు.- ఓ పార్థా! ఇహలోకమందుగాని పరలోకమందుగాని యిట్టి పురుషు డెప్పుడు వినాశమందడు. కారణ మేమనః నాయనా! కల్యాణ కారకములగు కర్మలను జేయువాడెవడును దుర్గతి నొందడు. ౪౦

కర్మణా మనసా వాచా యదభీక్ష్ణం నిషేవతే
తదే వా పహరత్యే నం తస్మా త్కల్యాణ మాచరేత్ ॥

ఉద్యోగం ౪౫-౫౭

మనో వా క్కాయములచే నేది జేసిన దానినే పొందును. గావున మనుజు డెప్పుడును కల్యాణమునే యాచరించవలయును.

ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టో భిజాయతే॥ ౪౧
అథవా యోగినా మేవ కులే భవతి ధీమతాం
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ య దీదృశాం॥ ౪౨

యోగభ్రష్టుడు (అనగా: కర్మయోగమునుండి భ్రష్టుడైన వాడు) పుణ్యకర్మలను జేయు పురుషులకు లభించు స్వర్గాదిలోకములు జేరి యచ్చో ననేక వత్సరములు వసించి పిదప పరిశుద్ధులగు శ్రీమంతుల గేహమునందు జన్మించును ౪౧ లేదా, బుద్ధిమంతులగు (కర్మ) యోగుల కులమందె జన్మించును. ఇట్టి జన్మ (ఈ) లోకమునందు మిక్కిలి దుర్లభమైనది. ౪౨

శాంతిపర్వమందలి ౨౪౦ వ యధ్యాయమున వ్యాసుడు శుకమహర్షికి యోగవిధిని చక్కగ బోధించియున్నాడు.

గచ్ఛతాం గచ్ఛతాం క్షేమం దుర్బలో త్రానసీదతి
బ్రహ్మణః పద మన్విచ్ఛ న్సంసారా న్ముచ్యతే శుచిః॥

శాంతి ౧౬౯-౩౨

క్షేమమును గురించి పోవు వారిలో దుర్బలులు నశింతురు. శుచివంతుడు బ్రహ్మపదమును వెదకి గనుంగొని ముక్తుడగును.

బ్రహ్మపదమును గోరువారు శుచిమంతులు గాన వారి యిండ్లయందు యోగభ్రష్టుడు జన్మించునని భగవన్నిర్ణయము.

తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికం
యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురునందన॥ ౪౩
పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశో పి సః
జిజ్ఞాసు రపి యోగస్య శబ్దబ్రహ్మా తివర్తతే॥ ౪౪

దానియందు అనగా: అవ్విధముగ ప్రాప్తమయిన జన్మమునందు) పూర్వజన్మమునందలి బుద్ధిసంస్కారము తనకు ప్రాప్తమగును;

పట్టియు నోపకపోయినను! అతను దానికంటె యధికమగు (యోగ) సిద్ధిని సంపాదించుకొనుటకు బ్రయత్నించును ౪౩ పూర్వజన్మ సంబంధమైన యాతని యభ్యాసముచేతనే యవశుడై (స్వయముగ నిచ్ఛలేకపోయినను) పూర్ణ సిద్ధి వైపునకు లాగబడును. ఎవరికి (కర్మ) యోగముయొక్క జిజ్ఞాస అనగా: జ్ఞానము సంపాదించుకొనవలయు నను నిచ్ఛ కల్గినదో యతడు సైతము శబ్దబ్రహ్మము కంటె బరమునకు జేరును. ౪౪

ఏవం పూర్వాభ్యాసేన యోగేన యుంజానో పూర్వక మంతతః
అపి జిజ్ఞాసమానో పి శబ్దబ్రహ్మ తివర్తతే ॥ శాంతి ౨౩౫
ఏవం స్వస్థాత్మన సాధో స్సర్వత్ర సమదర్శినః
షణ్మాసా న్నిత్యయుక్తేన శబ్దబ్రహ్మతివర్తతే॥ శాం. ౨౩౯

ఈ యోగమును ఆలోచించినను సమ బుద్ధి గలవాడైనను; ఆరు మాసములు ఆచరించినను శబ్దబ్రహ్మమును దాటగలడు "శబ్దబ్రహ్మణి నిష్ణాతం పరే చ కృతనిశ్చయం" శబ్దబ్రహ్మమునందాసక్తిగలవాడును పరబ్రహ్మమునందు నిశ్చయముగలవాడును దేవుడనియు, బ్రాహ్మణుడనియు జెప్పబడును.

ద్వే బ్రహ్మణి వేదితవ్యే శబ్దబ్రహ్మ పరం చ యత్
శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మ ధిగచ్ఛతి ॥

ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంసిద్ధ కిల్బిషః
అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిం ॥ ౪౫

తపస్విభ్యో ధికో యోగీ జ్ఞానిభ్యో పి మతో ధికః
కర్మిభ్య శ్చాధికో యోగీ తస్మా ద్యోగీ భవార్జున ॥ ౪౬

ఇట్లు ప్రయత్నము చేయుచు నుండగ నుండగ పాపముల నుండి విముక్తుడై (కర్మ) యోగి యనేక కర్మముల నొంది సంసిద్ధుడయి తుదకు నుత్తమగతి నొందును. ౪౫ తపస్వులకంటెను

జ్ఞానుల కంటెను, కర్మఠుల కంటెను (కర్మ) యోగి శ్రేష్ఠుడని తెలిసికొనుచున్నారు. కావున నో యర్జునా! నీవు యోగివి కమ్ము

అత్మారామేణ బుద్ధేన బోద్ధవ్యం శుభకర్మణా
యోగదోషా న్సముచ్ఛిద్య పంచ యా న్కవయో విదుః ॥
కామం క్రోధం చ లోభం చ భయం స్వప్నంచ పంచమం ॥
క్రోధం శమేన జయతి కామం సంకల్పవర్జనాత్
సత్వసంసేవనా ద్ధీరో నిద్రా ముచ్ఛేత్తు మర్హతి ॥
ధృత్యా శిశ్నోదరం రక్షే త్పాణిపాదం చ చక్షుషా
చక్షుః శ్రోత్రే చ మనసా మనో వాచం చ కర్మణా ॥
అప్రమాదా ద్భయం జహ్యా ద్దంభం ప్రాజ్ఞోప సేవనాత్
ఏవ మేతా న్యోగదోషా న్జయే న్నిత్య మతంద్రితః ॥

శాంతి- ౨౩౯

శుచిత్వము, తెలివియు గల పురుషుడు నైదగు యోగ దోషముల బోగొట్టుకొనవలయునని జ్ఞానులు చెప్పుచున్నారు.

ఎట్లన: సంకల్పత్యాగముచే కామమును, శాంతిచే క్రోధమును, సత్వగుణముచే నిద్రను, ధైర్యముచే గుహ్యోదరములను, నేత్రములచే హస్తపాదములను, మనస్సుచే నేత్రములను, కర్మచే మనో వాక్యములను, ప్రమాదము లేకుండుటచేత భయమును, పెద్దల సేవవలన డంబమును ఈ ప్రకారముగా యోగ దోషముల వలని తొందరల మాన్పికొనవాడు యోగమునకే గాక అన్ని గుణములకును ఆలవాలమగును.

ఈ యోగ దోషములు భారతమునందు సర్వ విషయములకును జెప్పబడినవి.

: యోగినా మపి సర్వేషాం మద్గతేనాం తరాత్మనా
: శ్రద్ధావా న్భజతే యో మాం స మే యుక్తతమో మతః ॥౪౭

అయిన సన్ని (కర్మ) యోగులలోను, ఎవడు నాయం

దంతఃకరణము నుంచి శ్రద్ధచే నన్ను భజించు చున్నాడో యాతని నే నందఱిలో నుత్తముడైన యుక్తుడని ( అనగా: నుత్తమ మగు సిద్ధినొందిన (కర్మ, యోగి ) తలచు చున్నాను. ౪౭

శర తల్ప గతుఁడగు భీష్ముడు నన్ను ధ్యానము జేయుటచే “ తతో మే తద్గతం మనః ” నా మనస్సు ధ్యానముచే భీష్ముని పొందినది. ఈ దృష్టాంతమువలన భగవద్ధ్యాన పరాయణులు భగవంతుని మనంబు నాకర్షించుటకు సమర్థులని బోధింపనైనది.

శ్రీకృష్ణుడు యోగ బలముచే నిట్లగపడెను. “ అథాపశ్యత్పురుషం యోగ యుక్తం పీతాంబరం లుబ్ధకో నేక బాహుం ” మౌసలపర్వం- యోగముచే గూడుకొని శంఖ చక్ర పీతాంబర-ధారియై యనేక బాహువులు గల శ్రీకృష్ణుని లుబ్ధకుడు జూచెను.

“ యోగ యోగీశ్వరః కృష్ణః ” కృష్ణుడు యోగ యోగీశ్వరుడని గలదు కావున శ్రీకృష్ణుడు భగవద్గీతా పారాయణ పరులకు యోగమును ప్రసాదించగలడు.

ఈ యారవ యోగము భారతమునందు అనేక పర్యాయములు వ్యాసాది మహర్షులచే ప్రతిపాదింప బడినది.

భారతీయుల ధర్మ గ్రంథమగు
శ్రీమన్మహా భారతము నందలి మోక్ష ధర్మ బోధక మగు
భగవద్గీతల యందు ధ్యాన యోగ మను
౬ వ అధ్యాయము.



శ్రీకృష్ణాయనమః.

# శ్రీ కు మా ర గీ త

## జ్ఞాన విజ్ఞాన యోగము.

### సప్తమోఽధ్యాయః

శ్రీ భగవానువాచ

మయ్యాసక్తమనాః పార్థ యోగం యుంజన్మదాశ్రయః
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు ॥ ౧
జ్ఞానం తేఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యామ్యశేషతః
యద్జ్ఞాత్వా నేహ భూయోఽన్యద్ జ్ఞాతవ్య మవశిష్యతే ॥ ౨

శ్రీ భగవంతుడు సెప్పుచున్నాడు. ఓ పార్థా! నా యందు చిత్తము నుంచియు, నన్నే యాశ్రయించియు కర్మ యోగము నాచరించుచు నీవు నన్ను యథాప్రకారముగ (విధిగను) పూర్ణముగను నిస్సంశయముగను సెట్లు తెలుసుకొందువో దానిని వినుము. ౧ విజ్ఞానముతో గూడుకొనిన యీ జ్ఞానమును నేమియు శేషము లేకుండునటుల నీకు నేను చెప్పుచున్నాను. దేనిని తెలిసికొనుటచే నీ లోకము నందు మరల జలిసికొనదగిన దేమియు నుండదో దానిని చెప్పుచున్నాను. ౨

సృష్టిప్రళయసంయుక్తమాచార్యైః పరిదర్శితం
యద్జ్ఞాత్వా పురుషో లోకే ప్రీతిం సౌఖ్యంచ విందతి ।
ఫల లాభంచ తస్య స్యాత్సర్వ భూత హితంచ తత్ ।
శాంతి ౧౯౪-౪

పురుషుడు సృష్టి ప్రళయ సహితమగు నట్టియు సదాచారముచే చూడదగి నట్టి దానిని దెలుసుకొని ప్రీతిని సుఖమును పొంది గలడని భీష్ముడు ధర్మజునకు జెప్పెను.

భగవంతమజం దివ్యం విష్ణుమవ్యక్త సంజ్ఞితం
భావేన యాంతి శుద్ధా యే జ్ఞాన తృప్తా నిరాశిషః
జ్ఞాత్వాత్మస్థం హరిం చైవ న నివర్తంతి తేవ్యయాః ॥
ప్రాప్య తత్పరమం స్థానం మోదంతే క్షర మవ్యయం
ఏతావదేతద్విజ్ఞాన మేతదస్తి నచాస్తిచ ॥
తృష్ణాబద్ధం జగత్సర్వం చక్రవత్పరి వర్తతే ॥
శాంతి. ౨౧౭-౩౩

జ్ఞాన తృప్తులు, త్యాజ్యాహారులు, భావ శుద్ధి గల వారలు అవ్యక్త సంజ్ఞ గల విష్ణుమూర్తిని యాత్మ యందున్న వానిగాదలంచి యుత్తమ స్థానమును బొందు చున్నారు. ఆశా బద్ధ మగునట్టియు చక్రము వలె తిరుగు నట్టి యీ జగత్తునందు ఇదియే విజ్ఞానము. ఇంతకన్న వేరు లేదు.

: మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే
: యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః ॥ ౩

వేల కొలది జనులలో నొకానొకండె సిద్ధిని సంపాదించుకొన వలయునని యత్నించును; ప్రయత్నించుచున్న వారిలో నైతము ఒకానొకనికే నా యొక్క సత్యమయిన జ్ఞానము కలుగును. ౩

మానవానాం సహస్రేషు తేషు వై శుద్ధ యోనిషు
అస్మాన్నకశ్చిన్మనసా చక్షుషావాప్య పూజయత్
తేపి స్వస్థా మునిగణా ఏక భావమనువ్రతాః ॥ ౫౦
శాంతి. ౩౩౭-౪౯

పరిశుద్ధమగు జన్మ గల వేలకొలది మనుజులలో మనుష్యుల నొకరైనను మనస్సు చేత గాని దృష్టిచే గాని మన్నించినవారు కారు. ఆమునులు స్వస్థ చిత్తులై ఏక భావమును పొంది యున్నారు అని తపంబొనర్చిన ఋషులు ఆకాశ వాణితో జెప్పుకొనిరి.

ఋషుల కైనను దర్శన మివ్వని చంద్రవర్చస్సు గలమానవులు ఏకాంత భక్తి గలవారై శ్వేత ద్వీపమందు గలరు. మానవ కోటిలో కోటి కొకరని దలంచ వలయును.

ఏకో నర సహస్రేషు ధర్మవిద్విద్యతే నవా ॥

అరణ్య. ౨౧౫ - ౧౬

వేల కొలది మనుజులలో ధర్మమును గుర్తెరింగిన వాడు గలడో లేడో గాన నీవు దెలిసిన వాడవని వ్యాధునితో జెప్పెను.

సహస్రేషు నరః కశ్చి న్మోక్షబుద్ధిం సమాశ్రితః
దుర్లభత్వం చ మోక్షస్య విజ్ఞాయ శ్రుతి పూర్వకం ॥

పరాశరః శాంతి ౩౦౨- ౩౯

వేల కొలది మనుష్యులలో నొకానొకడె మోక్షము నందు బుద్ధి గలిగి యుండుటయు, మోక్షము శ్రుతుల చొప్పున దుర్లభ మనియు పరాశర గీత యందలి సాంఖ్య విచారమున గలదు.

ధర్మమును మోక్షమును భగవంతుని దెలుసు కొనుటకు వేల కొలది మనుజులలో నొక్కడుండు నని భారతాభిప్రాయము.

భూమి రాపో నలో వాయుః ఖం మనో బుద్ధి రేవ చ
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి రష్టధా ॥ ౪
అపరే య మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్ ॥ ౫
ఏత ద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా ॥ ౬

మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ ॥ ౭

నాయొక్క ప్రకృతియే - పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, (ఈ యైదు సూక్ష్మ భూతములు) మనస్సును, బుద్ధియు, అహంకారమును అని ఎనిమిది విధములుగ విభజింపబడినది. ౪ ఇది 'అపరా, (అనగా: నికృష్టమగు) ప్రకృతి. ఓ మహాబాహూ! యర్జునా! ఇదిగాక దేనిచే నీ జగత్తు ధరింప బడుచున్నదో యట్టి 'పరా, (అనగా: శ్రేష్ఠమైనది) శ్రేణి లోనిదయిన జీవ స్వరూపము నా రెండవ ప్రకృతి యని యెఱుంగుము. ౫ ఈ రెంటి నుండియు సర్వభూతములు నుత్పన్నము లగుచున్న వని యెఱుంగుము. నేనే జగత్తున కంతను ప్రభువును (అనగా: మూల భూతుడను) ప్రళయము (అనగా: చివర) నయి యున్నాను. ౬ ఓ ధనంజయా! నాకంటె పరము నందేమియు లేదు. దారమునం దనేక మణులు గ్రుచ్చబడినటుల నాయందివి యన్నియు గూర్చబడి యున్నవి. ౭

అష్టాభ్యః ప్రకృతిభ్య శ్చ జాతం విశ్వ మిదం జగత్ ॥
పృథివీ వాయు రాకాశ మాపో జ్యోతి శ్చ పంచమం
యత స్సృష్టాని తత్రైవ తాని యాంతి పునః పునః ॥
మహాభూతాని భూతేభ్య స్సాగరస్యోర్మయో యథా
ప్రసార్య చ యథాంగాని కూర్మ స్సంహరతే పునః॥
తద్వ ద్భూతాని భూతాత్మా సృష్టాని హరతే పునః
మహాభూతాని పంచైవ సర్వభూతేషు భూతకృత్ ॥
అకరో త్తేషు వైషమ్యం తత్తు జీవో న పశ్యతి ॥

శాంతి - ౧౯౪ - ౫

సర్వ భూత సృష్టికి పంచ భూతములు కారణములు. సాగర మందలి తరంగములు సాగరమున నమసి నట్లు దేని వలన

జనించిన పంచ భూతములు దాని యందే లయమును పొందును. భూత ముల యందలి విషయ భావమును జీవుడు గన జాలడు ఐదు పంచ భూత ములు, ఆరవది మనస్సు, ఏడవది బుద్ధియు, ఎనిమిదవ వాడు క్షేత్రజ్ఞుడు. ఇంద్రియము లాలోచన కొఱకు. సంశయాత్మకము మనస్సు. బుద్ధి పర్యవసానము దేల్చునవి క్షేత్రజ్ఞుడు సాక్షి రూపకముగా నుండును. పురుషుడు ఇంద్రియ స్వభావముల దెలుసుకొని "ఇంద్రియాణి చ సర్వాణి విజేతవ్యాని భారత" భారతా! సర్వేంద్రియములను జయించవలయును. సూత్రము నందు మణులు గూర్చబడి నట్లు ఇంద్రియము లన్నియు పురుషుని యందు గూర్చబడినవి. "పురుషే తిష్ఠతీ బుద్ధి స్త్రిషు భావేషు వర్తతే" పురుషుని యందున్న బుద్ధీంద్రియము మూడు భావముల యందు అనగా:-

సత్వం రజ స్తమ శ్చైవ ప్రాణినాం సంశ్రితా స్సదా
త్రివిధా వేదనా చైవ సర్వ సత్వేషు దృశ్యతే॥

సత్వ రజ స్తమో గుణములు ప్రాణి మాత్రుల నాశ్రయించి యుండును. ఈ మూడు విధము లగు వేదనలు సర్వ జంతువుల యందును కన బడు చుండును.

సృజతే తు గుణా నేక ఏకో న సృజతే గుణాన్
మశకో దుంబరౌ వా పి సంప్రయుక్తౌ యథా సదా॥

గుణ కారణ డొక్కడే యైనను గుణము లను సృజియించడు. మశకము, మేడిపండును ఏ ప్రకారముగ కలసి యెల్లపుడు నుండునో యటులనే "సృజతే హి గుణాన్ సత్వం క్షేత్రజ్ఞః పరి పశ్యతి" సత్వము గుణములను బుట్టించును. క్షేత్రజ్ఞుడు జూచుచుండును. మఱియు, స్థావర జంగమాత్మకమయిన యీ జగ మంతయు నా యాత్మ రూపము ననే యున్నది. ప్రళయ కాలమందును నా యాత్మనే శేష చున్నది.

ముఖ్యముగ నీ యధ్యాయమున బుద్ధిని దెలిసి మనుష్యులగు వారు తమ్ముఁ గృతకృత్యులనుగా దలంచుకొనుచున్నారు.

రసోఽహ మప్సు కౌంతేయ ప్రభాస్మి శశిసూర్యయోః
ప్రణవ స్సర్వ వేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు ॥ ౮
పుణ్యో గంధః పృథివ్యాం చ తేజ శ్చాస్మి విభావసౌ
జీవనం సర్వ భూతేషు తప శ్చాస్మి తపస్విషు ॥ ౯
బీజం మాం సర్వ భూతానాం విద్ధి పార్థ సనాతనం
బుద్ధి ర్బుద్ధిమతా మస్మి తేజ స్తేజస్వినా మహం ॥ ౧౦
బలం బలవతా మస్మి కామ రాగ వివర్జితం
ధర్మా విరుద్ధో భూతేషు కామో స్మి భరతర్షభ ॥ ౧౧

ఓ కౌంతేయా ! జలములో రసము నేను. చంద్రసూర్యుల
లోని కాంతిని నేను. ప్రణవము ( అనగా : ఓంకారము )
నేను. ఆకాశము నందలి శబ్దము నేను. అందఱిలో నున్న పౌరు
షమును నేనే యయి యున్నాను. ౮ పృథివి యందున్న
పుణ్య గంధము ( అనగా: సువాసన ) ను నేను. అగ్ని యం
దున్న తేజస్సు నేను. సర్వ భూతముల యందున్న జీవన
శక్తియును, తపస్సు జేయు వారి యొక్క తపస్సును నేనే. ౯
ఓ పార్థా! సర్వ భూతములకు సనాతన మగు బీజమును, నేనే
యని తెలిసికొనుము. బుద్ధిమంతుల యొక్క బుద్ధిని నేను.
తేజశ్శాలుర యొక్క తేజస్సు సైతము నేనే. ౧౦ కామ
మును ( వాసన ) రాగము ( అనగా: విషయాసక్తి ) గాక బల
వంతులలో బలమును నే నయి యున్నాను. మఱియు నో భరత
శ్రేష్ఠా ! ధర్మమునకు విరుద్ధము గాని భూతముల యందున్న
కామమును నేనే యయి యున్నాను. ౧౧

యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసా శ్చ యే
మత్త ఏవేతి తాన్విద్ధి న త్వహం తేషు తే మయి ॥ ౧౨

: త్రిభి ర్గుణమయై ర్భావై రేభి స్సర్వ మిదం జగత్
మోహితం నా భిజానాతి మా మేభ్యః పర మవ్యయం ॥ ౧౩
: దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా
: మా మేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే॥౧౪

మఱియు సాత్వికములును, రాజసములును, తామసములు నగు భావములు (పదార్థములు) అన్నియు నా వలన బయలు వెడలిన వనియు దెలిసి కొనుము. కాని యవి నా యందున్నవి నేను వాని యందు లేను. ౧౨ (సత్వమును, రజస్సును, తమస్సు నను నీ) త్రిగుణా త్మకములగు పదార్థములచే మోహిత మయిన యీ జగత్తంతయు, దీనికంటె పరముగ నున్నవాడును నవ్యయుడ (నిర్గుణమగు) నగు వాడును నగు నన్ను తెలిసి కొన లేదు. ౧౩ గుణాత్మకమును, దివ్యము నగు నా మాయ దుస్తరమైనది. కాని నన్నే శరణుజెందువారీ మాయను తరింతురు.

తస్య తేజోమయ స్సూర్యో మన శ్చంద్రమసి స్థితః
బుద్ధి ర్జ్ఞానగతా నిత్యం రస స్త్వప్సు ప్రతిష్ఠితః
ఏకస్య విద్ధి దేవస్య సర్వం జగ దిదం వశే ॥
శాంతి వృత గీత- ౨౮౦-౨౩

ఆతని తేజస్సు సూర్యుడు. ఆతని మనస్సు చంద్రుడు. మహత్తత్వ మప్పుడును వృత్తిజ్ఞానము. జలము రసనేంద్రియము. రజస్సత్వ తమో గుణములు నారాయణమయములు. ఈ జగ మంతయు నొక దేవుని వశ మందున్నదని, వృత్ర గీత యందు వృత్రాసురునికి సనత్కుమారుడు బోధించెను. ఈ యధ్యా యము భగవన్మయము. అన్నిటి యందలి సార భూతమును నేనని దలంచుము. రజస్సత్వ తామ సాది గుణంబులు నావల ననే గలుగు చున్నవి. "సాత్వికీ రాజసీ చైవ సర్వ సత్వేషు దృశ్యతే" సుఖ స్వరూపగల సత్వము దుఃఖ స్వరూపగల రజో

గుణము ఈ రెండును తేను స్సంబంధ మగు వ్యవహారము నను సంబంధించిన వగును.

బీజ ధర్మిం తథా వ్యక్తం ప్రసవాత్మక మేవ చ
బీజధర్మా మహా నాత్మా ప్రసవ శ్చేతి న శ్శ్రుతం ॥
బీజధర్మ స్త్వహంకారః ప్రసవ శ్చ పునః పునః
బీజ ప్రసవ ధర్మాణి మహాభూతాని పంచ వై ॥
బీజధర్మిణ ఇత్యాహుః ప్రసవం చ ప్రవర్తతే ॥ అశ్వ ౫౦

అవ్యక్తము, మహత్తు, అహంకారము, పంచ మహా భూతములు, ఇవి యన్నియు సృష్టికి ప్రధానము లనియు, వీటినే బీజ రూపము లనియు, అట్టి బీజ రూపమునే నేనని భగవంతుడు జెప్పెను.

అశరీర శ్శరీరేషు సర్వేషు నివస త్యసౌ
వస న్నపి శరీరేషు న స లిప్యతి కర్మభిః ॥ శా. ౩౫౦-౩

అతడు శరీరము లేనివాడై సకల శరీరము లందు వసించును. శరీరములందు వసించువాడై నను కర్మలతో సంబంధము నొందడు.

న స శక్య స్త్వయా ద్రష్టుం మయా న్యైర్వాపి సత్తమ
సగుణై ర్నిర్గుణై ర్విశ్వో జ్ఞాన దృశ్యో హ్యసౌ స్మృతః ”

అతనిని దర్శించుట నీవు గాని, నేను గాని, మఱియు, ఇతరులు గాని శక్యము గాదు. సగుణులను గాని, నిర్గుణులను గాని, యా విశ్వాత్ముని జూచుట జ్ఞానమొక్కటి చేతనే శక్యమగును.

క్షేత్రాణి హి శరీరాణి బీజం చాపి శుభాశుభం
తాని వేత్తి స యోగాత్మా తతః క్షేత్రజ్ఞ ఉచ్యతే ”

శరీరములును శుభాశుభములైన వాని వాసనలును క్షేత్రములు. వానిని యోగ రూపుండగు నతం డెఱుంగును. దాని వలన నతడు క్షేత్రజ్ఞుడన బడుచున్నాడు

కాలచక్రం జగచ్చక్రం యుగచక్రం చ కేశవః
ఆత్మయోగేన భగవా న్పరివర్తయతే ఖిలం ॥
కాలస్య హి చ మృత్యోశ్చ జంగమస్థావరస్య చ
ఈశతే భగవా నేక స్సత్య మేత ద్బ్రవీమి తే ॥
ఈశ న్నపి మహాయోగీ సర్వస్య జగతో హరిః
కర్మాణా రభతే కర్తుం కీనాశ ఇవ వర్ధనః ॥
తేన వంచయతే లోకా న్మాయాయోగేన కేశవః
యే త మేవ ప్రపద్యంతే తేన ముహ్యంతి మానవాః ॥
ఉద్యోగ- యానసంధిపర్వణి- సంజయః   ౬౭- ౧౩

నన్ను పొందినవారు మాయను తరింతురని గలదు. యానసంధి పర్వమున సంజయుడు ధృతరాష్ట్రుని కిట్లు జెప్పెను. రాజా! ఆయనను పొందిన మానవులు మోహజాలమున బడ నేరరు.

ఏతే ప్రధానస్య గుణా స్త్రయః పురుషసత్తమ
కృత్స్నస్య చైవ జగత స్తిష్ఠంత్య నపగా ఇవ ॥
శాంతి యాజ్ఞవల్క్యః-   ౩౧౫ - ౧

సత్వ రజ స్తమస్సు లనెడి యీ మూడును ప్రధానము యొక్క (ప్రకృతి) గుణములు. ఇవి జగము నందంతటను నెడ తెగక సంబంధించియే యుందును. ఈ యధ్యాయము ముఖ్యముగా జూడదగినది.

న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః
మాయయా పహృతజ్ఞానా ఆసురం భావ మాశ్రితాః ॥ ౧౫

మాయచే నశించిన జ్ఞానము గల వారును, మూఢులును, దుష్కర్ములును నగు నరాధము లాసుర బుద్ధికి లోబడి నందున నన్ను శరణు జెందరు. ౧౫

వయం త్వేనం న పశ్యామో మోహితా స్తస్య మాయయా ॥
ఏకతాదిఋషయః శాంతి- ౩౩౮

ఏకతాది ఋషులు భగవంతుని జూచుటకు తపంబుల నాచ రించియు, జూడ లేకపోయిరి. ఈ ఋషులు జిజ్ఞాసు లగుటచే ఏకాంతిక భక్తులలో జేర లేక పోయిరి

మాయా హ్యేషా మయా సృష్టా యన్మాం పశ్యసి నారద
సర్వభూతగుణై ర్యుక్తం నైవ త్వం జ్ఞాతు మర్హసి॥

శాంతి- భగవాన్ ౩౪౦- ౪౫

నారదా! దేనివలన జూచుచున్నావో అట్టి మాయ నాచే సృష్టింపబడినది. నీవు సర్వ భూత గుణ యుక్తడవు. గావున నన్ను దెలుసు కొనుటకు అర్హుడవు గావు. అని వియద్వాణి రూపకముగా భగవంతుడు జెప్పెను.

ఘోషయాత్రయందు గంధర్వులచే భంగపడి దుర్యోధనుడు ప్రాయోపవేశము బొందినపుడు పాతాళ వాసులగు దైత్యులతనిం గొంపోయి యిట్లు జెప్పిరి. "త్వ మస్మాకం గతి ర్నిత్యం దేవ తానాం చ పాండవాః" నీవలన భారత యుద్ధము జరుగనున్నది. నీవు మా రాక్షస కోటిలో జేరిన వాడవు నిన్ను బురస్కరించు కొని యుద్ధము జేయ దలచి నారము. రాక్షసుల మగు మాకు నీవే గతి. దేవతలకు పాండవులు గతి. సంశప్తకులు భీష్మద్రోణా దులు పాండవుల యందలి స్నేహభావము వదలి రాక్షసావిష్టు లయి యుద్ధమును జేయుదురు. కావున ధైర్య మవలంబించి యుం డుమని జెప్పి దుర్యోధనుని హస్తినాపురమున కంపి వేసిరి.

అసుర భావమును పొందిన వారు భగవంతుని గన జాలరు. దేవ భావము గల వారు గావుననే పాండవులు భగవదనుగ్రహ మునకు పాత్రులైరి.

చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతినో ర్జున
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ॥ ౧౬
తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే

ప్రియో వా జ్ఞానినో త్యర్థ మహం స చ మమ ప్రియః ॥ ౧౭
ఉదారా స్సర్వ ఏవై తే జ్ఞానీ త్వాత్మైవ మే మతం
ఆస్థిత స్స హి యుక్తాత్మా మా మే వా నుత్తమాం గతిం॥౧౮

ఓ భరత శ్రేష్ఠుడ వగు నర్జునుడా! ఆర్తులు (రోగపీడితులు) జిజ్ఞాసులు (జ్ఞానమును తెలిసి కొనవలయు నని కోరిక గలవారు) అర్థార్థులు (ద్రవ్యము మొదలగు వానిని గోరు వారును) నన్ను సేవింతురు మఱియు జ్ఞాని పరమేశ్వరుని తెలిసికొని కృతార్థు డగుటచే నేమియు సంపాదించుకొన నవసరము లేక పోయి నను, నిష్కామ బుద్ధితో నన్ను భజించును. ౧౬ నిత్యము నిలో ననన్యభావ మున నన్ను భజించువాడును, ఎల్లప్పుడును నిష్కామ బుద్ధితో వ్యవహరించు వాడును నగు జ్ఞాని గొప్పవాడు; జ్ఞానికి నేను మి క్కిలి ప్రియుఁడను. జ్ఞాని నా కత్యంత మును ప్రియుఁడు. ౧౭ ఈ భక్తులెల్లరును మంచివారలు; కాని వారెల్లరలోను జ్ఞానియన ' నేనే, యని నా మతము. కారణమేమన: యుక్త చిత్తుడగుచు నందఱను నుత్తమోత్తమ గతి యగు నాయందె వాడు స్థిరుడై యుండును. ౧౮

చతుర్విధా మమ జనా భక్తా ఏవ హి మే శ్రుతం
తేషా మేకాంతిన శ్శ్రేష్ఠా యే చైవా నన్యదేవతాః ॥
అహ మేవ గతి స్తేషాం నిరాశీః కర్మకారిణాం
యే చ శిష్టా స్త్రయో భక్తా ఫల కామా హి తే మతాః ॥
సర్వే చ్యవనధర్మా స్తే ప్రతిబుద్ధ స్తు శ్రేష్ఠభాక్ ॥
శాంతి - ౩౪౧ - ౩

జనులు నన్ను నాలుగు విధములుగా భక్తిని జేయుదురు. అట్టి భక్తులలో నేకాంతికులు భక్తశ్రేష్ఠులు. ఇతర దేవతోపాసన లేకుండా నన్నుపాసించువారలకు నేనే గతి యగుదును. మిగి లిన మూడు విధములగు భక్తిని జేయువారలు ఫలాపేక్ష గలవారు

గావున సంసారచక్రమున దిరుగుదురు. మూడు విధములగు భక్తి పరాయణులగు వారు పతన ధర్మము గలవారు. నన్ను దెలిసిన వాడు శ్రేష్ఠుడనబడును. భగవంతునియందు దప్ప నితరధ్యానము లేనివారే ఏకాంతిక భక్తులన బడుదురు.

యూయం జిజ్ఞాసవో భక్తాః కథం ద్రక్ష్యథ మాం ప్రభుం"
ఏకతాది ఋషులు తపంబాచరించిన నీ యశరీర వాక్యము వినబడెను. ఓ బ్రాహ్మణులారా! ప్రసన్నమగు మనస్సులచే తపంబాచరించితిరి. భక్తులారా! మీరే విభుని దర్శింప గోరుచున్నారో, ఆ ప్రభువును జిజ్ఞాసువులు గాన మీరెట్లు జూడగలుగుదురు? అని యనుటచే జ్ఞానులకు దప్ప తదితర ముప్వురు భక్తులును, అలవిగాని వాడు.

బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే
వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః ॥ ౧౯

అనేక జన్మము లెత్తిన పిదప "సర్వమును వాసుదేవుడే" యని యను భవము లోనికి దెచ్చుకొని జ్ఞానవంతుడు నన్ను బొందుచున్నాడు. అట్టి మహాత్ముడు మిక్కిలి దుర్లభుడగును. ౧౯

సర్వ భూతాత్మ భూతో హి వాసుదేవో మహాబలః
పృథివీ వాయు రాకాశ మాపో జ్యోతి శ్చ పంచమం
తే సమేతా మహాత్మాన శ్శరీర మితి సంజ్ఞితం ॥

సర్వ భూతాంతర్యామి యగు వాసుదేవునకు పంచ భూతములు గలసి శరీర మైనది. శాంతి- ౩౪౦-౨౩

ఛాదయామి జగ ద్విశ్వం భూత్వా సూర్య ఇవాం శుభిః
సర్వ భూతా ధివాస శ్చ వాసుదేవ స్తతో హ్యహం।

నేను సూర్యుని వలె జగత్తును వ్యాపించి సర్వ భూతములకు నివాసభూతుడగుటచే వాసుదేవుడనైతిని. శా. ౩౪౩- ౪౧

స్వవంశ విస్తరకరం జనయిష్యతి మానసః

వసుదేవ ఇతి ఖ్యాతం పుత్రమానక దుందుభిం॥
తస్య పుత్రశ్చతుర్బాహుర్వాసుదేవో భవిష్యతి॥
దాతా బ్రాహ్మణ సత్కర్తా బ్రహ్మభూతో ద్విజప్రియః॥

సర్వగుణ సంపన్నుడు వంశోద్ధారకుడు బ్రాహ్మణ సత్కారము గావించు వాడు బ్రహ్మభూతుడు చతుర్బాహుడు నగు వాసుదేవుడు యదువంశమున జన్మించును. అను॥ ౧౪౬

ప్రవిశంతి ద్విజశ్రేష్ఠాః క్షేత్రజ్ఞం నిర్గుణాత్మకం
సర్వావాసం వాసుదేవం క్షేత్రజ్ఞం విద్ధి తత్వతః॥
సమాహిత మనస్కాశ్చ నియతాస్సంయతేంద్రియాః
ఏకాంత భావోపగతా వాసుదేవం విశంతితే॥

ద్విజశ్రేష్ఠులు క్షేత్రజ్ఞుడును గుణరహితుడును సర్వమునకు స్థానభూతుడును నగు వాసుదేవుని పొందుదురు. మఱియు నియమించ బడిన మనస్సు ఇంద్రియములు గలవారును ఏకాంతమును పొందినవారై వాసుదేవుని ప్రవేశింతురు. శాం। ౩౪౫-౧౫

యం ప్రవిశ్య భవంతీహ ముక్తా వై ద్విజసత్తమాః
సవాసుదేవో విజ్ఞేయః పరమాత్మా సనాతనః॥

ఏవరిని పొందిన ముక్తులగుదురో యట్టి మహాను భావుడగు వాసుదేవు నెఱుగ దగును. అంతవరక నేక జన్మల పొందుచునే యుండును గీత ౭-౨౦ శ్లో వ్యాఖ్యానమున జూడుడు.

కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతే న్యదేవతాః
తం తం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతాస్స్వయా॥ ౨౦
యోయో యాం యాం తనుం భక్తశ్శ్రద్ధయా ర్చితు మిచ్ఛతి
తస్య తస్యాచలాం శ్రద్ధాం తమేవ విదధామ్యహం॥ ౨౧

తమ తమ ప్రకృతి నియమానుసారముగ నాయా (స్వర్గాది ఫలముల యందలి) వేర్వేఱు కోరికల నందిన లోకులా యా యు

వాసనల యొక్క కోరికల ననుసరించుచు నితర (వేర్వేఱు) దేవతలను భజించు చున్నారు. ౨౦ ఏ యే భక్తులే యే రూపమును (అనగా: దేవతలను) శ్రద్ధతో నుపాసింప నిచ్ఛయించుచున్నారో వారివారి కా శ్రద్ధనే నేను స్థిరపరచుచున్నాను. ౨౧

స తయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధన మీహతే
లభతే చ తతః కామా న్మయైవ విహితాన్ హితాన్॥ ౨౨
అంతవత్తు ఫలం తేషాం తద్భవ త్యల్ప మేధసాం
దేవా న్దేవయజో యాంతి మద్భక్తా యాంతి మా మపి॥ ౨౩

కాన, నా శ్రద్ధతో యుక్తుడై వాడా దేవత యొక్క యారాధనమును చేయుట కారంభించును; కానీ నాచే నిర్మింపబడిన యా కామ ఫలమును మాత్రమే యాతడు సంపాదించుకొనుచున్నాడు. ౨౨ కాని, యీ యత్యల్ప బుద్ధి గల వారికి కలిగెడు ఫలములు నశ్వరము లయి యున్నవి. (మోక్షము వలె స్థిరములుగ నుండునవి కావు.) దేవతలను భజించు వారు దేవతల నొందుచున్నారు. నా భక్తులు నన్ను బొందుచున్నారు.

బ్రహ్మాణం శితికంఠం చ యా శ్చాన్యా దేవతాః స్మృతాః
ప్రబుద్ధ చర్యాః సేవంతో మా మేవై ష్యంతి యత్పరం॥

బ్రహ్మాది దేవతలలో నెవరిని సేవించినను నన్నే పొందుదురని భగవంతుడు జెప్పెను. శాంతి ౩౪౬ - ౩౬

యాం యా మిచ్ఛే త్తనుం దేవః కర్తుం కార్య విధౌ క్వచిత్
తాం తాం కుర్యా ద్వికుర్వాణ స్స్వయ మాత్మాన మాత్మనా॥

దేవుడొక కార్యము జేయుకొఱకు నే యే శరీరముల నెత్తగోరునో యాయా శరీరములను దాను తన్నే తనచేతనే వేఱుపఱచుకొని కయికొను చున్నాడు. శ్రీమంతుడతడు వేదముల వనికి పట్టని సూక్ష్ముడు శౌనకాది మహర్షులకు జెప్పెను.

అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యంతే మా మబుద్ధయః
పరం భావ మజానంతో మమా వ్యయ మను త్తమం॥ ౨౪
నా హం ప్రకాశ స్సర్వస్య యోగమా యాస మావృతః
మూ ఢో యం నా భిజానాతి లోకో మా మ జ మవ్యయం॥ ౨౫

బుద్ధిహీనులు నాయొక్క శ్రేష్ఠము, నుత్తమోత్తమము నవ్యయము నగు రూపమును తెలిసికొన లేక యవ్యక్తుడ నైన నన్ను వ్యక్తుడ నను కొను చున్నారు. ౨౪ నేను నా యోగ రూపక మగు మాయచే నాచ్ఛాదితుడ నగుటచే నెల్లవారికిని స్వస్వ రూపముతో గనప్పట్టను. నే నజుడను, నవ్యయుడ నని మూఢు లు తెలిసి కొనలేరు. ౨౫

అనాద్యన్త మనూనం వా ప్యకంపమచలం ధ్రువం
సదస చ్చైవ తత్సర్వ మవ్యక్తం త్రిగుణం స్మృతం॥
జ్ఞేయాని నామ ధేయాని నరై రాధ్యాత్మ చింతకైః॥
అవ్యక్త నామాని గుణాం శ్చ తత్వతో
యో వేద సర్వాణి గతీ శ్చ కేవలాః
విముక్త దేహః ప్రవిభాగ తత్వవి
త్స ముచ్యతే సర్వ గుణై ర్నిరామయః॥ అశ్వ. ౩౯-౨౪

త్రిగుణాత్మకమగు నవ్యక్తము అనాద్యన్త మనూనాది సప్త నామంబులచే బరగు చున్నది. అధ్యాత్మ చింతకులు నైనామ ములు తెలుసుకొన దగుదురు. అవ్యక్త మున కున్న నామములు గుణములు తెలియుటచే సర్వ గుణములచే విడువబడి ముక్తుడగును

విష్ణు రేవా ది సర్గేషు స్వయంభూ ర్భవతి ప్రభుః॥
అశ్వ ౪౦- ౧౨. ఆది సృష్టియందు విష్ణువే కర్తయగును.
ఏవం యో వేద గుహాశయం ప్రభుం
పరం పురాణం పురుషం విశ్వరూపం .

హిరణ్మయం బుద్ధిమతాం పరాం గతిం
స బుద్ధిమాన్ బుద్ధిమతీత్య తిష్ఠతి॥

ఈ ప్రకారముగా సుహితయుడగు పురాణపురుషుడు గలడు. ఇట్టి పురుషుని గనగొనన్న వారు బుద్ధిమంతులై బుద్ధి నతిక్రమించి యుండ గలరు.

అవ్యక్తరూపో భగవాం చ్ఛతధా చ సహస్రధా
శతధా సహస్రధా చైవ తథా శత సహస్రధా॥
కోటిశశ్చ కరోత్యేష ప్రత్యగాత్మాన మాత్మనా॥
శాంతి. ౩౧౫ - ౧.

అవ్యక్త రూపుం డగు భగవంతుడు తనంతటనే తా నీ మూడు గుణముల నవలంబించి వేలు బది వేలు గోటాన గోట్ల రూపములుగా బరిణమించు చున్నాడు.

ఋషయః పితరో దేవా మహాభూతాని ధాతవః
జంగమా జంగమం చైవ జగ న్నారాయణోద్భవం॥
యోగ జ్ఞానం తథా సాంఖ్యం విద్యా శ్శిల్పాది కర్మ చ
వేదా శ్శాస్త్రాణి విజ్ఞాన మేత త్సర్వం జనార్దనాత్॥

ఋషులు మొదలుకొని సర్వము జనార్దనుని వలన వ్యక్తమగుచున్నది. అనుశాసన. ౧౪౯ - ౧౩౭.

వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన॥ ౨౬

భూత భవిష్యద్వర్తమాన కాలముల యందుత్పన్నములైన సర్వ ప్రాణులను నే నెఱుగుదును. కాని యో యర్జునా నన్నెవరును తెలుసుకొనె లేరు.

ధన్యో స్యనుగృహీతో సి యత్తే దృష్ట స్స్వయం ప్రభుః
న హి తం దృష్టవా న్కశ్చి త్పద్మయోని రపి స్వయం॥

అవ్యక్తయోని ర్భగవాన్ దుర్దర్శః పురుషోత్తమః
నారదైతద్ధి నా సత్యం వచనం సముదాహృతమ్ ॥

నర నారాయణావూచతుః- శాంతి. ౩౪౭- ౧.

నారదా! నీవు ధన్యుడవు. నీ వనుగ్రహించ బడినవాడవు. నీవే కారణమువలన ప్రభువును జూచి కృతార్థుడ వైతివి.

బ్రహ్మచే నయినను చూడశక్యముగాని పురుషోత్తముని జూచితివని మేము బలికిన వచనము సత్యమని నర నారాయణులనిరి.

నాస్య భక్తాత్ప్రియతరో లోకే కశ్చన విద్యతే
తత స్స్వయం దర్శితవా న్స్వ మాత్మానం ద్విజోత్తమ ॥

నారదా! పురుషోత్తమునికి భక్తుని కన్న ప్రియ మగునది లేదు. గావున, నీవు స్వయముగా, స్వంతమగు నీ యాత్మను జూచితివి. అన్నియు, ( అనగా: భూత భవిష్య ద్వర్తమానముల నన్నింటిని ) నే నెఱుంగుదును. నన్నెవరు నెఱుంగరు.

భగవంతుడు జెప్పినటుల నాత్మను నారదుడు జూచినట్లు గలదు. గాన భగవంతుడు భక్తపరాధీనుడని యెఱుంగవలయును.

ఇచ్ఛా ద్వేష సముత్థేన ద్వంద్వ మోహేన భారత
సర్వ భూతాని సమ్మోహం సర్గే యాంతి పరంతప ॥ ౨౭

కారణమేమన నో భారతా యో పరంతపా యింద్రియముల యొక్క యిచ్ఛా ద్వేషముల వలన గల్గు ( సుఖ దుఃఖాది ) ద్వంద్వముల మోహముచే నీ సృష్టి యందలి సర్వ భూతములును భ్రమ జెందు చున్నవి.

యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్య కర్మణాం
తే ద్వంద్వమోహ నిర్ముక్తా భజంతే మాం దృఢ వ్రతాః ॥ ౨౮

కాని పాపములన్నియు నశించుటచే పుణ్యాత్ములగువారు ద్వంద్వముల యొక్క మోహము నుండి ముక్తులయి దృఢవ్రతులుగ నన్ను భజించు చున్నారు.

తపో హి తప్యత స్తస్య యత్స్థానం పరమాత్మనః ।
నతత్సంప్రాప్నుతే కశ్చి దృతేహ్యావాం ద్విజోత్తమ ॥ ౩౮॥శాం

తపోయుక్తుడగు పరమాత్మ స్థానము నరనారాయణుల మగు మేముదప్ప నితరులు జూడ జాలరు.

"యాహిసూర్య సహస్రస్యసమస్తస్య భవేద్ద్యుతిః". సహస్రసూర్యులతో సమానంబగుపరమాత్మ యొక్క స్థానము నుండి పంచభూతములు, సర్వ భూతములను బొందిన మనస్సు ఈ మొదలగునవి,

సర్వభూతోత్పాదకం నామ తత్స్థానం వేదసంజ్ఞకం,
విద్యా సహాయో యత్రాస్తే భగవాన్ హవ్య కవ్య భుక్ ॥

సర్వ భూతో త్పాదక మగు స్థానము దేవస్థానమనియును అచ్చట నాత్మ స్వరూపుడు విద్యా సహాయుడై హవ్య కవ్య భోక్తయగు భగవంతు డుండగలడు. ఇట్టి భగవంతుని " యే హి నిష్కలుషా లోకే పుణ్య పాప వివర్జితాః " ఎవరు నిష్కల్మషులు పుణ్య పాప వర్జితు లగు వారో, వారు సూర్య నిచే దగ్ధము జేయబడి పరమాణు రూపులై ఆ దేవుని పొంది యచ్చటి నుండి విముక్తులై ప్రద్యుమ్నునిబొంది ప్రద్యుమ్ను నుండి విముక్తులై జీవ భూతుడగు సంకర్షణుని పొంది సాంఖ్యు లగు వారు భగవద్భక్తులతో గూడ " తత త్రైగుణ్య హీనా స్తే పరమాత్మాన మంజసా " త్రిగుణ రహితమగు పరమాత్మనే పొందుదురు. అట్టి పరమాత్ముడే వాసు దేవుడని నిశ్చయింప బడినది.

జరామరణ మోక్షాయ మామాశ్రిత్య యతంతియే,
తే బ్రహ్మ తద్విదుః కృత్స్న మధ్యాత్మం కర్మ చాఖిలమ్॥ ౨౯

సాధిభూతాధి దైవంమాం సాధియజ్ఞంచ యే విదుః,
ప్రయాణకాలే పిచ మాం తేవిదు ర్యుక్త చేతసః ॥ 30

(ఈరీతిగ) నన్నాశ్రయించి జరామరణములనుండి ముక్తులగుటకు ప్రయత్నించువారు ఆబ్రహ్మమును, అధ్యాత్మమును, సమస్త కర్మలను తెలిసికొనుచున్నారు. అధిభూతము, అధిదైవము, అధియజ్ఞము, అనునవి నైతము నేనె యైనట్లు తెలిసికొన్నవారు మరణకాలమునందు సైతము నన్ను తెలిసికొనుచున్నారు 30

న తు త్రస్యతి తత్త్వజ్ఞః ఫలే జాతే తరంత్యుత
ఏతం యే విదురధ్యాత్మం కైవల్యం జ్ఞానముత్తమం ॥
ఏతాం బుద్ధ్వా నరస్సర్వాం భూతానామాగతిం గతిం
అవేక్ష్య చ శనైర్బుద్ధ్వా లభతే శమనం తతః ॥

తత్త్వమును తెలిసినవాడు భయపడనేరడు. ఫలోత్పత్తి కాగానే తరించగలడు. కైవల్యజ్ఞానమను ఉత్తమమగు అధ్యాత్మమును కనుగొన్నవారు ధన్యులు. మనుజుడు సర్వభూతములయొక్క గమనాగమనముల తెలిసికొని చూచి నిమ్మళముగా తెలివిపడుచు, పిమ్మట శాంతిని పొందగలడు.

శ్రీమద్భారతీయుల ధర్మగ్రంథమగు
శ్రీమన్మహాభారతము నందలి మోక్షధర్మబోధక
మగు శ్రీమద్భగవద్గీత యందలి
జ్ఞానవిజ్ఞానయోగమను
సప్తమాధ్యాయము.



శ్రీమత్పరబ్రహ్మణే నమః

# శ్రీ కుమారగీత

## అక్షరపరబ్రహ్మయోగము.

### అష్టమోధ్యాయః.

---

అర్జున ఉవాచ.

కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ।
అధిభూతంచ కిం ప్రోక్త మధిదైవం కిముచ్యతే ॥ ౧
అధియజ్ఞః కథం కోత్ర దేహే స్మిన్ మధుసూదన।
ప్రయాణకాలే చ కథం జ్ఞేయో సి నియతాత్మభిః ॥ ౨

అర్జును డడుగు చున్నాడు - ఓ పురుషోత్తమా! ఆ బ్రహ్మ మనగ నేమి? కర్మ యన నేమి? దేని నధిభూత మన వలయును? దేని నధి దైవత మని చెప్పు చుందురు? ౧. ఓ మధుసూదనా! అధియజ్ఞ మెటు లుండునో, యీ దేహము నందది యేదియో? (అనగా: నధి దేహ మన నేమియో?) ఇంద్రియము లను నిగ్రహించు కొన్న వారందఱు అంత కాలమందు నిన్నెట్లు తెలిసికొన వలయునో చెప్పుము. ౨.

అర్జునుడు భగవంతుని యడిగి నట్లు భారతము నందు శుక డు, జనకుడు, ధర్మజుడు మొదలగు వ్యాస యాజ్ఞవల్క్య భీష్మాదుల నడిగి సమాధానము లను పొంది నట్లు గలదు.

శ్రీ భగవానువాచ.

అక్షరం బ్రహ్మ పరమం స్వభావో ధ్యాత్మ ముచ్యతే
భూత భావోద్భవ కరో విసర్గః కర్మ సంజ్ఞితః ॥ ౩

: అధిభూతం క్షరో భావః పురుష శ్చాధి దైవతం
: అధి యజ్ఞో హ మేవాత్ర దేహే దేహ భృతాం వర॥ ౪

శ్రీ భగవంతుడు చెప్పుచున్నాడు.- (అందటికంటెను) సత్కృష్టుఁడైన యే యక్షరుఁడు గలడో (అనగా: చెప్పుడును నాశనము నొందని తత్వము గలదో) యదియే బ్రహ్మము. ప్రతి వస్తువునకును నున్న మూలభావము (స్వ- భావము) నధ్యాత్మ మని చెప్పు చున్నారు. (అక్షర బ్రహ్మ నుండి) తన్మాత్రలు మొదలుగా గలిగిన (చరాచర) పదార్థముల నుత్పాదింపజేయు విసర్గము (అనగా: సృష్టివ్యాపారము) కర్మయని జెప్పబడును. ౩. (జనించినట్టి యధి భూత ముల యొక్కయు) క్షరమగు (అనగా: నామ రూపాత్మక మగు, లేక నశ్వరమగు) స్థితియే యధి భూతము; (ఈ పదార్థ ముల యందుండు) పురుషుడు (అనగా: సచేతన మగు నధిష్ఠాత) అధి దైవతము. శరీరధారు లలో శ్రేష్ఠుడవగు నో యర్జునా! అధి యజ్ఞము (అనగా: స కల యజ్ఞములకు నధిపతి యని చెప్పబడు వాడను) నేనే. ఈ దేహమునందు (అధి దేహ) నేనే యున్నాను. ౪

ఏకాదశ చ యాన్యాహు రింద్రియాణి విశేషతః
అహంకారా త్ప్రసూతాని తాని వక్ష్యామ్య హం ద్విజ॥
అతః పరం ప్రవక్ష్యామి సర్వాం వివిధ మింద్రియః॥
బ్రహ్మోవాచ- అశ్వ- ౪౨- ౧

అహంకారము వలన జనించిన ఏకాదశేంద్రియ వివరణము.
అధ్యాత్మ మధి భూతంచ అధి దైవంచ శ్రూయతాం॥
అశ్వ- ౪౨- ౧౨. బ్రహ్మోవాచ. యాజ్ఞవల్క్య

ఆధ్యాత్మ అధి భూత అధి దైవంబులను వినుము.

| అధ్యాత్మమ్ | అధి భూతమ్ | అధి దైవమ్ |
|---|---|---|
| పాదౌ | గంతవ్యమ్ | విష్ణుః |
| పాయు | విసర్గమ్ | మిత్రః |
| ఉపస్థమ్ | ఆనందమ్ (శుక్రమ్) | ప్రజాపతిః |
| హస్తౌ | కర్తవ్యమ్ | ఇంద్రః |
| వాక్ | వక్తవ్యమ్ | వహ్నిః |
| చక్షూ | రూపమ్ | సూర్యః |
| శ్రోత్రే | శబ్దః | దిశః |
| జిహ్వ | రసః | ఆపః |
| ఘ్రాణే | గంధః | పృథివీ |
| త్వక్ | స్పర్శః | పవనః |
| మనః | మంతవ్యం (సంకల్ప) | చంద్రమాః |
| అహంకారః | అభిమానమ్ | బుద్ధిః |
| బుద్ధిః | బోద్ధవ్యమ్ | క్షేత్రమ్ |

విష్ణు మేవా భిజానంతి సర్వ యజ్ఞేషు బ్రాహ్మణాః ॥
శాంతి- ౨౬౫- ౧౦. విచఖ్యుగీత.

బ్రాహ్మణులు సర్వ యజ్ఞముల యందును విష్ణువునుగా తెలుసు కొను చున్నారు.

అధి పౌరుష మధ్యాత్మ మధిభూతాధిదైవతం
అధిలోకాధి విజ్ఞాన మధియజ్ఞ స్త్వ మేవ హి ॥
త్వాం విదిత్వా త్మ దేహస్థం దుర్విదం దైవతై రపి
విద్వాంసో యాంతి నిర్ముక్తాః పరం భావ మనామయమ్ ॥

అనుశాసన- ౧౬- ౧౮. తండి ఋషి సదాశివుని గురించి యిట్లు స్తోత్రము జేసి యున్నాడు.

అధిపౌరుష అధ్యాత్మ అధిభూత అధిదైవతే అధిలోక

అధిః జ్ఞాన అధియజ్ఞాసులు నీవే ననియు, దేవతలచే కనుగొన శక్య ముగాని నిన్ను దేహమునందున్న వానినిగా దెలుసుకొని నిర్బాధకమగు స్థానమును బొందుచున్నారు. మఱియు, ఉపమన్యు స్తోత్రము నందు "క్రతూనాం విష్ణు రుచ్యతే" యనియు, "యజ్ఞో వై విష్ణుః" యని శ్రుతియు, సదాశివుని క్రతువులలో విష్ణువునుగా జెప్పినందున "అధియజ్ఞము" అను పదము విష్ణువును యజ్ఞముగా వర్ణించినది.

ఇంద్రియాణాం నిరోధేన సర్వేషాం విషయైషిణాం
మునే ర్జన పద త్యాగా దధ్యాత్మాగ్ని స్సమిధ్యతే॥
యథా గ్ని రింధనై రిద్ధో మహాజ్యోతిః ప్రకాశతే
తథేంద్రియ నిరోధేన మహా నాత్మా ప్రకాశతే।
యథా పశ్యతి భూతాని ప్రసన్నాత్మా త్మనో హృది
స్వయం జ్యోతి స్తదా సూక్ష్మా త్సూక్ష్మం ప్రాప్నో త్యను
త్తమం॥ అనుగీత ౪౬-౪౭

విషయ సుఖములను గోరనందరికింద్రియముల యొక్క నిరోధము చేతను, మునికి దేశ త్యాగము చేతను అధ్యాత్మమను నగ్ని ప్రజ్వరిల్లును. సమిధలతో ప్రజ్వరిల్లిన యగ్ని వలె నింద్రియ నిగ్రహముచే నాత్మ ప్రకాశించును. తన యొక్క హృదయము నందు భూతములను నిర్మల స్వభావము గలవాడై జూచిన యెడల స్వంతముగా జ్యోతి సూక్ష్మమున కన్నను సూక్ష్మమై యనుత్తమ మగు నది గ గలదు.

అంతకాలే చ మా మేవ స్మర న్ముక్త్వా కళేబరం
యః ప్రయాతి స మద్భావం యాతి నా స్త్యత్ర సంశయః॥ ౫
యం యం వాపి స్మర న్భావం త్యజ త్యంతే కళేబరం
తం త మే వైతి కౌంతేయ సదా తద్భావ భావితః॥

మఱియు నెవ డంత కాలము నందు నన్నే స్మరించుచు దేహమును వదలి వేయుచున్నాడో, వాడు నా స్వరూపము నొందుచున్నాడు. ఇందుకు సందేహము లేదు. ౫. లేదా! ఓ కౌంతేయా! ఎప్పుడును (అనగా: జన్మయంతయు) దానియందె యనురక్తుడగు నటుల అభ్యసించిన మనుజుడే యే భావమును స్మరించుచు తుదకు దేహమును వదలి వేయునో యా భావము నే పిమ్మట పొందును. ౬.

: తస్మాత్సర్వేషు కాలేషు మా మనుస్మర యుద్ధ్య చ
: మయ్యర్పిత మనో బుద్ధి ర్మా మే వైష్యస్య సంశయం ॥ ౭
...అభ్యాస యోగ యుక్తేన చేతసా నాన్యగామినా
: పరమం పురుషం దివ్యం యాతి పార్థా నుచింతయన్ ॥ ౮

కాన సర్వ కాలముల యందును నన్ను స్మరించుచుండుము. మఱియు యుద్ధము చేయుము. నాయందు మనస్సును బుద్ధిని సమర్పించితివేని (యుద్ధము చేసినను) నన్నే పొందుదువు. దీనియందు సంశయ మేమియు లేదు. ౭. ఓ పార్థా! చిత్తమును రెండవ వైపు నకు బోనియ్యక యభ్యాసము యొక్క-పాయముచే స్థిర పఱచి, దివ్యుడగు పరమ పురుషుని ధ్యానము చేయుచుందువేని యాతని నే బొందుదువు. ౮.

అనుశా- ౧౪౯- ౩౪. భీష్ముని నిర్యాణ సమయము నందు చెప్పిన వచనములు -

భగవన్. దేవ దేవేశ సురా సుర నమస్కృత
త్రివిక్రమ నమస్తే స్తు శంఖ చక్ర గదా ధర ।
వాసుదేవో హిరణ్యాత్మా పురుష స్సవితా విరాట్
జీవభూతో నరూప స్త్వం పరమాత్మా సనాతనః ॥
త్వత్సక్తం త్వద్గతస్వాంత మదార మపరిగ్రహం

త్రాయస్వ పుండరీకాక్ష పురుషోత్తమ నిత్యశః ॥
అనుజానీహి మాం కృష్ణ వైకుంఠ పురుషోత్తమ
త్వాం తు జానామ్యహం దేవం పురాణ మృషిసత్తమం ॥
నరేణ సహితం దేవం బదర్యాం సుచిరోషితం
స మాం త్వ మనుజానీహి కృష్ణ మోక్ష్యే కళేబరం ॥
త్వయాహం సమనుజ్ఞాతో గచ్ఛేయం పరమాం గతిం॥

కృష్ణా! నీవు విరాట్పురుషుడవు నీవు రూపవంతుడవు గావు జీవభూతుడవు నీ యందు దగులు కొన్నట్టియు నిన్ను పొందినట్టి దియు నగు యంతరాత్మగల నన్ను గాపాడుము. నిన్ను పురాణపురుషునిగా దెలియుదును. కృష్ణా! శరీరమును వదలుచున్నాను నీ యాజ్ఞను పొందిన వాడనయి యుత్తమ గతిని పొందగలను.

అంత కాలము నందు భగవంతుని ప్రార్థించి భగవంతుని పొందిన యంత రాత్మ గల వాడై కళేబరమును వదలి భీష్ముడుత్తమ గతిని బొందెను.

ఇది యంతకాలకృత్యమని భీష్ముని వలనఁ దెలియఁదగు.

అంతకాలమున నెట్టి స్మరణ గలుగునో యట్టి జన్మయే గలుగు ననుటకు నిదర్శనముగ నంబా వృత్తాంతమును జూడుడు

ఉద్యోగ- ౧౮౮- ౧౮ అంబావచనము-

చితాం కృత్వా మమహతీం ప్రదాయ చ హుతాశనం
ప్రదీప్తే గ్నౌ మహారాజ రోష దీప్తేన చేతసా ॥
ఉక్త్వా “ భీష్మ వధాయే ” తి ప్రవివేశ హుతాశనం
జ్యేష్ఠా కాశిసుతా రాజన్ యమునా మభితో నదీం ॥

కాశిరాజు కూతురు అంబ యను కన్య భీష్మునిచే దీసుకొని రాబడి తన మనోరథమును పొందజాలక భీష్ముని జయింప దలచి యీ జన్మలో చేతగాక భీష్మ వధ కొఱకు జనించు గాక

యను భావముచే శివానుగ్రహమును బొంది యగ్ని ప్రవేశము గావించి శిఖండియై భీష్మవధకు కారకు రాలయ్యెను.

మరణకాల మందలి యా యా భావములను జన్మాంతరముల యందు తప్పక బొందుదు రనుట కిదియే నిదర్శనము.

: కవిం పురాణ మనుశాసితార
మణో రణీయాంస మను స్మరే ద్యః।
: సర్వస్య ధాతార మచింత్య రూప
మాదిత్య వర్ణం తమసః పరస్తాత్ ॥ ౯
: ప్రయాణ కాలే మనసా చలేన
భక్త్యా యుక్తో యోగ బలేన చైవ।
: భ్రువో ర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్
స తం పరం పురుష ముపైతి దివ్యం ॥ ౧౦
: య దక్షరం వేదవిదో వదంతి
విశంతి య ద్యతయో వీతరాగాః।
: య దిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే ॥ ౧౧
: సర్వ ద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ
: మూర్ధ్న్యా ధాయా త్మనః ప్రాణ మాస్థితో యోగధారణాం॥
: ఓమిత్యే కాక్షరం బ్రహ్మ వ్యాహర న్మా మనుస్మరన్
: యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిం ॥ ౧౩

కవియు, (అనగా: సర్వజ్ఞుడును,) పురాతనుడును, శాసించువాడును, నణువు కంటె చిన్నవాడును, నన్నింటికిని ధాతయు, (ననగా: నాధార భూతుడును లేక కర్తయు) నచింత్య స్వరూపుడును, చీకటికి వెలుపల భాగమున నున్న సూర్యుని వలె దేదీప్యమానుడు నగు పురుషుని స్మరించువాడును,

౯. అంత కాలము నందు (ఇంద్రియ నిగ్రహ రూపమగు) యోగ మునొక్క సామర్థ్యము చేతను, భక్తి చేతను యుక్తుడయి మన స్సును స్థిరముగ జేసి, ప్రాణమును కను బొమల మధ్య యందు బాగుగ నునిచి భజించు వాడును నగు పురుషుడా పరమపురుషుని బొందును. ౧౦. వేదవేత్తలు దేని నక్షర మని జెప్పుచున్నారో, వీతరాగుడై యతి దేని యందు ప్రవేశించు చున్నాడో, యెవరిని కోరి బ్రహ్మచర్య వ్రతము నాచరించు చున్నాడో యా పదమును (అనగా: ఓంకార బ్రహ్మను) నీకు సంక్షేపముగ జెప్పుచున్నాను. ౧౧. అన్ని (ఇంద్రియ రూపములగు) ద్వారముల నరికట్టియు, మనస్సును హృదయమందు నిరోధించియు, తన ప్రాణమును శిర స్సున జేర్చియు, యోగ ధారణ మును జెందియు- ౧౨. "ఓం" అను నేకాక్షర బ్రహ్మను జపించుచు నన్ను స్మరించుచు దేహ మును వదలి వేయు వాడుత్తమ గతి నొందును. ౧౩.

ద్రోణో పి శస్త్రాణ్యుత్సృజ్య పరమం సాంఖ్య మాస్థితః
తథోక్త్వా యోగ మాస్థాయ జ్యోతిర్భూతో మహాతపాః ॥
పురాణం పురుషం విష్ణుం జగామ మనసా పరం
ముఖం కించి త్సము న్నమ్య విష్టభ్య ఉర అగ్రతః ॥
నిమీలితాక్ష స్సత్వస్థో నిక్షిప్య హృది ధారణాం
ఓ మి త్యేకాక్షరం బ్రహ్మ జ్యోతిర్భూతో మహాతపాః ॥
స్మృత్వా దేవ దేవేశ మక్షరం పరమం ప్రభుం
దివ మాక్రామ దాచార్య స్సాక్షా త్సద్భి ర్దురాక్రమం ॥
ద్వౌ సూర్యా వితి నో బుద్ధి రాసీ త్తస్మిం స్తదా గతే
ఏకరూప మివ వ్యాసీ జ్జ్యోతిర్భిః పూరితం నభః ॥
సముత్పతతి చార్కాభే భారద్వాజే దివాకరం
నిమేషమాత్రేణ చ తజ్జ్యోతి రంతరధీయత ॥ ద్రోణ. ౧౯౩-౫౦

ద్రోణుడంతేకాలమునందు శస్త్రముల నొదిలి యోగమును పొంది మనస్సుచే విష్ణు ధ్యానము గావించి, ముఖమును కొంచము వంచి బొమ్మలను బిగించి నేత్రములు మూసికొని హృదయము నందు ధారణను పొంది, దివమునకు వెళ్ళునపుడు ఇరువురు సూర్యులవలె నితరులకు దోచుచు నిమిషమాత్రమున సూర్యుని వంటి తేజస్సంతర్ధానమును పొందెను.

గీత యందలి యోగుల మార్గమంతకాలమందు ద్రోణాచార్యులకు సంభవించినట్లు గలదు.

శివమాహాత్మ్యమునందిట్లుగలదు. అను శా. ౧౬-౪౪ ఉపమన్యు.

యం చ వేదవిదో వేద్యం వేదాంతే చ ప్రతిష్ఠితం
ప్రాణాయామపరా నిత్యం యం విశంతి జపంతి చ ॥
ఓంకారరథ మారుహ్య తే విశంతి మహేశ్వరం ॥

వేదాంతముల యందు నిశ్చయమైనదియు వేదవేత్తలకు విదితమైనదియు నేది గలదో దానిని ప్రాణాయామపరులు ప్రవేశింతురు. జపింతురు. మఱియు నట్టివారలు ఓంకారమను రథము నధిష్టించి మహేశ్వరుని పొందుదురు.

అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః ! ౧౪
మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతం
నాప్నువంతి మహాత్మాన స్సంసిద్ధిం పరమాం గతాః ॥ ౧౫

ఓ పార్థా! అనన్యభావముచే నెల్లప్పుడును, నన్ను ప్రతిదినమునను స్మరించునట్టి నిత్యయుక్తులగు ( కర్మ- ) యోగులకు నేను సులభుడను ( అనగా : వారు నన్ను నొందుట సులభము ) ౧౪. నన్ను పొందిన పిదప పరమసిద్ధి నొందిన మహాత్ములను, దుఃఖమునకు నునికిపట్టును నశాశ్వతమునగు పునర్జన్మ

ప్రాప్తము కాదు. ౧౪.

ఆబ్రహ్మభువనా ల్లోకాః పునరావర్తినో ర్జున
మా ముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే ॥ ౧౬

ఓ యర్జునా! బ్రహ్మలోకము మొదలుకొని స్వర్గాది లోకములవఱకును, గల లోకములన్నియు ( ఎప్పుడో యొకప్పుడు) పునరావర్తనమును ( తిరిగి వచ్చుట ) బొందును. కాని, యో కౌంతేయా! నన్ను నొందుదువేని పునర్జన్మ యుండదు. ౧౬.

"కారణం పరమం ప్రాప్య అతిక్రాంతస్య కార్యతాం
పున రావర్తనా నాస్తి సంప్రాప్తస్య పరం పదమ్ ॥ " శాంతి.

కార్యము నతిక్రమించిన వాడు పరమపద రూపమగు పరమకారణమును పొంది తిరిగి రానేరడు.

మాం ప్రవిశ్య భవంతీ హ ముక్తా భక్తా స్తు యే మమ
అహం హి పురుషో జ్ఞేయో నిష్క్రియః పంచవింశకః ॥
శాంతి- ౩౪౦- ౪౩. భగవాన్.

శాంతి- ౨౮౦- ౫౯- శుక్రాచార్యులతో వృత్రుడిట్లు చెప్పెను.

సత్యేన తపసా చైవ విదిత్వా సంక్షయం హ్యహం
న శోచామి న హృష్యామి భూతానా మాగతిం గతిం ॥

సత్యము తపస్సు వీటిచే సంక్షయమును తెలుసుకొని, భూతములయొక్క రాక పోకలను జూచుచు, దుఃఖమును గాని, సంతోషమును గాని పొందను. మఱియు కాలముచే ప్రేరేపించబడి జీవులు నరకమును పొందుచున్నారు. కాలమును తెలుసుకొనలేక పశు పక్షి మృగాది జన్మల నొందుచు, కామ బంధముచే బద్ధులై యవశులగుచు బాధపడు జీవులను జూచు చున్నాను. "కాలసంఖ్యాన సంఖ్యాతం సృష్టి స్థితి పరాయణం " ఉత్పత్తి స్థితుల కాధారమగు కాలపరిమితిని యెఱుంగని వారలై సమస్త భూతములు

నెల్లప్పుడు బడుబాధల నెఱుంగుచున్నాను.

వృత్రుడిట్లు చెప్పినవాడై తన మనోనిశ్చయము నీరీతిగ జెల్పెను.

" విష్ణో రనంతస్య సనాతనం తత్
స్థానం సర్గా య్యత సర్వే ప్రవృత్తాః।
స వై మహాత్మా పురుషోత్తమో వై
తస్మిన్ జగ త్సర్వ మిదం ప్రతిష్ఠితమ్॥

సనాతనుడు అనంతుడు నగు నట్టియు మహాత్ముడగు పురుషోత్తముని యందు జగత్తంతయు నిమిడి యున్నదని వృత్రుడు ప్రాణంబుల నొదిలెను. కావున, ధర్మనందనా! మేమేగతికి బోయెదమని యడిగితిరి.

" శుద్ధాభిజనసంపన్నాః పాండవాః శంసితవ్రతాః
విహృత్య దేవలోకేషు పున ర్మానుష మేష్యథ॥
ప్రజా విసర్గే చ సుఖేన కాలే
ప్రేత్యైత్య దేవేషు సుఖాని భుక్త్వా।
సుఖేన సంయాస్యథ సిద్ధసంఖ్యాం
మా వో భయం భూ ద్విమలా స్థ సర్వే॥ "

పరిశుద్ధులగు వారితో గూడుకొని నియమింప బడిన వ్రతములు గల పాండవులారా! దేవలోకముల యందు విహరించిన వారలై తిరిగి మానుషత్వమును పొందుడు మఱియు సుఖముగా ప్రజాసృష్టి కాలమందున్న వారై దేవతల యందుండి సుఖముల ననుభవింపక సిద్ధకోటిలో జేరుదురుగాక.

పాండవులారా! మీరు పవిత్రులు గావున భయ పడ నవసరము లేదు. అని భీష్ముడు నుడివెను.

ఈ విషయమై వృత్రగీతయందు చక్కని విచారము గలదు

సహస్ర యుగ పర్యంత మహ ర్య ద్బ్రహ్మణో విదుః
రాత్రిం యుగ సహస్రాన్తాం తే హోరాత్రవిదో జనాః ॥ ౧౭

అహో రాత్రము లనగ నేమియో (యథార్థముగ) తెలిసి కొనిన వారు కృత, త్రేత, ద్వాపర, కలియను చతుర్యుగములు కలసి యొక మహాయుగమనియు, వేయి మహాయుగముల యొక్క కాలము బ్రహ్మదేవుని యొక్క యొక దివస మనియు నట్టి వేయి యుగములాయనకు నొక రాత్రియగుననియు దెలిసికొనుచున్నారు.

అవ్యక్తా ద్వ్యక్తయ స్సర్వాః ప్రభవన్త్య హారాగమే
రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవా వ్యక్త సంజ్ఞకే ॥ ౧౮
భూతగ్రామ స్స ఏవా యం భూత్వా భూత్వా ప్రలీయతే
రాత్ర్యాగమే వశః పార్థ ప్రభవత్య హారాగమే ॥ ౧౯

ఈ (బ్రహ్మ దేవుని యొక్క) దివస మారంభ మగు నేని యవ్యక్తము నుండి వ్యక్త మంతయు (పదార్థము) బయలు వెడలును. రాత్రియందు పూర్వోక్తమగు నవ్యక్తమందు లయించుచు న్నది. ౧౮. భూతములయొక్క యా సముదాయమే (ఈరీతిగ) తిరిగి తిరిగి జనిమించి యవశ్య మయిన దయి (అనగా: తన కిచ్ఛ యున్నను లేకపోయినను యంత్రము నందు వేయబడిన దానివలె) రాత్రి యారంభమునకు కాగానే లయము నొందుచున్నది. ఓ. పార్థా! దివసారంభము కాగానే తిరిగి పుట్టుచున్నది. ౧౯.

"సహస్ర పరివర్తం త ద్బ్రాహ్మం దివస ముచ్యతే
రాత్రి మేతావతీం చైవ తదాన్తే విశ్వ మీశ్వరం ॥
ప్రశమే ధ్యాన మావిశ్య సుప్త్వా సోన్తే విబుధ్యతే ॥"

వెయ్యి యుగములైన బ్రహ్మ కొక పగలు. రాత్రియు నంతపరిమితి గలదయె. "సహస్రయుగపర్యంతం" అను గీత శ్లోకమిచట గలదు.

"ప్రతిబుద్ధో విశరుతే బ్రహ్మక్షయ్యం క్షపాక్షయే
సృజతే చ మహద్భూతం తస్మాద్వ్యక్తాత్మకం మనః ॥"

ఈయధ్యాయమునసృష్టి యంతయు వ్రాయబడినది. బ్రహ్మ రాత్ర్యంతము నందు మేలుకొని అక్షయమును జేయుచున్నాడు.

పరస్తస్మాత్తు భావోన్యో వ్యక్తో వ్యక్తాత్సనాతనః
యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి ॥ ౨౦
అవ్యక్తోక్షర ఇత్యుక్తస్తమాహుః పరమాం గతిం
యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ ॥ ౨౧
పురుష స్స పరః పార్థ భక్త్యా లభ్య స్త్వనన్యయా
యస్యాం తస్థాని భూతాని యేన సర్వ మిదం తతమ్ ॥ ౨౨

కాని పైన చెప్పిన యవ్యక్తముకంటె పరమందున్నదియు, సనాతనము నగునదియు మఱియొక యవ్యక్తపదార్థము సర్వభూతములు నశించినను, నశించునది కాదు. ౨౦: ఏ యవ్యక్తము నక్షర మనియు చెప్పుచున్నారో యదియె పరమమని (అనగా: సర్వశ్రేష్టము, కడపటి గతియని) చెప్పబడినది. (మఱియు) దేని నొందిన తిరిగి జన్మించుట లేదో యట్టి నాయొక్క పరమ స్థానమును నదియే. ౨౧. ఓ పార్థా! యెవని లోపల నన్ని భూతములు నున్నవో, యెవనిచే నీ సమస్తము విస్తరింపజేయ బడినదో, లేక, వ్యాపింప జేయ బడినదో యా పరముడు (అనగా: శ్రేష్ఠుడైన పురుషుడు) అనన్యభక్తి చేతనే పొంద దగిన వాడు. ౨౨

భూతములన్నియు వశించినను అవ్యక్తము నశించు నది గాదు ఏలననగా "అవ్యక్తాద్వ్యక్తముత్పన్నం లోక సృష్ట్యర్థ మీశ్వరాత్" లోక సృష్టి కొఱకు ఈశ్వరుని వలన అవ్యక్తమునుండి వ్యక్తముత్పన్నమైనది. ఈ యవ్యక్తమే స్వకర్మలచే మహాపురుష లక్ష్మ... మైనది.

ఇదం పురుష సూక్తం హి సర్వ వేదేషు పార్థివ
ఋతం సత్యం చ విఖ్యాతే మృషిసింహేన చింతితం
ఉత్సర్గేణాప వాదేన ఋషిభిః కపిలాదిభిః
అధ్యాత్మ చింతమాశ్రిత్య శాస్త్రాణ్యుక్తాని భారత ॥
వ్యాసః. శాంతి ౩౫౦-౫

"పురుషులనేకులా లేక యొకరా?" యను ప్రశ్నకు వైశంపాయనుడిట్లుత్తరమిచ్చెను. పురుషులందరిలో వ్యాస మహర్షిచే జెప్ప బడిన పురుష సూక్త వాచ్యుడగు పురుషుడే పరమపురుషుడని వైశంపాయనుడు జెప్పి—

తస్యైకత్వం మహత్వంచ సచైక పురుష స్స్మృతః
మహా పురుష శబ్దం స బిభర్త్యేక స్సనాతనః ॥

పరమేశ్వరునకేకత్వ మహత్వములొక్కటియే: ఆయనయే పురుషుడన బడును. అట్టి సనాతనుడే మహా పురుష శబ్దమును ధరించుచున్నాడు. మఱియు అశ్వమేధ పర్వము నందు "విద్యామయోయం పురుషో నతు కర్మ మయ స్స్మృతః" పురుషుడు విద్యామయుడు గాని కర్మ మయుడు గాడు, మఱియు,

విషయో విషయత్వం చ సంబంధోయమిహోచ్యతే
విషయీ పురుషో నిత్యం సత్యంచ విషయ స్స్మృతః ॥

విషయి విషయములలో విషయి పురుషుడు; విషయము సత్యమని దెలియ వలెను.

అంగుష్ఠ మాత్రః పురుషోంత రాత్మా
న దృశ్యతే సౌహృదయే నివిష్టః
అజశ్చరో దివారాత్రమతన్ద్రితశ్చ
సతం మత్వా కవి రాస్తే ప్రసన్నః ॥ సనత్సు. ४-౧౫

సర్వమును సృష్టించిన పురుషుడంగుష్ఠ మాత్రుడు అతని యానంద స్వరూపమును జ్ఞానులు జూచి కృతార్థులగుదురు.

యత్ర కాలే త్వనావృత్తి మావృత్తిం చైవ యోగినః
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ॥ ౨౩
అగ్ని ర్జ్యోతి రహః శుక్ల ష్షణ్మాసా ఉత్తరాయణం
తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః॥ ౨౪
ధూమో రాత్రి స్తథా కృష్ణ ష్షణ్మాసా దక్షిణాయనం
తత్ర చాంద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే॥ ౨౫
శుక్ల కృష్ణే గతీ హ్యేతే జగత శ్శాశ్వతే మతే
ఏకయా యాత్య నావృత్తి మన్యయా వర్తతే పునః॥ ౨౬

ఓ భరత శ్రేష్ఠా! యిప్పుడు నీకు (కర్మ-) యోగి యే కాలమునందు మృతినొంది తిరిగి యీ లోకమున జనిమించుటకు రాడో, యే కాలమునందు మృతిజెందుటచే తిరిగి యీలోకమున జనిమించునో యా కాలమును జెప్పుచున్నాను. ౨౩. అగ్ని, జ్యోతిస్సు, (పగలు) దివసము, శుక్ల పక్షము, ఉత్తరాయణ మారు మాసములు నను కాలమున మరణించిన బ్రహ్మ వేత్తలు మృతి జెందిన పిదప బ్రహ్మను పొందుచున్నారు. (తిరిగి జనిమింపరు!) ౨౪. (అగ్ని-) ధూమము, రాత్రి, కృష్ణ పక్షము, దక్షిణాయన మారు మాసములు నను కాలమున (మృతిజెందిన) (కర్మ-) యోగి చంద్రునియొక్క తేజస్సును పొంది (అనగా: చంద్ర లోకము దగ్గరకు వెళ్లి) తిరిగి (పుణ్యము క్షీణించిన-పిదప) వచ్చుచున్నాడు ౨౫. ఈ రీతిగ శుక్లము, కృష్ణము, (అనగా: ప్రకాశ మయము, అంధకారమయము,) అని జగత్తునకు శాశ్వతములగు రెండు గతులు (అనగా: స్థిరము లగు మార్గములు) గలవని చెప్పబడినవి. ఒక మార్గమున బోయిరేని తిరిగి

రారు. మఱియొక మార్గమున బోయిరేని తిరిగి వత్తురు. అట్లే

అయం స దేవ యానానా మాదిత్యో ద్వార ముచ్యతే
అయంచ పితృయానానాం చంద్రమా ద్వార ముచ్యతే॥
ఏష కాష్ఠా దిశశ్చైవ సంవత్సర యుగాది చ
దివ్యా దివ్యః పరో లాభో అయనే దక్షిణోత్తరే॥
ఏవం ప్రజాపతిః పూర్వమారాధ్య బహుభిస్తవైః
ప్రజార్థం వరయామాస నీల లోహిత సంజ్ఞితః॥

ఉపమన్యుః. అనుశాసన ౧౬-౪౫

దేవయానములకు సూర్యుడు, పితృ యానములకు చంద్రుడు ద్వారములనియు, ఈప్రకారముగా ప్రజాపతి పూర్వకాలమం దీశ్వరుని యారాధించి ప్రజల కొఱకు కళా కాష్ఠ మొదలుకొని సంవత్సర యుగ అయనాదులను వరములుగా పొందెను.

ధౌమ్యుని శిష్యుండగు నుపమన్యువు, పోయిన దన నేత్రములు తిరిగి రాగలందులకై యశ్వని దేవతలను స్తుతించినపుడు, శుక్ల, కృష్ణ గతులిట్లు వర్ణింపబడినవి. ఆది. ౩- (౫) ౧.

హిరణ్మయా శకునీ సాంపరాయౌ
నాసత్య దస్రౌ సునసౌ వైజయంతౌ।
"శుక్రం వయంతౌ తరసా సువేమా
వధి వ్యయంతా వసితం వివస్వతః॥"

తంతువాయుడు తురీ వేమలచే (అనగా: నేతపనిముట్లచే) తంతువుల సమకూర్చి వస్త్రము నేవిధముగ నిర్మించుచున్నాడో యుదే విధమున నీ యశ్వినులు, సూర్యుని సృష్టించి యాతని వలన నేర్పడిన శుక్ల, కృష్ణము లను (అనగా: దినములను) తంతువులచే, సంవత్సర రూపమైన వస్త్రమును నిర్మించుచున్నారు.

మఱియు నీ సంవత్సరము ( కాలము ) ద్వారా జీవుల నాయాయి కర్మ ఫలముల భోగమునకు మార్గము లయిన శుక్ల కృష్ణము లను ( అనగా : ఉత్తరాయణ దక్షిణా యనము లను ) శీఘ్రముగ పొందించుచు కాలమునకు ప్రేరకులై / ప్రవర్తకులై యున్నారు.

శుక్లో హః కర్మచేష్టాయాం కృష్ణ స్స్వాప్నాయ శర్వరీ
అహ స్త్వత్రో దగయనం రాత్రి స్స్యా ద్దక్షిణాయనమ్ ॥
శాంతి- ౩౩౧- ౧౬.

పగటి భాగము కర్మమయ మనియు, రాత్రి భాగము నిద్రా మయ మనియు; అహస్సుత్తరాయణ మనియు, రాత్రి దక్షిణాయన మనియు చెప్పబడినది. మఱియు

"పంథానౌ పితృయాన శ్చ దేవయాన శ్చ విశ్రుతౌ
ఈజానాః పితృయానేన దేవయానేన మోక్షిణః ॥"

యజ్ఞశీలురు పితృయానమునను, మోక్షశీలురు దేవయానమునను వెళ్ళుదురు. ఇందువలననే ప్రాణమునుగ భీష్ముని విషయము గమనించుడు "ఆవృత్తే భగవత్యర్కే గంతాసి పరమాం గతిం" సూర్యుడుత్తరాయణమందు ప్రవేశించినపుడు నీవుత్తమ గతి నందగలవు అను భగవద్వాక్యానుసారముగా నుత్తరాయణమున గతించి యుత్తమ గతిని పొందెను.

నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన
తస్మా త్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున ॥ ౨౭

వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు యత్పుణ్య ఫలం ప్రదిష్టం ।
అత్యేతి తత్సర్వ మిదం విదిత్వా
యోగీ పరం స్థాన ముపైతి చాద్యమ్ ॥ ౨౮

ఓ పార్థా! ఈ రెండు మార్గములను ( యథార్థముగ ) దెలి
సికొనిన, యే ( కర్మ- ) యోగి యును మోహము నొందడు;
కాన నో యర్జునా! నీవు సర్వకాలము ( కర్మ- ) యోగయుక్త
డవు కమ్ము. ౨౭. దీనిని ( పై చెప్పిన తత్త్వమును ) తెలిసికొను
నేని, వేదముల యందును, యజ్ఞముల యందును, తపస్సుల యం
దును, దానములయందును యే పుణ్యఫలము చెప్పబడినదో దాని
నంతను ( కర్మ- ) యోగి యతిక్రమించును. దానికి పరమం
దున్న యాద్య స్థానమును బొందుచున్నాడు. ౨౮.

ఆధ్యాపరయేన్మహదేతద్యశస్యం
వాచో వికారాః కవయో వదంతి
అస్మిన్ యోగే సర్వమిదం ప్రతిష్ఠితం
ఏతద్విదురమృతాస్తే భవంతి॥ ౧౨ సనత్సుజాతీయము.

యశస్కరమును, బ్రహ్మప్రాప్తి కారణమును, గొప్పదియు
నగు నీయోగశాస్త్ర మధ్యయనము జేయదగినది. ఈ యోగమును
దెలిసికొనిన వానికి సర్వము నధీన మందుండును. దీనికి ( అనగా
ఈ యోగము నకు ) భిన్నము లగు శాస్త్రములు, వాగ్వికార
మాత్రములే. యని పెద్దలు చెప్పియున్నారు. ఎవరీ యోగమును
దెలిసి కొందురో, వారు అమృతీ భూతు లగు చున్నారు

అక్షర పరబ్రహ్మ యోగమను అష్టమాధ్యాయము సమాప్తము.
శ్రీమ దాభాగ్య నగర స్థిత శ్రీమన్మగ్భటారాధ్య వంశ భార
ద్వాజసగోత్ర వైద్యకలావిశారద- ముదిగొండ
మల్లనారాధ్య పుత్ర ముదిగొండ బుచ్చయ్యా
లింగారాఖ్యేన శ్రీ మద్భగవద్గీతా
మహా భారత ప్రమాణ వచనైః ప్రకటితా.

శ్రీ శివాభ్యాం నమః



# శ్రీ కుమార గీత



## రాజవిద్యా రాజ గుహ్య యోగము

### నవమాధ్యాయము.

శ్రీభగవానువాచ.

ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే
జ్ఞానం విజ్ఞాన సహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥ ౧

రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్॥ ౨
అశ్రద్ధధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప
అప్రాప్య మాం నివర్తంతే మృత్యుసంసార వర్త్మని॥ 3

శ్రీ భగవంతుడు సెప్పుచున్నాడు. నీ వసూయ లేని వాడవు కాన నిప్పుడు గుహ్యములలో గుహ్యమైనదియు, విజ్ఞాన సహిత మగు జ్ఞానమును, దానిని దెలుసు కొనుటచే పాపముల నుండి ముక్తుడ వగుటకు నీకు జెప్పుచున్నాను. (వినుము) ౧

ఇది (జ్ఞానము) గుహ్యముల యన్నింటికిని (రాజు) శ్రేష్ట మైనది. రాజ విద్య యన, విద్యల యన్నింటి లోను శ్రేష్ఠ మయినది. ఇది పవిత్రమును, నుత్తమమును, ప్రత్యక్షముగ దెలియు నదియు, నాచరించుటలో సుఖకరమును, నవ్యయమును, ధర్మ్యమునై యున్నది. ౨

ఓ పరంతప! ఈ ధర్మము నందు శ్రద్ధ లేనివారు నన్ను నొందక మృత్యువుతో గూడిన సంసారము నందు తిరుగుచున్నారు

ఆరణ్య పర్వ ౨౧౩- శ్లో. ధర్మవ్యాధః

" ప్రత్యక్షం మమ యో ధర్మ స్తం చ పశ్య ద్విజోత్తమ " నా యొక్క ధర్మము ప్రత్యక్షము గా జూడుము. అనిచెప్పి కౌశిక డను బ్రాహ్మణుని, వృద్ధులగు దన తలిదండ్రులకడకు దోడ్కొని పోయి " పితా మాతా చ భగవ న్నేతౌ మే దైవతం పరం। య ద్దైవతేభ్యః కర్తవ్యం త దేతాభ్యాం కరోమ్యహమ్ " వీరు నాకు ప్రత్యక్షదేవతలు. దేవతల కొఱకు జేయదగినదానిని వీరలకు జేయుదును. వీరలను మనసున భావించుకొని యీశ్వరుని సేవించి నటుల సేవించుటయే నా ప్రత్యక్షధర్మ మని వ్యాధుడు జెప్పెను.

(మఱియు) ఈ యభిప్రాయమునే మనస్సున నిడుకొని, తన వ్యక్తస్వరూపము యొక్క యుపాసన చెప్పకమునుపు భగవం తుడు గీతలయందు భక్తిమార్గము నుపదేశించెను.

: మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా
: మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః ॥ ౪
: న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగ మైశ్వరం
: భూతభృ న్న చ భూతస్థో మమాత్మా భూతభావనః ॥ ౫
: యథాకాశస్థితో నిత్యం వాయు స్సర్వత్రగో మహాన్
: తథా సర్వాణి భూతాని మత్స్థానీ త్యుపధారయ ॥ ౬

నేను నాయొక్క యవ్యక్తస్వరూపముచే నీజగత్తు నంతను విస్తరించినాను లేక వ్యాపించి నాను. నాయందు సర్వభూతములు నున్నవి. నేను వానియందు లేను ౪. మఱియు నాయందు సర్వ భూతములును లేవు! నాయొక్క యీశ్వరశక్తి, లేక యోగ సా మర్థ్య మే విధమున నున్నదో చూడుము! భూతములను బుట్టించు నాయొక్క యాత్మ భూతములను ధరించుచున్నను, భూతముల

యందు లేను. ౫. అంతటను వీచుచున్న గొప్ప వాయువు వెల్లప్పుడును నాకాశమందున్నట్లు సర్వభూతములు నా యందున్నవని తెలిసికొనుము.

అహం సర్వగతో బ్రహ్మ న్భూతగ్రామాంతరాత్మకః
భూతగ్రామశరీరేషు నశ్యత్సు న నశామ్యహమ్॥ శాం. ౩౪౦-౪౭

నారదా! నేనంతట నుండు వాడను సర్వ భూతాంతర్యామిని భూతములవలన పుట్టి నట్టి శరీరములు నశించినను నేను నశించు వాడనుగాను. నారాయణుడు మార్కండేయున కీ విధముగ నుపదేశించెను- అరణ్య- ౧౮౯- ౩౯.

యచ్చ కించి త్త్వయా లోకే దృష్టం స్థావరజంగమం
విహిత స్సర్వథైవా సౌ మమాత్మా భూతభావన॥
అర్ధం మమ శరీరస్య సర్వలోకపితామహః
అహం నారాయణో నామ శంఖచక్రగదాధరః॥

లోకమునందు జూడబడిన స్థావర జంగమాత్మక ప్రపంచమంతయు నేనే నని దెలియుము. అందు బ్రహ్మ నాను సగము శరీరమనియు, నేనే శంఖచక్ర గదా ధరుండ ననియు దెలియుము.

ఈ యధ్యాయమంతయు భగవదీయము.

కృష్ణః పృథివీ మసృజత్ఖం దివం చ॥ అను శా. ౧౬౭.

పృథివి మొదలుకొని యాకసమువఱకు శ్రీకృష్ణుడే సృజించెనని ధర్మరాజునకు భీష్ముడు జెప్పెను. ఇదొక విశ్వరూపాధ్యాయము.

సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికాం
పరం భావ మజానంతో మమ భూతమహేశ్వరమ్ ॥ ౭
ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతేర్వశాత్ ॥ ౮
న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ
ఉదాసీనవదాసీన మసక్తం తేషు కర్మసు ౯

మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరం
హేతునా నేన కౌన్తేయ జగద్విపరివర్తతే ॥ ౧౦

ఓ కౌంతేయా! కల్పాంతమునందు సర్వభూతములును నా ప్రకృతి నొందుచున్నవి. కల్పారంభమునందు (అనగా: బ్రహ్మదేవుని పగటి యొక్క యారంభమునందు) నేనే వానిని మరల నిర్మించుచున్నాను. ౮. నేను నాయొక్క ప్రకృతిని స్వాధీనము చేసికొని, యా ప్రకృతికి స్వాధీనులగుటచే యవశులయిన (వారివారి కర్మలచే బద్ధులయిన) యీ భూతములయొక్క సముదాయమునంతను మరల మరల నిర్మించుచున్నాను. ౯. కాని, ఓ ధనంజయా! (సృష్టిని నిర్మించుట యను) నీ కర్మయందు నాకు నాసక్తి లేమిచే నేనుదాసీనుని వలె నున్నాను. గాన నా కర్మలు నన్ను బంధింపనేరవు. ౯. నే నధ్యక్షుడనై ప్రకృతి నుండి చరాచర సృష్టినంతను ప్రసవింప జేయుచున్నాను. కావున నో కౌంతేయా! జగత్తున నుత్పత్తిలయములు జరుగుచున్నవి. ౧౦.

ప్రకృతి స్సా పరా మహ్యం రోదసీ యోగధారిణీ
ఋతా సత్యా మరా జయ్యా లోకానా మాత్మసంజ్ఞితా ॥
తస్మాత్సర్వాః ప్రవర్తంతే సర్గప్రళయవిక్రియాః
తపో యజ్ఞ స్స యష్టా చ పురాణః పురుషో విరాట్ ॥

శాంతి - ౩౪౨ - ౧౪. శ్రీభగవాన్.

అర్జునా! ఆ ప్రకృతి మిక్కిలి యుత్కృష్టమైనది. అది భూమ్యాకాశముల మయము. అది తన సృష్టి శక్తి చేత భూమ్యాకాశములగు లోకముల నెల్ల ధరించుచున్నది ఆ ప్రకృతి కర్మముల ఫలరూపముగా (అనగా: జీవులయి తమతమ కర్మములచే బడయు నాయా పుణ్యలోకములుగా) నుండును. అది శుద్ధచిత్తు. అది సత్యమయినదియు, మరణము లేనిదియు, జయింపరానిదియు, సర్వలోకముల కాత్మ యనంబడునదియు నై యున్నది. దాని నుం

డి సృష్టి ప్రళయ వికారములెల్ల ప్రవర్తించుచుందును. ( అదియే, నా ప్రకృతియగును ) అది తపము. అది యజ్ఞము, యజ్ఞము నేయు వాడును. అది పురాణుడగు విరాట్పురుషుడు. అట్టి ఈ నేను,

“ తతో యుగసహస్రాంతే సంహరిష్యే జగత్పునః
కృత్వా మత్స్థాని భూతాని చరాణి స్థావరాణి చ ॥
ఏకాకీ విద్యయా సార్థం విహరిష్యే జగత్పునః
తతో భూయో జగత్సర్వం కరిష్యామీహ విద్యయా ॥ ”

వేయి యుగములు గడచిన తుదిని నే నీ జగము నంతయు మరల నా లోనికి సంహరించుకొందును. స్థావర జంగమమ్ము లగు సమస్త భూతములను నా లోపల నునిచికొని విద్యామాత్రముతో గూడి యేకాకినై విహరించుచుందును. మరల; కాలము గడచనగా, నేను నా విద్యచేత జగమును మరల సృజింతును.

పశ్య దేవస్య మాహాత్మ్యం మహిమానం చ నారద
శుభాశుభైః కర్మభిర్యో న లిప్యతి కదాచన ॥ శా. ౩౪౦.

నారదా! శుభ కర్మల చేతను, అశుభ కర్మల చేతను, నొకప్పుడును బద్ధుడు కానందు యద్దేవుని వ్యాపకత్వమును మహత్వమును జూడుము.

అవజానంతి మాం మూఢా మానుషీం తను మాశ్రితం
పరం భావ మజానంతో మమ భూతమహేశ్వరమ్ ॥ ౧౧
మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః
రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః ॥ ౧౨

సర్వభూతములకు గొప్ప యోగీశ్వరుడు నగు నా యొక్క యుత్కృష్టమగు స్వరూపమును నెఱుగనట్టి మూఢులు నన్ను మానుష దేహమును ధరించిన వానిగా దలచి యవమానము చేయుచున్నారు. ౧౧. వారియొక్క యాశలు నిష్ఫలములైనవియు, కర్మలు వ్యర్థములైనవియు, జ్ఞానము ఫల[illegible]నవియును చిత్తము

భ్రష్టమయిన బియు నగుటచే వారు మోహాత్మకమును, రాక్షస
మును, నాసురమగు స్వభావము నాశ్రయించియున్నారు. ౧౨.

అరణ్యం- ౨౫౧. ఘోషయాత్ర యందు గంధర్వులచే
పరిభవము నొంది పాండవులచే ముక్తుండగు దుర్యోధనుడు లజ్జతో
గూడుకొని ప్రాయోపవేశమును పొందెను. అట్టి దుర్యోధనుని,
దానవులు పాతాళమునకు గొంపోయి యిట్లు బోధించిరి.

" నీవు నిష్కారణము ప్రాణముల నొదులుచున్నావు. నిన్ను
నమ్ముకొనియే దానవుల మగు మేము, (అనగా: దైత్య రాక్షసు
లనబడు వారము,) " దైత్యరక్షోగణా శ్చైవ సంభూతాః
క్షత్రయోనిషు " క్షత్రియులమై పుట్టి యున్నాము. " భీష్మ
ద్రోణ కృపాదీంశ్చ ప్రవేక్ష్యంత్య పరే సురాః " భీష్మాదులను
గూడ యసురులు ప్రవేశింతురు. ఇందువలన వారందరు నిర్దయు
లయి, పరస్పరము వధించుకొన గలరు. అట్టి సమయమున నీవు
ధైర్య మవలంబించి యుండవలయును. " అని బోధించి పంపిరి.

ఇట్టి యాసుర భావముగల మనుజులు నన్ను దెలియ లేరని
భగవంతుడు జెప్పియుండుటచేత, రాక్షసావేశపరులు దైవభావ
మును గనజాలరని యీ యాఖ్యానము వలన దెలియుచున్నది.

బ్రూయా స్త్వం వాసుదేవం చ పాండవానాం సమీపతః
ఆత్మార్థం పాండవార్థం చ యత్తో మాం ప్రతియోధయ॥
సభామధ్యే చ యద్రూపం మాయయా కృతవా నసి
తత్తథైవ పునః కృత్వా సార్జునో మా మభిద్రవ॥
ఇంద్రజాలం చ మాయా వై కుహకా వా విభీషణా
ఆత్తశస్త్రస్య స్సంగ్రామే వహంతి ప్రతిగర్జనాః॥
వయ మప్యు త్సహేమ ద్యాం ఖం చ గచ్ఛేమ మాయయా
రసాతలం విశామోఽపి ఇంద్రం వా పుర మేవ తు॥

దర్శయ న్నేవ రూపాణి స్వశరీరే బహూ న్యపి
నతు పర్యాయత స్సిద్ధి ర్బుద్ధి మాప్నోతి నైష్ఠికీమ్ ॥
ఉద్యోగ. ౧౨౯- ౫౩.

పాండవులకు రాయబార మంపునపుడులూకునితో దుర్యో ధను డిట్లు జెప్పెను- "కృష్ణా! నీవు మా సభయందు జూపిన రూపములు ఐంద్రజాలికములు. అవి నాకును దెలియును. నే నంత టట సంచరించ గలను. గాన యీ వెడమాయల జాలించి యుద్ధ మునకు రమ్మ" అని యనెను. భగవదీయ మగు విశ్వ రూప మును సైతము అసురభావ పూరితు డగు దుర్యోధనుడు దెలియజాలక యవమానించెను.

బలవంతులగు మీఅందరుండగ మన కేల యప జయము గలు గును? పాండవుల కేల జయము గల్గును? నాకు దెలియ జెప్పుడని యడిగిన దుర్యోధనునకు భీష్ము డిట్లు జెప్పెను.

భీష్మపర్వ- ౬౬- విశ్వోపాఖ్యానము.

బ్రహ్మ భగవంతుని ప్రార్థింపగా ప్రత్యక్షమైన భగవం తుడు, "ఓ బ్రహ్మ! నీ యభిప్రాయ మును దెలుసుకొంటిని" యని జెప్పి యంతర్ధానము జెందెను. అప్పుడట నున్న దేవర్షి గంధ ర్వాదులు విస్మయమును జెందినవారై "యిప్పుడు తమకు భగ వంతుడిచ్చిన యాదేశమునకు తాత్పర్య మేమి?" అని యడిగిరి. అందులకు బ్రహ్మ, జగత్పతియగు భగవంతుని లోకా నుగ్రహము కొఱకు, 'మానుషం లోక మాతిష్ఠ వాసు దేవ ఇతి శ్రుతః

అసురాణాం వధార్థాయ సంభవస్వ మహీతలే ॥'

"అసురుల వధ కొఱకు వాసుదేవ నామము గల వాడవై మనుష్యలోకమున బుట్టుము" అని కోరితిని. భగవంతుడును అం దుల కంగీకరించెను. అని చెప్పెను. కావున నో దుర్యోధనా!

" తేషాం వధార్థం భగవాన్ నరేణ సహితో బలీ
మానుషీం యోని మాస్థాయ చరిష్యతి మహీతలే ॥"

భగవంతుడు రాక్షసవధార్థమై నరునితోగూడ మనుజుడై పుట్టి సంచరించుచున్నాడు. అట్టి భగవంతుని,

"మూఢాస్తే న జానంతి నరనారాయణావృషీ" మూర్ఖులగువారు గుర్తించజాలరు.

" మన్యే త్వాం రాక్షసం క్రూరం తథా చాసి తమోవృతః
తస్మాద్ద్విషసి గోవిందం పాండవం చ ధనంజయమ్ ॥"

నిన్ను క్రూరుండగు రాక్షసునిగా దలచుచున్నాను. అలాగే తమస్సుచే, (అనగా: నజ్ఞానముచే) నావరింపఁబడినవాడవయితివి. అందుచేతనే, గోవిందుని (అనగా: శ్రీకృష్ణుని) పాండవుఁడగు యర్జునుని ద్వేషించుచున్నావు.

"నావజ్ఞేయో వాసుదేవో మానుషోయమితి ప్రభుః" కాన వాసుదేవుని మనుజుడని తిరస్కరింపం జనదు.

ఇట్లీ వాసుదేవమాహాత్మ్యమును దెలుపునట్టివి ౫- అధ్యాయము లిందుగలవు. ఇది నాల్గవనాటి యుద్ధరాత్రి యందు జరిగిన భీష్మదుర్యోధనుల సంవాదము. అ- ౩౭ జూడుడు

మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః
భజంత్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్ ॥ ౧౩
సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే ॥ ౧౪
జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మా ముపాసతే
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్ ॥ ౧౫

కాని, యో పార్థా! నాదైవీప్రకృతి నాశ్రయించియున్న మహాత్ములు సర్వభూతముల కును, నన్నవ్యయమైనట్టి యాస్థానముగ దెలిసికొని యనన్యభావము గలవారై నన్ను భజించుచ

న్నారు. ౧౩. మఱియు, యత్నశీలురును, దృఢవ్రతులును, నిత్యమును యోగయుక్తులు నగుచు, నన్నెల్లప్పుడును గొనియాడుచు, వందనము చేయుచు భక్తితో నుపాసించుచున్నారు.౧౪. అటులే యనేకులు సర్వతోముఖుడనైన నన్నే కత్వము చేతను, (అనగా: నభేద భావము చేతను) పృథక్త్వము చేతను (అనగా భేదభావముచేతను) లేక బహువిధములగు జ్ఞానయజ్ఞముల చేతను యజించి యుపాసించుచున్నారు. ౧౫.

మనసా చింతయామాస కృష్ణం కంసనిషూదనం
కృష్ణకృష్ణ మహాబాహో దేవకీనందనా వ్యయ ॥
వాసుదేవ జగన్నాథ ప్రణతార్తివినాశన
పాహి మాం కృపయా దేవ శరణాగతవత్సల ॥
దుశ్శాసనా దహం పూర్వం సభాయాం మోచితా యథా
తథైవ సంకటా దస్మా న్మా ముద్ధర్తు మిహార్హసి ॥

అరణ్య - ద్రౌపదీధ్యానమ్ - ౨౬౩.

దుర్వాసమహర్షి యొకనాటి యర్ధరాత్రమున భిక్షార్థమై ధర్మనందనుని పర్ణశాలకు విచ్చేసెను. అంత ద్రౌపది యేమియు దోచక శ్రీకృష్ణుని మనసా ధ్యానించెను. "దేవా! దుశ్శాసను బారినుండి దప్పించిన మహానుభావా! దుర్వాసమహర్షి వచ్చియున్నాడు. ఈ సంకటము నుండి దప్పించుము." అపుడు శ్రీకృష్ణుడు "పార్శ్వస్థాం శయనే త్యక్త్వా రుక్మిణీం కేశవః ప్రభుః" సమీపమందున్న రుక్మిణిని విడచి ద్రౌపదియున్న పర్ణశాలయందవతరించెను అపుడు ద్రౌపది నమస్కరించి మునియాగమనము దెలుప విని శ్రీకృష్ణుడిట్లనియె.

"తత స్తా మబ్రవీ త్కృష్ణః క్షుధితోస్మి భృశాతురః
శీఘ్రం భోజయ మాం కృష్ణే పశ్చా త్సర్వం కరిష్యసి"

ద్రౌపదీ! యాకలిగొని యున్నాను. నన్ను శీఘ్రముగా భుజింపజేసిన యెడల ననంతర మన్నియు జేయ గలుగుదువు. అని పల్కగా ద్రౌపది సిగ్గుజెందినదై "స్థాల్యాం భాస్కరదత్తాయా మన్నం మద్భోజనావధి। భుక్తవత్యద్య సర్వం దేవ తస్మాదన్నం న విద్యతే॥" సూర్యదత్తమగు భాజనమందన్నము నా భోజన పర్యంతమే యుండును యటు పిమ్మట నుండ నేరదని యెను. అంత శ్రీకృష్ణుడు ద్రౌపదీ! యిట్టి సమయమున నీవిట్లు పలుకం జనదు. భాజనముం దెమ్మి చూతమనియెను. ద్రౌపదియు భాజనముం దెచ్చి చూపిన నందు-

"స్థాల్యాః కంఠేథ సంలగ్నం శాకాన్నం వీక్ష్య కేశవః
ఉపయుజ్యాబ్రవీదేనా మనేన హరి రీశ్వరః॥
విశ్వాత్మా ప్రీయతాం దేవ స్తుష్టశ్చాస్త్వితి యజ్ఞభుక్॥"

శాకాన్న ముండగా దానిని గ్రహించి తృప్తిం జెంది ఇక మునులకాతిథ్య మివ్వ మనిన, యా మును లందఱు తృప్తులై వెడలిపోయిరి.

దైవీ సంపద గలవార లనన్య మనస్కులై ద్రౌపది వలె ధ్యానించి కృతార్థు లగుదురు.

"త ఏవ సుఖ మేధంతే జ్ఞానతృప్తా మనీషిణః" జ్ఞానముచే తృప్తులగువారు సుఖములను పొందుదురు

అహం క్రతు రహం యజ్ఞ స్స్వధా హ మహ మౌషధం
మంత్రో హ మహ మేవాజ్య మహ మగ్ని రహం హుతమ్॥
పితా హ మస్య జగతో మాతా ధాతా పితామహః
వేద్యం పవిత్ర మోంకార ఋక్సామ యజు రేవ చ॥ ౧౭
గతి ర్భర్తా ప్రభు స్సాక్షీ నివాస శ్శరణం సుహృత్
ప్రభవః ప్రళయ స్థానం నిధానం బీజ మవ్యయమ్॥ ౧౮

తపా మ్యహ మహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ
అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహ మర్జున ॥ ౧౯

క్రతువు (అనగా: శ్రౌత యజ్ఞము) నేను, యజ్ఞము (అనగా: స్మార్త యజ్ఞము) నేను, స్వధయును (అనగా: శ్రాద్ధము నందు పితృ దేవతల కర్పింపబడు నన్నమును) నేను, ఔషధము (అనగా: వనస్పతులనుండి యజ్ఞార్థమై బయలుదేరిన యన్నమును) నేను, (యజ్ఞము నందు హోమము చేయుచు చెప్పబడు) మంత్రములు నేను, ఆజ్యమును నేను, అగ్నియు నేను, (అగ్ని యందు హోమము చేయబడిన) యాహుతియు నేనే. ౧౬. ఈ జగత్తునకు దండ్రిని, తల్లిని, ధాతను, (ఆధారభూతుడను) పితామహుడను, (తాతను) నేను. పవిత్రమయిన వస్తువును జ్ఞేయమైన వస్తువును, ఓంకారమును, ఋగ్వేదమును, సామవేదమును, యజుర్వేదమును నేనే. ౧౭. (అందఱు) గతిని, (ఎల్లవారికి) పోషకుడను, ప్రభువును, సాక్షిని, నివాసమును, శరణమును, సఖుడను, నుత్పత్తిని, ప్రళయమును, స్థితిని, నిధానమును, నవ్యయమగు బీజమును నేనే. ౧౮. ఓ యర్జునా! నేను వేడిని కలుగ జేయుచున్నాను. దానిని లేకయుండుటకును జేయుచున్నాను. అమృతమును, మృత్యువును, సత్తును, నసత్తును నేనే యయి యున్నాను. ౧౯.

మార్కండేయునారాయణ సంవాదము - అరణ్య- ౧౮౯.

భగవానువాచ. అపి దేవాశ్చ మాం విప్ర నహి జానంతి తత్త్వతః ॥

భగవంతుడు మార్కండేయున కిట్లు జెప్పుచున్నాడు. దేవతలైనను నన్ను దెలియజాలరు. నీవు భక్తుడవు గావున నీకు పదేశించుచున్నాను.

" అహం నారాయణో నామ ప్రభవ శ్శాశ్వతో వ్యయః
విధాతా సర్వభూతానాం సంహర్తా చ ద్విజోత్తమ ॥

నేను సర్వభూతములయొక్క సృష్టిప్రళయములకు నధికారి నగు నారాయణుడను. "పిబామ్యప స్సమావిద్ధా స్తాశ్చైవ విసృజామ్యహమ్ ॥" నే నుదకములను ద్రావుదును విడచెదను. ఇటులే పై శ్లోకముల యొక్క భావము లన్నియు స్పష్టముగా జెప్పంబడినవి. ఇత్యాది విశ్వరూపప్రకరణము.

: త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే ।
: తే పుణ్య మాసాద్య సురేంద్రలోక
మశ్నంతి దివ్యా న్దివి దేవభోగాన్ ॥ ౨౦
: తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి ।
: ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతం కామకామా లభంతే ॥ ౨౧

త్రైవిద్యులు అనగా: ఋక్, యజుస్సు, సామము నను మూడు వేదముల యందు నున్న కర్మ చేయువారును, సోమపులు (సోమపానము చేయువారును) నిష్పాపులు నగువారు నన్ను యజ్ఞములచే బూజించి స్వర్గలోకము నొందుదమని యిచ్ఛయించుచున్నారు. వారింద్రునియొక్క పుణ్యలోకమును జేరి స్వర్గమునందు దేవతల యొక్కననేకములగు దివ్య భోగముల ననుభవించుచున్నారు. ౨౦. ఆ విశాలమగు స్వర్గ లోకము ననుభవించి పుణ్యము క్షయించిన పిదప మరల జన్మ నెత్తి మృత్యులోకమునకు వచ్చుచున్నారు. ఇట్టి త్రయీధర్మముల (అనగా: మూడువేదముల యందలి యజ్ఞ యాగాది శ్రౌత ధర్మముల) నాచరించువారును, కామ్యములగు నుపభోగములను గోరువారును (స్వర్గమును గుఱించి) రాక పోకల జేయుచుందురు. ౨౧.

అరణ్య పర్వ- ౨౬౦- ౬౧. ముద్గలచరిత్ర.

ముద్గలుడు దుర్వాసాతిథ్యముచే కృతకృత్యుడై, దుర్వాస మహర్షిచే స్వర్గమునకు పొమ్మని చెప్పబడెను. ఇంతలో స్వర్గము నకు సకుటుంబముగ గొనిపోవుటకు విమాన సహితుడై, వచ్చిన దేవదూత ముద్గలుని స్వర్గమునకు రమ్మనియె. ముద్గలుడు, స్వర్గ సుఖము లెవ్వియని యడిగిన, దేవదూత యిట్లని జెప్పె. "స్వర్గ మునందు సకలసంపదలు, సర్వసుఖములు గలవు. స్వ కృతపుణ్య వశమున ఫల భోగముల ననుభవించి, తరువాత పురుషుడు, తతః పిపతిష్యస్వయం, పడిపోవుదునను భయము పొందును. ఇదియే స్వర్గమునందలి యొక గొప్ప దోషము."

దేవదూతయొక్క యీ వాక్యముల విని ముద్గలుడిట్లనియె.

" పతనాంతే మహ ద్దుఃఖం పరితాప స్సుదారుణః

స్వర్గభాజ శ్చరంతీహ తస్మా త్స్వర్గం న కామయే " స్వర్గ మునందు పతన దుఃఖము గలదు. కావున నేను స్వర్గమును కోరను.

" యత్ర గత్వా న శోచంతి న వ్యథంతి చలంతి చ

త దహం స్థాన మత్యంతం మార్గయిష్యామి కేవలమ్ "

ఎచ్చటికి వెళ్ళిన దుఃఖ ముండదో యట్టి స్థానమునే నేను కోరెదను. కావున నాకా స్థానము నుపదేశింపుమనిన దేవదూత యిట్లు జెప్పెను.

" బ్రహ్మణ స్సదనా దూర్ధ్వం త ద్విష్ణోః పరమం పదమ్

శుద్ధం సనాతనం జ్యోతిః పరం బ్రహ్మేతి యం విదుః ॥ "

బ్రహ్మలోకమునకన్నను మిన్నయగు విష్ణుపదము గలదు. అదియె సనాతనమగు పరబ్రహ్మ స్థానము. దానిని పొందినవారు తిరిగి రానేరరు. అని జెప్పి దివమునకు వెళ్ళెను.

: అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే

: తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం ౨౨

ఎవరు అనన్య నిష్ఠులయి నన్ను జింతించుచు నన్నుపా సించుచున్నారో, యట్టి నిత్య యోగయుక్తులయిన పురుషుల యొక్క యోగ క్షేమములను నేను వహించుచున్నాను. ౨౨.

శాంతి- ౩౪౭- ౮౨- వైశంపాయనోవాచ.

మనీషిణో హి యే కేచి ద్యతయో మోక్షధర్మిణః
తేషాం విచ్ఛిన్నతృష్ణానాం యోగక్షేమవహో హరిః ॥

నారాయణుడే పరమగతిగాగల యేకాంతభక్తు లెప్పుడును బురుషోత్తముని జింతించుకొనుచు నీప్సితముల నొందుచున్నారు. మోక్షధర్మ సంపన్నులును, నిరాశులు నగు యతుల యోగ క్షేమములను 'హరి' యే దాల్చుచున్నాడు.

సభాపర్వ- ౬౮- ద్రౌపదీప్రార్థన.

జూదమునందు ధర్మనందనుని యైశ్వర్యమును గెలిచిన దుర్యోధనుడు, ద్రౌపదివస్త్రముల హరించు మనినపుడా ద్రౌపది యొకరిని సహాయము గోరక భగవంతు నిట్లు ప్రార్థించెను.

" ఆకృష్యమాణే వసనే ద్రౌపద్యా చింతితో హరిః
గోవింద ద్వారకావాసిన్ కృష్ణ గోపీజనప్రియ ॥ "

గోవిందాదినామములచే నీరీతిగ చింతన జేసినందున భగవంతుడామె మనోరథ మీడేర్చి దుర్యోధనాదుల మనోరథంబుల భగ్నము గావించెను. ఇదియే పై శ్లోకమునకు గొప్పదృష్టాంతము.

తత్రైవ రత్నాని ధనం చ కేవలం
ధరా తు కృత్స్నా తు మహాభుజా ద్య వై ।
యదస్తి చాన్య ద్ద్రవిణం గృహే మమ
త్వమేవ తస్యేశ్వర నిత్య మీశ్వరః ॥ అశ్వ- ౫౨- ౨౨.

అన్ని విధముల చేతను తనయందే చిత్తముంచిన ధర్మనందనునితో " ఓ ధర్మనందనా! నాయొక్క సర్వైశ్వర్యములకు నీవే ప్రభుడవు. " అని జెప్పి శ్రీకృష్ణుడు ద్వారకకు బోయెను.

అనన్య భక్త స్స సత స్తత్పరస్య జితాత్మనః
వరదో భగవా న్విష్ణు స్సమీపస్థం ద్విజోత్తమం ॥ శా. ౩ ౩౫-౩౧

బ్రాహ్మణ శాపమువలన పాతాళమును పొందినట్టి యుపరిచరవసువును అనన్య భక్తిపరుడని తెలుసుకొని విష్ణుమూర్తి, గరుత్మంతుని బంపి దన సాన్నిధ్యమునందుంచుకొనియెను.

యే ప్యన్యదేవతాభక్తా యజంతే శ్రద్ధయా న్వితాః
తే పి మా మేవ కౌన్తేయ యజంత్యవిధిపూర్వకమ్ ॥ ౨౩

ఓ కౌన్తేయా! భక్తి శ్రద్ధాయుక్తులయి యితర దేవతలను యజించువారు సైతము నన్నే యజించిన వారగుదురు; కాని, యా యజనము శాస్త్రోక్తమయినది కాదు. ౨౩.

బ్రహ్మాణం శితికంఠం చ యా శ్చా న్యా దేవతా స్స్మృతాః
ప్రబుద్ధచర్యా స్సేవంతో మా మే వైష్యంతి యత్పరం ॥
శాం- ౩౪౨- ౩. శ్రీకృష్ణః

ప్రబుద్ధచర్యులగువారును (ఏకాంతులు) బ్రహ్మను శివుని మఱియు తక్కిన దేవతలను సేవించుచుందురు. కాని యందుల కెల్ల ఫలముగా నన్నే పొందుదురు. నా భక్తులయందు గల విశేష మిద్యదియే. అర్జునా! నీకు వివరముగా దెలిపితిని.

అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభు రేవ చ
న తు మా మభిజానంతి తత్త్వేనా త శ్చ్యవంతి తే ॥ ౨౪

కారణమేమన: సర్వ యజ్ఞములకు భోక్తను, స్వామిని నేనే యయి యున్నాను. వారొక్క తత్త్వము తెలియక పోవుటచే వారు మరల జనన మరణ ప్రవాహమున బడుదురు. ౨౪

యాంయం తు భావితా యజ్ఞై స్సర్వ యజ్ఞేషు మానవైః
మాం తత్తో భావయుత్వా [illegible] భావనా మమ ॥

నేను సర్వభూతములయొక్క సృష్టిప్రళయములకు నధికారి నగు నారాయణుడను. "పిబామ్యాప స్సమావిద్ధా స్తాశ్చైవ విసృజామ్యహమ్ ॥" నేనుదకములను ద్రావుదును విడచెదను. ఇటులే పై శ్లోకముల యొక్క భావము లన్నియు స్పష్టముగా జెప్పంబడినవి. ఇయ్యది విశ్వరూప ప్రకరణము.

: త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే ।
: తే పుణ్య మాసాద్య సురేంద్రలోక
మశ్నంతి దివ్యా న్దివి దేవభోగాన్ ॥ ౨౦
: తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి ।
: ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతం కామకామా లభంతే ॥ ౨౧

త్రైవిద్యులు అనగా: ఋక్, యజుస్సు, సామము నను మూడు వేదముల యందు నున్న కర్మ చేయువారును, సోమపులు (సోమపానము చేయువారును) నిష్పాపులు నగువారు నన్ను యజ్ఞములచే బూజించి స్వర్గలోకము నొందుదమని యిచ్ఛయించుచున్నారు. వారింద్రునియొక్క పుణ్యలోకమును జేరి స్వర్గమునందు దేవతల యొక్క ననేకములగు దివ్య భోగముల ననుభవించుచున్నారు. ౨౦. ఆ విశాలమగు స్వర్గ లోకము ననుభవించి పుణ్యము క్షయించిన పిదప మరల జన్మ సెత్తి మృత్యులోకమునకు వచ్చుచున్నారు. ఇట్టి త్రయీధర్మముల (అనగా: మూడువేదముల యందలి యజ్ఞయాగాది శ్రౌత ధర్మముల) నాచరించు వారును, కామ్యములగు నుపభోగములను గోరువారును (స్వర్గమును గుఱించి) రాకపోకల జేయుచుందురు. ౨౧.

అరణ్య పర్వ- ౨౬౦- ౬౨. ముద్గలచరిత్ర.

ముద్గలుడు దుర్వాసాతిథ్యముచే కృతకృత్యుడై, దుర్వాస మహర్షిచే స్వర్గమునకు పొమ్మని చెప్పబడెను. ఇంతలో స్వర్గము నకు సకుటుంబముగ గొనిపోవుటకు విమాన సహితుడై, వచ్చేసి దేవమాత ముద్గలుని స్వర్గమునకు రమ్మనియె. ముద్గలుడు, స్వర్గ సుఖము లెవ్వియని యడిగిన, దేవమాత యిట్లని చెప్పె. "స్వర్గ మునందు సకలసంపదలు, సర్వసుఖములు గలవు. స్వ కృతపుణ్య వశమున ఫల భోగముల ననుభవించి, తరువాత పురుషుడు 'తతః పిపతిషా స్త్వయం, పడిపోవుదునను భయము పొందును. ఇదియే స్వర్గమునందలి యొక గొప్ప దోషము."

దేవమాతయొక్క యీ వాక్యముల విని ముద్గలుడిట్లనియె.

" పతనాంతే మహా ద్దుఃఖం పరితాప స్సుదారుణః
స్వర్గభాజ శ్చరంతీ హ తస్మా త్స్వర్గం న కామయే " స్వర్గ

మునందు పతన దుఃఖము గలదు. కావున నేను స్వర్గమును కోరను.

" యత్ర గత్వా న శోచంతి న వ్యథంతి చలంతి చ
త దహం స్థాన మత్యంతం మార్గయిష్యామి కేవలమ్ "

ఎచ్చటికి వెళ్ళిన దుఃఖ ముండదో యట్టి స్థానమునే నేను కోరెదను. కావున నాకా స్థానము నుపదేశింపుమనిన దేవమాత యిట్లు జెప్పెను.

" బ్రహ్మణ స్సదనా దూర్ధ్వం త ద్విష్ణోః పరమం పదమ్
శుద్ధం సనాతనం జ్యోతిః పరం బ్రహ్మేతి యం విదుః ॥ "

బ్రహ్మలోకమునకన్నను మిన్నయగు విష్ణుపదము గలదు. అదియె సనాతనమగు పరబ్రహ్మ స్థానము. దానిని పొందినవారు తిరిగి రానేరరు. అని జెప్పి దివమునకు వెళ్ళెను.

అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ౨౨

ఎవరు అనన్య నిష్ఠులయి నన్ను జింతించుచు నన్నుపాసించుచున్నారో, యట్టి నిత్య యోగయుక్తులయిన పురుషుల యొక్క యోగ క్షేమములను నేను వహించుచున్నాను. ౨౨.

శాంతి- ౩౪౨- ౭౨- వైశంపాయనోవాచ.

మనీషిణో హి యే కేచి ద్యతయో మోక్షధర్మిణః
తేషాం విచ్ఛిన్నతృష్ణానాం యోగక్షేమవహో హరిః ॥

నారాయణుడే పరమగతిగాగల యేకాంతభక్తు లెప్పుడును బురుషోత్తముని జింతించుకొనుచు నిప్సితముల నొందుచున్నారు.

మోక్షధర్మ సంపన్నులును, నిరాశులు నగు యతుల యోగక్షేమములను 'హరి' యే దాల్చుచున్నాడు.

సభాపర్వ- ౬౭- ద్రౌపదీ ప్రార్థన.

జూదమునందు ధర్మనందనుని యైశ్వర్యమును గెలిచిన దుర్యోధనుడు, ద్రౌపదివస్త్రముల హరించుమనినపుడా ద్రౌపది యెవరిని సహాయము గోరక భగవంతు నిట్లు ప్రార్థించెను.

" ఆకృష్యమాణే వసనే ద్రౌపద్యా చింతితో హరిః
గోవింద ద్వారకావాసిన్ కృష్ణ గోపీజనప్రియ ॥ "

గోవిందాదినామములచే నీరీతిగ చింతన జేసినందున భగవంతుడామె మనోరథ మీడేర్చి దుర్యోధనాదుల మనోరథంబుల భగ్నము గావించెను. ఇదియే పై శ్లోకమునకు గొప్పదృష్టాంతము.

తథైవ రత్నాని ధనం చ కేవలం
ధరా తు కృత్స్నా తు మహాభుజా ద్య వై ।
య దస్తి చా న్య ద్ద్రవిణం గృహే మమ
త్వ మేవ తస్యే శ్వర నిత్య మీశ్వరః ॥ అశ్వ- ౫౨- ౨౨.

అన్ని విధముల చేతను తనయందే చిత్తముంచిన ధర్మనందనునితో " ఓ ధర్మనందనా! నాయొక్క సర్వైశ్వర్యములకు నీవే ప్రభుడవు. " అని జెప్పి శ్రీకృష్ణుడు ద్వారకకు బోయెను.

అనన్య భక్త స్స సత స్తత్పరస్య జితాత్మనః
వరదో భగవా న్విష్ణు స్సమీపస్థం ద్విజోత్తమం ॥ శా. ౩ ౩౭-౩౧

బ్రాహ్మణ శాపమువలన పాతాళమును పొందినట్టి యుపరిచర వసువును అనన్య భక్తిపరు డని తెలుసుకొని విష్ణుమూర్తి, గరుత్మంతుని బంపి దన సాన్నిధ్యమునం దుంచుకొనియెను.

యే ప్యన్యదేవతాభక్తా యజంతే శ్రద్ధయా న్వితాః
తే పి మా మేవ కౌన్తేయ యజం త్యవిధిపూర్వకమ్ ॥ ౨౩

ఓ కౌన్తేయా! భక్తి శ్రద్ధా యుక్తులయి యితర దేవతలను యజించువారు సైతము నన్నే యజించిన వారగుదురు; కాని, యా యజనము శాస్త్రోక్తమయినది కాదు. ౨౩.

బ్రహ్మాణం శితికంఠం చ యా శ్చా న్యా దేవతా స్స్మృతాః
ప్రబుద్ధచర్యా స్సేవంతో మా మే వైష్యంతి యత్పరం ॥
శాం- ౩౪౨- ౩. శ్రీకృష్ణః.

ప్రబుద్ధచర్యులగు వారును (ఏకాంతులు) బ్రహ్మను శివుని మఱియు తక్కిన దేవతలను సేవించుచుందురు. కాని యందుల కెల్ల ఫలముగా నన్నే పొందుదురు. నా భక్తులయందు గల విశేష మి య్యదియే. యర్జునా! నీకు వివరముగా దెలిపితిని.

అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభు రేవ చ
న తు మా మభిజానంతి తత్త్వేనా త శ్చ్యవంతి తే ॥ ౨౪

కారణమేమన: సర్వ యజ్ఞములకు భోక్తను, స్వామిని నేనే యయి యున్నాను. వారొక్క తత్త్వము తెలియక పోవుటచే వారు మరల జనన మరణ ప్రవాహమున బడుదురు. ౨౪

యూయం తు భావితా యజ్ఞై స్సర్వేషు క్షేషు మానవైః
మాం తతో భావయుష్యత్ర వేదా నో భావనా వమ ॥

యేన యః కల్పితో భాగ స్స తథా మా ముపాగతః ॥
( గీత- ౩- ౧౧- జూడుడు. ) శాం.- ౩౪౧. అ.

యాంతి దేవవ్రతా దేవా న్పితౄ న్యాంతి పితృవ్రతాః
భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినో౽పి మామ్॥

దేవతల యొక్క వ్రతము చేయువారు దేవతలను, పితృల యొక్క వ్రతము చేయువారు పితరులను, నా యా భూతముల బూజించు వారా యా భూతము లను, నన్ను యజించు వారు నన్నును నొందు చున్నారు. ౨౫.

"యే యజంతి పితౄ న్దేవా న్బ్రాహ్మణా న్గురూ నతిథి పంచమాన్"
పితరులను, దేవతలను, గురువులను, అతిథులను పూజించు వారుత్తము లని యున్నది

మఱియు, శ్రీకృష్ణుడు సాంబుని పుత్రునిగా బడయుటకు తపంబాచరించి, ప్రత్యక్షమయిన సదాశివుని వలన దన మనోరథ ముల బొందినదే గాక,

ద్విజేష్వ కోపం పితృతః ప్రసాదం
శతం సుతానాం పరమం చ భోగమ్ ।
కులే ప్రీతిం మాతృత శ్చ ప్రసాదం
శమప్రాప్తి మావృణే చాపి దాక్ష్యమ్ ॥ అనుశా- ౧౫.

ఈ శ్లోకమున జెప్పిన రీతిగ మాతృ పితృ ప్రసాదములు మొదలగు నెనిమిది వరములను గూడ పొందెను.

దేవతలు, పితృదేవతలు, వీరివలన నాత్మోద్ధరణము గలదని భారతమునందు విస్తారముగ గలదు శాం- ౩౪౦ వ అధ్యాయమున, "దేవకార్యా దపి మునే పితృకార్యం విశిష్యతే" దేవకార్య మున కన్నను పితృకార్యము గొప్పదనియు; ఆకారణము చేతనే, "మాతరం పితరం చైవ శుశ్రూషంతో దివం గతాః" అనియు,

"పితృశుశ్రూషయా బుద్ధిం సంప్రాప్తోయ మనుత్తమా" మనియు,
"స్వచ్ఛందమరణం తుష్టో దదౌ తస్మై మహాత్మనే" యనియు,
అనగా: పితృశుశ్రూషా భక్తుల వలన (శుకమహర్షియు, భీష్ము
డును,) నుత్తమ బుద్ధిని, స్వచ్ఛంద మరణము బొందగల్గి నియు,

అట్లే చిరకారి యనువాడును,

"దేవతానాం సమావాయ మేకస్థం పితరం విదుః
మర్త్యానాం దేవతానాం చ స్నేహా దభ్యేతి మాతరం"

తండ్రిని, దేవతలందఱు నొక్కటిగా జేరినమొత్తమనియు, తల్లిని, దేవతల యందును, మనుజుల యందును గట్టి స్నేహముతో గూడిన దనియు దలచి సేవించి యుత్తమగతి నందెను.

ధర్మవ్యాధుని చరిత్రయు పితృభక్తిని గుఱించి లోకప్రసిద్ధము. గాన, పితృశుశ్రూషా పరులు త్తమగతిని బొందెదరని భారతాశయము.

॥ పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
॥ తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః ॥ ౨౬

ఏవో యొకానొక పత్రమును గాని, పుష్పమును గాని, ఫలమును గాని, యథాశక్తిగ కొంచ ముదకము నయినను, భక్తితో నాకరిపించు నట్టి ప్రయతాత్ముని యొక్క అనగా: నియతో చిత్తుని యొక్క, యీ భక్తి యను కానుకను నే నానందముతో స్వీకరించు చున్నాను. ౨౬

"స్థాల్యాః కంఠేథ సంలగ్నం శాకాన్నం వీక్ష్య కేశవః
ఉపయుజ్యా బ్రవీ దేనా మనేన హరి రీశ్వరః
విశ్వాత్మా ప్రీయతాం దేవ స్తుష్ట శ్చా స్త్వితి యజ్ఞభుక్"

ద్రౌపదీ ప్రార్థన వలన ప్రత్యక్ష మయిన శ్రీకృష్ణుడు,
పాత్రయందు [illegible]

మును ద్రౌపది హస్తముతో గ్రహించి తృప్తు డయ్యెను.

దీనిని బట్టి యెంతకొద్దియయినను భగవంతునికి సమర్పించిన నదియె యనంతమగు ననుటకు సందియము లేదు.

మనో హ్లాదయతే యస్మా చ్ఛ్రియం చాపి దదాతి చ
తస్మా త్సుమనసః ప్రోక్తా నరై స్సుకృతకర్మభిః ‖
దేవతాభ్య స్సుమనసో యో దదాతి నర శ్శుచిః
తస్య తృప్యంతి వై దేవా స్తుష్టాః పుష్టిం దదంత్యపి ‖
యం య ముద్దిశ్య దీయేరన్ దేవం సుమనసః ప్రభో
మంగళార్థం స తేనాస్య ప్రీతో భవతి దైత్యప ‖
అనుశా- ౯౮- ౧౯.

దేవతల కొఱకు పుష్పముల నర్పించు వారికా దేవతలు తుష్టిని, పుష్టిని యిచ్చుచున్నారు. ఏ దేవతల గుఱించి పుష్పముల నిచ్చినను భగవంతుడు ప్రీతుడగుచున్నాడు.

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్ ‖ ౨౭
శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబంధనైః
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి ‖ ౨౮

ఓ కౌంతేయా! నీవు చేయు నదియు, భుజించు నదియు, హోమము చేయు నదియు, దానము చేయు నదియు, తపము చేయు నదియు, నాకు నర్పించుచుండుము. ౨౭. ఇట్లు చేయుటచే (కర్మలను చేసినను) కర్మల యొక్క శుభాశుభ ఫలరూపమగు బంధనము నుండి నీకు ముక్తి కలుగును. మఱియు (కర్మ ఫలములను) త్యజించుట యను నియోగముతో యుక్తాత్ముడవు (అనగా: శుద్ధాంతఃకరణ కలిగిన వాడవు)ను, ముక్తుడవు నగుచు నన్ను నొందుదువు. ౨౮.

దదాతి యత్పార్థివ యత్కరోతి
యద్వా తప స్తప్యతి యజ్జుహోతి
న తస్య నాశో౽స్తి న చాపకర్షో
నాన్య స్తదశ్నాతి స ఏవ కర్తా ॥ ఉ- ౧౨౮- ౨౩. నారదః.

రాజా! మనుజుఁ డాచరించు దానమును, కర్మయును, మఱియు తపస్సు, హోమము ననునివి నశించునవి గావు మఱియు వాని యందు న్యూనత లేదు. అట్లే యన్యుఁ డెవఁడును వాని ననుభవించఁడు. అవి (అనగా: మనుజుని యొక్క సుకృత దుష్కృతములు) వానినే (అనగా: కర్తనే) పొందును. అట్టి యీ కర్మలను భగవదర్పణము జేసినచో జన్మలను బొందనేరఁడు. అని నారదుఁడు దుర్యోధనునకు జెప్పెను.

: సమో౽హం సర్వభూతేషు న మే ద్వేష్యో౽స్తి న ప్రియః
: యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్ ॥

నేను సర్వభూతములకును సమానుఁడను గానే యున్నాను. నాకు (ఒకడు) ద్వేష్యుఁడు గాని, (అనగా: న ప్రియుఁడు) మఱియు (ఒకడు) ప్రియుఁడు (అనగా: నిష్టమైన వాఁడు.) కాఁడు. కాని, యెవరు నన్ను భక్తితో భజించుచున్నారో వారు నాయందును, నేను వారియందు నుందును. ౨౯.

త్వయి చాహం ద్విజశ్రేష్ఠ భవాన్మయి న సంశయః
లోకో౽యం భవత స్సర్వః కా చింతా మయి తే నఘ॥
శాంతి- ౩౬౪- ౬. నాగో వాచ.

బ్రాహ్మణా! నీయందు నేను. నాయందు నీవు. లోకమంతయు నీ వారు గావున నన్ను మఱి యొక విధముగా దలంచకుమనెను. అంత నా బ్రాహ్మణుఁడు,
" య ఏవ త్వం స ఏవాహం యో౽హం స తు భవాన్ సదా

అహం భవాంశ్చ భూతాని సర్వే యత్ర గతా స్సదా"

భుజంగమా! దేవతలుసయితము నీకంటె ఎక్కువగారనుట సత్యము. నేను, నీవు, భూతములు నన్నియు నే పరమాత్మ యందు జొచ్చువారమో యా పరమాత్మయే నేను. నే నెవడనో యాతడే నీవు. అని వచించెను.

ధర్మ పరాయణు లగు వారు భగవంతుని యందు జేరుదురు. ఈ చరిత్ర యతిథి సత్కారములను బోధించును.

ఈ విషయమై శ్రీకృష్ణుడే స్వయముగా ధర్మ రాజునకు చెప్పిన వాక్యములు కొన్ని గలవు-

" న చ మే స్తోక మప్యాసీ ద్దుఃఖ మీర్ష్యాకృతం తదా"

ధర్మనందనా! దూర్వాసాతిథ్యము నందు నాకనేక బాధలు గలిగినను నే నేవిధమగు దుఃఖమును బొందలేదు.

ఈ చరిత్ర జూచినచో శ్రీకృష్ణునకు గల బ్రాహ్మణ గౌరవము బోధపడును. అనుశా- ౧౫౯- అ.

అపి చే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్
సాధు రేవ స మంతవ్య స్సమ్య గ్వ్యవసితో హి సః ॥ 30
క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వ చ్ఛాంతిం నిగచ్ఛతి
కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥ 31

విశేషదురాచారి యైనను, నన్ను నన్య భావముతో భజించినచో నతడు సాధువే యని తెలిసికొన వలయును. కారణమేమి యనః నతని బుద్ధికిమంచి నిశ్చయము గలిగియున్నది. 30. వాడు శీఘ్రముగధర్మాత్ముడగును. మఱియు నిత్యమగు శాంతి నొందును ఓ కౌంతేయా! నాయొక్క భక్తు డెప్పుడును నాశము నొందడని నీవు బాగుగ దెలిసి కొనుము. 31

పాండవా! శ్రీవత్సే ... బ్రాహ్మణ ... పాండవా!

సర్వ మేత దన్నం భోక్తవ్య మన్నం దుష్టాభిసంహితం
క్షత్తు రేకస్య భోక్తవ్య మితి మే ధీయతే మతిః ॥
ఉద్యో- ౯౦- ౩౩.

రాయ బారము నకు వెళ్ళిన శ్రీకృష్ణుని దుర్యోధనాదులు మాయింట భుజించు మని కోరినపుడు, కృష్ణు డిట్లు నుడివెను.
" దుర్యోధనా! శత్రువుల యన్నమును భుజింప రాదు. నీవు పాండవులను ద్వేషించుచుందువు; పాండవులె నా ప్రాణములు. గాన ఈ దుష్టాన్నము నే నొల్లను. విదురుని యింట భుజింతునని నిశ్చయించుకొంటిని. " అని జెప్పి, " విదురాన్నాని బుభుజే శుచీని గుణవంతి చ " శుచియు, గుణవంతము నగు విదురాన్నమును గ్రహించెను. ఇందువలన భక్తులే వర్ణము వారయినను, భగవంతుని కిష్టులనియు, భక్తులకు ద్వేషులగువారు భగవంతునికి పరమ ద్వేషులనియు యెఱుంగవలయును. ఉద్యో- ౯౦ దుర-
యా మే ప్రీతిః పుష్కరాక్ష త్వద్దర్శన సముద్భవా
సా కి మాఖ్యాయతే తుభ్య మంతరాత్మాసి దేహినాం ॥

మాం హి పార్థ వ్యపాశ్రిత్య యే పి స్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తే పి యాంతి పరాం గతిమ్॥

కారణమేమన: ఓ పార్థా! నన్నాశ్రయించి, స్త్రీలును, శూద్రులును, నంత్యజాలు మొదలగు పాప యోనులు సైతము పరమ గతి నొందుచున్నారు. ౩౨

కిం పున ర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా
అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్ ॥ ౩౩

ఇక పుణ్యమతులగు బ్రాహ్మణులును, నాకు భక్తులగు రాజర్షులును ( క్షత్రియులు ) నను వారి విషయము చెప్ప నేల ? ఈ యనిత్యమును అసుఖమును ( అనగా; దుఃఖము నిచ్చునదియు

నగు పృత్యు) లోకమునందు నీవుంటివి కాన, నన్ను భజింపుము.
వాసుదేవ స్సముద్ధర్తా భవితా తే జనార్దనః ॥ అనుశా- ౭౮-౨౫.

బ్రాహ్మణా! పాపవశమున తిర్యగ్యోనియందు జన్మించిన నిన్ను వాసుదేవు డుద్ధరించ గలడని యముడు జెప్పగా బ్రాహ్మణుడట్లుజేసెను. "తిర్యగ్యోని మహం ప్రాప్తో నచ మా మజహాత్స్మృతిః" నేను జంతువ నైనను పూర్వజన్మ స్మృతి గలిగి, "అనుజానీహి మాం కృష్ణ గచ్ఛేయం దివ మద్య వై" కృష్ణా! యనుగ్రహింపుము. నీ యాజ్ఞ యైనచో నుత్తమ గతి నందెదను." అని పలికి వాసుదేవానుజ్ఞ వడసి, "విమానం దివ్య మాస్థాయ యయౌ దివ మరిందమః"

ఇమం ధర్మం సమాస్థాయ యే పి స్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తే పి యాంతి పరాం గతిం ॥
కిం పున ర్బ్రాహ్మణాః పార్థ క్షత్రియా వా బహుశ్రుతాః
స్వధర్మ రతియో నిత్యం బ్రహ్మలోక పరాయణాః ॥
అనుగీత- ౧౯- ౬౧. వాసుదేవః.

ఈ యధ్యాయము భగవంతు డర్జునునకు బోధించినది పై గీతాశ్లోకము లిట దిరిగి జెప్ప బడినవి. అర్జునా!

"ఇంద్రియాణి తు సంహృత్య మన ఆత్మని ధారయేత్
తీవ్రం తప్త్వా తపః పూర్వం మోక్షయోగం సమాచరేత్"

ఇంద్రియముల నుపసంహరించి, ఆత్మ యందు మనస్సును స్థిరపఱచి తీవ్రతపస్సును గావించి మోక్షయోగము నాచరింప వలయును. దుఃఖశోకములు, సంగ స్నేహములు నను వీటికి భయపడ జనదు. "జీవో నిష్క్రామంత మాత్మానం శరీరా త్సంప్రపశ్యతి
స తముత్సృజ్య దేహే స్వం ధారయ న్బ్రహ్మ కేవలం ॥
ఆత్మాన మాలోకయతి మనసా ప్రహస న్నివ

తదేవ మాశ్రయం కృత్వా మోక్షం యాతి తతో మయి ”
జీవుడు శరీరమునుండి వెడలునట్టి యాత్మను జూడగలడు; జీవుడా దేహమును వదలి తనయందు బ్రహ్మను ధరించి, తనమనస్సుచే నానందించుచు యాత్మను జూడగలడు. దాని నాశ్రయించియే మోక్షమును పొందగలడు. ఇదియే నాచే జెప్పబడు రహస్యము.

“ పరా హి సా గతిః పార్థ యత్తద్బ్రహ్మ సనాతనం
యత్రా మృతత్వం ప్రాప్నోతి త్యక్త్వా దేహం సదా సుఖీ”

అర్జునా! ఏది సనాతన బ్రహ్మ పదార్థమో ఆ యుత్తమ గతి నేనే. అదియె దేహమును వదలి సుఖించు స్థానము. అదియె “ అమృత ” మన బడును.

“ ఇమం ధర్మం సమాస్థాయ ” ఈ ధర్మము ననుసరించిన పాపులు, స్త్రీ వైశ్య శూద్రాదులును నైతము పరమ పదమును బొందుదురు. బ్రాహ్మణ, క్షత్రియుల జెప్ప నేల?

“ స్వధర్మ రతయో నిత్యం ” స్వ- ధర్మము నందాసక్తిగల వారలే బ్రహ్మ లోక పరాయణు లగుదురు.

“ ధర్మ కామా శ్చ రాజానో బ్రాహ్మణా ధర్మ సేతవః ” అనుగీత- ౪౩- ౧౭. ధర్మమును గోరువారు రాజులు; ధర్మమును నియమించు వారు బ్రాహ్మణులు. అన్నింటి కన్నను ధర్మ గొప్పది గావున, ధర్మ పరాయణులగు బ్రాహ్మణ క్షత్రియులు. భగవ దనుగ్రహ పాత్రులు.

సత్యం దమ స్తపో దానం క్షాంతి రార్జవ మేవ చ
సాధకాని సదా పుంసాం న జాతి ర్న కులం నృప॥ అర- ౨౦౦.

సత్యము, ఇంద్రియ నిగ్రహము, తపో దానములు, అహింసా స్వ- ధర్మములును ఆత్మ సాక్షాత్కారమునకు కారణములు. కాని, జాతులు, కులములు కారణములు గావు.

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః ॥౩౪

నాయందు మనస్సు నుంచుము. నా భక్తుడవు కమ్ము. నా యొక్క యజన పూజనల జేయుము. నన్ను నమస్కరింపుము. ఇట్లు మత్పరాయణుడవై నీ యొక్క యోగము నవలంబించితి వేని నన్నే పొందుదువు. ౩౪.

దారితశ్చ స వజ్రేణ మహాయోగీ మహాసురః
జగామ పరమం స్థానం విష్ణో రమితతేజసః ॥
విష్ణుభక్త్యా హి తేనేదం జగద్వ్యాప్త మభూత్తదా
తస్మాచ్చ నిహతో యుద్ధే విష్ణోః స్థ్సాన మవాప్తవాన్ ॥
శాంతి- ౨౯౫. భీష్మౌవాచ.

నాయందు భక్తిగలవారు నన్నే పొందుదురను భగవదుక్తి ననుసరించి వృత్రాసురుడు విష్ణుభక్తిచే జగత్తంతయు వ్యాపించినవాడై యుద్ధమునందు వజ్రహతుడగుచు నుత్తమమగు విష్ణుస్థానమును పొందినవాడయ్యెను.

భగవద్భక్తిపరులు లోకకంటకు లయినను, అంతమునందు పరమపదమునే పొందుదురు. ఇందుకు వృత్రాసురుడే నిదర్శనము.

భక్త్యా దేవం విశ్వోత్పన్నం
యస్మాత్సర్వే లోకాః స్సంప్రసూతాః ।
వేదా ధర్మా మునయ శ్శాంతా స్సర్వే తస్య నిసర్గః ॥
శాంతి- ౩౩౭- ౧౨.

ఎవని నుండి ఈ సర్వ లోకములును, అంగ సహితము లగు వేదములును, ధర్మములును, సమస్త చరాచర మందలి స్థూలసూక్ష్మాది శరీరములు గలవారును, శాంతులు నగు మునులును బుట్టుచుండురో; యట్టి విశ్వోత్పన్నుడగు దేవుని భక్తిచే గ్రమింగ జాలినట్టు చూపుచుందురు, ఇట్టి వారెల్లపుడును,-

" తత్ర నారాయణ పరా మానవా శ్చంద్ర వర్చసః
ఏకాంత భావో పగతా స్తే భక్తాః పురుషోత్తమమ్ ॥ "

శ్వేత ద్వీపమునందు గల మనుష్యులు చంద్రునితో సమాన మగు కాంతి గలిగి వెలుఁగుచుందురు. వారందఱును నారాయణ పరులు. ఆ భక్తులు పురుషోత్తము నేకాంత భావముతో బొందిన వారు. వారు సహస్ర కిరణుండును, సనాతనుఁడును నగు దేవుని ప్రవేశించు చుందురు.

మఱియు వారిట్లు జపమును జేయు చుందురు.

" జితం తే పుండరీకాక్ష నమ స్తే విశ్వభావన
నమ స్తే స్తు హృషీకేశ మహాపురుష పూర్వజ ॥ "

భక్తులకీయధ్యాయమే శరణ్యము.

---

రాజవిద్యా రాజగుహ్య యోగమను
నవ మాధ్యాయము సమాప్తము.

శ్రీ మ ద్భా గ్య న గ ర స్థి త
శ్రీ మ దు ద్భ టా రా ధ్య వం శ భా ర ద్వా జ స గో త్ర
వైద్యకళావిశారద ముదిగొండ మల్లనారాధ్యపుత్ర
ముదిగొండ బుచ్చయ్య లింగా రాధ్యేన
శ్రీ మ ద్భ గ వ ద్గీ తా
మహాభారత ప్రమాణ వచనైః
ప్ర క టి తా .

శ్రీ మద్దక్షిణా మూర్తయే నమః

# శ్రీ కుమార గీత

## విభూతి యోగము.

### దశమాధ్యాయము.

సహస్ర శీర్షాయ నమశ్శివాయ సహస్ర నామాయ జనార్దనాయ॥

శ్రీ భగవానువాచ.

భూయ ఏవ మహాబాహో శ్రుణు మే పరమం వచః
యత్తేహం ప్రీయ మాణాయ వక్ష్యామి హిత కామ్యయా॥ ౧

శ్రీ భగవంతుడు చెప్పుచున్నాడు:- ఓ మహా బాహువా! (నా సంభాషణముచే) సంతుష్టుడవగు నీ యొక్క హితమునకై మరల చెప్ప బోవు విషయమును వినుము.

న మే విదుః సుర గణాః ప్రభవం న మహర్షయః
అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః॥ ౨

నా యొక్క యుత్పత్తి దేవతల గణమునకును, మహర్షుల కైనను తెలియదు. కారణమేమనగా: దేవతలకును, మహర్షులకును అన్ని విధముల చేతను నేనే యాది కారణము.

యో మామజ మనాదిం చ వేత్తి లోక మహేశ్వరమ్
అసమ్మూఢ స్స మర్త్యేషు సర్వ పాపైః ప్రముచ్యతే॥ ౩

నేను (పృథివి మొదలుగా గల యన్ని) లోకములకును గొప్ప యీశ్వరుడ నగుటచే నాకు జన్మయును, నాదియు లేదని తెలిసి కొనువాడే మనుష్యులలో మోహ విరహితుడై సర్వపాపముల నుండియు విముక్తుడగు చున్నాడు.

శాంతి ౩౩౮- ౧౩. భీష్మః.

ఉపరిచరవసు యజ్ఞమునందు హవిర్భాగముల గ్రహించు సమయమున విష్ణువు, యదృశ్యుడై దన భాగమును మూర్కొనుచు బలిగ్రహించెను అందులకు "బృహస్పతి స్తతః క్రుద్ధః స్రుచ ముద్యమ్య వేగితః" బృహస్పతి దనకు విష్ణువు గనుపడక పురోడాశమును గ్రహించెనని క్రుద్ధుడయి స్రుచము నెత్తి బలముకొలది యాకాశమున విసరివైచి, రోషముచే నశ్రుల విడచెను. అప్పుడు ఏకత ద్వితతాదు లిట్లు జెప్పిరి. "వేలకొలది వత్సరములు తపం బాచరించి, 'వయం త్వేనం న పశ్యామో మోహితా స్తస్య మాయయా', మే మాతని మాయచే మోహితులమై యతనింజూడ నశక్తుల మైతిమి శ్వేతద్వీపవాసులే యతనింజూడ నర్హులు" అని జెప్పి యాబృహస్పతి కోపముం జల్లార్చిరి.

మాయా మోహితులు భగవంతుని జూడజాలరు.

బుద్ధి ర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమః శమః
సుఖం దుఃఖం భవో భావో భయం చా భయ మేవ చ ॥ ౪
అహింసా సమతా తుష్టి స్తపో దానం యశో యశః
భవంతి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః ॥ ౫

బుద్ధియు, జ్ఞానము, అసంమోహము, ఓర్పు, సత్యము, దమము, శమము, సుఖము, దుఃఖము, భవము ( పుట్టుట ), అభావము ( నాశము ) అటులే భయము, అభయము, ౪. అహింసయు, సమత, తుష్టి ( సంతోషము ), తపము, దానము, యశము, అయశము మొదలుగా గల యనేక విధములగు సర్వప్రాణుల యొక్కయు భావములు నావలననే పుట్టినవి. ౫.

మహర్షయ స్సప్త పూర్వే చత్వారో మనవ స్తథా

మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః ॥ ౬

సప్త మహర్షులు, నట్లె పూర్వమందున్న నలుగురగు మనువులును, ఎవరినుండి (ఈ లోకము నందున్న) ప్రజలు గలిగిరో వారును, నాయొక్క మానసులే (అనగా: మనస్సుచే నిర్మింపబడిన భావములే) యై యున్నారు. ౬.

సప్తైతే మానవాః ప్రోక్తాః ఋషయో బ్రహ్మణస్సుతాః
స్వయమాగతవిజ్ఞానా నివృత్తిధర్మమాస్థితాః ॥
చతురశ్చాప్యరో పుత్రాన్ దేహాత్పూర్వం మహాఋషిః
తే వై పితౄణాం పితరశ్శ్రూయంతే రాజసత్తమ ॥

శాంతి. ౩౮౦- ౭౨., ౩౨౨-౮.

ఈ ప్రకారముగ పై యధ్యాయము నందు సృష్టి యంతయు చక్కగ వర్ణింప బడినది. సర్వము భగవదీయ మని బోధపడును.

ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః
సో వికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః ॥ ౭
అహం సర్వస్య ప్రభవో మత్త స్సర్వం ప్రవర్తతే
ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః ॥ ౮
మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరం
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ ॥ ౯
తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే ॥ ౧౦
తేషా మేవా నుకంపార్థ మహ మజ్ఞానజం తమః
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥ ౧౧

నాయొక్క విభూతి యందును (విస్తారము) యోగము నందును, (ఈ విస్తరింపజేయు శక్తి లేక సామర్థ్యము) నున్న యోగము తత్త్వమును తెలిసికొనన్నవారికి స్థిరమయిన (కర్మ-) యోగము ప్రాప్తించును సంశయము లేదు. నేను సమ స్తమునకు నుత్ప

శ్రిసానమును, మఱియు, నావలన సర్వ వస్తువులును ప్రవర్తించినవి. ఈ విషయమును తెలిసికొనిన బుద్ధిమంతులు, భావయుక్తులగుచు నన్ను భజించుచున్నారు. ౮. నాయందు చిత్తమును నిలిపియు, నాయందు జీవప్రాణముల సమర్పించియు, నొకరి నొకరు బోధించుకొనుచు నాకథలు జెప్పుకొనువారు, తమలోపల తామే యెప్పుడును సంతోషించుచు, రమించుచు నుందురు. ౯. ఈవిధమున నెప్పుడును యుక్తులయి (అనగా: సమాధి యందుండి) ప్రీతిపూర్వకముగ నన్ను భజించువారికి నన్ను పొందుటకు దగిన (సమత్వ-) బుద్ధిరూపమయిన యోగమును నేనే యిచ్చు చున్నాను. ౧౦. మఱియు వారి ననుగ్రహించు నిమిత్తమై వారియొక్క యాత్మభావమందు (అనగా: నంతఃకరణమునందు) ప్రవేశించి, ప్రకాశించు చున్న జ్ఞానదీపముచే (వారి మనస్సునందు) అజ్ఞానమువలన గలిగిన యంధకారమును నశింప జేయుచున్నాను. ౧౧

శాంతి. ౩౪౦-౪౨. వాసుదేవః.

మత్తస్సర్వం సంభవతి జగత్థ్సావర జంగమం
అక్షరశ్చ క్షరశ్చైవ సచ్చాసచ్చైవ నారద ॥

నారదా! నావలన స్థావర జంగమాత్మకమగు జగత్తు జనించుచున్నది॥ క్షరాక్షరములు, సదసత్తులు గలుగుచున్నవి.

అరణ్యం. ౮౯ - ౧౩. వాసుదేవః

బ్రహ్మ వక్త్రం భుజౌ క్షత్ర మూరూ మే సంస్థితా విశః
పాదౌ శూద్రా భవంతీ మే విక్రమేణ క్రమేణ చ ॥
ఋగ్వేద స్సామ వేదశ్చ యజుర్వేదో ప్యథర్వణః
మత్తః ప్రాదుర్భవం త్యేతే మా మేవ ప్రవిశంతి చ ॥

నాలుగు వేదములు, నాలుగు వర్ణములు నావలన బుట్టుచు నంతమునందు నన్నే పొందుచున్నవి. మఱియు ..........., శాం

తులు, నియతాత్ములు, కామక్రోధ విముక్తులు, సంగరహితులు, రహితకల్మషులు, అహంకారత్యాగులు, ఆధ్యాత్మికాసక్తులు, వీఱందఱు "మామేవ సతతం విప్రా శ్చింతయంత ఉపాసతే" నన్నే యెల్లప్పుడు నుపాసన జేయుచుందురని నారాయణుడు మార్కండేయున కుపదేశించెను.

ఆర్జున ఉవాచ.

పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్ ॥ ౧౨

అహు స్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా
అసితో దేవలో వ్యాస స్స్వయం చైవ బ్రవీషి మే ॥ ౧౩

అర్జునుడు ప్రశ్న చేయుచున్నాడు.- నీవే పరబ్రహ్మవును, శ్రేష్ఠమగు స్థానమును, పరమ పవిత్రమగు వస్తువును నైయున్నావు; దివ్యుడు శాశ్వతుడు నగు పురుషుడును, నాదిదేవుడును, జన్మశూన్యుడును, సర్వవిభువును (అనగా: సర్వ వ్యాపి) నని- ౧౨ నిన్ను ఋషులును, దేవర్షియగు నారదుడును, అసితుడును, దేవలుడును, వ్యాసులవారును చెప్పుచున్నారు. నీవును నాకు నా విషయమునే స్వయముగ చెప్పుచున్నావు. ౧౩.

సర్వ మేత దృతం మన్యే య న్మాం వదసి కేశవ
న హి తే భగవ న్వ్యక్తిం విదు ర్దేవా న దానవాః ॥ ౧౪

స్వయ మేవా త్మనా త్మానం వేత్థ త్వం పురుషోత్తమ
భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే ॥ ౧౫

వక్తు మర్హ స్యశేషేణ దివ్యా హ్యాత్మ విభూతయః
యాభి ర్విభూతిభి ర్లోకా నిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి ॥ ౧౬

ఓ కేశవా! నీవు నాకు జెప్పిన విషయమంతయును సత్యమని తలచెదను. ఓ భగవానుడా! నీ యొక్క వ్యక్తిని (అనగా:

నీ యొక్క మూలమును) దేవతలు గాని రాక్షసులు గాని యెవ్వరు నెఱుగరు - ౧౪ ఓ భూత భావనా! యో భూతేశా! యో దేవ దేవా! యో జగత్పతీ! యో పురుషోత్తమా! నిన్ను నీవు నీ చేతనే తెలిసి కొను చున్నావు - ౧౫ నీ యొక్క విభూతులు దివ్యము లైనవి. వానిచే నీ జగత్తునంతను వ్యాపించి యుందువు. కావున: నీవే (కృపయుంచి) నాకా విషయమును పూర్ణముగ జెప్పుము. ౧౬

కథం విద్యామహం యోగిం స్త్వాం సదా పరిచింతయన్
కేషు కేషు చ భావేషు చింత్యోసి భగవన్మయా ॥ ౧౭
విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మే మృతమ్॥ ౧౮

ఓ యోగీశ్వరుడా! యెల్లప్పుడును నీచింతనముచేయు నేను నిన్నెట్లు తెలుసుకొనవలయునో? మఱియు నో భగవానుడా! యే యే పదార్థములలో నిన్ను నేను ధ్యానింపవలయునో నాకు జెప్పుము. ౧౭. ఓ జనార్దనా! నీ యొక్క విభూతిని, యోగమును, తిరిగి విస్తారముగ నాకు జెప్పుము. కారణ మేమన, నమృతతుల్యమగు (నీయొక్క భాషణమును) విని నేను తృప్తినొందకున్నాను.

భీష్మ - ౬౭. విశ్వోపాఖ్యానము. బ్రహ్మచే నొనర్పబడిన స్తవమునందలి బ్రహ్మర్షుల సిద్ధాంతములు. బ్రహ్మ -

సాధ్యానామపి దేవానాం దేవదేవేశ్వరః ప్రభుః
లోకభావన భావజ్ఞ ఇతి త్వాం నారదో బ్రవీత్॥

సాధ్యులకు, దేవతలకు దేవదేవేశ్వరుడనియు, ప్రభువనియు, సర్వజనులయొక్క భావన దెలిసినవాడనియు, నారదుడు జెప్పెను.

భూత భవిష్య ద్వర్తమానములు దెలిసినవాడని మార్కండేయులు ..., సర్వభూతములకు ... వాడను

సర్వ భూతముల కర్తవని యాంగిరసుడును నిన్ను నుతించిరి.

" అవ్యక్తం తే శరీరోత్థం వ్యక్తం తే మనసి స్థితం
దేవా వాక్సంభవా శ్చేతి దేవల స్త్వాం తథా బ్రవీత్"

దేవా! అవ్యక్తము నీ శరీరమువలన బుట్టినదనియు, వ్యక్తము నీమనస్సునందున్నదనియు, దేవత లందఱు నీ వాక్కువలన బుట్టిరనియు దేవలు డానతిచ్చెను.

మఱియు శిరస్సుచే నాకసము వ్యాపించినదనియు, బాహువులచే పృథ్వి ధరింప బడినదనియు, కుక్షియందు మూడులోకములున్నవనియు, సనాతన పురుషుడ వనియు,

" నైవం త్వా మభిజానంతి తపసా భావితా నరా " తపస్సువలన భావితులగు మనుజులు నిన్ను దైవ మనియు, దెలిసి కొనుచున్నారు. (అని) ఇట్టి ఋషి వాక్యముల చేతనే యర్జునుడు, ౧౩ వ శ్లోకమున భగవంతుని స్తుతించి యున్నాడు.

అనాద్యంతం పరం బ్రహ్మ న దేవా న ర్షయో విదుః
ఏక స్తద్వేద భగవా న్ధాతా నారాయణః ప్రభుః ॥
నారాయణా దృషిగణా స్తథా ముఖ్యా స్సురాసురాః ॥

శాంతి. ౩౧౮- ౬౩. ఆద్యంతములు లేని బ్రహ్మను దేవతలు, ఋషులు నెఱుఁగరు. నారాయణున కొకనికే దెలియును. ఆయన వలన ఋష్యాదులు దెలిసికొనిరి.

తే వరేణా భిసంపన్నా బలేన చ మదేన చ
నా వబుధ్యంతి సంమూఢా విష్ణు మవ్యక్తదర్శనమ్ ॥

శాంతి. ౩౮౯- ౧౨. వరములు, మదము, బలము వీటిం బట్టి మూర్ఖులగువారు విష్ణువు నెఱుంగరు. ఇది వరాహావతార చరిత్రయందు గలదు. అర్జునుడు సూత్ర ప్రాయముగా స్తుతించిన, ౧౪, శ్లోకములు ననంతమగు స్తోత్రము గావించినవి.

శ్రీ భగవా నువాచ

హంత తే కథయిష్యామి దివ్యా హ్యాత్మ విభూతయః
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నా స్త్యంతో విస్తరస్య మే ॥ ౧౯
అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః
అహ మాదిశ్చ మధ్యం చ భూతానా మంత ఏవ చ ॥ ౨౦

శ్రీ భగవంతుడు చెప్పుచున్నాడు - ఓ కురుశ్రేష్ఠుడా! మంచిది అటులే చెప్పెదను. కాని, నాయొక్క దివ్య విభూతు లలో ముఖ్యములైన వానిని చెప్పెదను. కారణ మేమనః నా యొక్క విస్తారమునకు నంతములేదు. ౧౯.

ఓ గుడాకేశుడా! సర్వభూతములలోపల నున్న యాత్మను నేనే. మఱియు (సర్వ) భూతములయొక్క యాదియు, మధ్య యు, నంతమును నేనే. ౨౦.

" సర్వేషా మేవ భూతానా మహం బ్రహ్మమయో మహాన్
భూతం పరతరం మత్తో విష్ణో ర్వాపి న విద్యతే "

---

ఈ విభూతి వర్ణనాను సారముగనే యనుశాసనిక పర్వము నందును (౧౪. ౩౧౧- ౩౨౧) అనుగీతల యందును (అశ్వ - ౪౩- ౪౪) పరమేశ్వరునియొక్క రూపము వర్ణింప బడినది కాని గీతలలో నున్న వర్ణనము దానికంటె మిక్కిలి సరసముగ నుండుట చే నిదియె యితర స్థలముల నను వదింపబడు చున్నదని స్పష్టమగు చున్నది. ఉదాహరణమునకై భాగవత పురాణముయొక్క పదు నొకండవ స్కంధమునందలి పదునాఱవ యధ్యాయము నం దిట్టి విభూతివర్ణనమునే భగవంతుడుద్ధవునకు నిరూపించెను. అది యీ యధ్యాయమునందున్న వర్ణనమువలె నున్నదని యక్కడనే (భా గ. ౧౧- ౧౬- ౬౭.) యారంభమునందు జెప్పబడినది.

* ఇది జ్ఞానగావ యజ్ఞుల్ [illegible]

అర్జునా! సర్వభూతములలో నేను బ్రహ్మమయుడను. విష్ణువు నయిన నాకంటె వేఱగు భూతము లేదు.

ఈ గీతలయందలి విభూతియోగమే భారతము.

ఆదిత్యానా మహం విష్ణు ర్జ్యోతిషాం రవి రంశుమాన్
మరీచి ర్మరుతా మస్మి నక్షత్రాణా మహం శశీ ॥ ౨౧
వేదానాం సామవేదో౽స్మి దేవానా మస్మి వాసవః
ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానా మస్మి చేతనా ॥ ౨౨

ద్వాదశాదిత్యులలో విష్ణువును నేనే, తేజశ్శాలురలో కిరణములు గలిగిన సూర్యుడను, (ఏడు, లేక ముప్పదితొమ్మిది) మరుత్తులలో మరీచిని నేనే యయి యున్నాను. నక్షత్రములలో చంద్రుడను నేనే. ౨౧. నేను వేదములలో సామవేదము నై యున్నాను. దేవతలలో నింద్రుడనయి యున్నాను. ఇంద్రియములలో మనస్సునై యున్నాను. భూతములలో చేతన (అనగా: ప్రాణముల యొక్క కదలుట) నేనే యై యున్నాను.

ఆదిత్యానాం హి సర్వేషాం విష్ణు రేక స్సనాతనః ॥ శాంతి.

అంశజాదిత్యులలో విష్ణువు సనాతనుడు.

అనుశా. ౧౪- ౩౨౭. సామవేదశ్చ వేదానాం యజుషాం శతరుద్రియం ॥ వేదములలో సామవేదమును నేనని భగవంతుడు జెప్పెను.

ఉపమన్యువు శ్రీకృష్ణునితో శివ మాహాత్మ్యమును జెప్పునపుడు "శివుడు వేదములలో సామవేదమనియు, యజుస్సులలో శతరుద్రీయమనియు ఇట్లే శివ కేశవుల కిరువురకి మాత్రమే విభూతి యోగము జెప్పంబడినది

భారతము నందు గూడ శివ కేశవులే పరాత్పరులని ధృవపరచ బడియున్నది. గీత సైతమా మార్గము నే యనుసరించుచున్నది.

రుద్రాణాం శంకర శ్చాస్మి విత్తేశో యక్షరాక్షసామ్
వసూనాం పావక శ్చాస్మి మేరు శ్శిఖరిణా మహమ్ ॥ ౨౩

మఱియు నేకాదశరుద్రులలో శంకరుడను నేనే, యక్ష రాక్షసులలో కుబేరుడను అష్ట వసువులలో పావకుడను నేను, సప్త పర్వతములలో మేరువును నేను. ౨౩.

అనుశాసనికం. శివమాహాత్మ్యం. ౧౪-౩౨౧. ఉపమన్యు:-
త్వం బ్రహ్మ సర్వదేవానాం రుద్రాణాం నీలలోహితః
ఆత్మా చ సర్వభూతానాం సాంఖ్యే పురుష ఉచ్యతే ॥
ఋషభ స్త్వం పవిత్రాణాం యోగినాం నిష్కళ శ్శివః ॥

శంకరా! నీవు దేవతలలో బ్రహ్మవు. రుద్రులలో నీలలోహితుడవు. సర్వభూతములలో నాత్మవు. సాంఖ్యమునందు పురుషుడవు. పవిత్రులలో ఋషభుడవు. యోగులలో నిష్కళుడ వగు పరశివుడవు అని యీరీతిగనే

శివ. కేశవుల విశ్వరూపములు సమములనుటకు నిదర్శనములు భారతమునందు విశేషముగా గలవు.

శాంతి. ౩౪౧- ౨౭. వాసుదేవః-
య స్తం వేత్తి స మాం వేత్తి యో ను తం స హి మా మను
రుద్రో నారాయణ శ్చైవ సత్త్వ మేకం ద్విధా కృతమ్॥

అర్జునా! రుద్రుని దెలియువాడు నన్ను దెలియును. నన్ను దెలిసినవాడు రుద్రుని దెలియును. శివ, కేశవుల నిరువురిని సత్త్వమొక్కటియె రెండుగా జేయబడినదని దెలియుము.

పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిం
సేనానీనా మహం స్కంద స్సరసా మస్మి సాగరః ॥ ౨౪

ఓ పార్థా! పురోహితులలో ముఖ్యుడగు బృహస్పతిని నేనే యని తెలిసికొనుము. సేనా నాయకులలో నేను స్కందుడను

(కుమారస్వామిని), జలాశయములలో నేనే సముద్రుడను. ౨౪

దేవతల నందరిని రాక్షసుల బారినుండి రక్షించిన మహా సుభావుడు కుమార స్వామి.                శల్య పర్వ. ౪౭- ౬౦.

తతః ప్రీతో మహాసేన స్త్రిదశేభ్యో వరం దదౌ
రిపూన్ హంతాస్మి సమరే యే వో వధచికీర్షవః ॥

దేవతలందఱు కుమారస్వామిని, సేనలకు పట్టాభిషిక్తుని గావించిరి. అంత కుమారస్వామి, సంతోషించినవాడై దేవతల గుఱించి "మిమ్ము బాధించు వారల నశింప జేయుదును" అని జెప్పి యటులె జేసి దేవతల రక్షించెను. ఈతని చరిత మత్యద్భుతము. శైవులకీ మహానుభావుడే శరణ్యుడు.

ఇట్టి గొప్ప తేజస్సుగలవాడే నేనని భగవద్వచనము.

అభిషిచ్య తతో దేవా వరుణం యాదసాం పతిం ॥ శల్య- ౪౭.

దేవతలు సముద్రుని సర్వజలములకధిపతినిగా నభిషేకించిరి. సర్వదేవతలచే నభిషేకింప బడినవాడు గనుక నే సముద్రుడు భగవదపరావతారుడు

మహర్షీణాం భృగు రహం గిరా మస్మ్యేక మక్షరమ్
యజ్ఞానాం జపయజ్ఞో స్మి స్థావరాణాం హిమాలయః ॥ ౨౫

మహర్షులలో భృగువును నేను, అక్షరములలో నేకాక్షరమును (ఓంకారమును) నేనే. యజ్ఞములలో జపయజ్ఞమును నేనే. స్థావరములలో (స్థిరపదార్థములలో) హిమాలయమును నేనే. ౨౫

భృగుమహర్షి గొప్ప వాడని, శాంతి యందు, భారద్వాజ మహర్షికి గలిగిన సంశయములను దీర్చు సందర్భమున నారదుడు, "స ఏవ భగవా న్విష్ణు రనంత ఇతి విశ్రుతః ॥ (అనగా: విష్ణువే, యనంతుడని దెలియబడుచున్నాడు)" అను యనంతాది శబ్దము లను దెలియ జెప్పి యున్నాడు.......... యాతడును భగవంతుడే యని

వర్ణించ బడెను. గాన భగవ న్మాహాత్మ్యము దెలిసినవారు భగవం తుని స్వరూపములే యని దెలియవలయును.

ఏకాక్షర మగు నోంకార మును, గీత- ( ౭-౮ ) లలో "ప్రణవ స్సర్వ వేదేషు" సర్వవేదములయందును ప్రణవమనియు, అనుగీతలలో "ఓంకార స్సర్వవేదానా" మనియు నుండుటచే నోంకారము భగవన్మయము.

అనుశా-౧౪౯ వ యధ్యాయమున భీష్మునిచే జపయజ్ఞమును గూర్చి యిట్లు జెప్పబడినది. "ధర్మనందనా! సర్వపాపహార మగు నీజపవిధానమును వినుము. "రాత్రా వహని ధర్మజ్ఞ జపన్ పాపైర్న లిప్యతే" రాత్రింబవళ్ళు నెపుడైనను జపించు వారి పాపము లన్నియు నశించును. ఈ జపము ( నమో వసిష్ఠాయ మహావ్రతాయ ) మహావ్రతుడగు వసిష్ఠుని దగ్గరనుండి ప్రారంభించ బడును. "సహస్రశీర్షాయ నమ శ్శివాయ సహస్రనామాయ జనార్దనాయ" యని శతరుద్రీయమునందలి రుద్రులును, వసువులును, ద్వాదశాదిత్యులు, (ఏకాదశ రుద్రులు,) విశ్వే దేవతలు, పితృదేవతలును, "అపి యజ్ఞస్య వేత్తారో దత్తస్య సుకృతస్య చ। అకృత్యా స్సర్వభూతేషు పశ్యంతి త్రిదశేశ్వరాః ॥" యజ్ఞము, దానము, సుకృతము నను వాని నెరిగి సర్వభూతములకును యజమానులయి యున్నారు. ఆశ్లో "నందీశ్వరో మహాకాయో గ్రామణీ ర్వృషభధ్వజః" యనియు, "ఈశ్వరా స్సర్వలోకానాం గణేశ్వరవినాయకాః" యనియు నందీశ్వరాదుల సర్వ లోకాధిపతులుగను, హిమాలయాది పర్వతములును,

"విష్ణు ర్దేవో థ జిష్ణుశ్చ స్కందశ్చాంబికయా సహ
కీర్తయ న్ప్రియత స్సర్వా న్సర్వపాపైః ప్రముచ్యతే"

విష్ణువు, జిష్ణువు, స్కందుడు.... అంబిక

ఈ పై జెప్పబడిన దేవతలను జపము జేయుటచే సర్వ పాపముల నుండియు ముక్తులగుదురు. ( ఈజప మింతటితో ముగియును. )

మఱియు మానవులలో యవక్రీత కణ్వాది ఋషులు, నారద దూర్వాసాదులును, రంతిదేవాదిరాజర్షులును వీరుగాక (ఈ) యధ్యాయము నందు జెప్ప బడిన వారందరి జపమును ( సావిత్రీ ముత్తమాం పఠన్ ) సావిత్రీజప మని యందురు.

ఇట్టి జపమును నాలుగు వర్ణములలో నెవరు గావించినను,
" న తేషాం విద్యతే దుఃఖం గచ్ఛంతి పరమాం గతిమ్ "
వారుత్తమ గతిని బొందు దురు.

శాంతిలో ౧౯౯ వ యధ్యాయమున జాపకో.పాఖ్యాన మొకటి గలదు. శా. ౩౪౦- ౧౧౪.

---

" యజ్ఞములలో జపయజ్ఞమును నేను " అను వాక్యము మిక్కిలి గొప్పదే; అనుగీతలయందు ( మ. భా. అశ్వ. ४४ - ౮) " యజ్ఞానాం హుత ముత్తమం " అనగా: యజ్ఞమునందు అగ్నిహోత్రములో హవిస్సును సమర్పించుటచే సిద్ధమగు యజ్ఞముత్తమమని జెప్పబడినది. మఱియు నిదియె వైదికులగు కర్మకాండ తత్పరులయొక్క మతము. కాని భక్తిమార్గమునందు హవిర్యజ్ఞము కంటె నామయజ్ఞము, జపయజ్ఞమును గొప్పవి గాన గీతయందు " యజ్ఞానాం జపయజ్ఞోస్మి " యను వాక్యము చెప్పబడినది.

మఱియొక యజ్ఞమును జేసినను చేయకపోయినను జపము చేతనె బ్రాహ్మణుడు సిద్ధి నొందు చున్నాడని మనువును నొకచోట ( ౨- ౮౭ ) చెప్పినాడు. భాగవతమునందు " యజ్ఞానాం బ్రహ్మయజ్ఞోహం " అని పాఠాంతరము కలదు.

* ( ఇది తిలకు గారి యాశయము )

జితం భగవతా తేన పురుషేణేతి భారత
నిత్యం జపపరా భూత్వా సరస్వతీ ముదీరయేత్ ॥
యో హ్యాస్మాకం గురుశ్రేష్ఠ కృష్ణద్వైపాయనో మునిః
జగౌ పరమకం జప్యం నారాయణ ముదీరయేత్ ॥

మా గురువగు వ్యాసమహర్షి 'నారాయణ' యను మంత్రమును జపించిరి. ఏకాంతివలందరు భగవన్నామజప ధ్యానములచే తరించినటుల గలదు. అందు జపమే మోక్ష సాధకము. కావున, జప యజ్ఞమే భగవంతుడు.

అశ్వత్థ స్సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః
గంధర్వాణాం చిత్రరథ స్సిద్ధానాం కపిలో మునిః ॥ ౨౬

వృక్షములన్నింటిలో నశ్వత్థమును (రావిచెట్టును), దేవర్షులలో నారదుడను, గంధర్వులలో చిత్రరథుడను, సిద్ధులలో కపిల మహా మునిని, ౨౬.

శాంతి. ౨౩౦. అ. యుధిష్ఠిరుడు (సర్వలోకము లకును ప్రియుఁడుగను, సమస్త ప్రాణులకు సంతోష కరుడు గను, సమస్త గుణములతో గూడిన వాడుగను భూమి యందెవ డున్నాడు? అని యడిగెను. అందులకు భీష్ముడు భరతర్షభా! నీవడిగిన యీ విషయమున నారదుని గూర్చి వాసుదేవ, ఉగ్రసేనులకు జరిగిన సంవాదమును వినుము. " యస్య సంకల్పతే లోకో నారదస్య ప్రకీర్తనే) లోకులందరు నారదుని మిక్కిలి గీర్తించు చుందురు. అతని సకలగుణ సంపన్నునిగా దలచు చున్నా రనిన యుగ్రసేనుని తో (నరాధిప యా న్మన్యే శృణు తా న్మే ప్రచక్షతః) వాసుదేవుడు చెప్పుచున్నాడు ఓ నరాధిపతీ! నాకు దెలిసినంత వఱకు నారదుని సుగుణముల నీకు దెలియఁజేయుచున్నాను వినుము.

అభేత్తా పరగుహ్యానాం తస్మా త్సర్వత్ర పూజితః
అవద్యో ... త్సర్వత్ర పూజితః ॥

కాలమును వ్యర్థపుచ్చకపోవుటయు, పర రహస్యము లను బయలుపరచకపోవుటయు, ఇంద్రియనిగ్రహమువలన కామ క్రోధములు లేకయుండుటయు నను నీసద్గుణములు గలుగు కారణముననే, యాతడు సర్వులకును పూజనీయుడై యున్నాడు.

ఇట్లు వాసుదేవుని మెప్పునడసిన నారదుడు గాక మరెవరు లోకపూజ్యు లగుదురు?

" సాంఖ్యస్య కర్తా కపిలః పరమర్షి స్స ఉచ్యతే " సాంఖ్యమునకు కర్తయగు కపిలుడు పరమఋషి యని జెప్పబడుచున్నాడు ఈ విషయము శాంతి ( అ- ౩౧౫. ) యందు వ్రాయబడినది.

ఉచ్చైశ్శ్రవస మశ్వానాం విద్ధి మా మమృతోద్భవమ్
ఐరావతం గజేంద్రాణాం నరాణాం చ నరాధిపమ్ ॥ ౨౭

గుఱ్ఱములలో నమృతమథనసమయమునందు బుట్టిన యుచ్చైశ్శ్రవమను గుఱ్ఱమును నేనే. గజశ్రేష్ఠములలో నైరావతమును నేనే. మఱియు మనుజులలో రాజును, ౨౭.

ఆయుధానా మహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్
ప్రజన శ్చాస్మి కందర్ప స్సర్పాణా మస్మి వాసుకిః ॥ ౨౮

ఆయుధములలో వజ్రమును నేను. గోవులలో కామధేనువును నేనే. మఱియు ప్రజలను పుట్టింప జేయు మన్మథుడను నేనే, సర్పములలో వాసుకిని నేనే. ౨౮.

అనంత శ్చాస్మి నాగానాం వరుణో యాదసా మహం
పితౄణా మర్యమా చాస్మి యమ స్సంయమతా మహం॥ ౨౯

మఱియు నాగములలో ననంతుడను నేనే. యాదస్సులలో ( జలమునందు నివసించు జంతువులలో ) వరుణుడను నేను. మఱియు పితృదేవతలలో నర్యముడను నేను, నియమించు వారిలో యముడను నేను. ౨౯.

: ప్రహ్లాద శ్చాస్మి దైత్యానాం కాలః కలయతా మహమ్
: మృగాణాం చ మృగేంద్రోహం వైనతేయశ్చ పక్షిణామ్॥ ౩౦

మఱియు దైత్యులలో ప్రహ్లాదుడను నేనే, గ్రింగు వారలలో కాలమునై యున్నాను. మఱియు పశువులలో మృగేంద్రుడను (సింహమును) నేను. మఱియు పక్షులలో గరుడుడను. ౩౦

ఉద్యోగం. అ-౩౫. విరోచన సుధన్వుల వివాదము.

ప్రహ్లాద పుత్రుడగు విరోచనుడు సుధన్వుడను బ్రాహ్మణునితో వాదించి, యావిషయమై ప్రాణములనే పణముగా నిర్ధారించి, యందు సాక్ష్యమునకై దన తండ్రినే గోరి, తండ్రి కడకు సుధన్వుని బిలుచుకొని పోయెను. అంత ప్రహ్లాదుడు వచ్చిన విరోచన సుధన్వుల గనుగొని వారలవివాద విషయము నెఱింగి; యనంతరము దానే తీర్పు జెప్పవలసియుండుటయు దన కేక పుత్రుడగుటయు నాలోచించియు సుధన్వునితో నీవే జయించితి వనియెను. ప్రహ్లాదుడీరీతిగ పుత్రాభిమానమునుగూడద్యజించి తన ధర్మమగు సత్యమునే పలికినందులకు సుధన్వుడు సంతోషించినవాడై,

" య ద్ధర్మ మవృణీథా స్త్వం న కామా దనృతం వదేః
పున ర్దదామి తే పుత్రం తస్మా త్ప్రహ్లాద దుర్లభమ్ ॥
ఏష ప్రహ్లాద పుత్ర స్తే మయా దత్తో విరోచనః॥ "

ప్రహ్లాదా! స్వలాభమును ద్యజించి కేవలధర్మమునకై సత్యము బలికి పుత్రునిగూడ బోగొట్టుకొన సిద్ధపడిన సత్యప్రియుడవగు నీకు దుర్లభుడయిన నీకుమారుని మరల యిచ్చుచున్నాను. అనిజెప్పెను.

ఈ కథవలన, మనము దెలియదగినదేమి యనః రాక్షసుడై యుండియు ధర్మము కొఱకు స్వార్థమును ద్యజించి సత్యమునే బలుకుట చేత ప్రహ్లాదుడు భగవత్స్వరూపుడని వర్ణింపబడియె ననియే!

శాంతి ౨౨౪ బలి వాసవ సంవాదము.

దీనుడై సంచరించు బలిని జూచి వాసవు డిట్లుం డుటకు కారణ మేమి యనః ఇంద్రునకు బలిజెప్పిన కాలమహిమ.

వాసవా! (కాలో హి దురతిక్రమః) కాలము దాటశక్య మయినదిగాదు. (కాలో హి బలవత్తరః) కాలము బలిష్ఠమైనది. ఇట్టి కాలమే జగత్తును నడపుచున్నది. (కాలః కలయతి ప్రజాః) కాలమే ప్రజలను నడపుచున్నది. కాలముకన్నను వేరుగ నడపు నది లేదు. (మాం చే దభ్యాగతః కాలః) నన్నిట్టి దశకు దీసుకొని వచ్చిన కాలము, (త్వా మ ప్యుపగమిష్యతి) నిన్నును పొందును. కావున, గర్వము విడిచి సంచరించుము. భగవంతుడే కాలము. కాలమే భగవంతుడని దెలియుము.

ఇది యొక జ్ఞానదాయక చరిత్ర.

పవనః పవతా మస్మి రామ శ్శస్త్రభృతా మహం
ఝుషాణాం మకర శ్చాస్మి స్రోతసా మపి జాహ్నవీ ॥ ౩౧

వేగముగలవారిలో వాయువును నేనే, శస్త్రధారులలో రాముడను నేను. చేపలలో మకరమును నేనే. నదులలో గంగను నేనే.

త్రేతాయుగే భవిష్యామి రామో భృగుకులోద్వహః ॥
అహం దాశరథీ రామో భవిష్యామి జగత్పతిః ॥ శాంతి.

త్రేతాయుగమున పరశురాముడను, పిమ్మట జగత్పతి యగు శ్రీరాముడ నగుదును.

సర్గాణా మాది రంత శ్చ మధ్యం చైవా హ మర్జున
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతా మహం ॥ ౩౨

ఓ యర్జునా! సృష్టికంతకు, నాదియు, నంతమును, మధ్యమును నేనే; విద్యలలో నధ్యాత్మ విద్యను, వాదించువారలలో వాదమును నేను. ౩౨.

శాంతి. ౩౪౦ - ౯౪. వ్యాస.

స ఆది స్స మధ్య స్స చాంతః ప్రజానాం
స ధాతా స నేయ స్స కర్తా స కార్యం ।
యుగాంతే ప్రసుప్త స్సుసంక్షిప్య లోకాన్
యుగాదౌ ప్రబుద్ధో జగ ద్యుత్ససర్జ ॥

ఆది మధ్యాంత రూపియగు పరమేశ్వరుడు ప్రజలకు సర్వము నిచ్చు వాడయి యుగాంతము నందు జగత్తును సంహరించి, యుగాదియందు జగత్తును నిర్మించు చుండును.

శాంతి. ౧౯౫. అధ్యాత్మం.

౩౨ హంత వక్ష్యామి తే పార్థ ధ్యానయోగం చతుర్విధం
యం జ్ఞాత్వా శాశ్వతీం సిద్ధిం గచ్ఛంతీహ మహర్షయః ॥

మహర్షులు దేనిని దెలుసుకొని శాశ్వతమగు సిద్ధిని బొందు చుందురో అట్టి ధ్యానమును జెప్పెద. ఇదియె యధ్యాత్మ విద్య యనబడును. భారతా! మనస్సును, బంచేంద్రియవర్గమును దమంకటనే యిట్టి ధ్యానయోగముచే ధ్యానమార్గమునందు నిలుచునట్లు జేసి, దరువాత శాంతిని బడయ వలయును. దైవ పౌరుషములచే నిది గానేరదు. కాని, ఇట్టిది సాధించిన వానికి సమాధి సుఖమే గాని దుఃఖములు గలుగ నేరవు.

: అక్షరాణా మకారో౽స్మి ద్వంద్వ స్సామాసికస్య చ
: అహ మేవా క్షయః కాలో ధాతాహం విశ్వతోముఖః ॥ 33

అక్షరములలో నకారమును నేనే, మఱియు సమాసములలో ( నుభయ పద ప్రధానమగు ) ద్వంద్వమును నేనే. నిమేషము, ముహూర్తము మొదలగు వానిలో నక్షయమగు కాలమును నేనే. సర్వతోముఖుడను ( అనగా: నలు ప్రక్కలు ముఖములు గల ధాత ( బ్రహ్మ ) దేవుడను నేనే. ౩౭.

మృత్యు స్సర్వహర శ్చాహ ముద్భవ శ్చ భవిష్యతామ్
కీర్తి శ్శ్రీ ర్వాక్చ నారీణాం స్మృతి ర్మేధా ధృతిః క్షమా ॥
మఱియు నందఱను నశింపజేయు మృత్యువును, తిరిగి జ
న్మించువారికి నుత్పత్తి స్థానమును నేనే. స్త్రీలలో కీర్తి, శ్రీ,
వాణి, స్మృతి, మేధ, ధృతి, క్షమ యను నవన్నియు నేనే. ३४
అనుగీతా. ४३. బ్రహ్మ.

మాహేశ్వరీ మహాదేవీ ప్రోచ్యతే పార్వతీ హి సా
ఉమాం దేవీం విజానీధ్వం నారీణా ముత్తమాం శుభామ్ ॥
స్త్రీలలో ఉమాదేవి యుత్తమురాలు. పురాణములయందు
( కృష్ణకాళ్యౌచ ) కాళీకృష్ణులు నేకాండ జనితులనియు గలదు.

బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసా మహం
మాసానాం మార్గశీర్షో హ మృతూనాం కుసుమాకరః ॥ ३५
అటులే సామలలో ( అనగా: గానము చేయదగిన వైదిక
ములగు స్తోత్రముల యందు ) బృహత్సామమును, ఛందస్సులలో
గాయత్రీ ఛందస్సును నేను. మాసములలో మార్గశీర్షము నేను,
ఋతువులలో వసంతుడను నేనే. ३५.

ద్వాదశ్యాం మార్గశీర్షే తు అహోరాత్రేణ కేశవం
అర్చ్యాశ్వమేధం ప్రాప్నోతి దుష్కృతం చా స్య నశ్యతి ॥
భారతమున ( ౧౨ ) మాసములలో మార్గశిరము మొదటి
దిగా జెప్పబడినది. మార్గశిర ద్వాదశియం దహోరాత్రములు
కేశవు నర్చించిన యశ్వమేధ ఫలము లభించును.

ద్యూతం ఛలయతా మస్మి తేజ స్తేజస్వినా మహం
జయో స్మి వ్యవసాయో స్మి సత్త్వం సత్త్వవతా మహమ్ ॥ ३६
మోసముచేయువారలలో నేను జూదమును. తేజస్వంతుల
యొక్క తేజస్సును నేను విజయశాలురగు పురుషులయొక్క విజ

యమును నేను; నిశ్చయము గల వారి యొక్క నిశ్చయమును నేను. సత్వశీలురయొక్క సత్వమును నేను. ౩౬

అనుగీత. ౫౧- ౩౬. వాసుదేవః.

ప్రసాదే చైవ సత్వస్య ప్రసాదం సమవాప్నుయాత్
లక్షణం హి ప్రసాదస్య యథా స్యాత్స్వప్నదర్శనమ్ ॥

మనుజుడు సత్వముయొక్క ప్రసన్నత (అనగా: నావిర్భావము లేక, పరిదర్శనము) వలననే, ప్రసాదమును (అనగా: ప్రసన్నత యను శారీరక వికాసమును) పొందగలడు. లేనిచో స్వప్నదర్శనము (అనగా: నెన్నడును చేసి చూచి యెరుగని విషయము కలలో గాన్పించునట్లు) వలె దురాపమగు బ్రసాదమును బొందనేరడు

కావున, మానవుని యుత్తరాభివృద్ధికి గారణమగు సత్వమును నేనని భగవంతుడు జెప్పియున్నాడు.

ఇట్లే యనుగీతాంశమున వాసుదేవుడర్జునునకు బోధించెను.

వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః
మునీనామప్యహం వ్యాసః కవీనాముశనా కవిః ॥ ౩౭

యాదవులలో వాసుదేవుడను నేను. పాండవులలో ధనంజయుడను, మునులలో వ్యాసుడను నేను. కవులలో శుక్రాచార్యుడను కవిని; ౩౭.

ఆది. ౬౭- ౧౫౨. యస్తు నారాయణో నామ దేవదేవస్సనాతనః
తస్యాంశో మానుషేష్వాసీ ద్వాసుదేవః ప్రతాపవాన్ ॥

సనాతనుడును నారాయణుడను పేరు గలిగిన వాడు నగు దేవదేవుని యంశమే వాసుదేవుడై మనుష్యలోకమున జనించును.

ఇంద్రస్యాంశ భవితా యస్య నారాయణ స్సఖః
సోఽర్జునేత్యభివిఖ్యాతో పాండోః పుత్రః ప్రతాపవాన్ ॥

ఎవనికి నారాయణుడు సఖుడో యట్టి నరుడింద్ర సంబంధియై యర్జునుడను పేర పాండుని పుత్రుడుగ జనియించును.

పితామహాద్యం ప్రవదంతి షష్ఠం
మహర్షి మార్షేయ విభూతి యుక్తం ।
నారాయణస్యాంశజ మేకపుత్రం
ద్వైపాయనం వేదమహానిధానమ్ ॥ శాంతి. ౩౫౦-౪.

పితామహునుండి (అనగా: సృష్టికర్తయగు బ్రహ్మనుండి) యెవని నారావ పురుషునిగా జెప్పుచున్నారో, యెవడు మహర్షులలో బరిగణింపబడి ఋషీశ్వరుల విభూతి (అనగ: నార్షతేజము) తో గూడి యున్నాడో, మఱియు నారాయణుని యంశజాతుడును, (దనతండ్రికి) ఏకపుత్రుడును, వేదములకు గొప్ప నిధానము నని వర్ణింపబడి యుంటచే, యట్టి సర్వసద్గుణ సంపన్నుడగు వాడె నా రూపమను నభిప్రాయముతోడనే "మునీనా మప్యహం వ్యాస" యని భగవంతుడు జెప్పియున్నాడు.

మఱియు నిట్లే "వ్యాసో నారాయణో హరిః" యనియు ననేకములు గలవు.

: దండో దమయతా మస్మి నీతి రస్మి జిగీషతాం
: మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతా మహమ్ ॥ ౩౮

శిక్షించువారలయొక్క శిక్షను నేను. జయేచ్ఛగల వారల యొక్క నీతిని యనగ: నుపాయమును నేను, మఱియు రహస్యములలో మౌనమును నేనే; జ్ఞానులయొక్క జ్ఞానమును నేనే ౩౮

తత స్స భగవాన్ ధ్యాత్వా చిరం శూలవరాయుధః
ఆత్మాన మాత్మనా దండం ససృజే దేవ సత్తమః ॥
తస్మాచ్చ ధర్మచరణా న్నీతి ర్దేవీ సరస్వతీ
ససృజే దండనీతిం సా త్రిషు లోకేషు విశ్రుతాం

మహాదేవ స్తత స్తస్మిన్ వృత్తే యజ్ఞే యథావిధి
దండం ధర్మస్య గోప్తారం విష్ణవే సత్కృతం దదౌ॥

శాంతి. ౧౨౨

మహాదేవుడు స్వయముగా దండనీతులను బుట్టించి యజ్ఞాంతము నందు ధర్మ రక్షకుడగు విష్ణుమూర్తికిచ్చెను. అత డాంగీరసునకు, అంగీరసు నుండి క్రమముగా భృగువు, దిక్పాల కులు మొదలుగా గల వారు పొందిరి.

ధర్మ గోప్తన దండమే యాధార మగుటచే దండమే దైవము, దైవమే దండము: దండము దొంగల కొఱకు నియ మించ బడినది.

'జ్ఞానేన చాత్మాన ముపైతి విద్వాన్' సనత్సుజాతీయం. విద్వాంసుడు జ్ఞానమువలననే యాత్మను పొందు చున్నాడు. కావున భగవంతుడు సర్వజ్ఞానములలో జ్ఞాన స్వరూపుడు.

యచ్చాపి సర్వభూతానాం బీజం తదహ మర్జున
న తదస్తి వినా యత్స్యా న్మయా భూతం చరాచరం॥ 39

అట్లే ఓ యర్జునా! సర్వభూతములకు బీజమును నేను. నేను లేక యుండునట్టి చరాచరభూతమేదియు లేదు. 39.

మహా భూతాని భూతాత్మా మహాత్మా పురుషోత్తమః
వాయు ర్జ్యోతి స్తథా చాపః ఖం చ గాం చా నుకల్పయన్
స సృష్ట్వా పృథివీం చైవ సర్వభూతేశ్వరః ప్రభుః॥

శాంతి ౨౦౮

భూతాత్మయు, మహాత్మయు, నగు నా పురుషోత్తముడు పృథివ్యప్తేజో వాయ్వాకాశములను పంచ మహా భూతములను సృజించి సర్వ భూతేశ్వరుడగు నాప్రభువు ఏకార్ణవమైన యా నీటి యందే శయనించెను.

సృష్టి యంతయు జల మయము మగు నప్పుడు నారాయణుఁడు మత్స్యరూపమున మనువుచే యోడ చేయించి యందు "బీజానిచైవ సర్వాణి యథోక్తాని ద్విజైః పురా" సర్వ బీజములను, మను వును, సప్తర్షులను, మార్కండేయాదులను యెక్కించు కొని "బీజా న్యాదాయ సర్వాణి సాగరం పుప్లువే తదా" బీజములనన్ని టిని: (ఆయా ముఖ్య విషయములను అనగా: సృష్టికి మనువును, ధర్మోపదేశమునకు గాను ఋషులను, ఆహారమునకు గాను బీజ ములను) బీజ రూపుడగు తాను సంగ్రహించుకొని బీజ రక్ష ణార్థమై, సముద్రమును దాటి యంతర్ధాన మయ్యెను.

ఈ విషయము అరణ్యపర్వమున (౧౮౭ - ౩౧) గలదు

: నాంతో౽స్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప
: ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా ॥ ౪౦

ఓ పరంతపా! నాయొక్క దివ్యములగు విభూతులకు నంత ము లేదు. విభూతుల యొక్క సవిస్తారము దిగ్దర్శనార్థము చెప్ప బడినది. ౪౦.

: యద్య ద్విభూతిమ త్సత్త్వం శ్రీమ దూర్జిత మేవ వా
: త త్త దేవా వగచ్ఛ త్వం మమ తేజోం౽శసంభవమ్ ॥ ౪౧

ఏ యే వస్తువు వైభవముతోడను, లక్ష్మి తోడను, ప్రభావ ముతోడను కూడియున్నదో యది యంతయు నా సంబంధమయిన తేజస్సుయొక్క యంశముచే నుత్పన్నమైనదనియే తెలిసికొమ్ము.౪౧

అనుశాసనిక పర్వమున (౧౫౮.) ధర్మ రాజు బ్రాహ్మణ పూజ యందు గలుగు 'వ్యుష్టిని' (అనగా: ఫలమును, లేక సమృ ద్ధిని) తెలియ జేయుమని భీష్ముని ప్రశ్నింపగా నాతడు (భీష్ముడు) దృష్ట వ్యుష్టియు, మహా వ్రతుడు నగు యీ కేశవుడీ విషయమును చెప్ప గలడు ... పురాణములలో చెప్ప

బడిన గొప్ప ధర్మముల నెఱిగిన వాడును, వానికి ప్రవర్తకుడును, సంశయ చ్ఛేత్తయు, నగు కేశవుని వలననే నీ సంశయముల బో గొట్టుకొనుము: అత డట్టి వాడగుట నే నెఱుంగుదు నని జెప్పుచు యా వాసు దేవుని మాహాత్మ్యమును "అయమాత్మా కేశవః" యని యారంభించి సర్వాత్మకత్వమును, సర్వ శక్తి సంపన్నత్వమును—

"తస్యాం తరిక్షం పృథివీ దిశ శ్చ సర్వం వశే తిష్ఠతి శాశ్వతస్య" యనియు ఇంకను య నేక విధముల సర్వకార్యకారణకర్తృత్వము మొదలుగా గలదని జెప్పుచు చివరకు-

"యత్ప్రశ స్తం చ లోకేషు పుణ్యం య చ్ఛ్రుభాశుభం
త త్సర్వం కేశవో చింత్యో విపరీత మతః పరమ్ ॥

లోకములో నేది ప్రశస్త (ఉత్తమ) మయినదియో నేది శుభమనియు నేది యశుభమనియు గలదో యది యంతయు కేశవుడే యని జెప్పెను. పైగీతాశ్లోకమున నీయభిప్రాయమే భగవంతునిచే బొందుపఱుప బడియున్నది.

: అథవా బహునై తేన కిం జ్ఞాతేన తవార్జున
: విష్టభ్యా హ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్ ॥ ౪౨

లేక ఓ యర్జునా! అక్కడక్కడ నుండు యావస్తువులను తెలిసికొనుట యేల? సంక్షేపముగ చెప్పుచున్నాను వినుము. నేను నా యొక్క యొకటియే యగు నంశము చేతను నీ జగత్తు నంతను వ్యాపించి యున్నాను. ౪౨.

[ చివరశ్లోకము "పాదోస్య విశ్వా భూతాని త్రిపా ద స్యామృతం దివి" అను పురుషసూక్తమందలి ఋక్కు యొక్క (ఋ. ౧౦. ౯౦. ౩.) యాధారముచే జెప్పబడినది. ఈ మంత్రము ఛాందోగ్యోపనిషత్తునందును (ఛాం. ౩. ౧౨. ౬.) గలదు.

[భగవంతుడు తనయొక్క యొకయంశముచేత నే జగత్తునంతటను వ్యాపించియున్నచో, వీని యన్నింటి కంటెను భగవంతుని యొక్క మొత్తపు మహిమ, మిక్కిలి గొప్పదిగ నే యుండవలయునని స్పష్టమగుచున్నది; మఱియు నా విషయమును చెప్పవలయునను తలంపుతోడనే కడపటి శ్లోకము జెప్పబడినది. పురుషసూక్తమునందు "ఏతావానస్య మహిమా అతో జ్యాయాంశ్చ పూరుషః" ఇదంతయు నాతని మహిమ యయియున్నది. దీనికంటె పురుషుడు శ్రేష్ఠుడని స్పష్టముగనె చెప్ప బడి యున్నది ]

అజ్ఞానము నందు భగవద్విభూతి సముద్రములు, చెట్లు, పుట్టలు, మొదలగు వివిధ రూపములుగా నగుపించును. జ్ఞానులకంతయు ( అనగా శుకుడు, మార్కండేయులు, వ్యాసుడు, నారదాదులు మొదలగువారికి ) నేకత్ర యున్నట్లు గనుపించును; దీనినే విశ్వరూపమందురు. ఇది ౧౧వ అధ్యాయమునందు వర్ణింప బడినది.

భారతీయుల ధర్మగ్రంథమగు
శ్రీ మన్మహా భారతము నందలి మోక్షధర్మ బోధకమగు
శ్రీమద్భగవద్గీతల యందు
విభూతి యోగమను దశమాధ్యాయము.

---

శ్రీవాసుదేవాయనమః.

# శ్రీ కుమారగీత.

## విశ్వరూప దర్శన యోగము.

### ఏకాదశాధ్యాయము.

అర్జున ఉవాచ.

మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మసంజ్ఞితం
య త్త్వయోక్తం వచ స్తేన మోహోऽయం విగతో మమ ॥ ౧
భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్య మపి చావ్యయమ్ ॥ ౨
ఏవ మేత ద్యథాత్థ త్వ మాత్మానం పరమేశ్వర
ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ ॥ ౩
మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో
యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్ ॥ ౪

అర్జును డడుగుచున్నాడు.- నా యందలి యనుగ్రహముచే నధ్యాత్మమను పేరుగల యీ గుహ్యమగు యీ గుహ్యమును నీవు చెప్పితివి గాన, నాయొక్క మోహము నశించినది. ౧. ఓ కమల పత్రాక్షా! అటులనే భూతములయొక్క యుత్పత్తి లయము లను, (నీ నాశరహితమగు మాహాత్మ్యమును) నీవల్ల నేను సవిస్తరముగ వింటిని. ౨. ఓ పరమేశ్వర! ఓ పురుషోత్తమా! ఇప్పుడు నీవు వర్ణించునటుల నీయొక్క యీశ్వర సంబంధమగు రూపమును నేను ప్రత్యక్షముగ చూడ నిచ్ఛయించుచున్నాను. ౩. ఓ యోగీశ్వరా! అట్టి రూపమును నేను చూడ వచ్చునని నీకు దోచెనేని నీయొక్క యవ్యయమగు స్వరూపమును నాకు జూపుము. ౪.

### శ్రీభగవానువాచ

పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ ॥ ౫

ఓ పార్థా! నాయొక్క యనేకవిధములైనదియు, ననేకములగు రంగులు గలదియు, నాకారములుగల యీ వందలకొలది గాని, లేక వేలకొలదిగాని దివ్యములగు రూపములనుజూడుము. ౫

పశ్యాదిత్యాన్వసూన్రుద్రా నశ్వినౌ మరుత స్తథా
బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత ॥ ౬
ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరం
మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టు మిచ్ఛసి ॥ ౭
న తు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగ మైశ్వరమ్ ॥ ౮

ఇదిగో! చూడుమో భారతా! (ద్వాదశ) ఆదిత్యులను, (నష్ట.) వసువులను, (నేకాదశ) రుద్రులను, (నిరువు రగు) నశ్వినీ కుమారులను, అటులే (నలుబది తొమ్మిది) మరుద్గణములను పూర్వము నందు నెప్పుడు చూడని యనేకాశ్చర్యములను చూడుము. ౬. ఓ గుడాకేశా! నేడిక్కడ నొక స్థలము నందే యున్న చరాచర జగత్తునంతను, మఱియు నీవు చూడదలచు కొన్న దాని నంతను, (నా దేహము నందు) చూడుము. ౭. కాని, నీయొక్క యీ చక్షుస్సుచే నన్ను జూడలేవు. నీకు నేను దివ్యదృష్టి నిచ్చుచున్నాను. దానిచే నాయొక్క యీశ్వర సంబంధమైన యోగమును అనగా: యోగ సామర్థ్యమును జూడుము.

### సంజయ ఉవాచ.

ఏవ ముక్త్వా తతో రాజ న్మహాయోగేశ్వరో హరిః
దర్శయామాస పార్థాయ పరమం రూప మైశ్వరమ్ ॥ ౯

అనేక వక్త్ర నయన మనేకాద్భుత దర్శనం
అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్ ॥ ౧౦
దివ్య మాల్యాంబర ధరం దివ్య గంధాను లేపనం
సర్వాశ్చర్య మయం దేవ మనంతం విశ్వతోముఖమ్ ॥ ౧౧
దివి సూర్య సహస్రస్య భవే ద్యుగప దుత్థితా
యది భా స్సదృశీ సా స్యా ద్భాస స్తస్య మహాత్మనః ॥ ౧౨
తత్రైకస్థం జగ త్కృత్స్నం ప్రవిభక్త మనేకధా
అపశ్య ద్దేవదేవస్య శరీరే పాండవ స్తదా ॥ ౧౩
తత స్స విస్మయా విష్టో హృష్టరోమా ధనంజయః
ప్రణమ్య శిరసా దేవం కృతాంజలి రభాషత ॥ ౧౪

సంజయుడు చెప్పుచున్నాడు.- అని చెప్పి యో రాజా! ధృతరాష్ట్రా! యోగములకు గొప్ప యీశ్వరుడగు హరిచే నర్జునునకు తన శ్రేష్ఠ మగు నీశ్వర సంబంధమైన రూపము ( అనగా: విశ్వరూపము ) చూపబడినది. ౯. దానికి యనగా: నా విశ్వరూపమునకు ననేకములగు ముఖములును, నేత్రములు నుండెను. వాని యందనేకము లగు నద్భుత ములు గోచరించు చుండెను. ౧౦. మఱియు దానిపై యనేక విధములగు దివ్యములైన యలంకారము లుండెను. మఱియు దానిపై ననేకవిధములగు దివ్యములైన యాయుధము లెత్తబడి ( తళ తళ లాడుచు ) యుండెను. ౧౧. అది యనంతమును, సర్వతోముఖమును, అన్ని విధములగు నాశ్చర్యములచే నిండియున్న దేవులయొక్క సుగంధముచే బూయబడినదియు, దివ్యములగు పుష్పములను వస్త్రములను ధరించినదియు, నాకాశమునందు వేవురు సూర్యులయొక్క కాంతి యొకపర్యాయమే వెలువడినచో నెట్టికాంతి గలుగునో యది యా కాంతితో కొంచము పోలి యుండ దగినట్టిదియు, ౧౨. దేవదేవునియొక్క యీశరీరమునందు నానా విధముల విభజింపబడిన జగత్తంతయు నొక్కస్థలము

నంచె యున్నటు లర్జునున కప్పుడు కానిపించెను. ౧౩. మఱియు నాశ్చర్యమున మునిగిన వాడగుటచే నతని శరీరము గగుర్పాడిచిన వెంట్రుకలు గలది యయ్యెను. మఱియు శిరస్సుచే నమస్కరించి యు. హస్తములు ముకుళించియు, నా యర్జునుడు భగవంతునితో మాటలాడుచున్నాడు అదేమన:—౧౪.

అర్జున ఉవాచ.

పశ్యామి దేవాం స్తవ దేవ దేహే
సర్వాం స్తథా భూతవిశేష సంఘాన్
బ్రహ్మాణ మీశం కమలాసనస్థం
ఋషీం శ్చ సర్వా నురగాం శ్చ దివ్యాన్ ॥ ౧౫

అనేక బాహూదర వక్త్రనేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽనంతరూపం
నాంతం న మధ్యం న పున స్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర విశ్వరూపమ్ ॥ ౧౬

కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతో దీప్తిమంతం
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమంతా
ద్దీప్తానలార్క ద్యుతిమప్రమేయమ్ ॥ ౧౭

త్వ మక్షరం పరమం వేదితవ్యం
త్వ మస్య విశ్వస్య పరం నిధానం
త్వ మవ్యయ శ్శాశ్వత ధర్మగోప్తా
సనాతన స్త్వం పురుషో మతో మే ॥ ౧౮

అనాది మధ్యాంత మనంతవీర్య
మనంతబాహుం శశి సూర్య నేత్రం
పశ్యామి త్వాం దీప్త హుతాశ వక్త్రం
స్వతేజసా విశ్వ మిదం తపంతమ్ ॥ ౧౯

ద్యావా పృథివ్యో రిద మంతరం హి
వ్యాప్తం త్వయై కేన దిశ శ్చ సర్వాః
దృష్ట్వా ద్భుతం రూప ముగ్రం తవే దం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్ ॥ ౨౦
అమీ హి త్వాం సుర సంఘా విశంతి
కేచి ద్భీతాః ప్రాంజలయో గృణంతి
స్వస్తీ త్యుక్త్వా మహర్షి సిద్ధ సంఘాః
స్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః ॥ ౨౧
రుద్రా దిత్యా వసవో యే చ సాధ్యా
విశ్వే శ్వినౌ మరుత శ్చో ష్మపా శ్చ
గంధర్వ యక్షా సుర సిద్ధ సంఘా
వీక్షంతే త్వాం విస్మితా శ్చైవ సర్వే ॥ ౨౨

అర్జునుడు పలుకు చున్నాడు. ఓ దేవా! నీయొక్క దేహమునందు దేవత లెల్ల వారును, నానా విధములగు భూతములయొక్క సముదాయమును, అటులే దేవతల కందఱకు స్వామియును, కమలాసనమున కూర్చున్న బ్రహ్మదేవుడును, ఋషులందఱును, వాసుకి మొదలగు దివ్యములగు సర్పములన్నియును, నాకు కాన్పించు చున్నవి. ౧౫. అనేకములయిన బాహువులు, ననేకములయిన యుదరములు, ననేకములయిన ముఖములును, ననేకములగు నేత్రములును గలిగి ననంత రూపములు గలిగిన నిన్నే నేను నలు ప్రక్కల జూచు చున్నాను; కాని యోవిశ్వేశ్వరా! విశ్వరూపా! నీకు నంతమును, మధ్యమును, నాదియును నున్నటులు నాకెచ్చటను కనబడదు ౧౬. కిరీటమును, గదను, చక్రమును ధరించి నలు ప్రక్కల కాంతితో తేజః పుంజమై జాజ్వల్యమానమగు నగ్ని సూర్యుల వలె దేదీప్యమానమై యీ నా

నేత్రములతో జూచుటకు నశక్యముగ నిండి యున్న నీవే నాకు నలుదిక్కులను కానిపించు చున్నావు. ౧౮. నీవే తుదకు జ్ఞేయుడవగు నక్షరుడవు. అనగా: బ్రహ్మవు నీవే. ఈ ప్రపంచమునకు కడపటి యాధారభూతుడవు నీవే. యవ్యయుడవును, శాశ్వతమైన ధర్మమునకు రక్షకుడవును, సనాతన పురుషుడవు నని నాకు దోచు చున్నది. ౧౯. ఆదియు, మధ్యము, నంతము లేనిదియు, నెవరికి యనంత బాహువులు కలవో, చంద్రుడును, సూర్యుడును నెవరికి నేత్రములో, ప్రజ్వలించు చున్న యగ్ని హోత్రమేరికి ముఖ్యమో, యిట్టి యనంత శక్తిగల నీవే నీ యొక్క తేజస్సుచే నీ జగత్తు నంతను తపింప జేయు చున్నటుల నేను జూచు చున్నాను. ౧౧. కారణమేమన: నాకసము యొక్కయు, పృథ్వి యొక్కయు, మధ్యనున్న యంతరమునంతను, సర్వ దిక్కులను నీ వొక్కడవే వ్యాపించి యున్నావు. మఱియు నీయొక్క యీ యద్భుతమును నుగ్రమును నగు రూపమును జూచి యో మహాత్మా! లోకత్రయమును భీతిచే ( ప్రవ్యథితం ) కంపమునొందుచున్నది. ౨౦. దేవగణములు నీయందు ప్రవేశించు చున్నవి. మఱియు కొందఱు భయముచే చేతులు ముకుళించి ప్రార్థించు చున్నారు. మఱియు "స్వస్తి, స్వస్తి" యని చెప్పుచు ననేక విధములగు స్తోత్రములచే మహర్షుల యొక్కయు, సిద్ధుల యొక్కయు గణములు నిన్ను స్తోత్రము చేయుచున్నవి. ౨౧. ఆటులే రుద్రులును, ఆదిత్యులును, వసువులును, సాధ్యగణములును, విశ్వేదేవతలును, (ఇరువురు) అశ్వినీకుమారులును, మరుద్గణములును, ఊష్మపులును ( పితృలును ), గంధర్వులు, యక్షులు, రాక్షసులు, సిద్ధులు ననువారియొక్క గణములన్నియు ప్రతిచోటను విస్మితులై నిమ్మును చూచు చున్నవి. ౨౨.

రూపం మహత్తే బహువక్త్రనేత్రం
మహాబాహో బహుబాహూరుపాదం
బహూదరం బహుదంష్ట్రాకరాళం
దృష్ట్వా లోకాః ప్రవ్యథితాస్తథాహమ్ ॥ ౨౩

నభఃస్పృశం దీప్తమనేకవర్ణం
వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రం
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా
ధృతిం న విందామి శమం చ విష్ణో ॥ ౨౪

దంష్ట్రాకరాళాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానలసన్నిభాని
దిశో న జానే న లభే చ శర్మ
ప్రసీద దేవేశ జగన్నివాస ॥ ౨౫

ఓ మహాబాహూ! నీయొక్క యీగొప్పదియును, ననేక ముఖములు గలదియు, ననేక నేత్రములు, ననేక బాహువులు, ననేకములగు నూరువులు గలవియు, ననేక పాదములు, ననేకములగు నుదరములు, ననేకములగు కోరలు గలిగి యుండుటచే వికృతముగ గాన్పించు రూపమును జూచి లోకములన్నియును, నేనును, భీతి జెందినాము. ౨౩. ఓ మహావిష్ణువా! ఆకాశము నొరయుచున్నదియు' తేజశ్శాలియు, ననేకములగు రంగులు గలిగినదియు, తెరువబడిన ముఖములు గల్గినదియు, గొప్పవయి ప్రదీప్తములగు నేత్రములు గల నిన్ను జూచి యంతరాత్మ వ్యాకులము నొందుటచే నాయొక్క ధైర్యము పోయినది. శాంతియు నశించినది. ౨౪. మఱియు దంతములచే వికృతములైనవియు మఱియు ప్రళయకాలమందున్న యగ్నివంటి నీ యొక్క యీ ముఖమును చూచిన నాకు దిక్కులు తెలియుటలే.

సుఖమును తోచదు. (అటులైనది) ఓ జగన్నివాసా! ఓ దేవ
దేవా! ప్రసన్నుడవగుము. ౨౫.

: అమీచ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః
స్సర్వే సహైవావనిపాల సంఘైః
: భీష్మో ద్రోణ స్సూతపుత్ర స్తథాసౌ
సహాస్మదీయైరపి యోధ ముఖ్యైః ॥ ౨౬
: వక్త్రాణి తే త్వరమాణా విశంతి
దంష్ట్రా కరాళాని భయానకాని
: కేచిద్విలగ్నా దశనాంతరేషు
సందృశ్యంతే చూర్ణితై రుత్తమాంగైః ॥ ౨౭

౨౬ రాజుల యొక్క సంఘములతో గూడ ధృతరాష్ట్రుని పుత్రులందఱును, భీష్ముడును, ద్రోణుడును, నటులే యీ సూతపుత్రుండును మాపక్షము నందున్న ముఖ్యులగు యోధులును -
౨౭ నీ యొక్క వికృతమైన కోరలు గల్గి నదియు, ననేకములైనదియు, భయంకరములైనదియు, నగు ముఖముల యందు మిక్కిలి వేగముతో పడుచున్నారు. కొందఱు దంతములందు చిక్కుకొనుటచేవారితలలు చూర్ణమై నటుల గాన్పించుచున్నవి.

: యథా నదీనాం బహవోంబు వేగా
స్సముద్ర మేవాభి ముఖా ద్రవంతి
: తథా తవామీ నరలోక వీరా
విశంతి వక్త్రాణ్యభి విజ్వలంతి ॥ ౨౮

౨౮. నదుల లోని జలమంతయు ప్రవాహములుగా సముద్రమందు మిక్కిలి వేగముతో ప్రవేశించు లాగున నీశూరులందఱు ప్రజ్వలించుచున్న నీముఖము లందు ప్రవేశించు చున్నారు.

: యథా ప్రదీప్తం జ్వలనం పతంగా

విశంతి నాశాయ సమృద్ధ వేగాః
: తథైవ నాశాయ విశంతి లోకా
స్తవాపి వక్త్రాణి సమృద్ధ వేగాః॥ ౨౯

౨౯. మండు చున్న యగ్ని హోత్రమునందు మరణము కొ
ఱకు మిక్కిలి వేగముతో మిడుతలు పడునట్లు నీ యొక్క
యనేకములగు నోళ్ల యందు (ఈజనులు) మరణార్థులయి యతి
వేగముగా ప్రవేశించు చున్నారు.

: లేలిహ్యసే గ్రసమాన స్సమంతా
ల్లోకాన్ సమగ్రా న్వదనై ర్జ్వలద్భిః
: తేజోభి రాపూర్య జగ త్సమగ్రం
భాస స్తవో గ్రాః ప్రతపంతి విష్ణో॥ 30

: ఆఖ్యాహి మే కో భవా నుగ్రరూపో
నమో స్తు తే దేవవర ప్రసీద
: విజ్ఞాతు మిచ్ఛామి భవంత మాద్యం
న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్॥ 3౧

ఓ విష్ణూ! లోకముల నన్నింటిని నీ యొక్క జాజ్వల్య
మానములగు ముఖములచే మ్రింగుచు, నీ యొక్క జిహ్వను
కదల్చు చున్నావు. మఱియు తేజస్సుచే జగత్తు నంతను వ్యాపిం
చుటవలన నీయుగ్రములగు కాంతిన లువైపులను తపించుచున్నది. 30

ఈ యుగ్రరూపమును ధరించిన నీ వెవడవో నాకు చెప్పు
ము. దేవతలలో శ్రేష్ఠుడా! నిన్ను నమస్కరించుచున్నాను. ప్రస
న్నుడ వగుము. నీవే యాదిపురుషుడ వని తెలిసి కొనుటకు కోరు
చున్నాను. కారణ మేమనః నీయొక్క కృత్యము నాకేమియు
తెలియుట లేదు. 3౧.

శ్రీభగవా నువాచ. : కాలో స్మి లోకక్షయకృ త్ప్రవృద్ధో
లోకా న్సమాహర్తు మిహ ప్రవృత్తః

ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః ॥ ౩౨
తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధం
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ ॥ ౩౩
ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాన్యానపి యోధవీరాన్
మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్ ॥ ౩౪

శ్రీ భగవంతుడు చెప్పుచున్నాడు — నేను లోకములను క్షయింపచేయునట్టియు, వృద్ధినొందించునట్టియు కాలమునై యున్నాను. మఱియు నిచ్చో లోకులను సంహరించుటకు బూనినాను. నీవు లేకపోయినను, అనగా: నీ వేమియు చేయక పోయినను నొకరి కొక రెదురుగ నున్న యోధులెల్లరు నశింతురు; ౩౨. కావున నీవు లెమ్ము; యశస్సును సంపాదించుకొనుము. మఱియు శత్రువులను జయించి సమృద్ధమగు రాజ్యము ననుభోగింపుము. నేను వీరిని పూర్వము నందే చంపియున్నాను. (కావున) నో సవ్యసాచీ! (అర్జునా!) నీవు నిమిత్తమాత్రముగ నుండుము. ౩౩ ద్రోణుని, భీష్ముని, జయద్రథుని, కర్ణుని, యితరులగు వీరులైన యోద్ధలను నేను పూర్వమందే చంపియున్నాను. వానిని నీవు చంపుము. తొందర పడకుము. యుద్ధము చేయుము. యుద్ధము నందు నీవు శత్రువులను జయింతువు. ౩౪.

సంజయ ఉవాచ. ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాంజలి ర్వేపమానః కిరీటీ
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం

సగద్గదం భీతభీతః ప్రణమ్య॥ ౩౫

సంజయుఁడు చెప్పుచున్నాడు. — కేశవుని సంభాషణను విని మిక్కిలి భీతుడై గద్గదస్వరముతో గంపించుచు చేతులు జోడించి, నమస్కరించి యర్జునుడు శ్రీకృష్ణునితో మఱల చెప్పుచున్నాడు. ౩౫.

అర్జున ఉవాచ. ః స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా
జగ త్ప్రహృష్య త్యనురజ్యతే చ
ః రక్షాంసి భీతాని దిశో ద్రవంతి
సర్వే నమస్యంతి చ సిద్ధసంఘాః॥ ౩౬
ః కస్మా చ్చ తే న నమేర న్మహాత్మన్
గరీయసే బ్రహ్మణో ప్యాదికర్త్రే
ః అనంత దేవేశ జగ న్నివాస
త్వ మక్షరం సదస త్తత్పరం యత్॥ ౩౭

ఓ హృషీకేశా! జగత్తు (అంతయు) నీయొక్క గుణకీర్తనములచే నానందము నొందుచున్నది; మఱియు వాని యందనురాగము గలది యగుచున్నది. రాక్షసులు నీకు భయపడి (పది) దిక్కులకు పఱుగు లిడుచున్నారు. మఱియు సిద్ధపురుషుల యొక్క సంఘములు నిన్నే నమస్కరించుచున్నారు. (ఇవంతయు యోగ్యముగనే యున్నవి.) ౩౬. ఓ మహాత్మా! బ్రహ్మదేవునకును నాదికారణుడవును, వారికంటెను శ్రేష్ఠుడవు నగు నిన్ను వారేల నమస్కరింపక యుందురు? ఓ యనంతా! దేవ దేవా! ఓ జగన్నివాసా! నీవే సత్తువును, నసత్తువును నై యున్నావు. ఈరెంటికిని పరముగనున్న యక్షరుడవును నీవే యైయున్నావు. ౩౭

ః త్వ మాది దేవః పురుషః పురాణ
స్త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్
ః వేత్తాసి వేద్యం చ పరం చ ధామ

త్వయా తతం విశ్వ మనంతరూప ‖ ౩౮

: వాయు ర్యమో ౽గ్ని ర్వరుణ శ్శశాంకః
ప్రజాపతి స్త్వం ప్రపితామహ శ్చ
: నమో నమ స్తే ౽స్తు సహస్రకృత్వః
పున శ్చ భూయో ౽పి నమో నమ స్తే ‖ ౩౯

నీ వాది దేవుడవు ( పురాణ పురుషుడవు ) నీవే యీజగత్తునకు ముఖ్యమైన నాధారమవు. జ్ఞాతవు, జ్ఞేయమును నీవే. ఓ యనంతరూపా! నీవే శ్రేష్ఠమగు స్థానమును, నీవే యీవిశ్వమును వ్యాపించిన వాడవు. ౩౮. వాయువును, యముడవును, అగ్నియును, వరుణుడవును, చంద్రుడవును, ప్రజాపతివిని అనగా బ్రహ్మదేవుడవును, ప్రపితామహుడవును నీవే. నిన్ను వేయి సారులు నమస్కరించు చున్నాను. ౩౯.

: నమః పురస్తా దథ పృష్ఠత స్తే నమో౽స్తు
తే సర్వత ఏవ సర్వ
: అనంతవీర్యామిత విక్రమ స్త్వం సర్వం
సమాప్నోషి తతో౽సి సర్వః ‖ ౪౦

నీకు ముందు నుండి నమస్కరించు చున్నాను వెనుక నుండి నమస్కరించు చున్నాను. ఓసర్వాత్మకా! నలుప్రక్కల నుండియు నమస్కారము నీకగు గాక; నీ యొక్క శౌర్యమనంతము. నీ యొక్క పరాక్రమ మతుల మగుటచే నెల్ల వారి కంతటను పూర్ణుడవైయున్నావు. కావునయంతయు నీవేయైయున్నావు.

: సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హే కృష్ణ హే యాదవ హే సఖేతి
: అజానతా మహిమానం త వేదం ౪౧
మయా ప్రమాదాత్ప్రణయేన వాపి ‖

: యచ్చావహాసార్థ మసత్కృతో౽సి

విహార శయ్యాసన భోజనేషు
: ఏకోథ వాప్యచ్యుత తత్సమక్షం
తత్క్షామయే త్వా మహమప్రమేయమ్ ॥ ४౨

४౧ నీ యొక్క యీ మహిమను తెలియక స్నేహితుడను కొని యోరీ కృష్ణా! యోరీ యాదవా! యో సఖుడా! యని ప్రమాదముచేగాని, స్నేహముచే గాని యగౌరవముగా మాటాడినందుకు-
४౨ మఱియు నో యచ్యుతా! యాహార విహారములందును, పరుండుట, కూర్చుండుట, మొదలగు వాని యందును, నేకాకివిగ నున్నప్పుడును గాని హాస్యముకొఱకు నిన్నవమానము చేసినందునను నన్ను క్షమింప వలయు నని యప్రమేయుడ వయిన నిన్ను నేను ప్రార్థించు చున్నాడను.

: పితాసి లోకస్య చరా చరాస్య
త్వమస్య పూజ్యశ్చ గురు ర్గరీయాన్
: న త్వత్సమో స్త్యభ్యధికః కుతోన్యో
లోక త్రయేప్యప్రతిమ ప్రభావః ॥ ४౩
: తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వామహమీశ మీడ్యమ్
: పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియా యార్హసి దేవ సోఢుమ్ ॥ ४४

४౩ - ४४ కావున స్తుత్యుడవును, సమర్థుడ వయిన నీవు ప్రసన్నుడ వగు మని కాయముచే నమస్కరించి నిన్ను ప్రార్థించు చున్నాను. ఓ దేవా! తండ్రి పుత్రుని యొక్కయు, స్నేహితుని యొక్కయు నపరాధమును క్షమించు నటుల ప్రియుడవు (అనగా: నీవు) ప్రియుని కొఱకు (అనగా: నిష్టుడ నయిన నాకొఱకు) లేక నా ప్రీతి కొఱకు నాయపరాధముల నన్నింటిని క్షమించుము.

: అదృష్టపూర్వం హృషితోస్మి దృష్ట్వా

భయేన చ ప్రవ్యథితం మనో మే
తదేవ మే దర్శయ దేవ రూపం
ప్రసీద దేవేశ జగన్నివాస ॥ ౪౫
కిరీటినం గదినం చక్రహస్త మిచ్ఛామి
త్వాం ద్రష్టుమహం తథైవ
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్ర బాహో భవ విశ్వ మూర్తే ॥ ౪౬

౪౫ ఎప్పుడును చూడని దానిని చూచి నందున నాకు మిక్కిలి సంతస మైనది. మఱియు భయముచే నామనస్సు వ్యాకుల మైనది. ఓ జగన్నివాసా! దేవ దేవా! ప్రసన్నుడ వగుము. మఱియు నో దేవా! నీ యొక్క యా పూర్వ రూపమును జూపుము.

౪౬ కిరీటమును గదను ధరించి నదియు, హస్తమున చక్రమును ధరించినదియు, పూర్వము నందు వలె నున్న నిన్ను చూడ నిచ్ఛగించు చున్నాను. కాన నో సహస్ర బాహూ! యో విశ్వ మూర్తీ! యా నాలుగు భుజములుగల రూపముతోడనే కనబడుము.

శ్రీ భగవా నువాచ

మయా ప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శిత మాత్మ యోగాత్
తేజోమయం విశ్వ మనంత మాద్యమ్ ౪౭
యన్మే త్వదన్యేన న దృష్ట పూర్వమ్ ॥
న వేద యజ్ఞాధ్యయనై ర్నదానై ర్న చ
క్రియాభి ర్నతపోభి రుగ్రైః
ఏవం రూప శ్శక్య అహం నృలోకే ౪౮
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర ॥
మా తే వ్యథా మా చ విమూఢ భావో
దృష్ట్వా రూపం ఘోర మీదృఙ్మమేదమ్

మా వ్యథా మా చ విమూఢభావో దృష్ట్వా రూపం ఘోరమీదృఙ్మమేదమ్ ।
వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం
తదేవ మే రూపమిదం ప్రపశ్య ॥ ౪౯

సంజయ ఉవాచ.

ఇత్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః
ఆశ్వాసయామాస చ భీతమేనం
భూత్వా పునస్సౌమ్య వపుర్మహాత్మా ॥ ౫౦

౪౭. శ్రీభగవంతుడు చెప్పుచున్నాడు - ఓయర్జునా! నీవిషయమున ప్రసన్నుడనైతిని; నీవు దక్క యితరులు పూర్వము నందెప్పుడు చూడనట్టి యీ తేజోమయమును, ననంతమును, నాద్యమును, నుత్కృష్టమును నగు విశ్వ రూపమును, నా యోగ సామర్థ్యము చేత నీకు చూపితిని.

౪౮. ఓ కౌరవ శ్రేష్ఠా! వేదముల చేతను, యజ్ఞముల చేతను, స్వాధ్యాయముల చేతను, దానముల చేతను, కర్మల చేతను, నుగ్రములగు తపస్సులచే నైతమిట్టి నా యొక్క స్వరూపము నీవ దక్క యెవరికిని మనుష్య లోకము నందు చూడ శక్యముగాదు.

౪౯. ఇట్టి ఘోర రూపమును చూచి నీ చిత్తమును తత్తర పడ నీయకుము; మూఢతను చెంద నీయకుము; భయమును వదలి సంతోషముతో నా యొక్క మొదటి రూపమును జూడుము.

౫౦. సంజయుడు చెప్పుచున్నాడు- అని పలికి వాసుదేవుడర్జునునకు తన (పూర్వ మందున్న) రూపమును మరల జూపెను. తిరిగి సౌమ్య మగు రూపమును ధరించి యీ మాహాత్మ్యముచే భయపడిన యర్జుననకు ధైర్యము చెప్పెను.

అర్జున ఉవాచ.

దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన
ఇదానీమస్మి సంవృత్త స్సచేతాః ప్రకృతిం గతః ॥ ౫౧

అర్జునుడు చెప్పుచున్నాడు.— ఓ జనార్దనా! నీయొక్క యా సౌమ్యమును మానుషము నగు రూపమును జూచి యిప్పుడు మనస్సు స్వస్థమగుటచే పూర్వము నందువలె సావధానుడ నయి యున్నాను. ౫౧.

శ్రీ భగవానువాచ.

సుదుర్దర్శ మిదం రూపం దృష్టవా నసి యన్మమ
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః ॥ ౫౨
నాహం వేదై ర్న తపసా న దానేన న చేజ్యయా
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవా నసి మాం యథా ॥ ౫౩
భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవంవిధో ర్జున
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥ ౫౪
మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః
నిర్వైర స్సర్వభూతేషు య స్స మా మేతి పాండవ ॥ ౫౫

శ్రీభగవంతుడు చెప్పుచున్నాడు:— నీచే చూడబడిన నాయొక్క స్వరూపము చూచుట మిక్కిలి కష్టము. దేవతలు సైత మీ రూపమును జూడ వలయు నని యెన్నుదురు. ౫౨. నీవు నన్ను చూచి నటుల, వేదముల చేత గాని, దానములచే గాని, యజ్ఞములచే గాని, యేవారును నన్ను చూచుటకు వీలు లేదు. ౫౩ ఓ యర్జునా! యో పరంతపా! యనన్య భక్తిచే మాత్రమే యథా తిగ నన్ను తెలిసికొనుటయు. నన్ను చూచుటయు, నాయందు ప్రవేశించుటయు సంభవించును. ౫౪. ఓ పాండవా! కర్మల నన్నింటిని నా సంబంధ మైనవి యనగా: పరమేశ్వర సంబంధము లైనవి యను బుద్ధితో చేయువాడును, మత్పరాయణుడును, సంగ రహితుడును, సర్వభూతములయందును వైరము లేని వాడును నగు భక్తుడు నన్ను బొందు చున్నాడు. ౫౫.

## శ్రీమన్మహా భారతము నందలి విశ్వ రూపములు.

మహాభారతము నందా యా స్థలము లందు వర్ణింప బడిన విశ్వ రూపములిట యుదహరింప బడును. తజ్ఞులు లెస్సగా పరిశీలన చేయుదురు గాక.

మార్కండేయ మహర్షి ధర్మజునకు దా గను గొనిన విశ్వ రూపము నిట్లు తెలిపెను. (అరణ్య. ౧౮౮)

ధర్మ నందనా! జగమంతయు జల ప్రళయ మగు సమయమున నే నొక దరి కేరి "న్యగ్రోధం సు మహాంతం వై విశాలం
80 పృథివీ పతే॥" గొప్ప దగు నొక మఱ్ఱి చెట్టును జూచితిని. ఆ చెట్టు యొక్క యొక అవ మీద "అతసీ పుష్ప వర్ణాభ శ్శ్రీవత్స కృత భూషణః॥" అవిశ పువ్వు వంటి రంగు గలిగి నట్టియు, శ్రీ వత్స మను మచ్చతో గూడి నట్టి యొక బాలుని జూచితిని. అతడు నన్ను జూచి "ఓ ముని! నీవు చాల శ్రమ జెందితివి; కావున "అభ్యంతరం శరీరం మే ప్రవిశ్య ముని సత్తమ" నా శరీరము లోపల ప్రవేశించి సుఖముగా నుండు" మని నోరు తెఱువ నే నందు ప్రవేశించి నలు దిక్కులు జూడగా: నగరముల తో గూడిన భూమియు, గంగ మొదలగు నన్ని నదులును, మహా సముద్రములును, అరణ్యములును, పర్వతములును, బ్రాహ్మణాది వర్ణ చతుష్టయమును, సింహాది జంతు జాలమును, వేయేల?

"కుక్షౌ తస్య నర వ్యాఘ్ర ప్రవిష్ట స్సంచరన్దిశః
శక్రాదీనపి పశ్యామి కృత్స్నాం దేవ గణానపి॥"

ఇంద్రాది సమస్త దేవ గణములును గాన్పించెను. ఈ విధముగ నీటి నన్నిటిని జూచుచు చుండగా నూరు సంవత్సరములు గడచెను.

అంత నేనాతని (విష్ణువును) శరణు బొంది యంతట యాయన యనుజ్ఞచే, వాయు వేగమున యాతని ముఖము నుండి బయట పడి, జూడగా: నెవరి యుదరమున నీ చిత్రమంతయు గాంచితినో నాతడా మఱ్ఱి యాకుపై యట్లే శయనించి యుండెను. అపుడాతని చరణములను మ్రొక్కి యా మాయా విశేషమును నాకు దెలుపు డన నామహాను భావుడు "పితృ భక్తో హి విప్రర్షే మాం చైవ శరణం గతః" ఓ విప్ర ఋషీ! పితృ భక్తి గలిగిన నీవు నన్ను శరణు బొందితివి; కావున జెప్పెద వినుమని-

"అహం నారాయణో నామ ప్రభవ శ్శాశ్వతో వ్యయః॥"

నేను నారాయణుడను పేరు గలిగిన (ప్రభవ) యన్నిఁటియొక్క పుట్టుకకు కారణమును, శాశ్వతమును నగు నవ్యయుఁడను; మఱియు "అహం విష్ణు రహం బ్రహ్మ శక్ర శ్చాహం సురాధిపః॥" బ్రహ్మ, విష్ణువు, దేవతాధిపతి యగు నింద్రుడను నేనే; ఇట్లే మఱియునాకు,

అగ్ని రాస్యం క్షితిః పాదౌ చంద్రాదిత్యౌ చ లోచనే
ద్యౌ ర్మూర్ధా ఖం దిశ శ్శ్రోత్రే తథాప స్స్వేద సంభవాః॥

అగ్నియేముఖము; భూమియేపాదములు; చంద్రసూర్యులే నేత్రములు; ఆకాశమే శిరస్సు; దిక్కులే చెవులు; అలాగే నీళ్లు స్వేదము. ఈ విధముగా జగమంతయు నామయమై యున్నది.

ఎప్పుడెప్పుడు ధర్మమునకు హాని గలుగునో యప్పుడెల్ల నే నావిర్భవించి ధర్మము (లోకమునునియతి బద్ధముగా) నుద్ధరింతును

అంతకాలేచ సంప్రాప్తే కాలో భూత్వా తి దారుణః
త్రైలోక్యం నాశయా మ్యేకః కృత్స్నం స్థావర జంగమం॥

అటులే యంత కాలము ప్రాప్తము కాగా: సర్వమును నశింప జేయుదును; మఱియు కాల చక్రమును నడుపుదును. నా మాయను దెలియ నేరి తరము గాదు. లోపల నీవును నేమియు

దెలియ లేదు. భక్తుడవు గాన లోపలి నుండి బయటికి రప్పించి నీవు దెలియ జెప్పితి నని యంతర్ధానము జెందెను. కావున పాండవులారా!

సర్వేషా మేవ భూతానాం పితా మాతా చ మాధవః
గచ్ఛధ్వ మేనం శరణం శరణ్యం కౌరవర్షభాః ॥

సర్వ భూతములకును తల్లియు దండ్రియు, మాధవుడే; కావున కౌరవోత్తము లారా! శరణ్యుడగు నీ మాధవుని శరణు బొందుడు. అని యీ రీతిగ మార్కండేయ మహర్షిచే స్వయముగా యనుభవింప బడిన సృష్టి లేక విశ్వ రూప లీల యొకటి యుదాహరణగా జూప బడినది.

ఉద్యోగ పర్వమున విశ్వరూపము లేక స్థితి వర్ణింపబడి యున్నది. ఇక యది యుదాహృత మగును.

పాండవ కౌరవుల సంధి కొఱకు శ్రీ కృష్ణుడు దుర్యోధను నొద్దకు బోవగా, దుర్యోధనాదు లతని బంధింప సమకట్టగా నా కృష్ణుడు-

ఏకోహ మితి య న్మోహా న్మన్యసే మాం సుయోధన
పరిభూయ సుదుర్బుద్ధే గ్రహీతుం మాం చికీర్షసి ॥

ఓ దుర్బుద్ధీ! సుయోధనా! అజ్ఞానముచే యొకడే యని నన్ను బట్టు కొని పరిభవింప దలచితివా! చూడు మిచ్చటనే పాండవు లందఱును గలరు. మఱియు దేవతలందఱు గలరు. అని జెప్పుచు గట్టిగా నవ్వెను.

అపుడాతని సర్వాంగముల నుండియు దేవ తిర్యగ్జాతులును ప్రతి రోమ కూపము నుండియు యనేక యగ్ని జ్వాలలును, జూచు వారల కన్నులు మిరు మిట్లు గొలుపు నట్లు బయల్వెడలెను.

ఋతే ద్రోణంచ భీష్మం చ విదురం చ మహామతిమ్
సంజయం చ మహా భాగ మృషీం శ్చైవ తపో ధనాన్
ప్రాదాత్తేషాం స భగవా న్దివ్య చక్షు ర్జనార్దనః ॥

భగవంతుని చే దివ్యచక్షువులు పొందిన భీష్మ ద్రోణ విదురాదులను దక్క నితరుల కెవ్వరికిని యా స్థితి (ఉనికి) లేక విశ్వరూపమును జూడ శక్యము గాక పోయెను; కాని ధృత రాష్ట్రున కివ్వ బడిన దివ్య చక్షువు (దివ్య జ్ఞానము) ను గూర్చి యాదలు నాశ్చర్యము జెందిరి. ఇట్టి యీ విశ్వ రూపమును (వస్తువునను స్వాభావిక మగు ఉనికి యొక్క సమస్త మైన యా కృతిని) జూడ జాలకను, మూఢ బుద్ధి గావున, జూచిన కొంచమును వెడ మాయ యని నిందించియు, దుర్యోధనుడు బంధు వినాశమునకును ఆత్మ నాశనమునకును కారణమయ్యెను.

విష్ణువు యొక్క యీ విశ్వ రూపమును గురించి భృగు మహర్షి భరద్వాజునితో జెప్పెనో యది వ్రాయ బడును.

ఈ దృశ్య ప్రపంచమున మనము గన్పట్టు సమస్త పదార్థములే యా యనంతుని యొక్క సర్వావయవములు గా వర్ణింప బడినవి. అనంతావయవుడు గనుక నే యనంతు డనియు, (అనగా వస్తుజాలమనంతము గాన యనంతుడు; లెక్క పెట్ట రాని వాడు విశ్వ రూపుడు, ప్రపంచము కన్న యతిరిక్తము గాని యా కృతి గల వాడు) విష్ణువును, ఇటులే అష్టమూర్తియు అనగా: పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, ఆత్మ యను నీయెనిమిదింటి సమవాయమే యీశ్వరుడనియు వర్ణింప బడుటచే నిట్టియీ విశ్వరూపుని అనగా: యీమహాభూతములను వీనివలన జనించిన పదార్థజాతమును నున్నదున్నట్టుగా దెలిసికొని భక్తితో (ప్రేమతో) పూజించు (గౌరవిం

చు) వాడు కృతార్థుడు కాగలడు. ఇట్లుగా నీ విశ్వ-రూపము ను మన్నించి పూజించు ( అనగా: నానా విధ దేవతలను, గోవులను, బ్రాహ్మణులను పూజించు ) సనాతన ధర్మ పరాయణులే ధన్యులు. యట్టివార విశ్వ-రూప సాక్షాత్కారమునంది విశ్వ-రూపమున (యాత్మ)యందు విశ్వాసము గలవారై మోక్షము నొందు చున్నారు.

ఇట్టి సందర్భమున నే ( భా శా. ౨౭౦.) సనత్కుమారుడు వృత్రాసురునకుపదేశించిన విశ్వ-రూపమును గూడ నిట నుదహరించు చున్నాము.

సనత్కుమారుడు వృత్రాసురునితో -

"శృణు సర్వ మిదం దైత్య విష్ణో ర్మాహాత్మ్య ముత్తమం
విష్ణౌ జగ త్స్థితం సర్వ మితి విద్ధి పరంతప ॥ " ఓ దైత్యుడా! విష్ణు మాహాత్మ్యమును వినుము. యీ విష్ణువు నందే జగత్తంతయు నున్నదని యెఱుంగు మని యారంభించి " పాదౌ తస్య మహీం విద్ధి " యని మఱియు నేకాదశ వికారాత్మక మగు విశ్వరూపమును అనగా: భూమిని పాదములుగను, దివమును శిరస్సుగను, దిక్కులు చేతులు గను, ఆకాశము శ్రోత్రము గను, సూర్యు డతని తేజస్సుగాను, చంద్రుడు మనస్సుగను, జ్ఞానమే బుద్ధియుగను, జలములే రసనగాను, గ్రహములు కనుబొమలుగను, నక్షత్రములు నేత్రములుగాను వర్ణించుచు " ఏకస్య విద్ధి దేవస్య సర్వం జగ దిదం వశే " యీయొక్క దేవుని వశమునందె యీ సర్వ మున్నదని జెప్పి యిట్టి యా దేవుని దెలిసి కొనుట జీవులకు దుష్కరమనియు జెప్పుచు ప్రవాహపతిత న్యాయమున నట్టి జీవుని వర్ణ విచారమును గూడ జేసియు న్నాడు. అదియు, సనత్సుజాతుని పరతత్త్వనిరూపణమును గూడ నిట నుదాహృతముకా

గలదు. జ్ఞాని యగు వాడు బొందునట్టి పరతత్త్వమునకు రూపము గలదా! గలిగియున్నచో నది యెవ్విధమగు రంగు గలది? యని ధృతరాష్ట్రుడు సనత్సుజాతునడిగెను. యందులకాతడు-

"నాభాతి శుక్ల మివ లోహిత మివా థో కృష్ణ మథా ర్జునం వా కాద్రవం వా। న పృథివ్యాం తిష్ఠతి నాం తరిక్షే నైత త్సముద్రే సలిలం బిభర్తి ॥" నీవడిగిన యా పర తత్త్వము తెలుపు, నలుపు మొదలగు రంగులు గలదిగ ప్రకాశించుటలేదు. మఱియు నా పర తత్త్వము "నైవర్క్షు" ఋక్కుల వల్లగాని, యజుస్సు వలన గాని యిట్టి మఱి వేనిచె గాని దెలియ బడదు.

కాని యో రాజా! "మహా వ్రతస్యా త్మని దృశ్యతే తత్" మహా వ్రతుడగు వానియొక్క యాత్మ (యంతరము) యందు మాత్రమా తత్త్వము జూడబడుచున్నది.

కావున బ్రాహ్మణుడు (బ్రహ్మజ్ఞాని) యట్టి మహావ్రతము ననగా: (భా. ఉ. సనత్సుజాతీయం. ౭౯)

జ్ఞానం చ సత్యం చ దమ శ్శ్రుతం చ
అమాత్సర్యం హ్రీ స్తితిక్షా ననూయా,
యజ్ఞ శ్చ దానం చ ధృతి శ్శమ శ్చ
మహా వ్రతా ద్వాదశ బ్రాహ్మణస్య-

జ్ఞానము, సత్యము, (మనో) దమము, (ఆధ్యాత్మిక) శ్రవణము, మాత్సర్యము లేమియు, (చేయరాని పనులయందు) సిగ్గు, ఓరిమి, అసూయ లేకుండుట, యజ్ఞము, దానము (త్యాగము), ధైర్యము, శమము (శాంతి) నను పన్నెండు గుణముల నెఱింగి వాని నాత్మయందు నిలిపియు, వానినే యాచరణ యందుంచినవాడు నరూపమును, యవినాశియు, యప్రమేయు (ఇంద్రియాగోచర) మును నగు పరతత్త్వమును బొంద గలడు.

(అని) సనత్సుజాతుడు ధృతరాష్ట్రునకు బోధించిన విధముగనే సనత్కుమారుడును పూర్వోక్తమగు భగవంతుని విశ్వరూపమును వర్ణించి యనంతరము జీవునికి- (భా. శా. ౨౮౦.) "షడ్జీవ వర్ణాః పరమం ప్రమాణం" యారు రంగులు గలవనియు,

అందు- తమోగుణ మెక్కువై సత్వగుణము తగ్గిపోయి రజోగుణము గొంచమున్నపుడు నలుపురంగు గలుగును యీ నలుపురంగుగల జీవుడనేక జన్మల నందుచు నరకమున గూలుచును, యట్టి తమోగుణ మెక్కుడై సత్వ రజస్సులు మొదటికన్న వ్యత్యస్తము లయినపుడు ధూమ్రవర్ణము గలవాడగుచు నిటులె క్రమముగ తమోగుణ రజోగుణముల వ్యత్యాసము, తగ్గుదలల చేతను, సత్వగుణము యొక్క యభివృద్ధిచేతను క్రమక్రమముగ నీలము, ఎఱుపు, పసుపు, తెలుపు వర్ణముల బొందుచు నాయాయి వర్ణముల ననుసరించి క్రమముగ ననేక జన్మలలో నుత్తమగతి నందుచు, సర్వోత్తమమును సత్వప్రధానమును నగు తెల్లని వర్ణమును దానితో గూడ నుత్తమ జన్మ నంది పర తత్వమును బొంద గలడు.

అని యీవిధముగ (సనత్సుజాత! సనత్కుమారునిచే జెప్పబడిన విశ్వరూపము అనగా: ప్రపంచ పరమేశ్వర సమన్వయము ననన్యభావముతో ధ్యానించి, బాహ్యముగను, యాంతరముగను, గమంగొనుచు జరించువాడు "మృత్యుసంసార బంధనాత్" మృత్యువు నుండియు సంసారము నుండియు బంధింపబడక విడివడి స్వేచ్ఛగా దుఃఖ రహితుడై యుండును.

గావున విశ్వ- రూపమును (అన్ని యాకృతులను లేక జీవరాసులను) భగవంతునికనన్యముగు (గురు, దేవ, పూజ్యులయం దెట్టి ప్రేమ, లేక భక్తి, పూజ్యభావము గలుగునో యట్టి గౌరవము గలుగునట్లుగా) భావించియు, విశ్వసించియు పూజించువారాత్మ విశ్వాసము గలవారై దుఃఖరహితులగుదురు.

రెండవ విధమగు, స్థిత్యాత్మక విశ్వ రూప నిరూపణము నింతటితో ముగించు చున్నాము.

శ్రీ కృష్ణుడు అర్జునుని చే బునః ప్రార్థితుడై భగవద్గీతార్థమును (అశ్వ మేధ. అను గీత. ౫౩) విపులముగా వివరించి ద్వారకకు ప్రయాణమై బోవుచు మార్గ మధ్యమున ఉదంకుడను మహర్షిని జూచెను. యథోచిత మర్యాదలు జరిగిన తర్వాత ఉదంకుడు "శ్రీ కృష్ణా! పాండవ కౌరవులకు పొత్తు గూర్చి నీ వెంతేని యుపకృతి జేసిన వాడ వైతి వనెను.

శ్రీ భగవా నువాచ.

కృతో యత్నో మయా పూర్వం సౌ శామ్యే కౌరవాన్ప్రతి
నా శక్యంత యథా సామ్యే తే స్థాప యితు మంజసా ॥
తత స్తే నిధనం ప్రాప్తా స్సర్వే స సుత బాంధవాః
న దిష్ట మభ్యతి క్రాంతుం శక్యం బుద్ధ్యాబలేనవా ॥

శ్రీ భగవంతుడు జెప్పు చున్నాడు:- ఓ మహర్షీ! పాండవ కౌరవులకు సంధి చేయుటకు గాను నే నెంతేని ప్రయత్నించితిని; కాని సాధ్యము గాలేదు. వారందఱును యుద్ధమున మరణించిరి. దైవ నిర్ణయము నతిక్రమించుటకు మన బుద్ధి యెంత పాటిది?

ఇది విని ఉదంకుడు క్రోధ దీప్తుడై -

న చ తే ప్రసభం యస్మా త్తే నిగృహ్య నివారితాః
తస్మాన్మన్యు పరీత స్త్వాం శప్స్యామ మధు సూదన ॥

మధుసూదనా! నీవు వారి నేకారణము చే నైనను, బలాత్కారముగ నైనను యుద్ధ విముఖుల జేయు వైతివి. ఇందుచే నిన్ను శపింతు నని యనెను.

శ్రీ భగవా నువాచ.

శ్రుత్వా చ మే తదధ్యాత్మం ముంచేథా శ్శాపమద్యవై
న చ మాం తపసాల్పేన శక్తో౽భిభవితుం పుమాన్ ॥

నే జెప్పబోవు అధ్యాత్మమును విని శపించుము; (అదియు గాక) కొంచము తపశ్శాలి నన్ను బరిభవింప జాలడు; మఱియు "న చ తే తపసో నాశ మిచ్ఛామి తపతాం వర॥" తపశ్శ్రేష్ఠుడవగు నీ తపస్సు యొక్క (నన్ను శపించుట చే యగు) క్షయమును నేను కోర నని భగవంతు డనెను.

ఉదంకః - బ్రూహి కేశవ తత్త్వేన త్వ మధ్యాత్మ మనిందితం
కృత్వా శ్రేయోభి దాస్యామి శాపం వా తే జనార్దన॥

కేశవా! నీవు గొప్ప దగు నధ్యాత్మము నెప్పెద నంటివి. చెప్పుము; అది విని నీకు మంచి చెడ్డలలో దేని నైన చేసెదను.

వాసుదేవః - తమో రజశ్చ సత్త్వం చ విద్ధి భావాన్మదాశ్రయాన్
తథా రుద్రాన్ వసూన్వాపి విద్ధి మత్ప్రభవాన్ద్విజ॥
మయి సర్వాణి భూతాని సర్వ భూతేషు చాప్యయం॥

త్రిగుణములు నా భావములు; దేవతలందఱు నా నుండియే జనిమించిరి; నా యందన్ని భూతములు గలవు; అన్ని భూతములందు నే నున్నాను; నాకన్న వేరైనది లేదు. "ఓంకార
౧ ప్రభవాన్ వేదాన్ విద్ధి మాం త్వం భృగూద్వహ॥" ఓంకారము నుండి బుట్టిన వేదములను నన్నుగా దెలిసు కొనుము. మఱియు యజ్ఞములు, యూపములు నేనే; "మమ విద్ధి సుతం ధర్మమగ్రజం ద్విజ సత్తమ॥" ధర్మమును నా ప్రథమ పుత్రునిగా నెఱుంగుము; "అహం విష్ణు రహం బ్రహ్మ" నేనే విష్ణువు నేనే బ్రహ్మను; "ధర్మ సంరక్షణార్థాయ ధర్మ సంస్థాపనాయ చ" ధర్మము యొక్క రక్షణ స్థాపనలు నా చే చేయబడుచున్నవి నేను దేవతల యందు దేవతగను, గంధర్వులందు గంధర్వుడుగను సంచరించు చున్నాను.

మానుష్యే వర్తమానే తు కృపణం యాచితా మయా
న చేత్ జ్ఞాతి సంమోహో వచో గృహ్ణంతి మే హితం॥

నేనుమనుష్యుడగానుండుటచే లోభి యగు దుర్యోధనుడు నా చే కోర్రబడియు విన లేను. మఱియు మోహితులైన వారు నా మాటలు వినక నశించిరి.

ఇది యంతయు విని ఉదంకుడు శాంతుడై నీ కివ్వ దలచిన శాపము నివ్వను. మఱియు "ద్రష్టుమిచ్ఛామి తే రూప మైశ్వరం త్వం నిదర్శయ" నీ యొక్క ఈశ్వర సంబంధ మగు రూపమును జూడ కోరుచున్నాను; చూపు మనెను.

"శాశ్వతం వైష్ణవం ధీమాన్ దదృశే యద్ధనంజయః॥"

అంత శ్రీకృష్ణుడు శాశ్వత మగు యే వైష్ణవ తేజస్సు నర్జునునకు జూపెనో దానినే జూపెను;

స దదర్శ మహాత్మానం విశ్వ రూపం మహాభుజం
సహస్ర సూర్య ప్రతిమం దీప్తి మత్పావకోపమం ॥

ఆ విశ్వ రూపము వెయ్యి సూర్యుల కాంతి గలిగి యగ్ని వలె ప్రకాశవంతముగా నుండెను.

ఉదంకు డిట్టి విశ్వ రూపమును జూచి, మరు భూమి యందు వర్షము గురిసిన నెంత సంతసము గలుగునో, యంత సంతసమును బొందిన వాడై 'విశ్వకర్మ నమస్తేస్తు' యని స్తుతించి నిజేచ్ఛ బోయెను.

మనము జేయు పనుల నన్నింటిని ఈశ్వరుడే జేయించు చున్నాడనుటకు నిదర్శన మగు విశ్వ రూపము.

ద్రోణాచార్యుడు దివంగతుడైన పిదప అర్జునుడు తన శిబిరమున విశ్రమించి "మేము యుద్ధమున గెలిచితిమి; మాకే జయము గలిగినది" యని —

"మయైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్త మాత్రం భవ సవ్య సాచిన్" వారందఱు మొదటనే నా చే చంప బడి నారు; ఓ అర్జునా! నీవు నిమిత్తమాత్రుడవే అని యుద్ధారంభమందు

భగవంతుడు జెప్పిన విధముగా, అర్జునుడు భావించుకొనుచుండ వ్యాస భగవానుడు ప్రత్యక్షమయ్యెను.

అర్జునః - సంగ్రామే న్యహనం శత్రూన్ శరౌఘైర్విమలైరహం
అగ్రతో లక్షయే యాంతం పురుషం పావకప్రభం ॥
జ్వలంతం శూలముద్యమ్య యాం దిశం ప్రతిపద్యతే
తస్యాం దిశి విశీర్యంతే శత్రవో మే మహామునే ॥
తేన భగ్నానరీన్సర్వాన్ మద్భగ్నాన్మన్యతే జనాః
భగవం స్తం మమాచక్ష్వ కో వై స పురుషోత్తమః ॥
శూలపాణి ర్మయా దృష్ట స్తేజసా సూర్య సన్నిభః
నపద్భ్యాం స్పృశతే భూమిం న చ శూలం విముంచతి ॥
శూలా చ్ఛూల సహస్రాణి నిపేతు స్తస్య తేజసా ॥
ద్రోణ ప. శత రుద్రీయము.

అప్పుడర్జునుడు వ్యాసు నిట్లు ప్రశ్నించెను: - నేను యుద్ధము నందు శత్రువుల చంపుచుండ నా ముందగ్ని కాంతి గల పురుషుడొకడు సంచరించుట చూచుచున్నాను. అతడు శూల పాణియై యెటు బోయిన నటు శత్రువులు మడియుచున్నారు. అతనిచే జంపబడిన వారిని నే జంపితి నని లోకులు భ్రమయుచున్నారు. అతని పాదములు భూమి నంటవు; అతని యొక్క శూలము నుండియే వేల కొలది శూలములు బుట్టుచున్నవి; ఇట్టి యా మహా పురుషుడెవరు?

వ్యాసః - ఈశానం వరదం పార్థ దృష్టవానసి శంకరమ్
తంగచ్ఛ శరణం దేవం వరదం భువనేశ్వరం ॥

కోర్కెల నన్నిటిని నెరవేర్చు నట్టియు, సర్వ నియంత యగు నట్టి యీశ్వరుడే యతడు; అతనినే శరణు బొందుము. ఇట్లని చెప్పి వ్యాసుడర్జునునకు శత రుద్రీయమును బోధించెను.

మఱియు విశ్వరూపుడగు యతని యనుగ్రహము చేతనే భీష్మ ద్రోణ కృపాశ్వత్థామలు వేయు బాణములు వ్యర్థములగు చున్నవి. ఇట్టి సర్వ సంహర్త యగు కాలాగ్ని రుద్రుని శ్రీ కృష్ణుని శక్తిచే స్వప్నమున సందర్శించి (సైంధవ వధా సందర్భమున) పాశుపత మహాస్త్రము ను సంపాదించితివి.

గచ్ఛ యుద్ధ్యస్వ కౌంతేయ న తవాస్తి పరాజయః
యస్య మంత్రీ చ గోప్తా పార్శ్వస్థో హి జనార్దనః ॥

నీవు యుద్ధము చేయుము; తప్పక జయించెదవు. కృష్ణుడు నీకు మంత్రిగను, రక్షకుడుగ నుండగా భయము లేదు. అని వ్యాసుడుపదేశించి యంతర్ధాన మయ్యెను.

---

భారతీయులకు ధర్మ గ్రంథ మగు
శ్రీ మన్మహా భారతము నందలి మోక్ష ధర్మ బోధక మగు
శ్రీమద్భగవ ద్గీతల యందు
విశ్వ రూప దర్శన యోగమను ఏకాదశా ధ్యాయము.



శ్రీకృష్ణాయనమః.

# శ్రీ కుమారగీత.

## భక్తియోగము.

### ద్వాదశాధ్యాయము.

అర్జున ఉవాచ.

ఏవం సతత యుక్తా యే భక్తా స్త్వాం పర్యుపాసతే
యే చా ప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః ॥ ౧

అర్జును డడుగుచున్నాడు.— ఇట్లెప్పుడును యుక్తులయి యనగా యోగియుక్తులయి, యే భక్తులు నీయొక్కగాని, యవ్యక్తమైన యక్షరము యొక్క (బ్రహ్మయొక్క) గాని యుపాసన చేయుచున్నారో, వారలలో నుత్తమమైన (కర్మ-) యోగ వేత్త యెవరు!

శ్రీ భగవానువాచ.

మయ్యావేశ్య మనో యే మాం నిత్య యుక్తా ఉపాసతే
శ్రద్ధయా పరయో పేతా స్తే మే యుక్తతమా మతాః ॥ ౨
యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే
సర్వత్రగ మచింత్యం చ కూటస్థ మచలం ధ్రువమ్ ॥ ౩
సన్నియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః
తే ప్రాప్నువంతి మా మేవ సర్వభూతహితే రతాః ॥ ౪

భగవంతుడు చెప్పుచున్నాడు:— నాయందు మనస్సును నిలిపి యెల్లప్పుడును యుక్త చిత్తులై పరమశ్రద్ధతో నన్ను పాసించువారే యందఱిలోను యుత్తము లగు యుక్తులు, అనగా: సత్తమ [illegible] లెవరు, అనిర్దే

శ్యము (అనగా: ప్రత్యక్షముగ జూపించుటకు శక్యము గానిది) నవ్యక్తమును, సర్వ వ్యాపియు; నచింత్య మును, కూటస్థ మును, (అనగా: నన్నింటికంటె పూర్వమందుండునదియు) నచలమును, నిత్యమును నయిన యక్షరమును (అనగా: బ్రహ్మను), ३. ఇంద్రి యముల నన్నింటిని, నిరోధించి యంతటను సమ బుద్ధి గల వారై యుపాసన చేయు చున్నారో! యా సర్వ భూత ముల యొక్క హితమందు తత్పరులైన వారును, నన్ను పొందు చున్నారు, ४.

క్లేశో ధికతర స్తేషా మవ్యక్తా సక్త చేతసాం
అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే ॥ ౫
యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే ॥ ౬
తేషా మహం సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్
భవామి న చిరా త్పార్థ మయ్యా వేశిత చేతసామ్ ॥ ౭
మయ్యేవ మన అధత్స్వ మయి బుద్ధిం నివేశయ
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః ॥ ౮

(అయినను) వారియొక్క చిత్త మవ్యక్తము నందాసక్త మగుటచే వారికి మిక్కిలి క్లేశము కలుగును. కారణ మేమనః (దేహధారులును, వ్యక్తులు నగు మనుజులకు) నవ్యక్తోపాసన యొక్క మార్గము కష్టముచే సిద్ధముగ నున్నది. ౫. కాని యెవరు నాయందు సర్వ కర్మల నర్పించి మత్పరాయణు లయి, యనన్య యోగముతో నన్ను ధ్యానించి భజించు చున్నారో, ౬. ప్రీతి మచ్చిత్తులగు లోకుల నో పార్థా! విలంబము చేయక యా మృత్యు మయ మగు సంసార సాగరము నుండి నే నుద్ధరించు చున్నాడను. ౭. (కాన) నాయందే మనస్సు నుంచుము. నాయందు బుద్ధిని స్థిరము చేసికొమ్ము. అటు లగు నేని పిమ్మట నీవు నా యందే నివసింతువు దీనియందు సంశయ మేమియును లేదు. ౮.

శా. ౩౩౫- ౧. యుధిష్ఠిరః.

గృహస్థో బ్రహ్మచారీ వా వానప్రస్థోథ భిక్షుకః
య ఇచ్ఛేత్సిద్ధి మాస్థాతుం దేవతాః కా యజేత సః ॥

నాలుగు విధములగు నాశ్రమములలో సిద్ధిని పొంద దలచిన వారు ఏ దేవత నారాధించిన సిద్ధులు గాగల రని యడిగిన భీష్ముడు- "గూఢం మాం ప్రశ్నవిత్ప్రశ్నం పృచ్ఛసే త్వ మిహానఘ" పృచ్ఛ సేయ నెఱింగిన ధర్మనందనా! నీవు గూఢముగ ప్రశ్న జేసితివి ఇది నూఱు వత్సరములయినను దైవానుగ్రహము జ్ఞానము, వినా దెలియజెప్ప వలనుపడదు పూర్వము-

"కృతే యుగే మహారాజ పురా స్వాయంభువేంతరే
నరో నారాయణ శ్చైవ హరిః కృష్ణ స్స్వయంభువః
తేషాం నారాయణ నరౌ తప స్తేపతు రవ్యయౌ
బదర్యాశ్రమ మాసాద్య శకటే కనకామయే ॥"

బదరికాశ్రమమున నర నారాయణులు ఘోరమగు తపము (దేవ పితౄణముల) నాచరించు సమయమున నారదమహర్షి యచటికేతెంచి వారల వీక్షించి నారాయణు నిట్లు ప్రశ్నించెను-

"పితరౌ సర్వభూతానాం దైవతం చ యశస్వినౌ
కాం దేవతాం తు యజతః పితౄన్ కాన్ మహామతీ ॥"

'ఓ మహా భాగా! సర్వ భూతములకును తలిదండ్రి వని, నాలుగాశ్రమముల వారికిని యుపాస్య దేవతవును, శాశ్వతుడవు నగు నీవు, ఏ దేవుని, లేక నే పితరుని యజించుచున్నావో, నాకు దెలియ జెప్పుము? అను నారదుని మాటలు విని యాభగవంతుడు- "ఆవాభ్యాం పూజ్యతే సో హి దైవే పిత్ర్యే చ కల్పితే
నాస్తి తస్మాత్పరో న్యో హి పితా దేవోథవా ద్విజ
ఆత్మా హి నస్స విజ్ఞేయ స్తత స్తం పూజయావహే
తేనైషా ప్రథితా బ్రహ్మన్ మర్యాదా లోకభావినీ

దైవం పిత్ర్యం చ కర్తవ్య మితి దైవాను శాసనమ్ ॥"

దేనికంటె మించిన తలి దండ్రులు గాని, దేవతలు గాని యెండజాలరో, యదియె మాచే దేవ పిత్ర్యములయందు పూజింపబడుచున్నది. మఱియు దానినే మా యొక్క యాత్మయనియు దెలిసికొనుము. ఈ కారణముచేగూడ దానిని బూజించుచున్నాము.

మఱియు నో బ్రాహ్మణోత్తమా! లోక భావనములగు నీ దైవ పిత్ర్యములు కర్తవ్యములను యను శాసనమతనిచే బంపబడినది గనే దెలిసికొమ్ము.

మఱియు బ్రహ్మ మొదలగు యిరువది యొక్క ప్రజాపతులును, యీ దేవునియొక్క సనాతనమగు నీ మర్యాదనే గౌరవించి దైవములను, పిత్ర్యములను యథా విధిగ నాచరించి గోర్కెలనెల్లి యీడేర్చు కొను చుండిరి.

"యే హీనా స్సప్తదశభి ర్గుణైః కర్మభి రేవ చ
కళాః పంచదశ త్యక్త్వా తే ముక్తా ఇతి నిశ్చయః ॥"

పదు నేడు గుణములను ( అనగా: జ్ఞానేంద్రియము లైదు, కర్మేంద్రియములైదు, పంచప్రాణములు (ఐదు), మనో బుద్ధులు రెండును ) విడిచి పెట్టినవారు ముక్తులగుదురు.

"దృశ్యతే జ్ఞానయోగేన అవాం చ ప్రసృతౌ తతః
ఏవం జ్ఞాత్వా త మాత్మానం పూజయావ స్సనాతనమ్ ॥"

అతడు జ్ఞాన యోగము వలననే దెలియబడును: మే మిరువరము నాతని నుండియే సృజింపబడితిమి ఇట్లెఱింగియే మేము సనాతనమగు నా యాత్మను బూజించుచున్నాము.

"భక్త్యా సంపూజయంత్యాశు గతిం చైషాం దదాతి సః
యే తు తద్భావితా లోకే హ్యేకాంతిత్వం సమాస్థితాః ॥"

ఎవరు, తనయందు భావమును నిలిపి, యేకాంతులై భక్తితోడ బూజింతురో వారికి శీఘ్రముగ నాతడు సద్గతి నొసంగును.

నారదా! మిక్కిలి భక్తుడవు గాన నావలన నీ వీ విషయ మెఱుంగ గలిగితివి. అని నారాయణుడు జెప్పగా విని నారదుడు "నేనిపుడు నీ యాద్య ప్రకృతి యగు బరమేశ్వరు సందర్శింపం గోరి శ్వేత ద్వీపమునకు బోవుదు" నని యాతని యనుజ్ఞ వడసి యట నుండి వెడలి పోయెను. అని భీష్ముడు జెప్పెను.

పై జెప్పిన విధమున నారదుడాద్య ప్రకృతిని జూచుటకు శ్వేత ద్వీపమునకేల బోవలయు నని సంశయింప వచ్చును! గాన యచటనే యేకాంతభక్తులు గలరని; "శ్వేతాః పుమాంసో గత సర్వపాపాః" తెల్లని శరీరములు గలవారును, పాపరహితు లును నై యుందురు. మఱియు వారు పాపాత్ముల కగపడరు.
౩౨ వారు వజ్రముల వంటి దృఢ కాయులై మానాపమానముల సహింప జాలి యుందురు. మఱియు స్థూల సూక్ష్మ శరీరములు గలిగి శాంతులై భగవంతుని యంద నన్యమగు భక్తిని గల్గి యుందురు.

అని యి రీతిగ వర్ణింపంబడిన (శ్వేత) మనుజులు భగవంతుని యాద్య ప్రకృతిని (అవిద్యచే కల్పింప బడిన నానా రూపములు గాక నైసర్గికమగు కారణ రూపమును) చక్కగ నెఱింగి యుండుటచే నట్టివారికి నివాసమగు శ్వేతద్వీపమునకు నారదుడు వెళ్లెను గాన, యెవరుత్తమములయిన రూప గుణములు గలిగి శాంతులయి యుందురో వారు శ్వేతద్వీపవాసులవలె (గీతలలో జెప్పబడిన) యేకాంతికభక్తులలో జేరి యుత్తమ పదము నందుదురు.

## ఉపరిచర వసువను రాజు భక్తాగ్రగణ్యుడు.

సర్వభావేన భక్తస్య దేవ దేవం జనార్దనమ్
అనాది మధ్యనిధనం లోకకర్తార మవ్యయం ॥
తస్య నారాయణే భక్తిం వహతో మిత్రకర్శినః
ఏకశయ్యాసనం దేవో దత్తవాన్ దేవరాట్స్వయమ్ ॥


వసు వసు రాజు సాత్వత విధి నవలంబించి దేవేశుఁడగు

నారాయణుని బూజింపగా శేషించిన దానితో బితామహులను బూజించుచుండెను. పిదప శేషించిన దానితో విప్రులను తననాశ్రయించిన వారలను బంచి తాననుభవించు చుండెను. అతడుసత్యపరుండై సర్వభూతములయందు యన్నిభావములచే భక్తి గలిగియుండిన వసువున కింద్రుడే కాసనం బొసంగెను. వసువు భక్తాగ్రగణ్యుడు.

తేషామహం సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్॥

అశ్వమేధం. ౬౬ మృత్యుసంసారము నుండి నేనుద్ధరించువాడనని భగవద్వచనము గలదు. జనన మరణ స్వభావముగల సంసారసాగరమని ముఖ్యాశయ మయ్యున్నను చచ్చినవారలను బ్రదికించు టయును ప్రత్యక్షముగా జూపుట గలదు (అనన్యే నైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే) ఇతర ధ్యానము లేక నాయందే భావము గలవారికి నేనమృతస్వరూపుడ నయ్యెదునని యనుట నిదర్శనము అశ్వత్థామ అపాండవే యాస్త్రము వేసి ఆయస్త్రముచే నుత్తరగర్భమందుగల శిశువురణించుననెను. అంత శరణాగతరక్షణ బిరుదుగల శ్రీకృష్ణుడు చచ్చిన వానిని నే బతికించెదననియె.

భగవాన్ - పరీక్షి న్నామ నృపతి ర్మ్రుతస్తే సుదుర్మతే
అహం తం జీవయిష్యామి దగ్ధం శస్త్రాగ్ని తేజసా॥

భగవంతు డిట్లనెను - అశ్వత్థామా! నీ శస్త్రాగ్నిచే మడిసిన పరిక్షిత్తును నే బ్రతికించెదను.

కుంతీ దేవి యితరా పేక్ష లేక కృష్ణు నిట్లు స్తుతించెను.
"త్వంనో గతిః ప్రతిష్ఠా చ త్వదాయత్త మిదం కులం" ఓ కృష్ణా! నీవే మాకు గతివి, ప్రతిష్ఠవు; ఈ కులము (భారతాన్వయము) నీ యధీనమై యున్నది.

మఱియు అపాండవము జేయ దలచిన నశ్వత్థామతో నిట్లు ప్రతిజ్ఞ జేసితివి.

అకామం త్వాం కరిష్యామి బ్రహ్మబంధో నరాధమ
అహం సంజీవయిష్యామి కిరీట తనయాత్మజం॥

బ్రహ్మబంధూ! నీ కోరికను భగ్నము గావించి యభిమన్యు పుత్రుని బ్రతికించెద నంటివి. "ఇచ్ఛన్నపి హి లోకాం స్త్రీన్ జీవయేథా మృతా నిమాన్" నీవిష్ట పడుచో మూడు లోకము లందు జచ్చిన వారి నైన బ్రతికించ గలవు; ఇక ఈ సిసువును బ్రతికించుట నీ కొక లెక్క లోనిది గాదు. నీ ప్రభావము నాకు దెలిసి యుండుటను బట్టి యాచించు చున్నాను. ఇది నాభక్తురాలని దెలిసి కృప యుంచ దగును.

మఱియు "పుణతార్క్ష్య రచింత్యాత్మా" యని ద్రౌపది యుపదేశించిన (పురాణ ఋషియు, యచింత్యుడును నగు నాతని నో మెఱలిడుచును) రీతిగ యాతనికి మెఱ వెట్టికొనుచు, దన తొడపై నున్న యాబాలుని జూచి-

"ధర్మజ్ఞస్య సుత స్సత్వ మధర్మం నావబుద్ధ్యసే
య స్త్వం వృష్ణిప్రవీరస్య కురుషే నాభివాదనమ్॥"

పుత్రకా! ధర్మజ్ఞుని పుత్రుడగువ నీ వధర్మము నేల దెలిసికొనలేక పోతివి? యేలనన! వృష్ణివీరుడగు వాసుదేవునకు వెందుకు నమస్కరించవైతివి? అని యతికరుణముగ విలపించ నుత్తరం గని భగవంతు డాశ్వత్థామకొఱకై యిట్లు పలికెను.

"యథా సత్యం చ ధర్మశ్చ మయి నిత్యం ప్రతిష్ఠితౌ
తథా మృత శ్శిశు రయం జీవతా మభిమన్యుజః॥"

నాయందు సత్యమును, ధర్మమును యున్నయెడల నభిమన్యు పుత్రుడు జీవించు (గాత) నని యనగా (ప్రాస్పందత శనై శ్శనైః) నా శిశువు ప్రాణముగలవాడయి మెల మెల్లన గదలెను. కావున మృత్యు సంసార సాగరము నుండి దప్పించు భగవం

తుడే సమర్థుడు. యితరుల కది శక్యమగునా!

అనన్యమగు భక్తియోగము చేతనే శాంతి, ద్రౌపది, సుభద్ర, యుత్తరయు భగవదనుగ్రహమున దమ వంశమును నిలుపుకొన గలిగిరి. గాన నెల్లరికిని భక్తియోగమే శరణ్యము.

శాంతి. ౩౦౯ - ౧౦౮

యస్యా వ్యక్తం న విదితం సగుణం నిర్గుణం పునః
తేన తీర్థాని యజ్ఞాని సేవితవ్యా విపశ్చితా ॥
న స్వాధ్యాయై స్తపోభి ర్వా యజ్ఞై ర్వా కురునందన
లభతే వ్యక్తకం స్థానం జ్ఞాత్వా వ్యక్తం మహీయతే ॥

సగుణంబగు నవ్యక్తమును, నిర్గుణంబగు నాత్మను నెవ్వండెఱుంగఁడో వాఁడొక్కఁడే (జ్ఞానము లేనంగున) దీర్థముల సేవింపవలయు యజ్ఞములను జేయవలయు నంతేగాని వేదాధ్యయనముచేతను, తపస్సుచేతను బ్రహ్మత్వము లభింపనేరదు. అవ్యక్తమగు పరము గూర్చిన జ్ఞానమున్న వాఁడొక్కఁడె పూజితుఁడగును.

అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ॥ ౯
అభ్యాసే ప్యసమర్థోఽసి మత్కర్మ పరమో భవ
మదర్థ మపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి॥ ౧౦
అథై త దప్యశక్తోఽసి కర్తుం మద్యోగ మాశ్రితః
సర్వకర్మ ఫలత్యాగం తతః కురు యతాత్మవాన్॥ ౧౧
శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే
ధ్యానా త్కర్మఫలత్యాగ స్త్యాగా చ్ఛాంతి రనంతరమ్॥ ౧౨

ఓ ఇప్పుడీ విధముగ నాయందు నిశ్చలముగ చిత్తము నుంచుట నీవలన కానిచో ఓ ధనంజయా! యభ్యాసము యొక్క

సాహాయ్యముచే ననగా: పదేపదే ప్రయత్నించి నన్ను పొందవలయు నని యుత్సాహపడుము. ౧౦ అభ్యాసము చేయుటకును నసమర్థుడవగుదువేని, నన్ను పొందునిమిత్తములు (శాస్త్రములయందు చెప్పబడిన జ్ఞాన ధ్యాన భజన పూజనాదులగు) కర్మలను చేయుచుండుము. మదర్థమై నీవు కర్మలను చేసినను సిద్ధి నొందుదువు ౧౧ కాని దీనిని చేయుటకును నీ వసమర్థుడ వగుదువేని మద్యోగమును (అనగా మదర్పణ పూర్వకమగు నే యోగము, అనగా: కర్మ- యోగము కలదో దానిని) ఆశ్రయించి, నియతాత్ముడవై (అనగా: మెల్లమెల్లగ చిత్తమును నిరోధించుచు, పిదప సర్వకర్మలయొక్క ఫలమును త్యజింపుము. ౧౨ కావున మేమన: నభ్యాసముకంటె జ్ఞానముమిక్కిలి మంచిది. జ్ఞానముకంటె ధ్యానము మిక్కిలియోగ్యతగలది. ధ్యానముకంటెకర్మఫలత్యాగము మిక్కిలి శ్రేష్ఠమైనది మఱియునీకర్మ ఫలము యొక్క త్యాగము వలన తర్వాత వెంటనేశాంతికలుగును.

"నాస్తి త్యాగసమం సుఖం" త్యాగమునకు సమానంబగు సుఖము లేదని జెప్పంబడినది. భారతము (శా. ౨౧౯-౧౯) నందు త్యాగము గుఱించి పంచశిఖుడు జనకుని కిట్లు జెప్పెను.

అత్ర సమ్యగ్వధో నామ త్యాగశాస్త్ర మనుత్తమం
శృణు యత్తవ మోక్షాయ భాష్యమాణం భవిష్యతి ।
త్యాగ ఏవ హి సర్వేషాం యుక్తానా మపి కర్మణాం
నిత్యం మిథ్యా వినీతానాం క్లేశో దుఃఖవహో మతః ॥
ద్రవ్య త్యాగే తు కర్మాణి భోగత్యాగే వ్రతా న్యపి
సుఖత్యాగే తపోయోగం సర్వత్యాగే సమాపనా ॥
తస్య మార్గో౽య మద్వైధ స్సర్వత్యాగస్య దర్శితః ॥

జనకా! ఈవిషయమై సమ్యగ్వధమను నుత్తమమగు త్యాగశాస్త్రము గలదు. దానిని జెప్పెదను. అది మోక్షము నివ్వ గలదు.

ముక్తిని బడయు గోరువారెల్లరికిని గర్మముల త్యాగము ముఖ్యముగా విధింపబడినది. ఎవరు జక్కగ వినీతులు గారో (యథార్థముగ త్యాగమున, నియమితులు గారో అనగ: మనస్సునునిలుపజాలరో) వారు దుఃఖముతో గూడిన బాధను మాత్రమే పొందుదురు. వైదికములగు యజ్ఞములు, ధనము మొదలగు వాని త్యాగము కొఱకున్నవి. వ్రతములు, నుపవాసములు మొదలయినవి భోగముల త్యాగము కొఱకున్నవి. మఱియు తపము యోగమును సుఖత్యాగమునకయి యున్నవి. సర్వమును ద్యజించుటయే త్యాగమనిపించుకొనును. దీనిం దెలిసినవారు దుఃఖములను దిగవిడుతురు. మఱియొక విధముగ నడచుకొను వారు దుర్గతుల పాలగుదురు. ఈయధ్యాయము కేవల జ్ఞాన దాయకము.

: అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ
: నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ॥ ౧౩

౧౩ ఎవ్వరిని ద్వేషించని వాడును, సర్వభూతములయందును మిత్రభావముతో సంచరించువాడును, దయ గలవాడును, మమత్వబుద్ధియు, నహంకారమును లేనివాడును, సుఖదుఃఖములు సమానముగ నున్నవాడును, క్షమ గలవాడును,

శా. ౧౪౯-౨. కపోతోపాఖ్యానము.

మహాప్రస్థాన మాసాద్య లుబ్ధకః పక్షి జీవకః॥

పక్షులను హింసించి జీవనము గడుపుకొను బోయ కపోతముల చరిత్రం జూచి యౌరా! అలుమొగల మనుకొన్న పక్షుల దాంపత్యముగూడ మోక్షదాయకమే గదా! యని (నిశ్చేష్టో మరుదాహారః) దన చేతల మానుకొని గాలిని దినుచు (నిర్మమో నిరహంకారః) మమతాహంకారములుడిగి సర్వభూతములకును హితుడయి (జగామ పరమాంగతిం) యుత్తమగతినిపొందెను

బోధయను పక్షులు జ్ఞానదాయకములు. ఇట్లీ పై ముగ్గురు లోకమునకు జ్ఞానబోధకులు గాగలుగుదురు.

శా. ౧౭౫. మేధావియనువాడు దండితో నిట్లనియె.

సోహం హ్యహింస్ర స్సత్యార్థీ కామక్రోధ బహిష్కృతః
సమ దుఃఖ సుఖ క్షేమీ మృత్యుం హాస్యా మ్యమర్త్యవత్ ॥

నేను హింసను వీడి, సత్యమును గోరువాడనై కామక్రోధాదులను వెలిబెట్టి సుఖ దుఃఖములను సమముగా జూచి చావు లేని (దేవత) వాని వలె మృత్యువును గెలిచి నాను.

సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః
మయ్యర్పితమనో బుద్ధి ర్యో మే భక్త స్స మే ప్రియః॥ ౧౪

౧౪ ఎల్లప్పుడు సంతుష్టుడు సంయమము గల వాడును దృఢ నిశ్చయము గల వాడును, నాయందు చంప బడిన మనో బుద్ధులు గల వాడును నగు నాకు భక్తుడును నగు (కర్మ-) యోగి నాకు మిక్కిలి ప్రియుడు.

సభాపర్వ. ౩౯- ౧. సహదేవః.

వ్యాజహారోత్తరం తత్ర సహదేవో ర్థవ ద్వచః
కేశవం కేశిహంతార మప్రమేయపరాక్రమమ్॥
పూజ్యమానం మయా యో వః కృష్ణం న సహతే నృపః
సర్వేషాం బలినాం మూర్ధ్ని మయే దం నిహితం పదమ్ ॥
ఏవ ముక్తే మయా సమ్య గుత్తరం ప్రబ్రవీతుసః
మానినాం బలినాం రాజ్ఞాం మధ్యే వై దర్శితే పదే॥
తతో పతత్పుష్ప వృష్టి స్సహదేవస్య మూర్ధని
అదృశ్యరూపా వాచ శ్చా ప్యబ్రువ న్సాధు సాధ్వితి ॥

రాజసూయమున నివ్వబడు యాగ తాంబూలమును శ్రీకృష్ణున కివ్వ వలయు నని భీష్ముడు నిర్ణయించెను. దానికి శిశు

పాలాదులు తగదనిరి. అప్పుడు భీష్మాదులు జెప్పిన వాక్యముల యందు నమ్మిక గలవాడును, యాత్మవంతుడు నగు సహదేవుడు శ్రీకృష్ణున కగ్ర తాంబూలము నివ్వ రాదను వారి శిరమున యీ నా పాదము నిడెద నని రాజులందఱు జూచుచుండ దన వామ పాదము నెత్తి జూపెను. అంతట, పుష్ప వర్షము గురిసెను. భూతములన్నియు సహదేవుని వాక్యమును గొని యాడెను. సహ దేవుడు భక్తులందఱిలో దృఢ నిశ్చయుఁడును, భగవంతునికిష్టుడు నని మనమెఱుఁగవలెను.

యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చయః
హర్షామర్షభయోద్వేగై ర్ముక్తో యస్స చ మే ప్రియః॥ ౧౫

౧౫ ఎవరిని లోకులు వ్యాకులపెట్టరో, లోకుల నెవడు వ్యాకులపెట్టడో, యట్టివాడును, హర్షము, క్రోధము, భయము విషాదము ననువానిచే వికారమునొందనివాడును నాకు ప్రియుడు.

అనపేక్ష శ్శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యథః
సర్వారమ్భపరిత్యాగీ యో మద్భక్త స్స మే ప్రియః॥ ౧౬

౧౬. నిరపేక్షియును, శుచియును, దక్షుడును (అనగా: నే కార్యము నయినను నాలస్యము లేక చేయువాడును) ఫల విష యమై యుదాసీనుడు, ఎవరిని ఏ వికారమును చలింపచేయ నేర దో, మఱియు నెవడు కామ్య ఫలముల యొక్క యారంభముల నన్నింటిని యనగా: నుద్యోగముల నన్నింటిని వదలెనో యట్టి నా భక్తుడు నా కిష్టుడు.

శాంతి. ౨౬౨- ౩౧. తులాధారః

యస్మాన్నోద్విజతే భూతం జాతు కించి త్కథంచన
సోభయం సర్వభూతేభ్య స్సంప్రాప్నోతి మహామునే॥
యస్మాదుద్విజతే లోకః సర్పా ద్వేశ్మగతా దివ

న స ధర్మ మవాప్నోతి ఇహలోకే పరత్ర చ॥

ఎవని వలన నొకప్పుడయినను నే ప్రాణియు భయపడ కుండునో యట్టి ప్రాణి సర్వభూతముల వలనను భయ పడ కుండును. మఱియు నెవఁ డింటిలో బ్రవేశించిన సర్పమువలె భయంకరుడయి యుండునో వా డిహ పర లోకముల బుణ్యమును బొంద నేరడు.

మఱియు "సర్వలోకో వృకా దివ" అన్ని విధములగు జీవజాలము తోడేలువలె నెవని జూచి భయమందునో వాడన్ని విధముల ధర్మ- (ఉత్తమ లోకముల గల్గించు పుణ్య-) వర్జితుడని దెలియ వలయు నని తులాధారుడు జాజలికి వినిపించెను.

మఱియు 'సర్వారంభ పరిత్యాగము' ఈయాఖ్యానమువలన
83 స్పష్టముగ మనకు దెలియ గలదు. ద్రౌపది దనకు మానభంగము దటస్థింపగా భగవంతుని ప్రార్థన దక్క నితరములయిన యే ప్రయత్నముల జేయక "గోవింద ద్వారకావాసిన్ కృష్ణ గోపీజన ప్రియ। కౌరవైః పరిభూతాం మా ముద్ధరస్వ జనార్దన!" అని ధ్యానించి భగవదనుగ్రహముచే కృతార్థురా లయ్యెను.

తస్యైవం గతతృష్ణస్య విజ్వరస్య నిరాశిషః।
కా వివక్షాస్తి వేదేషు నిరారంభస్య సర్వతః॥ శా. ౨౬౭-౧౧

ఆశా రహితుడును, తాప రహితుడును, యాహారమును ద్యజించిన వాడును, అన్నింటి యందును యే విధమగు బ్రయత్నమును జేయని వాడును నగు వానికి వేదములయందు విచార మేమి యుండగలదని జెప్పుట వలన, యిట్టి జ్ఞాని భగవద్భక్తులలో నగ్రగణ్యుడు. ఈ యధ్యాయమున విశేషములు జాల గలవు.

యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి
శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః॥ ౧౭

ఎవడు (దేని విషయమున నయినను) ఆనందము నొందడో ద్వేషింపడో, శోకింపడో, కోరకుండునో, శుభాశుభములను

(కర్మ ఫలములను) వదలినాడో యట్టిభక్తిగలవాడె నాకిష్టుడు

భక్తిమాన్యస్సనోత్థాయ శుచి స్తద్గతమానసః
సహస్రం వాసుదేవస్య నామ్నా మేతత్ప్రికీర్తయేత్॥ అనుగ్గీ

వాసుదేవుని పొందిన మనస్సుగలవాడై, వాసుదేవ సహస్ర మును గాచించువాడు భక్తివంతు డగును.

శాంతి. ౨౫౭- పరాశర గీత. శుభాశుభేషు సక్తాత్మా ప్రాప్నోతి సుమహద్భయమ్॥ శుభాశుభముల యందుదగుల్కొనిన యాత్మ గొప్ప భయము జెందును. ఈ యధ్యాయమున పరాశరుడు జనకునికి ద్వంద్వ భావముల బోధించియున్నాడు.

సమ శ్శత్రౌ చ మిత్రేచ తథా మానావమానయోః
శీతోష్ణ సుఖ దుఃఖేషు సమ స్సంగ వివర్జితః॥ ౧౮
తుల్యనిందాస్తుతి ర్మౌనీ సంతుష్టో యేన కేన చిత్
అనికేత స్థిరమతి ర్భక్తిమాన్ మే ప్రియో నరః॥ ౧౯

శత్రువులును, మిత్రులును, మానావమానములును, శీతోష్ణములును, సుఖ దుఃఖములును నెవరికి సమానముగ నుండునో, ఎవరికి దేనియందును నాసక్తిలేదో, ౧౮. నిందాస్తుతులు రెండును నెవరికి సమానము లయినవో, మితభాషి యెవడో, సంప్రాప్తమయిన దాని చేతనే సంతుష్టుడగు వాడెవడో, చిత్తము స్థిరమయినది యగుటచే నెవడనికేతుడో అనగా: నెవనియొక్క కర్మఫలాశా రూప మయిన నివాస మెచ్చటను లేదో యట్టి భక్తిగల పురుషుడు నా కిష్టుడు. ౧౯.

అసక్త స్సక్తవ ద్గచ్ఛ న్నిస్సంగో ముక్తబంధనః
సమ శ్శత్రౌ చ మిత్రేచ స వై ముక్తో మహీపతే॥ శా. ౧౮.

దేనియందు నాసక్తి లేక నాసక్తి యున్నటుల సంచరించుచు, సంగము లేని వాడయి, బంధములనుండి విడిపోయి, శత్రు మిత్రుల యందు సమాన బుద్ధిగల వాడు ముక్తుడగు నని, విషాద

మను పొందిన ధర్మ నందనున కర్జునుడు జెప్పెను.

గుప్తాని చత్వారి యథా గమం మే
శత్రౌ చ మిత్రే చ సమో స్మి నిత్యమ్
తం చా దిదేవం సతతం ప్రపన్న
ఏకాంత భావేన వృణో మ్యజస్రమ్ ॥ శా. ౩౩౭. నారద॥

శాస్త్ర విధి ప్రకారము హస్త పాదములను, శిశ్నోదరము లను గాపాడుకొంటిని. మఱియు శత్రు మిత్రులయందు సమత్వ బుద్ధి గలిగి యుంటిని. ఎల్లపుడు నయ్యాదిదేవుని యేకాంత భావ ముచే వరించు చుందును. ఇట్టి నేను యనంతుడగు నీకు నెందు వలన జూడ లేనని నారాయణునితో నారదుడు జెప్పకొనెను.

పై శ్లోకము నందు భక్తి పరుల నుప యోగించిన శబ్దములు నారదాది మహర్షులను వర్ణించు నని దెలియందగు.

యే తు ధర్మ్యా మృత మిదం యథోక్తం పర్యు పాసతే
శ్రద్ధధానా మత్పరమా భక్తా స్తే తీవ మే ప్రియాః ॥ ౨౦

పైన చెప్పబడిన యీ యమృత తుల్యమగు ధర్మమును మత్పరు లగుచు శ్రద్ధతో నాచరించు భక్తులు నాకు మిక్కిలి యిష్టు లగు చున్నారు. ౨౦.

సభాపర్వ. ౫౮ - ౭. రాజ సూయము నందు గురువుల పూజ సేయు నట్టియు, పరుల రహస్యము ను గాపాడు నట్టియు, వేదములను జదివి తపోవంతుడయి అనృతము నాడక సర్వ సద్గుణ ముల పుంజీ భూతుడు నగు నారదుడు రాజులందఱు వినుచుండ నిట్లనియె- “సర్వ సంశయ నిర్ముక్తో నారద స్సర్వలోక విత్
ఉవాచా ఖిలభూతానాం మధ్యే స్పష్టతరం వచః ॥
కృష్ణం కమల పత్రాక్షం నా ర్చయిష్యంతి యే నరాః
జీవ న్మృతా స్తు తే జ్ఞేయా న సంభాష్యాః కదాచన ॥

లోక జ్ఞానమును సర్వమును దెలిసి కొనిన నారదుడు సర్వ

భూతములు వినుచుండ యే సరులు శ్రీకృష్ణు నారాధింపరో వారు జీవన్మృతు లనియు, యట్టి వారితో మాటలాడుట సయితము బనికిరాదనియు స్పష్టముగ జెప్పెను. నారదాది మహర్షులు సగుణారాధన ముఖ్యమని యుపదేశించి యున్నారు.

ఆరిరాధయిషుః కృష్ణం వాచం జిగదిషామియాం
తయా వ్యాస సమాసిన్యా ప్రీయతాం పురుషోత్తమః ॥
నారాయణః పరం బ్రహ్మ నారాయణ పరం తపః
నారాయణః పరో దేవ స్సర్వం నారాయణ స్సదా ॥

భీష్మః- శాంతి. ౪౭- ౧౬.

భీష్మ డీరీతిగ (౧౬, మొదలు ౯౯. శ్లోకముల వఱకు) స్తుతి జేసి, 'ఏతావ దుక్త్వా వచనం భీష్మ స్తద్గత మానసః

నమ ఇత్యేవ కృష్ణాయ ప్రణామ మకరో త్తదా ॥

చివరకు శ్రీకృష్ణుని బొందిన మనస్సు గలవాడయి యాతని కొఱకు ప్రణామము నాచరించెను. ఇట్లు భీష్మ డాచరించిన స్తోత్రమున, 'విదిత్వా భక్తియోగం తు భీష్మస్య పురుషోత్తమః' భక్తి యోగము బూర్ణముగ నున్నందున దాని గై కొని,

'అధిగమ్య తు యోగేన భక్తిం భీష్మస్య మాధవః
త్రైకాల్య దర్శనం జ్ఞానం దివ్యం దత్వా యయౌ హరిః ॥

త్రికాలముల యందలి యన్నిటిని దెలుపు నట్టి దివ్యజ్ఞానము నొసంగి వెడలి పోయెను భారతమునం దుత్తమ భక్తుడు భీష్ముడు.

భారతీయులకు ధర్మ గ్రంథ మగు
శ్రీ మన్మహా భారతము నందలి మోక్ష ధర్మ బోధక మగు
శ్రీమద్భగవద్గీతల యందు
భక్తి యోగ మను ద్వాదశాధ్యాయము.

శ్రీ సరస్వత్యై నమః.

# శ్రీ కుమార గీత.

## క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము.

త్రయోదశాధ్యాయము.

శ్రీ భగవానువాచ;

ఇదం శరీరం కౌంతేయ క్షేత్ర మిత్యభిధీయతే
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥ ౧
క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత
క్షేత్ర క్షేత్రజ్ఞయో ర్జ్ఞానం యత్తద్జ్ఞానం మతం మమ ॥ ౨

శ్రీ భగవంతుడు చెప్పుచున్నాడు- ఓ కౌంతేయా! యీ శరీరమే క్షేత్రమని చెప్పబడుచున్నది. దీని తెలిసికొనినవాడే క్షేత్రజ్ఞుడని యీ శాస్త్రము నెఱిగినవారు చెప్పుచున్నారు. ౧. ఓ భారతా! సర్వ క్షేత్రముల యందున్న క్షేత్రజ్ఞుడను నేనే నని యెఱుంగుము. క్షేత్ర క్షేత్రజ్ఞుల యొక్క జ్ఞానమే నా యొక్క (పరమేశ్వరుని యొక్క) జ్ఞానమని చెప్పబడినది. ౨.

---

'అర్జున ఉవాచ- ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవ చ, ఏతద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ ॥
అర్జునుడడుగుచున్నాడు.- ప్రకృతిని, పురుషుని, క్షేత్రమును, క్షేత్రజ్ఞుని, జ్ఞానమును, జ్ఞేయమును అనగా, నేమియో యెఱుంగవలయు నని కోరిక యున్నది కాన దానిని చెప్పుము.'
అను నీశ్లోకమును తిలక మొదలగువారు ప్రక్షిప్తమనుటచే నిట నుదహరించలేదు.

(శాంతి. ౩౩౯.) ఈ విషయము చెప్ప రానిది. ఇది సనాతనంబగు పరమ రహస్యము. నీవు మా యందు భక్తిగల వాడ వగుటంజేసి నీకు గల రూపున జెప్పుచున్నాను. ఏది సూక్ష్మమును, నచలమును, తెలియరానిదియు నగు నవ్యక్తమును, ధ్రువమును; నింద్రియములు నింద్రియార్థములును లేనిదో,

స హ్యంతరాత్మా భూతానాం క్షేత్రజ్ఞ శ్చేతి కథ్యతే
త్రిగుణ వ్యతిరిక్తో వై పురుష శ్చేతి కల్పితః॥ అది భూతముల కంతరాత్మ యనియు, క్షేత్రజ్ఞుడనియు జెప్పబడుచున్నది. మఱియు నది త్రిగుణములగు, సత్వ రజ స్తమస్సులకు వ్యతిరిక్తమగు పురుషుడని చెప్పబడుచున్నది. అని యీ ప్రకారముగా నారదునకు నారాయణుడు జెప్పెను.

క్షేత్రం జానాతి చా వ్యక్తం క్షేత్రజ్ఞ ఇతి చోచ్యతే
అవ్యక్తికే ప్రవిశతి పురుష శ్చేతి కథ్యతే॥
అన్య దేవ చ క్షేత్రం స్యా దన్యః క్షేత్రజ్ఞ ఉచ్యతే
క్షేత్ర మవ్యక్త మిత్యుక్తం జ్ఞాతారం పంచవింశకమ్॥

వసిష్ఠః. శాంతి. ౩౦౭- ౩౮.

ప్రకృతి క్షేత్ర మనబడుచున్నది. ఆత్మ గొప్పదైయిరువది నాలుగు తత్వములు గడచి యిరువది యైదవ దగుచున్నది. అత డవ్యక్తమగు క్షేత్రమును దెలిసిన వాడు గాన క్షేత్రజ్ఞుడని జెప్పబడుచున్నాడు మఱియు నాత్మ యవ్యక్తమగు క్షేత్రమునందు ( దేహమునందు ) ప్రవేశించుచున్నది కనుక పురుషుడన బడుచున్నది. క్షేత్రము, క్షేత్రజ్ఞుడును వేఱు. క్షేత్ర మవ్యక్త మనియు, పంచవింశకు ( యిరువది యయిదవవా ) డయిన యాత్మ జ్ఞాత యనియు జెప్పబడినది. ఇట్లని వసిష్ఠుడు జనకునకు జెప్పెను.

ప్రజ్ఞావ్రుతం ...... వాయ్వా సమన్వితం

జ్ఞానాశ్రయం తృప్తితోయ మంతః క్షేత్రజ్ఞ భాస్కరమ్॥
అనుగీత. ౨౭- ౧౫.

ఈ క్షేత్ర మరణ్యముగ వర్ణింప బడినది. మఱియు నా వనము ప్రజ్ఞ యను వృక్షము; మోక్షమను ఫలమును, శాంతి యను ఛాయయు గలిగి జ్ఞానమున కాశ్రయమై యున్నది. ఇంతే గాక తృప్తి యను నుదకమును, లోపల క్షేత్రజ్ఞు డను సూర్యుండును గలడు ఎవరీ సూర్యుని బొందుదురో వారికి భయ ముండ నేరదు క్షేత్రజ్ఞుని యనుగ్రహము బొందినవారీ క్షేత్రారణ్యమును దెలిసి దుఃఖ రహితు లగుదురు. గీతా పారాయణ పారీణులీ యధ్యాయమును ప్రతి నిత్యమును జపించెదరు గాక.

అపో క్షేత్రజ్ఞ ఇత్యుక్త స్సంయుక్తః ప్రాకృతై ర్గుణైః
తైరేవ తు వినిర్ముక్తః పరమాత్మే త్యుదాహృతః॥
భృగు భరద్వాజ సంవాదము. శా. ౧౮౬- ౨౩.

ఈ జగ మంతయు జలమయము. దేహ ధారుల కెల్ల రూపము జలమె యగును. అందు మనస్సును బట్టి యాత్మ యుండును ఆయాత్మయే సర్వభూతములందు వసించి యుండు బ్రహ్మ. ఆత్మ ప్రాకృతగుణములతో గూడినపుడు క్షేత్రజ్ఞుడనబడును. ఆ గుణముల నుండి విడిపోయి నపు డాయాత్మ పరమాత్మ యనబడును. అదియె యాత్మ యనబడును; మఱియు నది సర్వ వ్యాపియు, తామరాకులోని బిందువు వలె నిర్లిప్తము నయి యున్నది.

"క్షేత్రజ్ఞం తం విజానీహి నిత్యం లోకహితాత్మకమ్"

అది క్షేత్రజ్ఞుడనియు, లోక హిత మంది మనస్సు గలిగి యుండునదనియు దెలియుము. ఈ యధ్యాయ మమోఘము.

అలింగ గ్రహణో నిత్యః క్షేత్రజ్ఞో నిర్గుణాత్మకః
తస్మా దలింగః క్షేత్రజ్ఞః కేవలం జ్ఞానలక్షణః॥
భగవాన్. అశ్వ. ౪౩- ౩౬.

రూపాది హేతువులచే గ్రహింప వీలుగాని వాడును, నిత్యుడును, నిర్గుణుడును క్షేత్రజ్ఞుడు; అందువలన లింగరహితుడగు క్షేత్రజ్ఞుడు జ్ఞానమే లక్షణముగా గలవాడు.

: తత్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్
: స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు. ॥ ౩
: ఋషిభిర్బహుధా గీతం ఛందోభిర్వివిధైః పృథక్
: బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః ॥ ౪

క్షేత్రమనగా నేమియో నది యెట్టిదియో, దాని వికారములెద్దియో, (దాని యందును) దేని నుండి యేది యుత్పన్నమగుచున్నదియో, యటులె క్షేత్రజ్ఞుడెవడో, యాతని సామర్థ్యమేమియో నేను సంక్షేపముగ జెప్పుచున్నాను వినుము. ౩. అనేక విధములుగ వివిధములగు ఛందస్సుల చేతను కార్యకారణరూపమగు హేతువును చూపించి పూర్ణముగ నిశ్చయింపబడిన బ్రహ్మసూత్రముల యందలి పదముల చేతను నీ విషయము గానము చేయబడినది. ౪.

బ్రహ్మసూత్రములు, ఉపనిషత్తులు, ఆచార్య భాష్యములు అధికారములను బట్టి యెంత యుపయోగకరములో యటులనే సర్వజనులకు బరమార్థ విచారమునకయి యీ గీతలు నట్టివే యని దలంపవలయు; సర్వ వేదార్థ సారముల దెలిసికొనుటకు మహా పరమార్థమునకిన్ని ధర్మములు గలవని గ్రహించుటకును మహాత్ములిందలి ధర్మములనే యనేక గ్రంథముల రచించి రనుటకు నిదర్శనముగా భగవదాజ్ఞలని వ్యాస మహర్షి శ్రీ మహాభారతమునందు (౧౮) అధ్యాయములుగా వీనిని రచించి యున్నాడు.

: మహాభూతాన్యహంకారో బుద్ధిరవ్యక్తమేవ చ
: ఇంద్రియాణి దశైకం చ పంచ చేంద్రియగోచరాః ॥ ౫

ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సంఘాత శ్చేతనా ధృతిః
ఏత త్క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్ ॥ ౬

పృథివ్యాది (స్థూలము లయిన) పంచమహాభూతములును నహంకారము బుద్ధి (మహాత్) యు నవ్యక్తము (ప్రకృతి) ఆటులె పది (సూక్ష్మము లగు) యింద్రియములును, మనస్సును నది యొకటియు, పంచేంద్రియములయొక్క (శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము నను సూక్ష్మములగు) నైదు విషయములును, - ౫. ఇచ్ఛయు, ద్వేషము, సుఖము, దుఃఖము, సంఘాతము, చేతన (ప్రాణాదుల యొక్క వ్యక్తమగు వ్యాపారమును), ధృతి (ధైర్యము) అను నీ (౩౧) తత్వములయొక్క సముదాయము సవికారమయిన క్షేత్ర మని చెప్ప బడినది. ౬.

శాంతి ౨౧౯.- పంచ జ్ఞానేంద్రియములు, మనస్సు, పంచ కర్మేంద్రియములు, త్రిగుణములు (వీటి లక్షణము గుణత్రయ విభాగ యోగమున వర్ణింప బడినది.), మోహము, ఇచ్ఛా ద్వేష సుఖ దుఃఖాదులు నను నివియెల్ల ననేక ప్రకారములుగా జెప్పం బడినవి. మనుజుడు జ్ఞానముచేత ముక్తిని బడయుచున్నాడు. లోకమంతయు ధర్మము చేత నే ధరింప బడుచున్నది. అన్నియు ధర్మము నందే నెలకొని యున్నవి. ఆ ధర్మమే సర్వ పురుషార్థ సాధక మగుచున్నది. గావున, సర్వము ద్యజించి ధర్మ పరులైన యెడల బరమాత్మ ప్రసన్నుడగు చున్నాడు. లోకము నందు గాన్పించు నట్టి వస్తువు కంటె గనుబడని దియు సాటి లేనిదియు నగు నొక వస్తు వంతటను గలదు.

ఏత దాహు స్సమాహారం క్షేత్ర మధ్యాత్మ చింతకాః
స్థితో మనసి యో భావ స్స వై క్షేత్రజ్ఞ ఉచ్యతే ॥

ఆత్మానాత్మ విచార పరులు ( ఇంద్రియములు మొదలగు

తత్త్వ జ్ఞానము యొక్క సిద్ధాంతమును బరిశీలించుటయు ననునవి జ్ఞానమని చెప్పబడుచున్నవి. ఇవిగాక మిగిలినవి యజ్ఞానము.

(సర్వ మేవాభిమానః, అన్నింటి గ్రమించునది యభిమానము. అట్టి యభిమానము లేకుండుట, "ఇజ్యాధ్యయన దానాని తప స్సత్యం ధృతిః క్షమా" యజ్ఞాధ్యయన దాన తపస్సులును, "డంబార్థ మపి సేవతే" డంబము కొఱకును జేయుచుందురు. కాన డంబ రాహిత్యము, "అహింసైకా సుఖావహా" సర్వ సుఖముల నిచ్చునట్టి యహింస, "శాంతిః ఖడ్గః కరే యస్య కిం కరిష్యతి దుర్జనః" దుర్జనుల రూపుబాపు శాంతియు, "ఆర్జవం ప్రతి పద్యస్వ" (తానెమి జేయుచున్నను పాండవుల విషయమై వారెట్లు బ్రదుకుదురను బుద్ధి గలిగి యుండుట మంచిదని ధృతరాష్ట్రునితో విదురుడు జెప్పిన విధమున) లోకము యొక్క మంచి చెడ్డల నాలోచించునదియె యార్జవము. ఇట్టి యార్జవము, ఆచార్యోపాసనము ("ఆచార్యేణ స్తుయ జ్జ్ఞాన మ్మత త్సత్యం వై తదామృతం, ఆచార్యుని వలన పొందిన జ్ఞాన మమృత మయము) శౌచము- అంతరింద్రియ బహిరింద్రియ పరిశుద్ధత, ఇంద్రియ లోలత్వముడుగుట, స్థిరత్వము ననునివి యన్నియు జ్ఞానాంగములు.

అర్చే ద్దేవా నదంభేన సేవేతా మాయయా గురూన్

అనుశాసన. ౧౬౨

డంబము లేక దేవతలను, మాయ లేకుండ గురువులను సేవించవలయును. మఱియు అధ్యాత్మ ధర్మము నే ప్రకారముగ ననునారదుడు బోధించెను.

అశోకం శోకనాశార్థం శాస్త్రం శాంతికరం శుభం

నిశమ్య లభతే బుద్ధిం తాం లబ్ధ్వా సుఖ మేధతే॥ శా. ౩౩౭

దుఃఖ నివృత్తి కొఱకు దుఃఖము లేని శాస్త్రాభ్యాసము జేసి మంచి బుద్ధిని పొంది దానివలన సుఖమును పొందగలడు. దుఃఖ

౩౮౬ - ౩౮౭ , ౩౯౦ - ౩౯౧ పేజీలు వ్యత్యస్తముగా ముద్రితము లైనవి. క్రమముగా జదువుకొన ప్రార్థితులు.

వివిక్త దేశ సేవిత్వ మరతి ర్జన సంసది ॥ ౧౦
అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం తత్త్వ జ్ఞానార్థ దర్శనం
ఏతద్జ్ఞాన మితి ప్రోక్త మజ్ఞానం యదతో న్యథా ॥ ౧౧

మానము లేకుండుట, దంభము లేకుండుట, అహింస, క్షమ, సరళత్వము, గురు సేవ, శుచిత్వము, స్థిరత్వము, మనో నిగ్రహము, - ౭. ఇంద్రియముల విషయముల యందు విరక్తియు, అహంకారము లేక పోవుటయు, జన్మము, మృత్యువు, జర, వ్యాధి, దుఃఖము అనునవి తన వెంట తగిలిన దోషములని యెన్ను కొనుటయు, - ౮. ( కర్మల యందు ) అనాసక్తియు, దారాపుత్రాదులు గృహము లోనగు వాని యందు లంపటుడు కాకుండుట, ఇష్టమైనను ననిష్టమైనను ప్రాప్తమైనచో నొక విధముననే యెప్పుడును చిత్తవృత్తి నుంచుట, - ౯. నాయందు ననన్య భావముచే వ్యభిచరింపని భక్తియు, ఏకాంత మయిన ప్రదేశమునందుండుట, సామాన్య జనుల యొక్క సముదాయమును గోర కుండుట. ౧౦. అధ్యాత్మ జ్ఞానము నిత్యమను కొనుటయు,

ప్రతిపద్యస్వ" ( తాఁ స్వామి జేయుచున్నను పాండవుల విషయమై వారెట్లు బ్రదుకుదురను బుద్ధి గలిగి యుండుట మంచిదని ధృతరాష్ట్రునితో విదురుఁడు జెప్పిన విధమున ) లోకము యొక్క మంచి జెడ్డల నాలోచించునదియే యార్జవము. ఇట్టి యార్జవము, ఆచార్యోపాసనము ( ' ఆచార్యతస్తు యజ్జన్మ తత్సత్యం వై తదామృతం, ఆచార్యుని వలన పొందిన జ్ఞాన మమృత మయము ) శౌచము- అంతరింద్రియ బహిరింద్రియ పరిశుద్ధత, ఇంద్రియ లోలత్వము డుగుట, స్థిరత్వము నను నివి యన్నియు జ్ఞానాంగములు.

అర్చేద్దేవా నదంభేన సేవేతా మాయయా గురూన్

అనుశాసన. ౧౬౩

దంబము లేక దేవతలను, మాయ లేకుండ గురువులను సేవించవలయును. మఱియు అధ్యాత్మ ధర్మము ఏ ప్రకారముగ నుండ నను నారదుఁడు బోధించెను.

అశోకం శోకనాశార్థం శాస్త్రం శాంతికరం శుభం
నిశమ్య లభతే బుద్ధిం తాం లబ్ధ్వా సుఖ మేధతే॥ శాం. ౩౩౭

దుఃఖ నివృత్తి కొఱకు దుఃఖము లేని శాస్త్రాభ్యాసము చేసి మంచి బుద్ధిని పొంది దానివలన సుఖమును పొందగలడు. దుఃఖ

వాటి ; కూడికయే క్షేత్ర ( శరీర ) మనెదరు. మనస్సునందు వర్తించు నట్టి వస్తువే క్షేత్రజ్ఞ ( ఆత్మ ) డన బడు చున్నాడు. ఈ యధ్యాయమున నీవిషయమై జక్కని వివరణము గలదు.

అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవం
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మ విన్నిగ్రహః॥ ౭

ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ
జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషా నుదర్శనమ్ ॥ ౮

అసక్తి రనభిష్వంగః పుత్ర దార గృహాదిషు
నిత్యం చ సమచిత్తత్వ మిష్టా నిష్టో పపత్తిషు ॥ ౯

మయి చా నన్య యోగేన భక్తి రవ్యభిచారిణీ
వివిక్త దేశ సేవిత్వ మరతి ర్జన సంసది ॥ ౧౦

అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం తత్వ జ్ఞానార్థ దర్శనం
ఏతద్జ్ఞాన మితి ప్రోక్త మజ్ఞానం య దతో న్యథా ॥ ౧౧

మానము లేకుండుట, దంభము లేకుండుట, అహింస, క్షమ, సరళత్వము, గురు సేవ, శుచిత్వము, స్థిరత్వము, మనో న్నిగ్రహము, – ౭. ఇంద్రియముల విషయముల యందు విరక్తియు, అహంకారము లేక పోవుటయు, జన్మము, మృత్యువు, జర, వ్యాధి, దుఃఖము అనునవి తన వెంట తగిలిన దోషములని యెన్ను కొనుటయు, – ౮. ( కర్మల యందు ) అనాసక్తియు, దారా పుత్రాదులు గృహము లోనగు వాని యందు లంపటుడు కాకుం డుట, ఇష్టమైనను యనిష్టమైనను ప్రాప్తమైనచో నొక విధము ననే యెప్పుడును చిత్తవృత్తి నుంచుట, – ౯. నాయందు ననన్య భావముచే వ్యభి చరింపని భక్తియు, నేకాంత మయిన ప్రదేశ మునందుండుట, సామాన్య జనుల యొక్క సముదాయ మును గోర కుండుట. ౧౦. ఆధ్యాత్మ జ్ఞానము నిత్య మను కొనుటయు,

సహస్రము లయినను పండితుని బొంద నేరవు. అనిష్ట సేవన, ఇష్ట పరిత్యాగములచే నల్ప బుద్ధులగు మనుజులు బాధల నొందుదురు. మఱియు ధైర్యముచే నింద్రియముల గాపాడు కొన వలయును.

ఇట్టి ధర్మము లన్నియు నాచరించి, అధ్యాత్మ రతి రాసీనో నిరపేక్షో నిరామిషః, ఆత్మనైవ సహాయేన యశ్చరే త్స సుఖీభవేత్॥" తనయాత్మయందు గ్రీడించుచు, యోగనిష్ఠుడయి, లోభమును విడచి, వేఱొకరు లేక దనకు దానె సహాయుడయి చరించు వాడే సుఖి యగును. ఈయధ్యాయమంతయు గురుబోధ. "అధ్యాత్మవిదుషో ధీరాః" "జ్ఞానం తు పరమం ప్లవః" అధ్యాత్మ విచారణ పరులె పండితులు. జ్ఞాన మను నదియో సంసార సాగరమును దాటుటకు నోడ వంటిది.

జ్ఞేయం యత్త త్ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వా మృత మశ్నుతే
అనాదిమ త్పరం బ్రహ్మ న స త్తన్నా స దుచ్యతే॥ ౧౨
సర్వతః పాణిపాదం త త్సర్వతో క్షి శిరో ముఖం
సర్వత శ్శ్రుతిమ ల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి॥ ౧౩
సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితం
అసక్తం సర్వభృ చ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ॥ ౧౪
బహి రంత శ్చ భూతానా మచరం చర మేవ చ
సూక్ష్మత్వా త్తదవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్॥ ౧౫
అవిభక్తం చ భూతేషు విభక్త మివ చ స్థితం
భూత భర్తృ చ యజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ॥ ౧౬
జ్యోతిషా మపి తజ్జ్యోతి స్తమసః పర ముచ్యతే
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య ధిష్ఠితం॥ ౧౭

(ఇప్పుడు) దేని నెఱింగిన నమృతము (మోక్షము) లభించు చున్నదో దానిని (నీకు) చెప్పుచున్నాను. అది యనాది

(అన్నింటికి) పరమందున్న బ్రహ్మ యగును. అది సత్తని చెప్పుటకు గాని, యసత్తని చెప్పుటకు గాని సాధ్యము గాదు. ౧౨. దానికి నన్ని వైపులను హస్తపాదములున్నవి; అన్ని వైపులను నేత్రములును, శిరస్సులును, ముఖములును కలవు. అన్ని వైపులను శ్రోత్రములు కలవు. అదియే యీ లోకము నందంతటను వ్యాపించి యున్నది. ౧౪. దాని యందు సర్వేంద్రియముల సంబంధ మయిన గుణముల యొక్క యాభాసము కలదు. అయినను దానికి నే యింద్రియమును లేదు. అది యసక్త మయినది. వేఱుగ నుండియు, సమస్తమును ధరించును. నిర్గుణముగ నుండియు గుణముల నుపయోగించును. ౧౪. అది సర్వభూతముల యొక్క లోపలను, వెలుపలను నుండును. అచరమును, చరమును నైనది. సూక్ష్మ మగుటచే నవిజ్ఞేయ మయినది. దూరమందున్నను సమీపము నందె యుండును. ౧౫. (తత్త్వతః) అది నిజముగ నవిభక్త మైనది. అఖండ మయినది. (అయినను) సర్వభూతముల యందును నానాత్వముచే వేఱు వేఱైన దాని వలె నున్నది. మఱియు సర్వభూతములను ధరించును. సంహరించును. ఉత్పన్నము చేయునదియు నదియె యని యెఱుంగవలయును ౧౬. దానినే తేజస్సులకు తేజస్సనియు, అంధకారమునకు పరముగ నున్నదనియు జెప్పుచున్నారు. జ్ఞానమును-తెలిసికొన దగినదియు (జ్ఞేయము) జ్ఞానగమ్యమును, అనగా: జ్ఞానము చేతనే తెలియు నదియును నదియె యగుటచే సందతి హృదయముల యందును నదియె యధిష్ఠించి యున్నది. ౧౭.

అన్య దేవ చ జ్ఞానం స్యా దన్యద్ జ్ఞేయం త దుచ్యతే
జ్ఞాన మవ్యక్త మిత్యుక్తం జ్ఞేయో వై పంచవింశకః ॥

శా. ౩౦౭- ౪౦.

జ్ఞానము వేఱు. జ్ఞేయమును వేఱు. జ్ఞాన మవ్యక్త మనియు

కలుషోదకమున రూపము ప్రతిబింబించని యట్లు యింద్రియములు వికారము జెంది యున్నచో జ్ఞానముచే నాత్మను గన జాలడు.

ఫలం కర్మాత్మకం విద్యా త్కర్మ జ్ఞేయాత్మకం తథా
జ్ఞేయం జ్ఞానాత్మకం విద్యా ద్జ్ఞానం సదసదాత్మకం॥
జ్ఞానానాం చ ఫలానాం చ జ్ఞేయానాం కర్మణాం తథా
క్షయాంతే య త్ఫలం దివ్యం జ్ఞానం జ్ఞేయ ప్రతిష్ఠితమ్॥
శా. ౨౮౬- ౭.

ఫలములకు కారణము కర్మ. కర్మమునకు గారణము బుద్ధి. బుద్ధికి గారణము జ్ఞానము జ్ఞానమున కాత్మ కారణము జ్ఞాన, బుద్ధి (జ్ఞేయ), కర్మ, ఫలముల యొక్క నాశానంతరము గలుగు మేల యిన ఫలము, జ్ఞేయం బగు బ్రహ్మము గుఱించిన జ్ఞానమే యగును. గాన సర్వమును జ్ఞానము కొఱకే యని తెలియవలెను.

ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః
మద్భక్త ఏత ద్విజ్ఞాయ మద్భావాయో పపద్యతే॥ ౧౮

ఈరీతిగ క్షేత్రమును, జ్ఞానమును, జ్ఞేయమును నన నేదియో సంక్షిప్తముగ జెప్ప బడి నది. వీనిని దెలిసికొను నేని నాయొక్క భక్తుడు నా స్వరూపమును బొందు చున్నాడు ౧౮.

ప్రకృతిం పురుషం చైవ విద్ధ్య నాదీ ఉభా వపి
వికారాం శ్చ గుణాం శ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్॥ ౧౯
కార్య కారణ కర్తృత్వే హేతుః ప్రకృతి రుచ్యతే
పురుష స్సుఖ దుఃఖానాం భోక్తృత్వే హేతు రుచ్యతే॥ ౨౦
పురుషః ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజా న్గుణాన్
కారణం గుణసంగో స్య సదస ద్యోనిజన్మసు॥ ౨౧

ప్రకృతి పురుషుడు అను నీ రెండును అనాదులని దెలిసికొమ్ము. వికారమును, గుణములు మొదలగు నవన్నియును

జ్ఞేయము పంచవింశకుఁడగు నాత్మ యనియు జెప్పెనుు

మఱియు "సర్వతః పాణి పాద" మను శ్లోకమున యాత్మ యేవిధముగ జెప్పబడినదో యటులె యను గీతయు నను వదించి యున్నది. మఱియు నిర్గుణత్వమును-

"హిత్వా గుణమయం సర్వం కర్మ హిత్వా శుభాశుభం
ఉభే సత్యానృతే త్యక్త్వా ఏవం భవతి నిర్గుణః ॥ గుణసహిత ములగు కర్మలు శుభాశుభములు. సత్యానృతములను వీటి నొదిలి నపుడె నిర్గుణ మన బడును." ఇట్లు నిర్వచింప బడినది.

మఱియు 'తత్ర యః పరమాత్మా హి స నిత్యం నిర్గుణ స్స్మృతః
స హి నారాయణో జ్ఞేయ స్సర్వాత్మా పురుషో హి సః॥
న లిప్యతే ఫలై శ్చాపి పద్మపత్ర మివాంభసా ॥', పరమాత్మ నిర్గుణుఁడనియు, యాతఁడే నారాయణుఁడనియు, పద్మ పత్రము జలముచే స్పృశింప బడనట్లు కర్మఫలములచే స్పృశింప బడఁడనియును యట్టి మూర్తిని-

"అహి రేవ హ్యహేః పాదా న్పశ్యతీ తి హి నశ్చ్రితం
తద్వ న్మూర్తిషు మూర్తిస్థం జ్ఞానం జ్ఞేయేన పశ్యతి ॥"

పాముల పాదముల పాములే గనుగొను నట్లు మూర్తులలో మూర్తీభవించిన (జ్ఞేయమును) పురుషుని జ్ఞానము చేతనే జూడ గలరనియు నిర్వచింప బడి యున్నది.

యథాంభసి ప్రసన్నే తు రూపం పశ్యతి చక్షుషా
తద్వ త్ప్రసన్నేంద్రియత్వాత్ జ్ఞేయం జ్ఞానేన పశ్యతి॥
స ఏవ లులితే తస్మి న్యథా రూపం న పశ్యతి
తథేంద్రియాకులీభావే జ్ఞేయం జ్ఞానే న పశ్యతి ॥ శా. ౨౦౪-౨.

నీళ్లు తేటగా నున్నపుడు రూపము యొక్క ప్రతిబింబ మే విధముగ గనిపించునో యదే విధముగ నింద్రియములు స్వచ్ఛముగ నుండినట్లో జ్ఞానముచే (జ్ఞేయము) నాత్మను తెలిసికొనఁగలదు

ప్రకృతి నుండి యుత్పన్నము లగు నని తెలిసికొనుము. ౧౯.

కార్యమనగ దేహమును, కారణము లనగ నింద్రియము లును నను నీ రెంటియొక్క కర్తృత్వము నకు ప్రకృతి కారణ మని చెప్పుచున్నారు. మఱియు కర్త కాకపోయినను, సుఖ దుఃఖముల నుపయోగించుటకు పురుషుడు (క్షేత్రజ్ఞుడు) కారణ మని చెప్పబడుచున్నాడు. ౨౦. కారణ మేమి యన: ప్రకృతి యందు పురుష డధిష్ఠితు డయినచో ప్రకృతి యొక్క గుణముల నతడుపభోగించును. ప్రకృతి సంబంధమైన యీ గుణములయొక్క యీ సంయోగము మంచి యోనుల యందు గాని చెడు యోనుల యందుగాని పురుషుడు జన్మించుటకు గారణ మగుచున్నది. ౨౧

ప్రకృతి ర్గుణా న్వికురుతే స్వచ్ఛందేనాత్మకామ్యయా
క్రీడార్థం తు మహారాజ శతశోథ సహస్రశః॥ శా. ౩౧౪.

గుణములయొక్క సృష్టికి ప్రకృతి ప్రధానమయి యున్నది.

అవ్యక్తం చ మహాంతం చ తథాహంకార మేవ చ
పృథివీ వాయు రాకాశ మాపో జ్యోతిశ్చ పంచమమ్॥
యాజ్ఞవల్క్యః. శా. ౩౧౧-౧౧.

అవ్యక్త మహ దహంకారములు పంచభూతములు నగు వీనిని అష్టప్రకృతు లనియెదరు.

యథా పంచ విముక్తాని ఇంద్రియాణి స్వకర్మభిః
తథా హి పరమం బ్రహ్మ విముక్తః ప్రకృతేః పరమ్॥
ఏవం ప్రకృతిత స్సర్వే ప్రవర్తంతే శరీరిణః
నివర్తంతే నివృత్తౌ చ స్వర్గం చైవో పయాంతి చ॥ శా. ౨౨౫.

ఇంద్రియము లేవిధముగ దమతమ వ్యాపారముల వీడి యుండునో యట్లే ప్రకాశము పరబ్రహ్మము గుణముల నన్నింటిని వీడి, ప్రకృతికంటె బరము డై యుండును. ఇట్టి దేహధారు లెల్లరును

గుణముల వలన ప్రవృత్తులయి స్వర్గాది ఫలముల బొందుచున్నారు; మఱియు నివృత్తులై మోక్షము నొందుచున్నారు.

పురుషుడు ( జీవుడు ), ప్రకృతి, బుద్ధి, విషయములు, ఇంద్రియములు, అహంకారము, అభిమానము నను నివి (నాశము నకు లోనయినవి గాన ) భూతము లని పేర్కొన బడు చున్నవి.

" ఏతస్మా ద్ధ్యప్రవృత్తి స్తు ప్రధానా త్సంప్రవర్తతే " వీటి కన్నిటికి మొదటి ప్రవృత్తి ( అనగా: మొట్టమొదటి యుత్పత్తి) ప్రధానము వలననే గలుగుచున్నది. రెండవ ప్రవృత్తి మిథునము వలన గలుగుచున్నది. కాని యీ ప్రవృత్తి మొదటి యైదు భూతముల విడచి దక్కిన వానియందె వర్తించు నని యెఱుంగవలయును.

"ధర్మా ద్దుష్కృత్యప్యతే శ్రేయ స్తథా శ్రేయో హ్య ధర్మతః
రాగవా న్ప్రకృతిం హ్యేతి విరక్తో జ్ఞానవా న్భవేత్ "

ధర్మము వలన శ్రేయస్సును, యధర్మము వలన దుర్గతిని బొందుచున్నాడు యట్లే రాగయుక్తుడయి ప్రకృతిని, విరక్తుడై జ్ఞానమును బొందు చున్నాడు.

యో యథా ప్రకృతి ర్జంతుః ప్రకృతే స్స్యా ద్వశానుగః
తస్య ద్వేష శ్చ కామ శ్చ క్రోధో దంభో నృతం మదః
నిత్య మేవా నువర్తంతే గుణాః ప్రకృతిసంభవాః ॥ శా.౨౬౫.

ఎవడేయే ప్రకారముగ ప్రకృతికి వశుడగునో వాడదే విధముగా ప్రకృతి సంభవము లగు కామ క్రోధాదుల బొందుచుండు నని కపిలాచార్యుడు జెప్పెను.

ఉపద్రష్టా నుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః
పరమాత్మేతి చాప్యుక్తో దేహే స్మి న్పురుషః పరః ॥ ౨౨

( ప్రకృతియొక్క గుణములను ) ఉపద్రష్ట, యనగా: దగ్గర నుండి జూచువాడు, అనుమోదించువాడు, భర్త(అనగా: ప్రకృతి గుణము లను వృద్ధి పొందించు వాడు ), మఱియు నుప భోగించు

వాడు, ఇట్టి వీనినే యీ దేహము నందున్న పురుషుడనియు, పర మాత్మ యనియు జెప్పుచున్నారు. ౨౨.

యఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైస్సహ
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే ॥ ౨౩

పురుషుడు (నిర్గుణుడును) ప్రకృతి గుణములు గలదియు నని తెలిసికొనువాడెట్లు ప్రవర్తించినను నతడు దిరిగి జన్మ నందడు.

పరమాత్మేతి యం ప్రాహుః సాంఖ్యయోగవిదో జనాః
మహాపురుష సంజ్ఞాం స లభతే స్వేన కర్మణా ॥ శా. ౩౬.

సాంఖ్యయోగ వేత్తలగు వారు దేనిని బరమాత్మ యని జెప్పుదురో అట్టి వారు స్వకర్మానుష్ఠానము వలన మహాపురుష సంజ్ఞలు బొందుదురు.

యథా దీపః ప్రకాశాత్మా హ్రస్వో వా యది వా మహాన్
జ్ఞానాత్మానం తథా విద్యాత్పురుషం సర్వజంతుషు ॥ శా. ౨౦

దీపము కొద్దిదే యయినను దాని కాంతి గొప్పదయినటుల సర్వజంతువులయందును పురుషుడదే విధముగా జ్ఞానముతో గూడిన యాత్మ యయి యున్నాడు.

(శా-) ఈ యధ్యాయము గురు శిష్య సంవాద రూపమగు నదియు, భగవదీయము నని యెరుంగవలయు.

ధ్యానేనాత్మని పశ్యంతి కేచిదాత్మానమాత్మనా
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥ ౨౪
అన్యే త్వేవమజానంతః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే
తేఽపి చాతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః ॥ ౨౫

కొందఱు స్వయముగనే తమ యందు ధ్యానముచే నాత్మను జూచుచున్నారు. కొందఱు సాంఖ్యయోగముచేతను, కొందఱు కర్మయోగముచేతను చూచుచున్నారు. ౨౪. కాని యిట్లు విని స్వయముగ జ్ఞానము కలుగని వారితరుల యుపదేశమును

(శ్రద్ధతో పరమేశ్వరుని ) భజించుచున్నారు. విన్న విషయమును ప్రమాణమని యంగీకరించి యాచరించు పురుషులును మృత్యువు నతిక్రమించుచున్నారు. ౨౫.

ధ్యానయోగేన శుద్ధేన నిర్మమా నిరహంకృతాః
ఆప్నువంతి మహాత్మానో మహాంతం లోక ముత్తమం ॥

మనుజులు ధ్యానయోగముచే మమతాహంకారములు లేనివారై యుత్తమ లోకమును గాంతురు. ధ్యాన యోగము వలన నాత్మజ్ఞు లవ్యక్తమును బొందుదురు. ఈ యధ్యాయ మర్జునునకు వసుదేవుడు బోధించెను. ( అనుగీత ౫౧. )

ప్రవేశ్యాత్మని చాత్మానం యోగీ తిష్ఠతి చాచలః
పాపం హంతి పునీతానాం పద మాప్నోతి సోజరమ్ ॥

యోగి యగువాడాత్మయందాత్మను ప్రవేశపెట్టి చలన స్వభావము లేనివాడయి పాపమును బోగొట్టకొని పవిత్రులు బొందునట్టి స్థానమును బొందును. ( శా. ౩౦౧ )

సాంఖ్య యోగములు రెండును తమను పొందినవారి యాత్మోద్ధరణమును జేయుటలో మిక్కిలి సమర్థములయినవని శాంతి యందు ౩౦౧, ౩౦౨- అధ్యాయములలో, ౨౦౦ల శ్లోకములతో జక్కగ నిరూపింపబడి యున్నది

"న లిప్యంతే పాపకృత్యైః కదాచి త్కర్మయోగినః"
కర్మయోగి పాపములచే పూయబడడు; తరింప సమర్థుడగును.

యావత్సంజాయతే కించి త్సత్త్వం స్థావర జంగమం
క్షేత్ర క్షేత్రజ్ఞ సంయోగా త్తద్విద్ధి భరతర్షభ ॥ ౨౬
సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరం
వినశ్య త్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి ॥ ౨౭
సమం పశ్య న్హి సర్వత్ర సమవస్థిత మీశ్వరం
న హినస్త్యా త్మనా త్మానం తతో యాతి పరాం గతిమ్॥

ఓ భరతశ్రేష్ఠా! స్థావర జంగమ రూపమైన యే వస్తువైనను క్షేత్రజ్ఞుల యొక్క సంయోగము వలననే పుట్టునని యెఱుంగుము. ౨౭. సర్వభూతముల యందును సమానముగనే యుండునదియు సర్వభూతములు నశించినను నశించనిదియు నగు పరమేశ్వర స్వరూపమును చూచినవారు నిజమగు తత్త్వము నెఱింగిన వారని చెప్పవలయు. ౨౮. ఈశ్వరుడు సర్వత్ర సమానముగనేయున్నాడని తెలిసికొని యెవడు తనను తాను కొంచపఱచికొనడో (అనగా: తాను తనంతటనే మంచి మార్గములో ప్రవేశించుచున్నాడో) యతను దాని నుండి యుత్తమ గతిని బొందుచున్నాడు. భా.

సమ స్సర్వేషు భూతేషు నిర్మమస్య జితాత్మనః
సమన్తా త్పరిముక్తస్య న భయం విద్యతే క్వచిత్॥

సర్వభూతముల యందు సముడై మమకారమును వదలి జితాత్ముడగుచు అంతటను త్యాగము జేసిన వానికి భయమనునది లేదని యతి యధ్వర్యు సంవాదమునందు గలదు. అనుగీ. ౨౫.

సమ స్సర్వేషు భూతేషు బ్రహ్మాణ మభివర్తతే
నైవేచ్ఛతి న చానిచ్ఛ ద్యాత్రా మాత్రా వ్యవస్థితః॥
అస్పృహ స్సర్వకామేభ్యో బ్రహ్మచర్య దృఢవ్రతః
అహింస స్సర్వభూతానా మీదృ క్సాంఖ్యో విముచ్యతే॥

వ్యాసః. శాంతి. ౨౩౬- ౩౬.

సర్వభూతముల యందును సముడును, కోరిక లేనివాడును, జీవిక మాత్రము గడపువాడును, హింసారహితుడును నగు సాంఖ్యుడు ముక్తుడగును.

ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః ౨౯
యః పశ్యతి తథాత్మాన మకర్తారం స పశ్యతి॥
యదా భూతపృథగ్భావ మేకస్థ మనుపశ్యతి ౩౦
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా॥

సర్వ కర్మలును సర్వ విధములచేతను ప్రకృతి చేతనే చేయబడు చున్న వనియు నాత్మ యకర్త యనియు ( అనగా: దేనిని చేయ దనియు ) నెఱింగిన వాడు నిజమగు తత్వమును తెలిసికొనె నని చెప్ప వలయును. ౨౯. ఎప్పుడు సర్వభూతములయందును, నున్న పృథక్త్వము ( అనగా: నానాత్వము ) ఏకముగ కాన్పించునో. మఱియు నీ యేకత్వము నుండియే సర్వమును విస్తృతమయినదని కాన్పించునో యప్పుడు బ్రహ్మ ప్రాప్తమగును.

శ్రోత్రం వేదయతే వేద్యం స శృణోతి స పశ్యతి
కారణం తస్య దేహోఽయం స కర్తా సర్వకర్మణాం॥ శా ౨౧౦.

శ్రోత్రాదీంద్రియ కర్తవ్యము లకు దేహమె కారణము. దేహమే సర్వ కర్మలకు కర్త యని యెఱుంగ వలయు.

"ప్రకృతి స్సూయతే తచ్చ దాసం శాస్త్రా న్నాపచీయతే"

ఇంద్రియములు తెలిసికొనుటకు దేహమే కర్త యగు నటుల ప్రకృతియే గనుచున్నదని తెలుసుకొని క్రింది శ్లోకాభిప్రాయ ప్రకారము బ్రహ్మను బొందగలరు.

యదా చాయం న బిభేతి యదా స్మాన్న బిభ్యతి
యదా నేచ్ఛతి న ద్వేష్టి బ్రహ్మ సంపద్యతే తదా॥
వ్యాసః . శాం. ౨౱- ౧౪.

శీత ముష్ణం తథై వార్థ మనర్థం ప్రియ మప్రియం
జీవితం మరణం చైవ బ్రహ్మ సంపద్యతే తదా॥
న బిభేతి పరో యస్మా న్న బిభేతి పరాచ్చ యః
యశ్చ నేచ్ఛతి న ద్వేష్టి బ్రహ్మ సంపద్యతే తదా॥
జనకః. ౩౨౭- ౩౭.

యదా సౌ సర్వభూతానాం న ద్రుహ్యతి న కాంక్షతి
కర్మణా మనసా వాచా బ్రహ్మ సంపద్యతే తదా॥
దేవ స్థానుః. ౨౯- ౫.

తులాధారః॥ యదా భావం న కురుతే సర్వభూతేషు పాపకం
కర్మణా మనసా వాచా బ్రహ్మ సంపద్యతే తదా॥ ౨౭.

యుధిష్ఠిరుడును గీతల యందలి ముప్పదవ శ్లోకమునే జెప్పి యున్నాడు. వీని యొక్క తాత్పర్య మిది. ద్వంద్వ భావములును, ద్వేషమును, సర్వభూతముల యందును పాపభావములు లేకయుండుటయు; మఱియు మనో వాక్కాయ కర్మములచే సర్వభూతముల యందును పాపభావము నుంచకుండుటయు నను గుణములు బ్రహ్మను బొందుటకు సహకారములు.

అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మా య మవ్యయః
శరీరస్థోఽపి కౌంతేయ న కరోతి న లిప్యతే॥ ౩౧
యథా సర్వగతం సౌక్ష్మ్య దాకాశం నోపలిప్యతే
సర్వత్రా వస్థితో దేహే తథాత్మా నోపలిప్యతే॥ ౩౨
యథా ప్రకాశయ త్యేకః కృత్స్నం లోక మిమం రవిః
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత॥ ౩౩
క్షేత్ర క్షేత్రజ్ఞయో రేవ మంతరం జ్ఞాన చక్షుసా
భూతప్రకృతి మోక్షం చ యే విదు ర్యాంతి తే పరమ్॥ ౩౪

ఓ కౌంతేయా! అనాదియు నిర్గుణము నగుటచే నీ యవ్యయమగు పరమాత్మ శరీర మందుండియును దేనిని చేయ నేరదు. మఱియు దానికి (ఏ కర్మము యొక్కయు) లేప (సంబంధ) ముండదు. ౩౧. ఇటు లాకాశము వలె నలుగడల వ్యాపించి సూక్ష్మమై యుండుటచే దానికి (దేని యొక్కయు) సంబంధ ముండ నేరదు. అటులే యాత్మ దేహ మందంతట నుండు నది యగుటచే దానికి (దేని యొక్కయు) లేపము తగులదు. ౩౨. ఓ భారతా! ఏ తీరున నొక్కడగు సూర్యుడు జగత్తు నంతను ప్రకాశింప జేయుచున్నాడో యటులనే క్షేత్రజ్ఞుడు క్షేత్రముల

నన్నిటిని ( అనగా: శరీరములను ) ప్రకాశింప జేయుచున్నాడు.

ఇట్లు జ్ఞాన నేత్రములచే క్షేత్ర క్షేత్రజ్ఞుల యొక్క భేద మును, సర్వభూతములకును ( మూలభూత మగు ) ప్రకృతి యొక్క మోక్షమును తెలిసికొన్న వారు పరబ్రహ్మము నొందుదురు.

అనంత మేత దాకాశం సిద్ధ దైవత సేవితం
రమ్యం నానాశ్రయాకీర్ణం యస్యాంతో నా ధిగమ్యతే॥

భృగుః. శా ౧౮౨- ౨౩.

సిద్ధ చారణులచే సేవింపబడు నాకాశముయొక్క యంత మెవ్వరికిని తెలియదు. అట్టి యాకాశమంతట నున్నను దేనిని యంట నటులు "స ఏవ భగవా న్విష్ణు రనంత ఇతి విశ్రుతః" భగవానుడగు విష్ణువును యంతము లేనివాడనియు, దేనిని యంటనివాడనియు తెలియుము. అట్టి పురుషుడే యాత్మస్వరూపుడు.

ధ్యాయే దేకాంత మాస్థాయ ముచ్యతే థ నిరాశ్రయః
నిర్ముక్త స్సర్వసంగేభ్యో వాయు రాకాశగో యథా॥
క్షీణ కోశో నిరాతంక స్తథా యం ప్రాప్నుయా త్పరమ్॥

వాసుదేవః. అనుగీత. ౪౬- ౪౭.

ఆశ్రయము లేనివాడయి యేకాంతముగా నుండి సర్వ సంగములనుండి విముక్తుడయి ధ్యానము జేయువాడయును వాయు, రాకాశముల వలె దేహము లేనివాడై పరమాత్మను పొందును.

భారతీయులకు ధర్మ గ్రంథ మగు
శ్రీ మన్మహా భారతము నందలి మోక్ష ధర్మ బోధక మగు
శ్రీమద్భగవద్గీతల యందు
క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగ మను
త్రియోదశా ధ్యాయము.

శ్రీ బాలా త్రిపుర సుందర్యై నమః

# శ్రీ కుమార గీత.

## గుణత్రయ విభాగ యోగము.

### చతుర్దశాధ్యాయము.

---

శ్రీ భగవానువాచ:

పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞాన ముత్తమం
యద్జ్ఞాత్వా మునయ స్సర్వే పరాం సిద్ధి మితో గతాః ॥౧
ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్య మాగతాః
సర్గే పి నోపజాయంతే ప్రళయే న వ్యథంతి చ ॥ ౨

శ్రీకృష్ణ భగవానుడు జెప్పుచున్నాడు:—మఱియును జ్ఞానములలో నుత్తమ మగు జ్ఞానము నిప్పుడు నీకు మరల జెప్పుచున్నాను. దేనిని తెలిసికొనుటచే మును లందఱు నుత్కృష్టమయిన సిద్ధి నొందిరో, ౧. (దానిని) ఈ జ్ఞానము నాశ్రయించి నాయొక్క సారూప్యము నొందినవారు సృష్టియొక్క యుత్పత్తి కాలము నందు నైతము జన్మించరు. ప్రళయకాలమునందు నైతము వ్యథ నొందరు. (అనగా: జనన మరణముల నుండి యన్ని విధముల చేతను విముక్తు లగుదురు.)

మమ యోని ర్మహ ద్బ్రహ్మ తస్మి న్గర్భం దధామ్య హం
సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత ॥ ౩
సర్వయోనిషు కౌంతేయ మూర్తయ స్సంభవంతి యాః
తాసాం బ్రహ్మ మహ ద్యోని రహం బీజప్రదః పితా ॥ ౪

ఓ. భారతా! మహద్బ్రహ్మ (అనగా: ప్రకృతి యనునది) నాకు యోనియై యున్నది. నేను దానియందు గర్భము నుంచు చున్నాను. అనంతరము దాని యందుండి సర్వ భూతములును బుట్టుట కారంభమగును; ౩ ఓ కౌంతేయా! (పశుపక్ష్యాది) సర్వ యోనుల యందును బుట్టుచున్న దేహముల యన్నింటికి నామహ ద్బ్రహ్మయే యోనియై యున్నది. నేను బీజదాతనగు తండ్రిని. ౪

ససృజే నాభితః పూర్వం బ్రహ్మాణ మమితప్రభః ॥ శా. ౩౪౦

నారాయణుడు నాభినలన బ్రహ్మను సృష్టించి, బ్రహ్మ! సృష్టి జేయుమని యానతిచ్చెను. దానికి బ్రహ్మ నాతరముగాద నెను. అప్పుడు సృష్టిజేయు సహాయముగా నుండుటకయి బుద్ధిని స్మరింప బుద్ధి యుద్భవించెను. దాని జూచి నారాయణుడు "బ్రహ్మాణం ప్రవిశస్వేతి లోకసృష్ట్యర్థ సిద్ధయే" ఓ బుద్ధీ! నీవు సృష్టికొఱకు బ్రహ్మను బ్రవేశించి సృష్టి గావింపు మనియె. అపుడు బుద్ధి బ్రహ్మలు గలసి యీ చరాచర జగత్తు నంతటిని సృజించెను. శాంతి (౨౦౭) యందు సృష్టి యంతయు జెప్పబడి యున్నది. నారాయణునియొక్క మూర్తి వైభవములు బీజప్రధా నత్వము, అవతారవిశేషములును యీ గీతయందనేక స్థలములలో వ్రాయబడి యున్నవి. కాన నిట విస్తారముగ వ్రాయ లేదు.

సత్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః
నిబధ్నంతి మహాబాహో దేహే దేహిన మవ్యయమ్ ॥ ౫
తత్ర సత్వం నిర్మలత్వా త్ప్రకాశక మనామయమ్
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ ॥ ౬
రజో రాగాత్మకం విద్ధి తృష్ణా సంగ సముద్భవమ్
తన్నిబధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినమ్ ॥ ౭
తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినాం
ప్రమాదాలస్య నిద్రాభి స్తన్నిబధ్నాతి భారత ॥ ౮

సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత ॥
జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సంజయ త్యుత ॥ ౯

ఓ మహాబాహువా! ప్రకృతి నుండి యుత్పన్నము లయిన సత్వ రజ స్తమో గుణములు దేహమందున్న యవ్యయ మగు (అనగా: నిర్వికార మగు) నాత్మను దేహము నందు బంధించి వేయు చున్నవి. ౫. ఓ పాప రహితుడ వగు నర్జునుడా! వీనిలో నిర్మల మయినదియు, ప్రకాశింప జేయునదియు, నే దోషమును లేనిదియు నగు సత్వ గుణము యొక్కయు, జ్ఞానము యొక్కయు సంగముచే ప్రాణులను బంధింపు చున్నది. ౬. రజోగుణము యొక్క స్వభావ మనురాగ స్వరూప మైనద నియు, తృష్ణచేతను నాసక్తి చేతను బుట్టు ననియు తెలిసి కొనుము. ఓ కౌంతేయా! అది ప్రాణులను కర్మ సంగముచే (అనగా: కర్మ చేయుద మను నూహ యొక్క సంగము చేత) బంధించి వేయు చున్నది. ౭. ఓ భారతా! తమో గుణ మజ్ఞానము వలన బుట్టిన దనియు ప్రాణుల నన్నింటిని మోహింప జేయు ననియు, దెలిసి కొనుము. ఇది జ్ఞానము నావరించి ప్రమాదమును కర్తవ్య మూఢతే యందు (అనగా: కర్తవ్యమును మఱచి పోవుట యందు) నాసక్తినిగలుగ జేయు చుండును. ౮. సత్వ గుణము సుఖము నందు ప్రవర్తింప జేయునది. రజో గుణము కర్మయందు ప్రవర్తింప జేయు నది. ఆసక్తిని యుత్పన్నము జేయు చున్నది. తమో గుణము జ్ఞానము నావరించి ప్రమాద కార్యముల యందు ప్రవర్తింప జేసి కర్తవ్య మూఢతయందు నాసక్తిని యుత్పన్నము జేయుచుండును. ౯.

నైవ శక్యా గుణా వక్తుం పృథక్త్వే నైవ సర్వశః
అవిచ్ఛిన్నాని దృశ్యంతే రజ స్సత్వం తమ స్తథా ॥
అన్యోన్య మథ రజ్యంతే హ్యన్యోన్యం చార్థ జీవినః
అన్యోన్యమాశ్రయా స్సర్వే తథా న్యోన్యాను వర్తినః ॥ అనుగీత

త్రిగుణములు వేర్వేరుగా జెప్పనలవి గావు. యవి యవి ఛిన్నములుగా నుండును; పరస్పరము జీవించునవియు, నాశ్రయించు నవియు, వర్తించు నవియు నై యున్నవి, వీటి యందున "న హి సత్వా త్పరో ధర్మః కశ్చి దన్యో విధీయతే" సత్వమునకు మించిన ధర్మము ( గుణము ) యెద్దియు లేదు.

ప్రకాశం సర్వ భూతేషు లాఘవం శ్రద్ధధానతా
సాత్వికం రూప మేవం తు లాఘవం సాధు సమ్మతం ॥

సర్వ భూతముల యందు ప్రకాశము, లఘుత్వము, శ్రద్ధ, సాధు జన ప్రీతి మొదలగునవి గలుగుటే సత్వగుణ మందురు.

తమసో తామసా న్భావా న్వివిధా న్ప్రతి పద్యతే
రజసా రాజసాం శ్చైవ సాత్వికా న్సత్వ సంశ్రయాత్ ॥

తమస్సు వలన తమోగుణములను, రజస్సువలన రజోగుణములను, సత్వమువలన సత్వగుణములను బొందుదురు. శా. ౩౦౨.

ఉష్ణీషవా న్యథా వసై స్త్రిభి ర్భవతి సంవృతః
సంవృతో యం తథా దేహీ సత్వ రాజస తామసైః ॥

మనుజుడు మూడువస్త్రములచే కప్పబడినట్లు త్రిగుణముల చేతను యావరింప బడి యుండును. శా. ౨౧౭- ౧౨

కావున, "నిత్య మేవా భివర్ధంతే గుణాః ప్రకృతి సంభవాః" ప్రకృతి వలన బుట్టిన మూడు గుణములును వృద్ధి జెందు చుండును.

తమ శ్శూద్రే రజః క్షత్రే బ్రాహ్మణే సత్వ ముత్తమం
ఇత్యేవం త్రిషు వర్ణేషు వివర్తంతే గుణా స్త్రియః ॥

శూద్రుల యందు తమోగుణము, క్షత్రియుల యందు రజోగుణము, బ్రాహ్మణులయందును సత్వగుణము నను ప్రకారములుగ నీ మూడు గుణము లాశ్రయించి యుండును. అను. ౩౯.

"సద సచ్చైవ త త్సర్వ మవ్యక్తం త్రిగుణం స్మృతమ్"

సద సదాత్మక మగు నవ్యక్తము త్రిగుణాత్మక మని తెలి యందగు. ఈ యధ్యాయ మంతయు త్రిగుణాత్మకము.

తాహు గ్రస్తస్య సోమస్య యథా జ్యోత్స్నా న ప్రకాశతే
తథా తమో భిభూతానాం భూతానాం నశ్యతే సుఖమ్॥

గ్రహణ సమయమున వెన్నెల వలె తమో గుణముచే నావ రింప బడిన భూతములయొక్క సుఖము నశించును. శా ౧౯౦-౩.

ప్రాకామ్యం సత్వ మాదిత్య స్సంతాపో రజసో గుణః
ఉపప్లవ స్తు విజ్ఞేయ స్తమస స్తస్య పర్వసు॥ అను. ౪౯-౪౫.

సత్వ మాదిత్యుడు. సంతాపము రజో గుణము. బాధ లన్నియు తమోగుణ మని భగవద్వచనము.

రజ స్తమ శ్చాభిభూయ సత్త్వం భవతి భారత
రజ స్సత్త్వం తమ శ్చైవ తమ స్సత్త్వం రజ స్తథా॥ ౧౦
సర్వద్వారేషు దేహే స్మి న్ప్రకాశ ఉపజాయతే
జ్ఞానం యదా తదా విద్యా ద్వివృద్ధం సత్త్వ మిత్యుత॥ ౧౧
లోభః ప్రవృత్తి రారంభః కర్మణా మశమః స్పృహా
రజస్యే తాని జాయంతే వివృద్ధే భరతర్షభ॥ ౧౨
అప్రకాశో ప్రవృత్తి శ్చ ప్రమాదో మోహ ఏవ చ
తమస్యే తాని జాయంతే వివృద్ధే కురునందన॥ ౧౩

రజ స్తమస్సుల నణచి సత్వము విజృంభించును. (అప్పుడు దానిని సాత్విక మని జెప్ప వలయును ; అట్లే సత్వ తమస్సుల నణచి రజస్సును, సత్వ రజస్సుల నణచి తమస్సును, విజృంభిం చును (వైకెప్పుచున్నవి) ౧౦. ఈ దేహము నందలి ద్వారము లన్నింటి యందును (ఇంద్రియముల యందు) ప్రకాశమానమగు (నిర్మల మగు) జ్ఞాన ముత్పన్న మయినపుడు సత్వగుణము వృద్ధి పొందిన దని తెలిసి కొన వలయును. ౧౧. ఓ భరత శ్రేష్ఠుడా!

రజోగుణము వృద్ధిపొందునేని లోభమును, కర్మలయందు ప్రవృత్తియు వాని యారంభమును యతృప్తియు నిచ్ఛయు గలుగును. ౧౨. ఓ కురునందనా! తమోగుణము వృద్ధిబొందునేని యంధకారమును ఏమియు చేయక పోవలయు నను కోరికయు గర్తవ్యమును మఱచుటయును, మోహమును బుట్టును. ౧౩.

రజోగుణ తమోగుణములను సత్వగుణమును, రజస్సత్వములను తమోగుణమును, తమస్సత్వముల రజోగుణమును లోబఱచుకొనును ఇది యుగరూపముల బట్టి గలుగుచుండును. ఈ ౧౦వ శ్లోకమే యుగరూపముల యందు వర్ణింపబడినది.

ఆనందః ప్రీతి రుద్రేకః ప్రాకాశ్యం సుఖ మేవ చ
అకార్పణ్య మసంరంభ స్సంతోష శ్శ్రద్ధధానతా ॥

(అనుగీత. ౩౭. బ్రహ్మ) ఆనందము, ప్రీతి యీమొదలగు సద్గుణములు (౬౦) గలది సత్వగుణము. "ఇత్యేత త్సాత్వికం వృత్తం కథితం వో ద్విజర్షభా," ఇట్టి సాత్వికవృత్తమును మీకు బోధించనయినది. యని బ్రహ్మ నుడివెను.

సంఘాతో రూప మాయాస స్సుఖ దుఃఖే హిమా తపౌ
ఐశ్వర్యం విగ్రహేః సంధిః హేతువాదో రతిః క్షమా ॥

(అనుగీత. ౩౬.) సుఖ దుఃఖాదులు (౧౯౦) గలది రజోగుణము. ద్వంద్వభావములతో గూడిన రజోగుణ వంతులగు మనుజులు దమ తమ కోరికలయందు ప్రవర్తించి సఫల మనోరథులయి యానందించుచుందురు. "నరో పి యో వేద గుణా నిమా న్సదా స రాజసై స్సర్వ గుణై ర్విముచ్యతే" యే నరుడయినను యీ రజోగుణముల దెలిసికొనిన యెడల వాడు రజోగుణముల నుండి ముక్తుడగును.

సంమోహో జ్ఞాన మత్యాగః కర్మణా మవినిర్ణయః॥
మోహము, అజ్ఞానము మొదలగు (౫౦) గుణములు గల

యట్టిది తమస్సు. ఇట్టి యీ తమో గుణము నెవ్వ డెఱుంగునో వాడు "స తామసై స్సర్వగుణై ర్విముచ్యతే" తామసములయిన గుణముల నుండి ముక్తుడగును. మూడు గుణముల వను మూడధ్యాయములు భగవంతునిచే నర్జునునకు జెప్పబడినవి.

యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రళయం యాతి దేహభృత్
తదోత్తమవిదాం లోకా నమలా న్ప్రతిపద్యతే ॥ ౧౪
రజసి ప్రళయం గత్వా కర్మసంగిషు జాయతే
తథా ప్రలీన స్తమసి మూఢయోనిషు జాయతే ॥ ౧౫
కర్మణ స్సుకృతస్యాహు స్సాత్త్వికం నిర్మలం ఫలం
రజస స్తు ఫలం దుఃఖ మజ్ఞానం తమసః ఫలమ్ ॥ ౧౬
సత్త్వా త్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ
ప్రమాద మోహౌ తమసో భవతో జ్ఞాన మేవ చ ॥ ౧౭

సత్త్వ గుణము వృద్ధి పొందినపుడు ప్రాణి మరణించినచో నుత్తమ మగు తత్త్వమును దెలిసిన వారి యొక్క (అనగా దేవతలు మొదలగు వారి యొక్క) నిర్మలము లగు (స్వర్గాది) లోకములను పొందును. ౧౪. రజో గుణము ప్రబలమైనప్పుడు మరణించె నేని కర్మల యందాసక్త మయిన (జనుల యందు) జన్మ మెత్తును. తమో గుణము ప్రబలమైనప్పుడు మృతి జెందె నేని (పశు పక్ష్యాది) మూఢ యోనుల యందు జన్మించును. ౧౫. పుణ్య కర్మకు నిర్మలమును, సాత్త్వికము నగు ఫలము గలుగు ననియు, రాజస కర్మకు దుఃఖ ఫల మనియు, తామస కర్మ కజ్ఞానము ఫలమనియు చెప్ప బడి నది. ౧౬. సత్త్వము వలన జ్ఞానమును, రజోగుణము వలన కేవలము లోభమును బుట్టును తమో గుణము వలన ప్రమాద మును, మోహ మును మాత్రమే గాక యజ్ఞానము సైతము బుట్టును. ౧౭.

జాయమానం హి పురుషం యం పశ్యే న్మధు సూదనః
సాత్త్విక స్తు స విజ్ఞేయో భవే న్మోక్షేషు నిశ్చితః ॥

(శా. ౩౪౯- ౭౩.) పుట్టిన నే మనుజుని మధు సూద నుడు జూచునో వాడు సాత్త్వికు డగును. వాడు తప్పక మోక్షము నందును. ప్రవృత్తితో గూడిన పురుషుడు మధు సూదనునిచే జూడబడడు. దేవతలు, మనులు సత్త్వము గల వార య్యును సూక్ష్మ సత్త్వము గలవారలై నైకారిక లగుచున్నారు

ఈ యాధ్యాయము కేవలము మోక్ష పరము.

భూయిష్ఠం నిహత్వా దోషా విజిత్వా స్సర్వ శత్రవః
ఏకో దోషో వరిష్ఠ శ్చ వధ్య స్స నిహతో మయా ॥
య త్ప్రయుక్తో జంతు రయం వై తృష్ణ్యం నా ధిగచ్ఛతి
తృష్ణా ర్త ఇహ నిమ్నాని ధావమానో న బుధ్యతే ॥
అకార్య మపి యే నే హ ప్రయుక్త స్సేవతే నరః
తం లోభ మసిభి స్తీక్ష్ణై ర్నికృంతతి నికృంతతి ॥

అంబరీషః. అనుగీత ౩౧- ౭.

అన్ని దోషములు, శత్రువులు నాచే జయింప బడినవి. గాని తృష్ణ జయింప బడలేదు. తృష్ణా పరుడు ఒరుగు లిడుచు మిట్టి పల్లముల గన జాలడు. అకార్య ముల జేయు చుండును. అట్టి లోభము నడచి వేయవలెను; లోభమువలన చింతయు చింత తోగూడ రజో గుణమును జేర కామమున ప్రవేశించి కామ మీ దేరిన తమో గుణ బద్ధుడయి నరకమున గూలును. మఱియు,

"ఏత ద్రాజ్యం నా న్య ద స్తీ హ రాజ్యం
ఆత్మై వ రాజా విదితో యథావత్ ॥"

ఈ రాజ్యము రాజ్యము గాదు. ఆత్మ రాజ్యమే సామ్రాజ్యము. యని (లోభ మేకం నికృంతతా) లోభ మును ఛేదించిన యంబరీషునిచే నీ గాధ గానము చేయబడెను.

సాపానాం విద్ధ్యనుస్థానం లోభ మేవ ద్విజోత్తమ
లుబ్ధాః పాపం వ్యవస్యంతి నరా నాతిబహుశ్రుతాః ॥

( అరణ్యం. ౨౩౭. ) లోభము పాపములకు కారణము. పెద్దల సేవింపని లుబ్ధులు పాపముల నాచరింతురు.

అత్రోచ్యతే: అనృతాత్ఖలు తమః ప్రాదుర్భూతం. తతో తమోగ్రస్తా అధర్మ మేవా నువర్తంతే; న ధర్మమ్. క్రోధ లోభ హింసా నృతాదిభి రవచ్ఛన్నాః, న ఖల్వ స్మిన్ లోకే నా ముత్ర సుఖ మాప్నువంతి; వివిధ వ్యాధి రుజో పతాపై రవకీర్యంతే. అంతే జరా మృత్యు కృతై శ్చాప్యై రితి. ( భృగు రువాచ. శా. ౧౯౦ )

అసత్యమువలన తమస్సు బుట్టును. తమస్సుచే మోహితు లయిన వారధర్మము నాచరింతురు. కాని ధర్మ మాచరింపరు. మఱియు క్రోధ లోభాదుల నంది వాటిచే జరా మృత్యువు లకు లోనగుదురని తెలియ వలయును.

ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః
జఘన్య గుణ వృత్తిస్థా అధో గచ్ఛంతి తామసాః ॥ ౧౮

సాత్త్వికు లయిన పురుషు లూర్ధ్వ గతిని ( అనగా: స్వర్గాది లోకములను ) పొందుదురు. రాజసులు మధ్యమ గతిని ( అనః మనుష్య లోకమును ) పొందుదురు. కనిష్ఠమయిన గుణవృత్తిచే తామసు లధో గతిని పొందుదురు. ౧౮.

అవ్యక్తాత్సత్త్వ ముద్రిక్త మమృతాయ ప్రకల్పతే
సత్త్వా త్పరతరం నాన్య త్ప్రశంసంతీ హ తద్విదః ॥
అనుమానా ద్విజానీమః పురుషం సత్త్వ సంశ్రయం
న శక్య మన్యథా గంతుం పురుషం ద్విజసత్తమాః ॥

( అశ్వ. ४८- ౬. ) అవ్యక్తము వలన సత్త్వము గలిగినది. సత్త్వ వేత్తలు సత్త్వముకన్న మించినది వేఱు లేదని జెప్పుదురు.

సత్వమున కాశ్రయు డగు పురుషుని యనుమానము వలన చెలిసి కొన గలము; మఱొక విధముగ దెలుసుకొన జాలము.

శాంతి ( ౩౦౨ ) యందు " ఊర్ధ్వం గచ్ఛంతి " యను నీ శ్లోకము గలదు. మఱియు " తామసా నిరయం యాంతి రజసా మానుషా నథ, సాత్వికా దేవలోకాయ గచ్ఛంతి సుఖభాగినః. " యనగా: తామసులు నరకమును, రాజసులు మానవత్వమును సుఖమును, సాత్వికులు దేవ లోకమును పొందుదురు

నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి ॥ ౧౯
గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్
జన్మ మృత్యు జరా దుఃఖై ర్విముక్తో మృత మశ్నుతే ॥ ౨౦

ద్రష్టయనగా: నౌదాసీన్యముగ జూచు పురుషుడు. ప్రకృతిగుణములు దక్క మఱియొక కర్త లేదని తెలిసి కొని నపుడును, త్రిగుణములకంటె పరమందున్న తత్వమును తెలిసి కొనన్నప్పుడును వాడు నన్ను బొందు చున్నాడు. ౧౯. దేహధారియగు మనుజుడు దేహోత్పత్తికి కారణభూతము లయిన నీ మూడు గుణములను గడచి, జన్మ జరా మరణ ముల యొక్క దుఃఖముల యందుండి ముక్తుడయి యమృతము ( మోక్షము )ననుభవించును.

అనాది నిధనో నంత స్సర్వ దర్శీ నిరామయః
కేవలం త్వ భిమానత్వా ద్గుణేషు గుణ ఉచ్యతే
గుణా గుణవత స్సంతి నిర్గుణస్య కుతో గుణాః
తస్మా దేవం విజానంతి యే గుణా గుణదర్శినః
యదా త్వేష గుణా నేతా న్ప్రాకృతా నభిమన్యతే
తదా స గుణవాంస్త్వ్య తం పర మేవా నుపశ్యతి ॥

వసిష్ఠ కరాళ జనక సంవాదము. శా. ౩౦౬- ౨౫.
అదియు నాశమును నంతము లేక సర్వదర్శియు, నిరామ

యందు నగు నా యాత్మను, కేవల దేహాత్మాభిమానము వలన గుణములను దెలిసిన వారు మాత్రమే గుణవంతము లగు వస్తువులు గుణములు గలిగి యున్న వనియు నిర్గుణ మగు దాని యందు గుణ మేదియు లేదనియు దెలియుదురు. జీవాత్మ తాను భ్రమము వలన దాల్చిన ప్రాకృత గుణముల నెల్ల నెపుడు గెలుచునో, యపుడే యది (జీవాత్మ) పరమాత్మను దర్శించు చున్నది.

అర్జున ఉవాచ.

కైర్లింగై స్త్రీన్ గుణా నేతా నతీతో భవతి ప్రభో
కి మాచారః కథం చైతాం స్త్రీన్ గుణా నతివర్తతే ॥ ౨౧

అర్జును డడుగు చున్నాడు — ఓ ప్రభూ! ఏ లక్షణములచే నీ మూడు గుణము లను గడచునో? ఆ త్రిగుణాతీతుని యొక్క యాచార మెటు లుండునో? వా డీ మూడు గుణముల నే రీతిగ గడచునో? నాకు చెప్పుము.

శ్రీ భగవా నువాచ.

ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహ మేవ చ పాండవ
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి ॥ ౨౨
ఉదాసీనవ దాసీనో గుణై ర్యో న విచాల్యతే
గుణా వర్తంత ఇత్యేవ యో వతిష్ఠతి నేంగతే ॥ ౨౩
సమ దుఃఖ సుఖ స్స్వస్థ స్సమ లోష్టాశ్మ కాంచనః
తుల్య ప్రియా ప్రియో ధీర స్తుల్య నిందాత్మ సంస్తుతిః ॥ ౨౪
మానా వమానయో స్తుల్య స్తుల్యో మిత్రారి పక్షయోః
సర్వారంభ పరిత్యాగీ గుణాతీత స్స ఉచ్యతే ॥ ౨౫

భగవంతుడు చెప్పు చున్నాడు — ఓ పాండవా! ప్రకాశము, ప్రవృత్తియును, మోహమును అనగా: నను క్రమముగ సత్వ రజ స్తమో గుణముల యొక్క కార్యములు (ఫలములు) ప్రాప్తము లయినను వాని నెవడు ద్వేషింపడో, ప్రాప్తములు

గాకపోయినను వాని నభిలషింపడో, ౨౨. (కర్మఫలముల విషయమై) యెవడు దాసీనుడై యుండునో, (సత్వ రజ స్తమో) గుణము లెవనిని చలియింప లేవో, గుణములు తమంతట తామే కార్యములు చేయుచున్న వని తెలిసికొని యెవడు స్థిరుడగునో, చలింపడో, (అనగా: వికారమును జెందడో) ౨౩. ఎవనికి సుఖ దుఃఖములు సమానముగ నుండునో, యెవడు స్వస్థుడో, అనగా: తనయందే స్థిరుడుగను నుండునో, మృత్తికయు, రాయియు; బంగారమును నేరికి సమానములుగ నుండునో, ప్రియమును, నప్రియమును, నిందయు, స్తుతియును నెవరికి సమానములుగ నుండునో, ౨౪. ఎవరికి మానమును, నవమానమును సమములో, మిత్రుడును, శత్రుడును సమానులో, ప్రకృతి యన్నిటిని చేయుచున్నదని తెలిసికొనుటచే నెవరికి (సర్వ-కామ్య) ఉద్యోగములను విడిపోయినవో యా పురుషుడు త్రిగుణాతీతు డని చెప్పుదురు. ౨౫.

అచల మనిధనం శివం విశోకం
 శుచి మతులం విదుషాం మతే ప్రవిష్టం
అనభిమత మసేవితం విమూఢై
 ర్వ్రత మిద మాజగరం శుచి స్మరామి.

అజగర ప్రహ్లాద సంవాదము. శా. ౧౭౯- ౨౫.

ఇది చలనము, నాశము లేనిది. మఱియు శుభమును, శోక రహిము నయి నది. విద్వాంసుల మతము నను సరించి నది. మిక్కిల మూఢు లగు వారి కనభిమతమై వారాచరింపనిదియునై యున్నది. ఇట్టి వ్రతమును నేనుశుచినై యాచరించు చున్నాను. పై శ్లోకముల యందలి యన్ని యాశయము లజగరు నందు గలవు.

మాం చ యో ऽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే
స గుణాన్ సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే ॥ ౨౬

బ్రహ్మణో హి ప్రతిష్ఠాహ మమృతస్యావ్యయస్య చ
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాంతికస్య చ॥ ౨౭

మఱియు నెవడు (కర్మల నన్నింటిని నాకే యర్పించు నట్టి) అవ్యభిచారి యగు (ఏకనిష్ఠ గలిగిన) భక్తియోగముచే సేవించు చున్నాడో వాడీ మూడు గుణముల నతిక్రమించి బ్రహ్మ భూతావస్థను సంపాదించు కొనుటకు సమర్థుడగును. ౨౬.
కారణ మేమన: నేనే యమృతమును, నమృతమగు బ్రహ్మయొక్కయు శాశ్వతమయిన ధర్మము యొక్కయు నేకాంతిక మైన (అనగా: పరమావధి యైన) యత్యంత సుఖము యొక్కయు కడపటి స్థానమయిన వాడను. ౨౭.

" విముక్తదేహః ప్రవిభాగ తత్త్వవిత్
స ముచ్యతే సర్వగుణై ర్నిరాశ్రయః "

తత్త్వముల విభజించి, దేహమును వదలి పెట్టిన వాడు యేబాధయు లేక సర్వ గుణములచేతను విడువబడును.

యో న కామయతే కించి న్న కించి దభిమన్యతే
ఇహ లోకస్థ ఏవైష బ్రహ్మభూయాయ కల్పతే॥

అనుగీత. 3౫. ఎవడు కొంచమైనను కోరికయు, యభిమానమును లేక యుండునో వాడిహ లోకము ననే బ్రహ్మ-భూతుడగును.

భారతీయులకు ధర్మ గ్రంథ మగు
శ్రీ మన్మహా భారతము నందలి మోక్ష ధర్మ బోధక మగు
శ్రీమద్భగవద్గీతల యందు
గుణ త్రియ విభాగ యోగ మను
చతుర్దశా ధ్యాయము.

శ్రీ హయగ్రీవాయ నమః.

# శ్రీ కుమారగీత.

## పురుషోత్తమ ప్రాప్తి యోగము.

### పంచదశాధ్యాయము.

జితం తే పుండరీకాక్ష నమస్తే విశ్వభావన
నమస్తేస్తు హృషీకేశ మహాపురుషపూర్వజ

శ్రీభగవానువాచ.

ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయం
ఛందాంసి యస్య పర్ణాని య స్తం వేద స వేదవిత్ ॥ ౧

అధ శ్చోర్ధ్వం ప్రసృతా స్తస్య శాఖా
గుణప్రవృద్ధా విషయప్రవాలాః।
అధశ్చ మూలా న్యనుసంతతాని
కర్మానుబంధీని మనుష్యలోకే ॥ ౨

శ్రీ భగవంతుడు చెప్పుచున్నాడు:— మొదలు పైనను, కొమ్మలు క్రిందను నుండి యేది యెప్పటికిని నశింపనిదనియు, వేదములు దేనికి యాకులనియు చెప్పిరో యా యశ్వత్థ వృక్షమును తెలిసికొనినవాడే వేదముల నెఱింగినవాడు. ౧.

సత్త్వాది గుణములు మూడింటివలన నంకురించి నడియు, (శబ్ద- స్పర్శ- రూప- రస- గంధము లను) విషయములను నంకు

రములు బయలు వెడలు నదియు, దాని కొమ్మలు క్రిందను పైనను వ్యాపించియున్నవి; మఱియు తుదను కర్మలయొక్క స్వరూపమును నొందెడి దానియొక్క వేళ్ళు క్రిందను (అనగా: మానుష లోకమునందు) వృద్ధిపొందుచు బహుదూరమువ్యాపించినవి.

అవ్యక్త యోని ప్రభవో బుద్ధి స్కంధమయో మహాన్
మహాహంకార విటప ఇంద్రియాంకుర కోటరః
మహాభూత విశాల శ్చ విశేషప్రతి శాఖినః
సదా పత్ర స్సదా పుష్ప శ్శుభా శుభ ఫలోదయః
ఆజీవ స్సర్వ భూతానాం బ్రహ్మ వృక్ష స్సనాతనః
ఏవం ఛిత్వా చ భిత్వా చ తత్వ జ్ఞానా సినా బుధః
హిత్వా సంగమయా న్పాశా న్మృత్యు జన్మ జరోదయాత్
నిర్మమో నిరహంకారో ముచ్యతే నాత్ర సంశయః
అనుగీత. ౪౭ బ్రహ్మ.

అవ్యక్తము కారణము. బుద్ధి ప్రమాను. అహంకారము వృక్షము. ఇంద్రియములు కొనలు (కొమ్మలు). మహాభూతములే విశాలములగు శాఖలు. ఎల్లప్పుడును శుభా శుభము లను నవియే పువ్వులు, ఫలములు. అన్ని భూతములకు జీవింప నాధారమును బ్రహ్మమయమును సనాతన మగు వృక్షము. దీనిని తత్వముచే దెలిసి కొని, జ్ఞాన మను కత్తిచే ఛేదించి; భేదించి, జనన మరణములకు కారణములగు పాశము లను వదలి, యహంకార మమకారముల త్యజించిన వాడు ముక్తి జెందును.

అవ్యక్త బీజ ప్రభవో బుద్ధి స్కంధ మయో మహాన్
మహా హంకార విటప ఇంద్రియాంకుర కోటరః
మహాభూత విశేష శ్చ విశేష ప్రతిశాఖవాన్
సదా పర్ణ స్సదా పుష్ప స్సదా శుభ ఫలోదయః
ఆజీవ స్సర్వభూతానాం బ్రహ్మ బీజ స్సనాతనః

ఏవం జ్ఞాత్వా చ తత్త్వాని జ్ఞానేన పరమాసినా
ఛిత్వా చా మరతాం ప్రాప్య జహాతి మృత్యుజన్మనీ॥

వాసుదేవః. అను. ౩౫- ౨౦. ఈషద్భేదముగా ననుగీతయందు యీ విషయము రెండు పర్యాయములు పైవిధముగ జెప్ప బడినది. ఈ విచారమింకను విస్తారముగా గలదు.

విముక్త స్సర్వపాపేభ్య స్సర్వం సృజతి నిష్కళం
క్షేత్రజ్ఞ ఇతి తం విద్యా ద్య స్తం వేద స వేదవిత్॥

అశ్వ. ౫౧- ౨౬.

యేన తృప్యత్య భుంజానో యేన తృప్యత్య విత్తవాన్
యేనా స్నేహో బలం ధత్తే య స్తం వేద స వేదవిత్॥

వ్యాస. శా. ౨౫౧- ౧౬.

ఎవడు సర్వపాపముల నుండి ముక్తుడై, నిష్కళమును సర్వమును సృజించునో యాతడు క్షేత్రజ్ఞుడని తెలిసికొనువాడు వేదవేత్త యగును.

ఎవనిచే భుజింపకయే తృప్తియు, ద్రవ్యము లేకయే తుష్టియు, సహాయము లేకయే బలమును పొందుచున్నాడో, యట్టి యాతని నెఱింగిన వాడు వేదవేత్త యగును.

॥ న రూప మస్యే హ తథో పలభ్యతే
నాంతో న చాది ర్న చ సంప్రతిష్ఠా
॥ అశ్వత్థ మేనం సువిరూఢ మూల
మసంగ శస్త్రేణ దృఢేన ఛిత్వా॥ ౩

కాని (పైవర్ణించినటుల) యిహలోకము నందు దాని యొక్క స్వరూపము గోచరింపదు. (దాని యంతమును, నాదియు, నాధార స్థానమును కనబడదు.) మిక్కిలి లోతుకు పాతుకొని పోగల యీ యశ్వత్థము ననాసక్తి యను బలిష్ఠ మగు కత్తితో ఛేదించి, ౩.

హృది కామద్రుమ శ్చిత్రో మోహ సంచయ సంభవః
క్రోధ మాన మహా స్కంధో విధిత్సా పరిషేచనః
తస్య చా జ్ఞాన మాధారః ప్రమాదః పరిషేచనః
తస్యా నుగతమూలస్య మూల ముద్ధ్రియతే బలాత్
యోగప్రసాదా త్కృతినా సామ్యేన పరమాసినా

శ్లో. ౨౫౩-౧. వ్యాసుడు కామాదుల జయించు నట్టి యుపాయమును శుకున కుపదేశించుట.

మనుష్యుని హృదయమందు కామ మను వృక్షము మోహమను బీజమును, క్రోధాహంకారము లాలవాలములును, కర్మాపేక్షయను పానును, ప్రమాదము ( పొరపాటు ) యను నీరును, అసూయత యను నాడులును, పూర్వ కృత దుష్కార్యము లనెడి చేవయును ( సారము ), మోహ విచారములను చిన్నకొమ్మలను, దుఃఖ మను పెద్దకొమ్మలును, భయమను జిగురును, మోహ కరములైనయపేక్షలను చుట్టుకొను తీగలును, గలిగి రతి మొదలగు ఫలముల నిచ్చునది యై యున్నది.

మిక్కిలి లోభు లగువారు వాసనా మయములగు త్రాళ్లచే కట్టబడినవారై, యావృక్షము చుట్టును జేరి దాని ఫలముల నపేక్షించుచు నావృక్షమును సేవింతురు.

ఎవ డాశా పాశములను వశపఱచుకొని యా వృక్షమును యీడ్చి కూలద్రోయునో వాడు జరా మరణముల వలన గలుగు దుఃఖములను దుదముట్టించ గలడు.

ఎఱుక లేనివాడు సంకల్పములతో దానినెక్కి యందలి ఫలములను గోయుచున్నాడు ( దుఃఖము ననుభవించుచున్నాడు ).

నేర్పరి యగు వాడు యోగము దోడ్పాటుతో సమాధి యను బలు కత్తిచే ( మిక్కిలి లోతుగా దిగి యున్న ) దాని వేరును నఱకి, బలిమిచే పెకల్చుచున్నాడు.

హిరణ్య పర్ణ మశ్వత్థ మభిపత్య హ్య పక్షకాః
తత్ర తే పక్షిణో భూత్వా ప్రపతంతి యథాసుఖం
యోగిన స్తం ప్రపశ్యంతి భగవంతం సనాతనం ॥ సనత్సు.

అజ్ఞానులు ఛందఃపర్ణములుగల జ్ఞానవృక్షమును జేరి జ్ఞానులయి యెట్లు ముక్తులగుదురో దానిని యోగులు తెలిసికొనగలరు.

తతః పదం తత్పరిమార్గితవ్యం
యస్మిన్ గతా న నివర్తంతి భూయః
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ ॥ ४

పిదప (సృష్టిక్రమము యొక్క యీ) "పురాతనమగు ప్రవృత్తి యెవరి వలన వెలువడినదో యా యాద్యుడగు పురుషునే నేను పొందుచున్నాను." (అను సంకల్పముచే) నెచ్చోటికి పోగా వెనుకకు తిరిగి రాడో యాస్థానమును శోధింప వలయును.

కథం త్వహ మసంక్లిష్టో గచ్ఛేయం గతి ముత్తమాం
నావర్తేయం యథా భూయో యోని సంకర సాగరే
పరం భావం హి కాంక్షామి యత్ర నావర్తతే పునః
సర్వ సంగా న్పరిత్యజ్య నిశ్చితో మనసా గతిం
తత్ర యాస్యామి యత్రాత్మా శమం మే ధిగమిష్యతి
అక్షయ శ్చావ్యయ శ్చైవ యత్ర స్థాస్యామి శాశ్వతః ॥
శా. ౩౩౨- ४౯.

నారదోపదేశము వలన శుకమహర్షి యిట్లాలోచింపదొడగె. నేనుత్తమ మయిన గతి నే విధమున బొందుదును. యోని సంకర మయమగు సంసార సాగరము నెట్లు దాటుదు. నేను తిరిగి రాకుండా సర్వసంగముల నొదలి నా యాత్మ యెచ్చట శాంతి బొందునో యచ్చటికిం జని యక్షయము నవ్యయము నగు స్థానమును పొంది శాశ్వతముగా నుండగలను.

: నిర్మానమోహా జితసంగదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్త కామాః
: ద్వంద్వై ర్విముక్తా స్సుఖ దుఃఖ సంజ్ఞైః
గచ్ఛంత్య మూఢాః పద మవ్యయం తత్ ॥ ౫

మానమును, మోహమును లేనివారును, నాసక్తి, దోషమును జయించిన వారును, నధ్యాత్మ జ్ఞానము నందెప్పుడును స్థిరులైన వారును, నిష్కాములును, సుఖ దుఃఖములను ద్వంద్వముల నుండి ముక్తులయిన జ్ఞాను లవ్యయమగు స్థానము నొందుచున్నారు.

వినీత మాన మోహ శ్చ బహు సంగ వివర్జితః
తదా త్మా జ్యోతిష స్సాధో నిర్వాణ ముపపద్యతే ॥

శా. ౨౭౬-౧౬. మాన మోహములు, సంగ దోషములు పోగొట్టు కొనిన వాడయి యాత్మను దెలుసుకొన్న వాడీయొక్క యుత్తమ గతిని (మోక్షమును) పొందును. అని ధర్మరాజు దన తమ్ముల కుపదేశించెను.

: న త ద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః
: య ద్గత్వా న నివర్తంతే త ద్ధామ పరమం మమ ॥ ౬

ఏడకు బోయి మరల రారో (యట్టిదే) నా యొక్క పరమ మగు స్థానము. దానిని సూర్యుడు గాని, చంద్రుడు గాని, యగ్ని గాని ప్రకాశింప జేయ లేదు. ౬.

న తత్ర సూర్య స్తపతి న సోమో భివిరాజతే
న వాయు ర్వాతి దేవేశ తప శ్చరతి దుశ్చరమ్ ॥
నారదః. శా. ౩౪౪-౫౭.

సూర్య చంద్రులు ప్రకాశింపక వాయువు వీవ నట్టి స్థలము శ్వేత ద్వీప మనియు, యచట నేకాంతిక భక్తులు తపం బాచరించు చుందు రనియు నారదుడు జెప్పెను.

వినాశినో హ్యధ్రువ జీవితస్య
కిం బంధుభి ర్భిన్న పరిగ్రహైశ్చ
విహాయ యో గచ్ఛతి సర్వ మేవ
క్షణేన గత్వా న నివర్తతే చ ॥ భీష్మః. శా. ౩౦౨.

నశించునట్టిదియు, నిశ్చయము లేనిదియు నగు జీవితము గల వానికి బంధువుల తోడను, పరిగ్రహముల తోడను నేమి ప్రయోజనము? ఎవడీ సర్వస్వమును వదలి పెట్టి వెడలిపోవునో వాడు క్షణములో (యుత్తమగతికి) వెళ్ళి తిరిగి రాడు.

"పరమాత్మాన మాసాద్య తద్భూతాయతనా మలాః
అమృతత్వాయ కల్పంతే న నివర్తంతి వా విభో ॥"

పరమాత్మను పొంది తిరిగి రానేరరు. ఈ యధ్యాయము సాంఖ్య తత్వ బోధకము.

యత్ర గత్వా న మ్రియతే యత్ర గత్వా న జాయతే
న పునర్జాయతే యత్ర యత్ర గత్వా న వర్తతే
యత్ర త ద్బ్రహ్మ పరమ మవ్యక్త మచలం ధ్రువమ్ ॥

శా. ౭౮౧ - ౧౨. ఎచటికి వెళ్ళినచో జనన మరణము లుండ నేరవో యచ్చటినుండి రానేరదు; అట్టి స్థానము పరబ్రహ్మ మని తెలియదగు.

"త ద్బ్రహ్మ పరమం ప్రోక్తం తద్ధామ పరమం మమ
తద్గత్వా కాలవిషయా ద్విముక్తా మోక్ష మాశ్రితాః ॥"

అర్జునః- యా ప్రీతి ర్ధర్మరాజే మే భీమే చ బలినాం వరే
నకులే సహదేవే చ సా మే త్వయి శలాగ్రజ
మయా త్వం సమనుజ్ఞాతః కృష్ణేన చ మహాత్మనా
గచ్ఛ పుణ్యకృతాన్ లోకాన్ శిబి రౌశీనరో యథా
వాసుదేవః- యే లోకా మమ విమలా స్సకృ ద్విభాంతి
బ్రహ్మాద్యై స్సురవృషభై రపీ ష్యమాణాః

తాత్ క్షిప్రం వ్రజ సతతా గ్నిహోత్ర యాజిన్
మత్తుల్యో భవ గరుడోత్తమాంగయానః ॥ ద్రో.౧౪౩.

భూరిశ్రవసు సాత్యకిని విరథు జేసి క్రింద బడ వైచి బొమ్మపై గూర్చుండి తలను నఱికి వేయుటకయి కత్తిని యెత్తుచుండ, వాసుదేవు మతానుసారమర్జునుడా తని కత్తితోటి చేతిని నఱికి వైచెను. అంతలకా భూరిశ్రవుడు కృష్ణార్జునులను నిందించెను. దానికర్జునుడు "శల్యాగ్రజా! కోప పడకుము. నాకు ధర్మరాజాదుల యందెట్టి ప్రీతిగలదో నీయందు నంతే ప్రీతి గలదు. నాయొక్కయు, శ్రీకృష్ణుని యొక్కయు యాజ్ఞానుసారము నీవు దయాపరుడయిన శిబి యనురాజు పొందిన పుణ్య లోకములను బొందుము." అని చెప్పెను. అంత వాసుదేవుండును "ఎల్లప్పుడును యజ్ఞముల నాచరించువాడా! బ్రహ్మాదులచే కోరఁబడునట్టివియు, నెల్లప్పుడు స్వచ్ఛములై ప్రకాశించు నట్టియు నే లోకములు గలవో యా లోకములకు నాతో సమాన మగు రూపము (శంఖ చక్ర పీతాంబరాదుల) ధరించినవాడవై నాయాన మగు గరుడు నధిష్ఠించి పొమ్ము" అని యాజ్ఞాపించెను.

ఇట్లు భూరిశ్రవునిచే పొందబడిన సారూప్య ముక్తిని పొందువారు తిరిగి రారు ఈ గాథ బహు చిత్రమయినది.

సర్వమునకు స్వతంత్రుడు భగవంతుడే యనుట కీ గాథ మంచి నిదర్శనము.

: మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః
: మనష్షష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి ॥ ౭

నా యొక్క సనాతన మగు నంశయే జీవ లోకము నందు (కర్మ భూమి యందు) జీవుడయి ప్రకృతి యందుండి, మనస్సుతోఁగూడి యాఱైన, ననగా: మనస్సును, అయిదు (సూక్ష్మ) యింద్రియములను ప్రకృతితో నాఱగు నింద్రియములను;

(నగా: మనస్సును 'సూక్ష్మ' ఇంద్రియములను) తన వైపు నకు నాకర్షించు చున్నది. దీనినే లింగ శరీరమని చెప్పెదరు. ౭.

పంచేంద్రియాణి సంధాయ మనసి స్థాపయే ద్యతిః
యదైతాన్య వతిష్ఠంతి మనష్షష్ఠాన్య థాత్మని
ప్రసీదంతి చ సంస్థాయ తదా బ్రహ్మ ప్రకాశతే
విధూమ ఇవ సప్తార్చి రాదిత్య ఇవ దీప్తిమాన్
వైద్యుతో గ్ని రివా కాశే దృశ్యతే త్మా తథా త్మని
స సర్వ స్తత్ర సర్వత్ర వ్యాపకత్వా చ్చ దృశ్యతే ॥

శా. ౨౩౯. పంచేంద్రియములను మనస్సునందును మనస్సును సంకల్పముల నుండియు మరల్చి యతి యగు వాడు దానిని బుద్ధి యందు నిలుప వలయును ఇంద్రియముల నెల్ల నిగ్రహించి యతి వాని వలన మనస్సును నిల్ప వలయును. ఇవి యయిదును నారవది యగు మనస్సును బుద్ధి యందును స్థిర పరచి, యందు చలింపక దిట్టముగా నుంచు నపుడు బ్రహ్మము పొగలేని యగ్ని వలెను ప్రకాశించు చున్న సూర్యుని వలెను తనయందున్న దన యాత్మను జూడ గలడు. ఈ యధ్యాయమును శుకునకు వ్యాసుడు బోధించెను. బ్రహ్మము తెలుసు కొనగోరు వారీ యధ్యాయమున నన్నియు బూర్ణముగ జూడగలరు.

మన షష్ఠాణి సంయమ్య హవీంష్యే తాని సర్వశః
గుణవ త్పావకో మహ్యాం దీప్యంతే త శ్శరీరిణః ॥ అనుగీత.

మనస్సుతో గూడిన పంచేంద్రియము లను హవిస్సులను అంత శ్శరీరులు నాకొఱకు వ్రేల్చు చున్నారు. దీనిని జ్ఞానమను నగ్నితో గూడిన యోగయజ్ఞమని వాసుదేవు డర్జునునకు జెప్పెను.

చక్షుష్మంతః ప్రపశ్యంతి తథా చ జ్ఞానచక్షుషః
పశ్యంత్యేవం విధం సిద్ధా జీవం దివ్యేన చక్షుషా ॥

వాసుదేవః. అను ౧౭- ౩౩.

నేత్రములు, జ్ఞాన నేత్రములు గల వారలు నగు సిద్ధులు దివ్య చక్షువుతో జీవుని జూడ గలరు.

మానసో గ్ని శ్శరీరేషు జీవ ఇత్య భిధీయతే
సృష్టిః ప్రజాపతే రేషా భూతా ధ్యాత్మ వినిశ్చయే ॥

భృగుః. శా. ౧౮౭- ౩౧.

మనస్సును సంబంధించిన జ్యోతి శరీరము లందు జీవుడని చెప్పబడు చున్నాడు జీవ రూపుడగు నీ బ్రహ్మ నుండి యీ సృష్టి కలిగె నని యాత్మ నిష్ఠయ పరుల నిశ్చయము.

ఇట్టి జీవుడు- "జీవ శ్చ సర్వభూతేషు పంచభూతగుణాతిగః" సర్వభూతముల యందును పంచభూతముల యొక్క గుణముల నతి క్రమించినవాడని తెలియ వలయు.

శరీరం య దవాప్నోతి య చ్చా ప్యుత్క్రామతీశ్వరః
గృహీత్వై తాని సంయాతి వాయు ర్గంధా నివా శయాత్ ॥

ఈశ్వరుడను (అనగా: జీవుడను) శరీరము (స్థూల) ప్రాప్తించి నపుడును, ఆ (స్థూల) శరీరమునుండి యతడు దాటి పోయి నప్పుడును, గంధము యొక్క- పుష్పము మొదలగు స్థానములనుండి వాయువు గంధము వలె (జీవుడు) పై వానిని (మనస్సును, పంచేంద్రియము లను) కూడనే తీసికొని పోవు చున్నాడు. ౮.

శరీరా ద్విప్రముక్తం హి సూక్ష్మభూతం శరీరిణం
కర్మభిః పరిపశ్యంతి శాస్త్రోక్తై శ్శాస్త్ర వేదినః ॥ శా. ౨౫౩

శరీరము నుండి బయలుదేరిన సూక్ష్మ రూపకమగు జీవుని శాస్త్ర వేత్తలు శాస్త్రోక్తములగు యోగ కర్మలచే జూడ గలరు.

సూర్య కిరణము లాకాశమునందు సంచరించినట్లు దేహము

నుండి వెడలిన యమానుషమగు సత్వము (ప్రాణము) చరించు చుండును. "తాని సూక్ష్మాని తత్వాని విముక్తాని శరీరతః
స్వేన సత్వేన సత్వజ్ఞాః పశ్యంతి నియతేంద్రియాః॥
శరీరము నుండి వెడలిన సూక్ష్మ సత్వములను నియమించ బడిన యింద్రియములు గలిగి సత్వమును తెలిసిన వారు తమ స్వత్వముచే జూచుచున్నారు (దృష్టాంతము) జలమునందు సూర్యుని జూచి నటుల సత్వ వంతుల యందు యోగులు సత్వము నట్లు గందురు.

"పృథగ్భూతేషు సృష్టేషు చతుర్ధాశ్రమ కర్మసు
సమాధౌ యోగమేవైతచ్ఛాండిల్య శ్శమ మబ్రవీత్॥

వేరు వేరగు నాలుగాశ్రమముల కర్మయందును యోగ ప్రధానములగు మనోబుద్ధుల వ్యాపారములను వదలుకొనుటయే ధర్మమని శాండిల్యుడు జెప్పియున్నాడు.

"విదిత్వా సప్త సూక్ష్మాణి షడంగం చ మహేశ్వరం
ప్రధాన వినియోగస్థం పరం బ్రహ్మనుపశ్యతి"

ఇంద్రియములు, ఇంద్రియార్థములు, మనస్సు, బుద్ధియు, మహత్తు, ప్రకృతి, పురుషుడు ననెడి యేడు సూక్ష్మములను, అనాదిజ్ఞానము, స్వాతంత్ర్యము, తృప్తి, సర్వజ్ఞత్వము, నిత్యా సంపచితమగు జ్ఞానము, అనంత శక్తి యనెడి షడంగములతో గూడిన మహేశ్వరుని దెలిసికొని ప్రధానమునసంగల పరిణామ మెఱింగిన వాడు పరబ్రహ్మమును గాంచు చున్నాడు.

జీవ గౌరవము నిచ్చట జూడుడు "దశ మాసా న్వసన్నైషోన్న మివ జీర్యతే" జీవుడు పదిమాసములు గర్భమందున్నను అన్నాదుల వలె జీర్ణము గాడు. ఇట్టి జీవుని యోగ శాస్త్ర పరులు "తమేతి మతి తేజోంశం భూతాత్మానం హృది స్థితం" తేజోంశ సంభూతుడగు నట్టియు హృదయమం

దుండు నట్టియు యాత్మస్వరూపుని తమోగుణవంతులు గన లేరు. ఈ యధ్యాయము జూచిన వారికి తెలియని విషయ ముండ నేరదు.

పుణ్య పాపమయం దేహం క్షపయ న్కర్మ సం క్షయాత్
క్షీణ దేహః పున ర్దేహీ బ్రహ్మత్వ ముప గచ్ఛతి
పుణ్య పాప క్షయార్థం హి సాంఖ్యం జ్ఞానం విముచ్యతే।

శా. ౨౭౫- ౩౫. దేహికి కర్మనాశముచే పుణ్యపాపమయ మగు దేహము వీడి దేహి బ్రహ్మత్వము పొంద గలడు. (కర్మ) పుణ్య పాప క్షయను కొఱకు సాంఖ్య జ్ఞాన ముపదేశింప బడినది. ఈ యధ్యాయముననే నారద దేవల సంవాదమున

"యాతి దేహ మయం ముక్త్వా కదాచి త్పరమాం గతిమ్"

ఒకానొకప్పటి కైనను జీవుడు దేహ వికారముల నొడిలి యుత్తమ గతిని బొంద గల డని దేలినది.

మన గ్రంథము లాత్మపరి శోధకములు గదా?

శ్రోత్రం చక్షుః స్స్పర్శనం చ రసనం ఘ్రాణ మేవ చ
అధిష్ఠాయ మన శ్చాయం విషయా నుపధావతి॥ ౯

శ్రోత్రము, చక్షుస్సు, త్వక్కు, జిహ్వ, నాసికయు, నటులే మనస్సును వను వానియందు స్థితిని జెంది (యీ) జీవుడు విషయముల నుప భోగించు చున్నాడు. ౯.

మన శ్చరతి రాజేంద్ర చారితం సర్వ మింద్రియైః
న చేంద్రియాణి పశ్యంతి మన ఏవా నుపశ్యతి
చక్షుః పశ్యతి రూపాణి మనసా తు న చక్షుషా
మనసి వ్యాకులే చక్షుః పశ్య న్న పి న పశ్యతి
తథేంద్రియాణి సర్వాణి పశ్యంతీ త్యభి చక్షతే
న చేంద్రియాణి పశ్యంతి మన ఏవా త్ర పశ్యతి
మనస్యుపరతే రాజ న్నింద్రియోపరమో భవేత్

తదింద్రియేషూ పరమం మనస్యు పరమే స్థితవత్
ఏవం మనః ప్రధానాని ఇంద్రియాణి ప్రభావయేత్ ॥ శా. ౩౧౭

మనస్సు ననది యింద్రియముల యందుండి చూచునే గాని శ్రోత్రాదీంద్రియములు జూచునవి గావు. మనస్సు వ్యాకులము నొందినచో నింద్రియములు జూచుచున్నను విషయముల గ్రహింప జాలవు మనస్సుపరమించిన నింద్రియము లన్నియు నుపరమించును. ఈ ప్రకారముగా నింద్రియము లన్నియు మనః ప్రధానములుగా నున్న వని గ్రహింప వలయు.

"ఇంద్రియాణాం తు సర్వేషా మీశ్వరం మన ఉచ్యతే"

మఱియు నింద్రియము లకన్నిటికి మనస్సే ప్రభువని యెఱుంగ వలయును.

దృఢైః పాశై ర్బహుభి ర్విముక్తః
ప్రజా నిమిత్తై రపి దైవతైశ్చ
యదా హ్యసౌ సుఖ దుఃఖే జహాతి
ముక్త స్తదా గ్ర్యాం గతి మేత్యలింగః ॥ శా. ౨౧౯.

ఈ జీవుడు దృఢములగు పాశముల చే తన ప్రజలకు కారణ భూతులగు దేవతల చేతను సుఖ దుఃఖముల చేతను విముక్తుడయి యుత్తమ గతినియు రూపుడై పొంద గలడు. ఈ యధ్యాయమును జనకునకు పంచశిఖు డుప దేశించెను.

ఉత్క్రామంతం స్థితం వా పి భుంజానం వా గుణా న్వితమ్
విమూఢా నా నుపశ్యంతి పశ్యంతి జ్ఞానచక్షుషః ॥ ౧౦

శరీరమునుండి వెడలి పోవు నదియు, శరీరమున నుండి గుణములతో గూడి (స్వయముగ కాదు) యుప భోగించు నదియు, నగు జీవుని మూర్ఖులు దెలిసికొనలేరు. జ్ఞాన చక్షుస్సుచే జూచు వారు (ఆత్మనిని) తెలిసికొనుచున్నారు. ౧౦.

తథైవో త్క్రమమాణం తు శృణుష్వ వహితో నృప
పద్భ్యా ముత్క్రమ మాణస్య వైష్ణవం స్థాన ముచ్యతే॥

యాజ్ఞవల్క్యః. శా. ౩౧౮. రాజా! మృతి నొందు వారు పోవు స్థానములను నవెవ్వియో జెప్పుచున్నాను. ఆత్మ పాదముల మూలమున నుత్క్రమించె నేని వాడు విష్ణు స్థానమునకు బోవును. పిక్కల నుండి వెడలిన వసువుల స్థానమును, మోకాలి నుండి వెడలిన సాధ్యుల స్థానమును, ఇటులనే పాయువుచే మిత్ర స్థానమును, కటి ప్రదేశముచే భూమిని, తొడల వలన ప్రజాపతిని, ప్రక్కలనుండి వెడలిన మరుత్తులను, నాసిక వలన చంద్రస్థానమును, బాహువుల వలన నింద్ర స్థానమును, వక్షము వలన రుద్ర స్థానమును, మెడల వలన వెడలిన ఋషి సత్తముడగు నరుని స్థానమును, ముఖమువలన విశ్వేదేవతలను, శ్రోత్రము వలన దిక్కులను, ఘ్రాణము వలన వాయువును, లలాటమువలన పితృ దేవతలను, మూర్ధముచే వెడలిన విభుండును దేవజ్యేష్ఠుడును నగు బ్రహ్మదేవుని, ఆయాయి విధములుగ పొందుచుందురు.

"ఏతా న్యుత్క్రమ స్థానాన్యు క్తాని మిథిలేశ్వర" మిథిలాధిపా! యివియె జీవుని యుత్క్రమ స్థానములు.

ఈ ప్రకారముగ బయలుదేరు నాత్మను జ్ఞానచక్షువు లగు వారు జూతు రనుటకీ క్రింది నిదర్శనముల గనుడు. ద్రోణ ౧౮౩.

సంజయః బ్రహ్మలోకం గతే ద్రోణే ధృష్టద్యుమ్నే చ మోహితే
వయమేవ తదా ద్రాక్ష్మ పంచ మానుషయోనయః
యోగయుక్తం మహాత్మానం గచ్ఛంతం పరమాం గతిమ్
అహం ధనంజయః పార్థః కృప శ్శారద్వతో ద్విజః
వాసుదేవ శ్చ వార్ష్ణేయో ధర్మరాజో థ పాండవః
అన్యే సర్వే చ నా పశ్యన్ భారద్వాజస్య ధీమతః॥

సంజయుడు చెప్పుచున్నాడు:— మహారాజా! ద్రోణుడు

బ్రహ్మలోకమునకు బోవు సమయమున యా తేజస్సును నేను, ధర్మరాజు, అర్జునుడు, కృపుడు, శ్రీకృష్ణుడు మొదలైన వారమయినను గురమునదక్క నితరు లెవ్వరును జూడలేదు.

మహోల్కేవ చ భీష్మస్య మూర్ధదేశా జ్జనాధిప
నిసృత్యా కాశ మావిశ్య క్షణేనాంతరధీయత॥ అను. ౧౬౭

గొప్పనక్షత్రమువలె భీష్ముని నుండి బయలు దేరిన తేజస్సు క్షణ మాత్రములో నాకాశమున యంతర్ధానమునందెను.

యతంతో యోగిన శ్చైనం పశ్యం త్యాత్మ న్యవస్థితం
యతంతో ప్యకృతాత్మానో నైనం పశ్యం త్యచేతసః॥ ౧౧

అటులే ప్రయత్నము చేయు యోగులు తమ యందున్న యీ యాత్మను తెలుసుకొనుచున్నారు. కాని యెవరియొక్క యాత్మ (అనగా: బుద్ధి) సంస్కరింప బడలేదో యట్టియజ్ఞులు ప్రయత్నమును చేసినను దీనిని తెలిసికొన లేరు. ౧౧.

అంగుష్ఠ మాత్రః పురుషోం తరాత్మా
లింగ స్య యోగేన స యాతి నిత్యం
త మీశ మీడ్య మనుకల్ప మాద్యం
పశ్యంతి మూఢా న విరాజమానమ్.
యోగిన స్తం ప్రపశ్యంతి భగవంతం సనాతనమ్॥ సనత్సు.

లింగ శరీర సంబంధియై పరబ్రహ్మ సంసారమును వ్యాపించి యుండును. అజ్ఞానులు దీని నెఱుఁగ జాలరు. ఆపురాణపురుషుని యోగులు దప్ప మఱి యితరు లెవ్వరు నెరుగ లేరు.

యదాదిత్యగతం తేజో జగ ద్భాసయతే ఖిలం
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ త త్తేజో విద్ధి మామకమ్॥

ఏ తేజస్సు సూర్యుని యందుండి జగత్తునంతను ప్రకాశింప జేయుచున్నదో, యే తేజస్సు చంద్రుని యందును, నగ్నియందును నున్నదో యది నా తేజస్సే యని తెలిసికొనుము. ౧౨

సూర్యస్య తపతో లోకా నగ్నే స్సోమస్య చాప్యుత
అంశవో య త్ప్రకాశంతే మమ తే కేశసంజ్ఞితాః॥
శా. ३४०- ४२.

గా మావిశ్య చ భూతాని ధారయా మ్యహ మోజసా
పుష్ణామి చౌషధీ స్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః॥
అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః
ప్రాణాపాన సమాయుక్తః పచామ్య న్నం చతుర్విధమ్ ॥

అటులే పృథ్విలో ప్రవేశించి నేనే (సర్వ)భూతములను నా తేజస్సుచే ధరించుచున్నాను. మఱియు రసాత్మక మయిన సోముడనై (చంద్రుడనై) సర్వౌషధులను, అనగా: వనస్పతులను బోషించు చున్నాడను. ౧३. నేను వైశ్వానర రూపుడనగు నగ్నిహోత్రుడై ప్రాణుల యొక్క దేహము నందుండి ప్రాణము తోడను నపానముతోడను కూడిన వాడనై(భక్ష్యము, చోష్యము, లేహ్యము, పేయ మని) నాలుగు విధములగునన్నమును పచనము జేయుచున్నాను. ౧४.

ప్రాణానాం ధారణార్థాయ యో న్నం భుఙ్క్తే చతుర్విధం
అంత ర్భూతః పచ త్య గ్నిః తస్మై పాకాత్మనే నమః ॥

శా. ४२- ४३. ప్రాణ ధారణము కొఱకు భుజించు చతుర్విధాహారముల నంతర్భూతుడయి యెవడు పచనము జేయునో యట్టి పాక స్వరూపుడగు యగ్ని కొఱకు నమస్కారము. "ఘోరా తు యా తను స్తస్య సో గ్ని ర్విష్ణు స్స భాస్కరః"

శతరుద్రీయమున పరమేశ్వరుని యొక్క ఘోర రూపములలో అగ్ని, విష్ణువు, సూర్యుడు నను ముగ్గురు దేవతలు చెప్పబడి యున్నారు. కావున వీరు ముగ్గురు నొక్కరే యని వేదాభిప్రాయము. మఱియు శాంతియందు "అగ్ని ర్విష్ణు స్సర్వ భూతా న్యనుప్రవిశ్య ప్రాణా న్ధారయంతీ తి." అగ్ని విష్ణువు

శరీరపు భూతములను ప్రవేశించి ప్రాణుల ధరించుచున్నారు.

కపిలం పరమర్షిం చ యం ప్రాహు ర్యతయ స్సదా
అగ్ని స్స కపిలో నామ సాంఖ్యయోగ ప్రవర్తకః॥

అర. ౨౨౮-౨౨. సాంఖ్య మత ప్రవర్తకుడగు కపిలుని యగ్నిగా యోగులు జెప్పుదురు. మఱియునగ్ని యొక్కయుత్పత్తులు, ప్రభావములు, వేదము నందలి యుపయోగి ములు ఈ యధ్యాయము నందు వర్ణింప బడినవి. "అగ్ని ర్గృహపతిర్నామ సర్వయజ్ఞేషు పూజ్యతే" గృహపతి యగు నగ్ని సర్వ యజ్ఞము లందును పూజింప బడును. ఇది యగ్నివంశాధ్యాయ మనబడును. ఇట్టి యగ్నియే నే నని భగవంతుడు జెప్పియున్నాడు.

అగ్ని ర్వైశ్వానరో మధ్యే సప్తధా దీప్యతేం తథా
ఘ్రాణం జిహ్వా చ చక్షుశ్చ త్వక్చ శ్రోత్రం చ పంచమం
మనో బుద్ధి శ్చ సప్తైతా జిహ్వా వైశ్వానరా ర్చిషః॥

వైశ్వానరాగ్ని మధ్యయందునేడు విధములుగ వెల్గుచున్నది.

౧ ఘ్రాణాది సప్తకము — వైశ్వానర జ్వాలలు.
౨ ఘ్రేయాది సప్తకము — సమిధలు.
౩ ఘ్రాతాది సప్తకము — ఋత్విజులు.

ఘ్రాణాది యగ్నులందు ఘ్రేయాది సమిధలను ఘ్రాతాది ఋత్విజులు హోమము జేయుచున్నారు. ఏడు గురు నేడింటి యందు నేడింటిని హోమము జేయుచున్నా రనిన నాత్మస్వరూపుడగు పరమేశ్వరుడు నాసికాదు లగు యింద్రియ ముల యందు వాసన మొదలగు విషయములు వాసన జూచు వానిచే నిగ్రహింప జేయుచున్నటుల జెప్పబడినది. ఏడింద్రియము లనగా: నాసిక, నాలుక, నేత్రము, చర్మము, కర్ణము, మనస్సు, బుద్ధియు, నివియే సప్తేంద్రియములు. వీని కర్తవ్య నియమమే మోక్షదము.

ఈ విషయము నందు సప్తహోత లనియు, దశహోత లనియు, పంచ హోత లనియు, చతుర్హోత లనియు కొన్ని యధ్యాయములు జెప్పఁబడినవి.

: సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తస్స్మృతి ర్జ్ఞాన మపోహనం చ
: వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యో
వేదాంతకృ ద్వేదవిదేవ చాహమ్ ॥ ౧౫

అటులే యందర యొక్క హృదయము లను నేనే యధిష్టించి యుంటిని స్మృతియు, జ్ఞానమును, అపోహమును (తన్నాశము) నా వలననే గలుగుచున్నవి. సర్వ వేదముల చేతను దెలిసికొన దగిన వాడను నేనే. వేదాంతము లను జేయు వాడను, వేదములను దెలిసికొనిన వాడను. ౧౫.

యో వేద వేద్యం స చ వేద వేద్యం
న తం విదు ర్వేదవిదో న వేదాః
తథా పి వేదేన విదంతి వేదం
యే బ్రాహ్మణా వేదవిదో భవంతి ॥ సనత్సుజాతీ.

ఎవడు వేదముల నెఱుంగునో వాడు తెలియదగిన ప్రపంచమును దెలిసికొన్నవాడే. ఏ వస్తువు ముఖ్యముగ దెలిసికొన దగినదో యట్టి దానిని (బ్రహ్మను) వేదవేత్తలు గాని యా వేదములు గాని యెఱుంగవు (అనగా: ఇది మిత్థ మని నిర్ణయింప జాలవు). అయినప్పటికిని యే బ్రాహ్మణులు వేదము నెఱింగిన వారగుచున్నారో వారా వేదముల చేతనే దెలియదగిన బ్రహ్మము (సత్యము) ను దెలిసికొనుచున్నారు.

సామాన్య దర్శనము నకు గోచరము గాకను ప్రత్యక్షముగ గన్పించకను మనోమాత్రముచే గ్రహింపదగిన పరబ్రహ్మము

లౌకికము గాదు గాన నెల్లరికి సులభముగా దెలియజాలదు. లౌకిక వాక్యములచే బోధ పడునట్టిదియు గాదు. గాన యట్టి బ్రహ్మము దెలియ గోరువారు యలౌకికమును నార్షమును నగు వేదము చేతనే దెలియ వలయు గాని యన్య విధమున గాదు. ఆ కారణముననే వేదము (బృహదారణ్యకము) నందు-

"ఆత్మనో వా రే దర్శనేన శ్రవణేన మత్యా విజ్ఞానేన ఇదం సర్వం విదితం భవతి." తాత్పర్యమిది (విశ్వరూపాధ్యాయమున జెప్పిన విధముగా నీ లౌకిక విషయముల యందే) ఆత్మను (వస్తు స్వభావమును) జూచుచు, పెద్దల వలన వినుచు, తాను జూచిన విషయముల జక్కగ నాలోచించుచు గ్రహించు చుండుట వలననే పరబ్రహ్మము (ఈ సర్వమును) దెలియబడును. అని జెప్పబడి యున్నది. బుద్ధిమంతులు గ్రహింతురుగాక.

నాస్తి వేదాత్పరం శాస్త్రం నాస్తి మాతృ సమో గురుః
న ధర్మాత్పరమో లాభ స్తపో నానశనాత్పరమ్ ॥

అను. ౧౬-౬౫ శాస్త్రముల (అనగా: నియమించి విజ్ఞానము గలుగి జేయువాని) లో వేదమును, గురువు లలో తల్లిని లాభములలో ధర్మమును, తపస్సులలో ఉపవాసమును మించిన శాద్దియు లేదు.

ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవ చ
క్షర స్సర్వాణి భూతాని కూటస్థో క్షర ఉచ్యతే ॥ ౧౬

ఈ లోకమున క్షరుడనియు నక్షరుడనియు నిరువురు పురుషులు గలరు. క్షరుడన నశ్వరములగు సర్వభూతము లనియు, కూటస్థు డనగా: నీ సర్వ భూతముల యొక్క మూలమునందుండు (కూటము నందు (ప్రకృతి రూపమై) యే యవ్యక్త తత్వము గలదో దానిని నక్షర మనియు జెప్పుచున్నారు. ౧౬.

పుట్టుట, పెరుగుట, ముదియుట, చచ్చుట యనునాల్గు లక్షణములు గలిగినదే వ్యక్తమనియు, యీ నాలుగు లేనిది యవ్యక్తమనియు జెప్పబడినది. "ద్వావాత్మానా చ భూతేషు సిద్ధాంతేష్వ పృథగాహృతౌ." (శా. ౨౩౬- ౩౧.) వేదముల యందును వానిననుసరించిన సిద్ధాంతముల యందును నాత్మలు రెండుగా నుదహరింపబడినవి. మఱియు మొదటిదగు జీవాత్మ వెనుకటి లక్షణములే గాక ధర్మార్థ కామ మోక్షములను నాలుగింటిని గూడ పొందుచుండును. ఈ యాత్మ వ్యక్తమనబడును. ఇది యవ్యక్తమగు పరమాత్మ వలన గలిగినది.

అక్షరశ్చ క్షరశ్చైవ ద్వైధీభావో య మాత్మనః
క్షర స్సర్వేషు భూతేషు దివ్యం త్వ మృత ముచ్యతే॥

శా. ౨౩౫- ౩౧. పరమాత్మ నకు క్షరమనియు, నక్షరమనియు రెండు భావములు గలవు. క్షరభావము సర్వభూతముల యందును వర్తించుచున్నది. చైతన్యము నందలి భావము దివ్యమును, నమృతమును 'నక్షరము' నగును. స్థావర జంగమములగు సర్వభూతములకు నీశుండగు పరమాత్మ నిష్క్రియుడును, నిర్గుణుండు నయ్యున్నది. మఱియు నవద్వారములు గల పురము (దేహము) జొచ్చి క్రియల జేయుచున్నది.

ఉభౌ వేదా క్షరౌ వుక్తౌ వుభౌ వేదా వనక్షరౌ
కారణం తు ప్రవక్ష్యామి యాథాతథ్యం తు జ్ఞానతః
అనాదినిధనా వేదౌ ఉభౌ వేదేశ్వరౌ మతౌ
తత్వసంజ్ఞా వుభౌ వేదౌ ప్రోచ్యతే జ్ఞాన చింతకైః
సర్గప్రళయ ధర్మత్వా దవ్యక్తం ప్రాహు రక్షరం॥

శా. ౩౦౫- ౧౦. క్షరమును నక్షరమును గూర్చి జెప్పబడిన దానిని వినుము. జీవుడును, ప్రకృతియు రెండును నక్షరము

లని చెప్పబడు చున్నవి. కారణము వినుము. ప్రకృతి జీవులిరు వురకు నాద్యంతములు గలుగవు; ఆ రెండును సృష్టి విషయ మున నాద్యంతములు గలవి. మఱియు నశ్వరములును. మాటిమాటికి సృష్టి ప్రళయ ధర్మములు గలది యగుటం జట్టి యవ్యక్తమును (ప్రకృతిని) నక్షరమని బలుకుదురు. ఆ యవ్యక్తము గుణము లను సృజించుటకై మాటి మాటికి వికారముల నొందు చున్నది; మహదాదులగు గుణములు పురుషుని వలనను బుట్టింప బడుటచే బురుషుడు ప్రకృతియు నొండొంటి నాశ్రయించి యుండుటవలన బంచ వింశకుడగు పురుషుడు క్షేత్ర మనియు బిలువ బడును.

యోగి గుణముల నెల్ల నుప సంహరించి యవ్యక్తాత్మ యందు (బ్రహ్మ మందు) లయింప జేయగా పంచ వింశకుడు (జీవుడు లేక పురుషుడు) గూడా యా గుణము లతో బాటు వానియందు లయించు చున్నాడు.

ప్రమా. ద్వా వివకా పక్షిణౌ నిత్యౌ సఖాయౌ చా ప్యచేతనౌ
ఏతాభ్యాం తు పరో యోన్య శ్చేతనావా న్స ఉచ్యతే॥
అచేతన స్సత్వసంఖ్యా విముక్తః
సత్వా త్పరం చేతయుతేం తరాత్మ
స క్షేత్రవి త్సర్వసంఖ్యాత బుద్ధి
ర్గుణాతిగో ముచ్యతే సర్వపాపైః॥ అను. ౪౬- ౧౬,౧౭.
ఉభౌ చ దేవౌ పృథవీం దివం చ
దిశ శ్చ శుక్రం భువనం బిభర్తి
తస్మా ద్దిశ స్సరిత శ్చ స్రవంతి
తస్మా త్సముద్రా విహితా మహాంతాః॥ సనత్సు. ౨౧.

ఆ పరమాత్మయే జీవేశ్వరుల కాధారము. భూమిని, యాకసమును, దిక్కులను; తేజోవంత మగు జగత్తునంతను ధరిం చునది యా పరమాత్మయే. ఏఱులును, సముద్రములును యాతని

వలననే ప్రవహించు చున్నవి.

విదురః. ద్వావిమౌ పురుషౌ లోకే సూర్యమండల భేదినౌ
  పరివ్రా డ్యోగయుక్తశ్చ రణే చాభిముఖో హతః॥ ౬.

రోగ యుక్తుడగు సన్యాసియు, యుద్ధమున శత్రువుల నెదిరించి జనిపోయిన వీరుడును సూర్యమండలమును భేదించుకొని పోవువారలు. ఈ యిరువురే గాని యన్యులట్లు గారు.

ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేతి గీయతే
యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః॥ ౧౭
యస్మాత్క్షర మతీతో౽హ మక్షరా దపి చోత్తమః
అతో౽స్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః॥ ౧౮

కాని యెవడు పురుషోత్తముడో వాడీ రెంటింటికంటెను వేరుగ నున్నాడు వానిని పరమాత్మ యని చెప్పుచున్నారు. ఆ యవ్యయుడగు నీశ్వరుడే త్రైలోక్యమును వ్యాపించి (త్రైలోక్యమును) పోషించు చున్నాడు. ౧౭. ఏ కారణము చే నేను క్షరముకంటె పరమందున్నవాడను, నక్షరముకంటె నుత్తముడను నై యున్నానో యా కారణముచే లోక వ్యవహారము నందును, వేదముల యందును పురుషోత్తము డను శబ్దములచే ప్రసిద్ధుడ నయి యున్నాను. ౧౮

వాసుదేవః. మత్తస్సర్వం సంభవతి జగత్స్థావర జంగమం
  అక్షరం చ క్షరం చైవ సచ్చాసచ్చైవ నారద
  మాం ప్రవిశ్య భవంతీహ ముక్తా భక్తాస్తు యే మమ
  అహం హి పురుషో జ్ఞేయో నిష్క్రియః పంచవింశకః॥.

శా. ౩౪౦ నారదా! నా వలన సర్వము బుట్టుచున్నది. సర్వము నేనని దెలియుము. నేనే పంచవింశతి తత్వాత్మకుడ నగు. పురుషుడను. మహాపురుషుడును నేనే యని దెలియుము.

ఈ మహాపురుషుని దెలిసికొన ప్రయత్నించు వారి చరిత

ములు మోక్ష ధర్మ పర్వాంతము ( భారతమున ) నిండి నిబిడీకృత మయ్యున్నవి. ఎవరు వ్రాయ గలరు?

౧ బ్రహ్మ. మహాపురుష శబ్దం స బిభర్త్యేక స్సనాతనః. సనాతను డగు పరమాత్మయె మహా పురుష శబ్దముచే జెప్ప బడి యుండుట వలన గీత యందలి పురుషోత్తమ ప్రాప్తి యోగము ముక్తిదాయక మని నిశ్చయింప వలయును.

౨ క్షీరోదధే రుత్తరత శ్శ్వేతద్వీపో మహాప్రభః
తత్ర నారాయణపరా మానవా శ్చంద్రవర్చసః
ఏకాంతభావోపగతా స్తే భక్తాః పురుషోత్తమం
తే సహస్రార్చిషం దేవం ప్రవిశంతి సనాతనం ॥

చంద్ర వర్చస్సు గలిగిన మానవులు శ్వేత ద్వీపము నందు గలరు. వారు ఏకాంత భావము నందిన భక్త వరులు. వారు సనాతనుడును, సహస్ర కిరణుడును నగు పురుషోత్తము నారాధించుచు ఆయననే పొందుదురు.

శ్వేత ద్వీప వాసుల జప విధాన మీరీతిగ నుండును.
" జితం తే పుండరీకాక్ష నమ స్తే విశ్వభావన
నమ స్తే స్తు హృషీకేశ మహా పురుష పూర్వజ ॥ "

మహాపురుషుని దెలుసుకొని యాతని నేకాగ్రమనస్కులై యుపాసించి మోక్షము బడసిన వారలలో నుత్తము లగు వారల నిద్దరి మచ్చుకు జూపి యున్నాము. మఱియు నాభక్తవర్గము ననే జేరిన వాడును, విశేషించి భారతీయుల కెల్లరికిని సుప్రసిద్ధుడు నగు నారదుని యొక్క భక్తి విశేషము, సద్వర్తన మును ప్రసంగాను ప్రసక్తముగ నటనట వ్రాయబడినది. ఇట నాతని సమ్యగ్ మగు స్తవము యుదహరింప బడుచున్నది. దానిని సమగ్రముగ బఠించి యర్థము దెలిసి పురుషోత్తము భజించువారు ముక్తు లగుదు రనుట నిస్సంశయము.

## శ్రీ నారద మహా ముని కృత

# మహాపురుష స్తవము.

నారదః - నమస్తే దేవదేవేశ నిష్క్రియ నిర్గుణ లోక సాక్షిన్ క్షేత్రజ్ఞ పురుషోత్తమ అనంత పురుష మహాపురుష పురుషోత్తమ త్రిగుణ ప్రధాన అమృత అమృతాక్ష అనంతాఖ్య వ్యోమ సనాతన సదసద్వ్యక్తావ్యక్త ఋతధామన్ ఆదిదేవ వసుప్రద ప్రజాపతే సుప్రజాపతే వనస్పతే మహాప్రజాపతే ఊర్జస్పతే వాచస్పతే జగత్పతే మనస్పతే దివస్పతే మరుత్పతే సలిలపతే పృథివీపతే దిక్పతే పూర్వనివాస గుహ్య బ్రహ్మపురోహిత బ్రహ్మకాయిక మహారాజిక చాతుర్మహారాజిక ఆభాసుర మహాభాసుర సప్తమహాభాగ యామ్య మహాయామ్య సంజ్ఞాసంజ్ఞ తుషిత మహాతుషిత ప్రమర్దన పరినిర్మిత అపరినిర్మిత వశవర్తిన్ అపరినిందిత అపరిమిత వశవర్తిన్ అవశవర్తిన్ యజ్ఞ మహాయజ్ఞ యజ్ఞసంభవ యజ్ఞయోనే యజ్ఞగర్భ యజ్ఞహృదయ యజ్ఞస్తుత యజ్ఞభాగహర పఞ్చయజ్ఞ పఞ్చకాల కర్తృపతే పాఞ్చరాత్రిక వైకుంఠ అపరాజిత మానసిక నామనామిక పరస్వామిన్ సుస్నాత హంస పరమహంస మహాహంస పరమయాజ్ఞిక సాంఖ్యయోగ సాంఖ్యమూర్తే అమృతేశయ హిరణ్యేశయ దేవేశయ కుశేశయ బ్రహ్మేశయ పద్మేశయ విశ్వేశ్వర విష్వక్సేన త్వం జగదన్వయః త్వం జగత్ప్రకృతిః తవాగ్నిరాస్యం బడబాముఖోఽగ్నిః త్వమాహుతి స్సారథిః త్వం వషట్కారః త్వం ఓంకారః త్వం తపః త్వం మనః త్వం చంద్రమాః త్వం చక్షురాజ్యం త్వం సూర్య స్త్వం దిశాంగజ స్త్వం దిగ్భానో విదిగ్భానో హయశిరః ప్రథమ

త్రిసౌపర్ణః పర్ణధర పఞ్చాగ్నే త్రిణాచికేత షడంగ నిధాన ప్రాగ్జ్యోతిష జ్యేష్ఠ సామగ మాసిక వ్రత ధర అథర్వ శిరః పఞ్చ మహా కల్ప ఫేనపాచార్య వాలఖిల్య వైఖానస అభగ్న యోగ అభగ్న పరి సంఖ్యాన యుగాదే యుగమధ్య యుగనిధన ఆఖండల ప్రాచీన గర్భ కౌశిక పురుష్టుత పురుహూత విశ్వ కృత్ విశ్వ రూప అనంత గతే అనంత భోగ అనంత అనాదే అమధ్య అవ్యక్త అవ్యక్త నిధన వ్రతా వాస సముద్రా ధివాస యశోవాస తపోవాస దయా వాస లక్ష్మ్యా వాస విద్యా వాస కీర్త్యా వాస శ్రీవాస సర్వావాస వాసుదేవ సర్వచ్ఛందక హరి హయ హయమేధ మహా యజ్ఞ భాగ హర వర ప్రద సుఖ ప్రద ధన ప్రద హరిమేధ యమ నియమ మహానియమ కృచ్ఛ్ర అతి కృచ్ఛ్ర మహాకృచ్ఛ్ర సర్వకృచ్ఛ్ర నియమధర నివృత్త భ్రమ ప్రవచన గత ప్రవృత్త వేద క్రియ అజ సర్వ గతే సర్వ దర్శిన్ అగ్రాహ్య అచల మహావిభూతే మాహాత్మ్య శరీర పవిత్ర మహా పవిత్ర హిరణ్మయ బృహత్ అప్రతర్క్య అవిజ్ఞేయ బ్రహ్మాగ్ర్య ప్రజా సర్గ కర ప్రజా నిధన కర మహామాయాధర చిత్రశిఖండిన్ వరప్రద పురోడాశ భాగహర గతాధ్వర ఛిన్నతృష్ణ ఛిన్న సంశయ సర్వతోవృత్త నివృత్త రూప బ్రాహ్మణ రూప బ్రాహ్మణ ప్రియ విశ్వమూర్తే మహామూర్తే బాంధవ భక్తవత్సల బ్రాహ్మణ్య దేవ భక్తో హం త్వాం దిదృక్షుః ఏకాంతదర్శనాయ నమో నమః.

భా. శా. మోక్ష ధర్మ పర్వణి నారాయణీయే ౩౩౯. అ.

ఈ స్తవము వలన భగవంతుడు నారదునకు ప్రత్యక్షమై కోరిన వరముల నిచ్చి, "నైషాం విఘ్నో భవే దితి" ఇచ్చట నా ఏకాంత భక్తులు జాలమంది గలరు వారికి విఘ్నము గలుగకుండ నీ విటనుండి వెడలి పొమ్మని యానతిచ్చెను.

యో మా మేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమం
స సర్వవి ద్భజతి మాం సర్వభావేన భారత ॥ ౧౯
ఇతి గుహ్యతమం శాస్త్ర మిద ముక్తం మయా నఘ
ఏత ద్బుద్ధ్వా బుద్ధిమా న్స్యా త్కృతకృత్య శ్చ భారత ॥

ఇట్లు నేను పురుషోత్తముడ నని మోహమును జెందక యెవడు తెలిసికొను చున్నాడో వాడు సర్వజ్ఞుడై సర్వ భావములచేతను నన్నే భజించు చున్నాడు. ౧౯. ఓనిష్పాపుడవగు భారతా! యిట్టి గుహ్యముల యన్నింటిలోను గుహ్యమగు శాస్త్రము నాచే జెప్పబడినది. దీనిని దెలిసి కొనుటచే మనుష్యుడు బుద్ధిమంతుడై (అనగా: బుద్ధుడు, లేక జ్ఞాతయై) కృతకృత్యుడగును. ౨౦.

గీతల యందు ౧౪ అధ్యాయములలో జెప్ప బడిన విషయమంతియు పురుషోత్తముని దెలియుటకే యై యున్నది. యా విషయము నంతయు నీ యధ్యాయమున (సింహావలోకనముగ) జెప్ప బడినది. ఈ యధ్యాయముచె గీతార్థ మంతయు దెలియ నగును. అందుచే మోక్షము గల్గునని యీ యధ్యాయము నకు 'పురుషోత్తమ ప్రాప్తి యోగ' మని పెద్దలు నామకరణము జేసి యున్నారని గ్రహించెదరు గాక.

భారతీయులకు ధర్మ గ్రంథ మగు
శ్రీ మన్మహా భారతము నందలి మోక్ష ధర్మ బోధక మగు
శ్రీమద్భగవ ద్గీతల యందు
పురుషోత్తమ ప్రాప్తి యోగ మను
పంచదశాధ్యాయము.

---

శ్రీ శివాయ గురవే నమః.

# శ్రీ కుమారగీత.

## దైవాసుర సంపద్విభాగ యోగము.

### షోడశాధ్యాయము.

శ్రీ భగవానువాచ.

అభయం సత్త్వసంశుద్ధి ర్జ్ఞాన యోగ వ్యవస్థితిః
దానం దమ శ్చ యజ్ఞ శ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్ ॥ ౧
అహింసా సత్య మక్రోధ స్త్యాగ శ్శాంతి రపైశునం
దయా భూతే ష్వలోలత్వం మార్దవం హ్రీ రచాపలమ్ ॥ ౨
తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహో నాతిమానితా
భవంతి సంపదం దైవీ మభిజాతస్య భారత ॥ ౩

భగవంతుడు జెప్పుచున్నాడు:- ఓ భారతా! అభయమును శుద్ధమగు సాత్త్విక వృత్తియును, జ్ఞాన యోగ వ్యవస్థితియు, (అనగా: జ్ఞానమార్గము యొక్కయు, కర్మ యోగము యొక్కయు తారతమ్య వ్యవస్థను జేయుటయు) దాతృత్వము, దమము, యజ్ఞము, స్వాధ్యాయము, (అనగా: స్వ ధర్మానుసారముగ ప్రవర్తించుట) తపస్సు, సరళత, ౧ అహింస, సత్యము, క్రోధములేకుండుట, త్యాగము (కర్మ ఫల త్యాగము), శాంతి, అపైశున్యము, క్షుద్రబుద్ధిని విడనాడి యుండుట, సర్వ భూతముల యందును దయ, లంపటుడు కాకుండుటయు, మృదుత, (దుష్కార్యముల యందలి) లజ్జయు, చాపల్యము లేకుండుట, అనగా: వ్యర్థపు బనులు చేయకుండుట, ౨. తేజస్విత, క్షమ, ధృతి, శుచిగ నుండుట, ద్రోహము చేయక పోవుట యను నీగుణములు దైవీసంపత్తునందు జనిమించిన పురుషునకు ప్రాప్తములగును.

శా. 300. హంసగీత. బ్రహ్మ హంసరూపముతో సాధ్యుల కుప దేశించిన విధానము ప్రత్యేకముగ జూడ గలరు.

దత్వా భయ కృతం దానం తదా సిద్ధి మవాప్నుయాత్
అభయం సర్వ భూతేభ్య స్సదా త మభివర్తతే ॥ శా. ౭౯౭.

అన్ని దానముల కన్నను సర్వభూతములకొఱకు జేయబడిన అభయదానము దాతను వదలి యుండ నేరదు.

దానం హి భూతా భయ దక్షిణాయాః
సర్వాణి దానా న్యధితిష్ఠతీ హ
తీక్ష్ణం తనుం యః ప్రథమం జహాతి
సో నంత్య మాప్నో త్యభయం ప్రజాభ్యః ॥ శా. ౨౯౫.

సర్వభూతముల కభయ మొసగుటకన్న వేరెద్దియు లేదు.

సత్త్వం దేవగుణా న్విద్యా దితరా వాసురా గుణౌ

శా. ౨౧౬. సత్త్వము దేవ గుణము. ఇతరము లాసుర గుణములు. "జ్ఞానం మోక్షైకసాధనం" జ్ఞానము మోక్షము నకు సాధనము. "యోగీ బల మవాప్నుయాత్" యోగము బలసాధకము. "దానధర్మా త్పరో ధర్మో భూతానాం నేహ విద్యతే" అన్ని ధర్మములలోను దాన మను ధర్మ ముత్తమము.

దమా త్తస్య క్రియాసిద్ధి ర్యథావ దుపలభ్యతే
దమో దానం తథా యజ్ఞా నధీతం చాతివర్తతే ॥
దమ స్తేజో వర్ధయతి పవిత్రం చ దమః పరం
విపాప్మా తేజసా యుక్తః పురుషో విందతే మహత్ ॥

శా. ౧౬౦. దమ మను నది పురుషు నకు సర్వ క్రియా సిద్ధిని గలుగ జేయును. దమ మను గుణము దానము, యజ్ఞము, అధ్యయనము నను వానిని మించిన దగును. తేజో వృద్ధిని, పవిత్రతను గలుగ జేయును. పురుషుడు పాపరహితుడై మహత్తును

పొందును దమ మనగా: సర్వ దుర్గుణముల మానుకొని సద్గుణ ములను స్థానభూతు డగుటయే యని తెలిసికొన వలయును.

" యజ్ఞా ద్భవతి పర్జన్యః " యజ్ఞమువలన వర్షము గల్గును. స్వాధ్యాయము వలన సర్వము దెలిసిన వాఁడగును. తపస్సు వలన సిద్ధింపనివి సిద్ధించును. ఆర్జవము అనగా: ఋజు భావము లేక మృదుత్వము. " అహింసైకా సుఖావహా " అహింస సర్వ సుఖములకు కారణము. " సత్యా జ్జాతాని భూతాని సత్యం భూతమయం జగత్, తస్మా త్సత్యాశ్రయా విప్రా నిత్యం యోగ పరాయణాః. " సత్యమువలన భూతములు గలుగు చున్నవి. గాన జగత్తు, యోగి పరాయణు లగు మునులు సత్యాశ్రయు లని గలదు. క్రోధము లేకుండుటే దేవత్వము. త్యాగమే యాత్మ సాధనము. శాంతి దుర్జనుల పాలిటి ఖడ్గము. చాడీలు జెప్పక యుండుటె వాగ్వ్రతము. దయ భగవత్స్వరూపము. శిగ్గు అనగా: యకార్యములు జేయ కుండుట. చాపల్యము యస్థిరత.

క్షమా ధృతి రహింసా చ సమతా సత్య మార్జవం
జ్ఞానం త్యాగో థ సన్న్యాసః సాత్త్వికం వృత్త మిష్యతే॥

అశ్వ. ౪౫-౨. క్షమాది గుణములు సాత్త్వికత్వము నలవఱచును.

వృత్తశౌచం మనశ్శౌచం తీర్థశౌచ మతః పరం
జ్ఞానోత్పన్నం చ య చ్ఛౌచం త చ్ఛౌచం పరమం మతమ్॥

అను. ౧౦౮-౧౭. శుచిత్వము దెలిసికొన నీయధ్యాయముత్తమము.

తన దినచర్యల యందు శుచిత్వము, మానసిక శుచిత్వము, తీర్థముల యందలి శుచిత్వము, జ్ఞానముచే (నాంతర)శుచిత్వమును గలిగియుండుట సర్వశ్రేష్ఠమని జెప్పబడినది.

మనసా కృతశౌచా వై శుద్ధా స్తీర్థాని యాస్యథ
శరీరనియమం ప్రాహు ర్బ్రాహ్మణా మానుషం వ్రతం
మనోవిశుద్ధాం బుద్ధిం చ దైవ మాహు ర్వ్రతం ద్విజాః

మనో హ్యదుష్టం శౌచాయ పర్యాప్తం వై నరాధిప
మైత్రీం బుద్ధిం సమాస్థాయ శుద్ధా స్తీర్థాని ద్రక్ష్యథ
తే యూయం మానసై శ్శుద్ధా శ్శరీర నియమ వ్రతైః
దైవం వ్రతం సమాస్థాయ యథోక్తం ఫల మాప్స్యథ ॥
అర. ౯౩. పాండవులు తీర్థ యాత్రలకు వెడలి నపుడు పర్వత నారదులు జెప్పిన తీర్థ విధానము.

శరీర నియమములు గలది మానుష వ్రతము. మన స్సుచే శుద్ధ మయిన బుద్ధి గలుగుటే దేవ వ్రతము. కావున మీరలు దేవ వ్రతమును బూని యాత్రా ఫలముల బొందుడు.

"అద్రోహేణైవ భూతానాం యో ధర్మ స్స సతాం మతః॥"

సర్వభూతములకు ద్రోహము జేయకుండు ధర్మము సద్ధర్మ మని సత్పురుషుల యొక్క మతము.

యో యథా నిర్మితో జంతు ర్యస్మి న్యస్మింశ్చ కర్మణీ
ప్రవృత్తో వా నివృత్తో వా త త్ఫలం సోఽశ్నుతే మహత్ ॥
నారాయణీ. శా. ౩౪౦.

జంతువులే యే రీతిగ బ్రవృత్తి నివృత్తులలో సక్తమగునో యా కర్మల వలన నాయాయి ఫలముల బొందుచుండును.

దంభో దర్పో ఽతిమాన శ్చ క్రోధః పారుష్య మేవ చ
అజ్ఞానం చా భిజాతస్య పార్థ సంపద మాసురీమ్ ॥ ౪

ఓ పార్థా! దంభము, దర్పము, అతిమానము, కోపము, పారుష్యము అనగా: నిష్ఠురత, అజ్ఞానము ననునవి యాసురీసంపత్తు నందు (అనగా: రాక్షస సంపత్తునందు) జన్మించిన వారికి (ప్రాప్తము లగును.) ౪

క్రోధః కామో లోభమోహౌ విధిత్సా
కృపా సూయా మాన శోకౌ స్పృహా చ

ఈర్ష్యా జుగుప్సా చ మహాగుణేన
సదా వర్జ్యా ద్వాదశైతే నరేణ॥ సనత్సుజాతః.

క్రోధాదులగు ద్వాదశ మహాదోషములు దపస్వి యగు వాని కెల్లప్పుడును బరిత్యాజ్యములు.

దైవీ సంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా
మా శుచః సంపదం దైవీ మభిజాతోఽసి పాండవ॥ ౫

(వీనిలో) దైవీ సంపత్తు (పరిణామమునందు) మోక్షదాయకమనియు, నాసురీసంపత్తు బంధకమనియు చెప్పుచున్నారు. ఓ పాండవా! నీవు దైవీ సంపత్తునందు జన్మించిన వాడవు. శోకింపకు మని యుపదేశించెను. ౫

ద్వౌ భూతసర్గౌ లోకేస్మిన్ దైవ ఆసుర ఏవ చ
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు॥ ౬
ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదు రాసురాః
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే॥ ౭

ఈ లోకమునందు జీవులు రెండు విధములుగ బుట్టుచున్నారు. ఒకడు దైవుడును, మఱియొక డాసురుడును. వీనిలో దైవ (ప్రకారము యొక్క) వర్ణనము జేయబడినది. ఇప్పుడో పార్థా! యాసుర (ప్రకారమగు) వర్ణనను నేను జేయుచున్నాను వినుము. ౬ ప్రవృత్తియు (ననగా: నేమి చేయవలసినదియు) నివృత్తియు (నేమి చేయకూడనిదో యదియు) నాసురులకు తెలియదు. శుచిత, యాచారము, సత్యము ననునవి వారి యందుండవు. ౭

ప్రవృత్తిం చ నివృత్తిం చ కల్పయామాస వై ప్రభుః
శా. ౨౫౭ ప్రవృత్తి నివృత్తుల బ్రహ్మ కల్పించెను.
ద్వావిమావిహ పంథానౌ యత్ర వేదాః ప్రతిష్ఠితాః
ప్రవృత్తిలక్షణో ధర్మో నివృత్తౌ చ సుభాషితః॥

వేదములు ప్రతిష్ఠితములయి యుండు మార్గములు ప్రవృత్తి ధర్మములనియు నివృత్తి ధర్మములనియు రెండు విధములు గలవు.

ప్రవృత్త్యా చ నివృత్త్యా చ యస్మాద్దేవ ద్విభివ్యతి
యజుర్ఋక్సామభిర్జుష్ట మథర్వాంగిరసైస్తథా ॥ శా. ౩౩౬.

మీరు రచించిన యీ శాస్త్రము ఋక్కు, యజుస్సు, సామము, అంగిరసము ననెడి నాలుగు వేదములను విధేయమయి ప్రవృత్తి నివృత్తి విషయమునను సకల లోకములందును ప్రమాణభూతమయి యొప్పుచుండును.

ప్రవృత్తించ నివృత్తించ భూతానాం యో న బుధ్యతే
తస్య స్తంభో భవేద్బాల్యాన్నాస్తి స్తంభో నపశ్యతః ॥

భూతముల యొక్క ప్రవృత్తి నివృత్తుల నెవడు తెలియలేడో వాడు తెలియమిచే జడిమను బాల్యుడు చున్నాడు. యీ రెంటిని గనుగొను వానికి యట్టి జడిమ గలుగదు.

నివృత్తి లక్షణం ధర్మ మవ్యక్తం బ్రహ్మ శాశ్వతం
ప్రవృత్తిలక్షణం ధర్మం ప్రజాపతి రథా బ్రవీత్
ప్రవృత్తిః పునరావృత్తిః నివృత్తిః పరమా గతిః ॥ శా. ౨౧౭.

ప్రవృత్తి ధర్మము జన్మలకు కారణమనియు, నివృత్తిలక్షణము మోక్ష కారణమనియు బ్రహ్మ జెప్పెను.

ఆసురాణాం ప్రవృత్తిస్తు దంభభావః స్వభావజః ॥ శా.

అసురులభావము స్వభావముచే దంబము గలది.

: అసత్య మప్రతిష్ఠం తే జగదాహు రనీశ్వరం
: అపరస్పర సంభూతం కిమన్య త్కామహైతుకమ్ ॥ ౮

వీరు ( ఆసురులు ) జగత్తంతయు నసత్యమనియు, నప్రతిష్ఠమనియు ( నిరాధారము ) ననీశ్వర మనియు ( అనగా: పరమేశ్వరుడు లేకనే యుండునది. ) అ- పరస్పరసంభూత మనియు,

(అనగా: నొకదాని యందుండి మఱియొకటి పుట్ట లేదనియు)
కావుననే కామమందక్క (అనగా: మనుష్యుల యొక్క విష
యోప భోగముల దక్క) యీ జగత్తునకు మఱి యొక ప్రయో
జన మేమియు లేదనియు జెప్పెదరు ౮

అనీశ్వరః కథం ముచ్యే దిత్యేవం శత్రుకర్షణ
వదంతి కారణం శ్రేష్ఠం యోగా స్సమ్య క్పరీక్షిణః
వదంతి కారణం చేదం సాంఖ్యా స్సమ్య గ్ద్విజాతయః ॥

శా. ౩౯౧. ౩. సాంఖ్యులు సాంఖ్యమును, యోగులు యోగమును బ్రశంసింతురు; వారు దమ తమ దర్శనముల యాధిక్యతను నెలకొల్పుటకు తమ దర్శనములే శ్రేష్ఠములని జెప్పెదరు.

మనీషులగు యోగులు యీశ్వరుడు లేదను వాడు ముక్తి నే విధమునను బొంద నేరడని యుక్తమములగు కారణములచే జక్కగ నుపపాదించెదరు

ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానో ల్పబుద్ధయః
ప్రభవం త్యుగ్ర కర్మాణః క్షయాయ జగతో హితాః ॥ ౯
కామ మాశ్రిత్య దుష్పూరం దంభమాన మదాన్వితాః
మోహా ద్గృహీత్వా సద్గ్రాహా న్ప్రవర్తంతే శుచివ్రతాః ॥
చింతా మపరిమేయాం చ ప్రలయాంతా ముపాశ్రితాః
కామోపభోగ పరమా ఏతావ దితి నిశ్చితాః ॥ ౧౧
ఆశా పాశ శతై ర్బద్ధాః కామ క్రోధ పరాయణాః
ఈహంతే కామ భోగార్థ మన్యాయేనార్థ సంచయాన్ ॥ ౧౨
ఇద మద్య మయా లబ్ధ మిమం ప్రాప్స్యే మనోరథం
ఇద మస్తీద మపి మే భవిష్యతి పున ర్ధనమ్ ॥ ౧౩
అసౌ మయా హత శ్శత్రు ర్హనిష్యే చాపరా నపి
ఈశ్వరో హ మహం భోగీ సిద్ధో హం బలవా న్సుఖీ ॥ ౧౪

ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః ॥ ౧౫
అనేక చిత్తవిభ్రాంతా మోహజాలసమావృతాః
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకే శుచౌ ॥ ౧౬
ఆత్మసంభావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః
యజంతే నామయజ్ఞైస్తే దంభేన విధిపూర్వకమ్ ॥ ౧౭
అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః
మామాత్మపరదేహేషు ప్రద్విషంతోఽభ్యసూయకాః ॥ ౧౮
తానహం ద్విషతః క్రూరాన్సంసారేషు నరాధమాన్
క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు ॥ ౧౯
ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని
మామప్రాప్యైవ కౌంతేయ తతో యాంత్యధమాంగతిం ॥

ఇట్టి యూహాతో నల్ప బుద్ధులు గల నష్టాత్ములును, దుష్టులును క్రూర కర్మల నాచరించుచు, జగత్తును నశింపజేయుట కొఱకు బుట్టుచున్నారు. ౯ మఱియు ఎప్పుడును పూర్ణము కాని కామముల ( అనగా: విషయోపభోగేచ్ఛలను ) నాశ్రయించి దంభము, మానము, మదము నను వానిచే వ్యాపింపబడినవారు .( ఆసురులు ) మోహముచేత నసద్గ్రాహమును ( అనగా: నబద్ధపు కల్పనలను ) మనస్సునందు చేసికొని దుర్మార్గపు పనుల జేయుచున్నారు. ౧౦ అటులనే యామరణాంతమును (లెక్కలేని సుఖోపభోగములయొక్క) చింతలచే నావలులయి కామభోగముల యందు మగ్నులయి యదియే పరమ సాధ్యమని నిశ్చయించుచున్నారు. ౧౧ అనేక లట్టి పాశములచే బద్ధులయి, కామక్రోధపరాయణులై, సుఖోపభోగములకొఱకు న్యాయముగ పుష్కలముగ ధనము నార్జించుదమను నభిమానము గల వారగు

చున్నారు. ౧౨ నేనీ దినమున నింత సంపాదించితిని. రేపా కోరికను నెఱవేర్చుకొందును. ఈ ధనము నాదగ్గఱ నున్నది. అదియును నాదే యగును. ౧౩ ఈ శత్రువుల నేను చంపితిని. ఇంకను నేను కొందఱిని చంపుదును. నేనీశ్వరుడను. (నేనే) ఉపభోగించువాడను. నేను సిద్ధుడను, బలాఢ్యుడను, సుఖిని, ౧౪ నేను సంపన్నుడను, గొప్ప కులమందు బుట్టితిని. నాతో సమానుడెవడు? నేను యజ్ఞమును జేయుదును, దానము లిచ్చెదను. నే నానందము నొందుదును. అని యజ్ఞానముచే మోహము నొంది, ౧౫ యనేక ప్రకారములగు కల్పనలచే భ్రాంతులయి మోహ జాలములో బడి విషయోప భోగముల యందాసక్తులయిన యీ యసురులశుచియగు నరకమందు బడుచున్నారు. ౧౬ ఆత్మశ్లాఘనమును జేసికొను వారును, స్తబ్ధులును, ధనము యొక్కయు మానము యొక్కయు మదముతో గూడిన వారును, నగు నాసురులు దంభముతో శాస్త్ర విధిని విడచి కేవల నామ మాత్రములగు యజ్ఞముల చేయుచుందురు. ౧౮ అహంకారము చేతను, బలముచేతను, కామముచేతను, దర్పముచేతను, క్రోధముచేతను నిండినవారయి తమయొక్కయు, నితరులయొక్కయు దేహమందున్న నన్ను (పరమేశ్వరుని) ద్వేషించుచు, నిందించుచు, ౧౭ అశుభ కర్మలను జేయుచు. ద్వేషించు వారును, క్రూరులు నగు నీ నరాధములను (ఈ) సంసారమునందు ఎప్పుడును పాపయోనులయందే పడవేయుచుందును. ౧౯ ఓ కౌంతేయా! ఇట్లు ప్రతి జన్మయందును నాసుర యోనులనే పొందుచు నీమూఢులు నన్నెప్పుడు పొందక మిక్కిలి యధోగతి పాలగుచున్నారు.

సిద్ధి॥ అశుభా గతయః ప్రాప్తాః కష్టా మే పాపసేవనాత్
కామమన్యుపరీతేన తృష్ణయా మోహితేన చ
పునః పునశ్చ మరణం జన్మ చైవ పునః పునః

ఆహారా వివిధా భుక్తాః పీతా నానావిధాః స్తనాః
మాతరో వివిధా దృష్టాః పితర శ్చ పృథగ్విధాః
సుఖాని చ విచిత్రాణి దుఃఖాని చ మయా నఘ
ప్రియై ర్విహీనో బహుశ స్సంవాస శ్చ ప్రియై స్సహ
ధన నాశం చ సంప్రాప్తో లబ్ధ్వా దుఃఖేన తద్ధనం
తతః కదాచి న్నిర్వేదా న్నిరాకారా శ్రితేన చ
లోకతంత్ర పరిత్యక్తం దుఃఖార్తేన భృశం మయా
లోకే స్మి న్ననుభూయాహ మిమం మార్గ మనుష్ఠితః
తత స్సిద్ధి రియం ప్రాప్తా ప్రసాదా దాత్మనో మయా ॥

అనుగీత. ౧౬- ౩౧

అసుర భావములు గలవారి శుభములఁ బొందుదు రనుటకు జాల నిదర్శనములు గలవు ప్రకృతము (౧౭ అధ్యాయముల లోని గీతాభిప్రాయమును విపులముగా ౩౬ యధ్యాయములలో దిరిగి వర్ణించిన యనుగీతలలో) ఏ విషయమే కృష్ణునికి సిద్ధునితో జరిగిన సంభాషణము వలన గ్రహింపనగు.

సిద్ధుఁడయి బ్రహ్మలోకము నుండి వచ్చిన బ్రాహ్మణుఁడు శ్రీకృష్ణునితో దాను తమ వారు సిద్ధి నందుటకు కారణములను (పై శ్లోకములందు జెప్పినరీతిగ కామక్రోధములకు స్వేచ్ఛగలిగించి విషయముల ననుభవించుచు, ననేకములగు జన్మలనందుచు, నొకటి యేమి యన్ని విధములగు ( విషయ సంబంధులయిన ) మంచిచెడుగ్గుల యనుభవముల యొక్క విసుగుదల గా ) జెప్పి, యట్టి కారణముచే నేనువీటిని ద్యజించి యాత్మప్రసాదమును అనగాః నాత్మప్రసాదముచే క్రమముగ గలుగు సిద్ధిని ( నిశ్చింతతను ) బొందగలిగితిని. "నాహం పున రిహాగంతా" మరల నేను యీ మనుష్య సంబంధములగు దుఃఖములందు జిక్కువడను. స్వేచ్ఛగ లోకాలోకముల నెల్ల విహరించుచు దుఃఖమెఱుంగని యానంద మనుభ

యించుచుండును. "పరిపృచ్ఛస్వ కల్యాణం భాషేయం తత్తవేప్సితమ్." ఓ కృష్ణా! నీ వేదయిన కల్యాణమును గూర్చి ప్రశ్నింపుము. నీకీప్సితమగు నద్దానిని నే వచింతును. అని సిద్ధునిచే నాదేశింప బడి శ్రీకృష్ణుడు అతి గూఢము లగు విషయముల నెల్ల నాతని నడిగి తెలిసికొనియెను. ఈ విషయము నే సంగ్రహముగ గీతల యందు భగవంతుడు జెప్పియున్నాడు గాన యిట్టి (సిద్ధునికి గలిగినటువంటి) యాత్మ నిర్వేదము గలుగనిదే మనుజుడు మోక్షము బొందనేరడు. అట్లుగాక యనగా: విషాదమును బొందక సంసారమే సత్యమని నమ్మియుండు వాడాసుర భావము గలవాడనియు, వారి కధోగతి గలుగు ననియు గీతయందు జెప్పబడినది.

త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః
కామః క్రోధ స్తథా లోభ స్తస్మా దేత త్త్రయం త్యజేత్ ॥
ఏతై ర్విముక్తః కౌంతేయ తమోద్వారై స్త్రిభి ర్నరః
ఆచర త్యాత్మన శ్శ్రేయ స్తతో యాతి పరాం గతిమ్ ॥ ౨౨

కామము, క్రోధము, లోభము నను మూడును మూడువిధములగు నరక ద్వారములు. అవి మనలను నశింపజేయుచున్నవి. కాన నీ మూడింటిని వదల వలయును. ౨౧ ఓ కౌంతేయా! ఈ మూడు తమోద్వారముల నుండియు విముక్తుడగు నేని మనుజుడు దనకు దేనివలన మేలు గలుగునో దానినే యాచరింపనారంభించి పిదప నుత్తమ గతి నొందును. ౨౨

భీష్మః. తతో పశ్య త్స కామం చ క్రోధం లోభం భయం మదం
నిద్రాం తంద్రీం యథా లస్య మావృత్య పురుషాన్ స్థితాన్ ॥

కామ క్రోధాదులు మనుజుల నావరించి యుండును. శా. ౨౬౧.

కుండధారః. ఏతై ర్లోకా స్సంరుద్ధా దేవానాం మానుషా ద్భయం
తథైవ దేవవచనా ద్విఘ్నం కుర్వంతి సర్వశః ॥

ఈ కామాదిదోషములచే మనుజులందరు బద్ధులైయున్నారు.

దేవతలు మనుజులవ భయ మొందెదరు. ఈ కామాది దోషములు దేవతల యాజ్ఞానుసారము నలు దిక్కులను జేరి విఘ్నముల గావించుచుండును. దేవతల యాజ్ఞ లేక కృతార్థుడుగా నేరడు.

"కామ క్రోధసమాయుక్తో హింసా లోభ సమన్వితః
మనుష్యత్వా త్పరిభ్రష్టః తిర్యగ్యోనౌ ప్రజాయతే"

కామ క్రోధములతో గూడిన వాడు మనుష్యత్వమును బోగొట్టుకొని మృగ పక్షి సూకరాది జన్మల నందును

మనుష్యా యది వా దేవాశ్శరీర ముపతాప్య వై
ధర్మేణ సుఖ మేధంతే లోభ ద్వేష వివర్జితాః ॥ అను. ౧౬౩.

మనుజులైనను, దేవతలైనను, లోభ ద్వేషముల నొదిలి ధర్మముచే సుఖము బొందగలరు.

"సంపతంత్యాసురీం యోనిం యజ్ఞ ప్రసవ వర్జితాః" యజ్ఞాదుల నొదిలిన వారు అసురులై పుట్టుదురు

యః శాస్త్ర విధి ముత్సృజ్య వర్తతే కామ కారతః
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥ ౨౩
తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి ॥ ౨౪

ఎవడు శాస్త్రోక్తవిధిని వదలి యిచ్ఛచొప్పున జేయుచున్నాడో వానికి సిద్ధి లభింపదు, సుఖము లేదు, ఉత్తమ గతియు లభింపదు. ౨౩ కావున కార్యాకార్య వ్యవస్థితని (అనగా: కర్తవ్య మేదియో, యకర్తవ్య మేదియో) నిర్ణయించుటకు నీవు శాస్త్రమునే ప్రమాణముగ గ్రహింప వలయును. శాస్త్రమున జెప్పబడినదాని నెఱింగి తదనుసారముగ గర్మలం జేయుట యీ లోకమున నీవు గర్తవ్యము. ౨౪

పఠి ముష్ణంతి శాస్త్రాణి ధర్మస్య పరిపంథినః
వైషమ్యమర్థ విద్యానాం నిరర్థాః ఖ్యాపయంతి తే

అపక్వమతయో మందా న జానంతి యథాయథం
యథా హ్య శాస్త్రకుశలా సర్వత్రా యుక్తి నిష్ఠితాః
పరిముష్ణంతి శాస్త్రాణి శాస్త్రదోషానుదర్శినః
విజ్ఞాత మర్థం విద్యానాం న సమ్య గితివర్తతే ॥ శా. ౧౪౨.

ధర్మమునకు వ్యతిరేకము జెప్పువారు శాస్త్రములను దొంగి లించెదరు; నిరర్థక ప్రకటనల జేయుదురు, పక్వముగాని బుద్ధిగల వారున్న దున్నట్లు గుర్తెంబుగరు. శాస్త్రి జ్ఞానము లేని వారు, అంతట యుక్తుల జూపు చుందురు. శాస్త్రముల యందు దోషా రోపణ జేయు వారు శాస్త్రముల దొంగ లింతురు. విద్యలయొక్క తెలిసిన యర్థమును బాగు లేదందురు.

భారతీయులకు ధర్మ గ్రంథ మగు
శ్రీ మన్మహా భారతము నందలి మోక్ష ధర్మ బోధక మగు
శ్రీమద్భగవ ద్గీతల యందు
దైవా సుర సంప ద్విభాగ యోగ మను షోడశాధ్యాయము.

శ్రీమద్భాగ్య నగర స్థిత
శ్రీ మ దు ద్భ టా రా ధ్య వం శ సం భ వ
భారద్వాజసగోత్ర - వైద్యకళావిశారద -
ముదిగొండ మల్ల నారాధ్య పుత్ర
ముదిగొండ బుచ్చయ్య లింగా రాధ్యై
శ్రీ మద్భగవ ద్గీతా
మహా భారత ప్రమాణ వచనైః
ప్రకటితా.

శ్రీ శివాభ్యాంనమః

# శ్రీ కుమారగీత.

## శ్రద్ధాత్రయవిభాగయోగము.

### సప్తదశాధ్యాయము.

అర్జున ఉవాచ.

యే శాస్త్రవిధి ముత్సృజ్య యజంతే శ్రద్ధయా న్వితాః
తేషాం నిష్ఠా తు కా కృష్ణ సత్త్వ మాహో రజ స్తమః ॥ ౧

అర్జును డడుగుచున్నాడు:— ఓ కృష్ణా! శ్రద్ధతో గూడిన వాడైనను శాస్త్రము నందలి విధిని వదలి యజనము చేయువాని యొక్క నిష్ఠ (అనగా: మనస్సుయొక్క స్థితి) యెట్టిదని తెలిసికొన వలయును? సాత్త్వికమైనదా? రాజసమైనదా? తామసమైనదా? ౧

శ్రీ భగవా నువాచ.

త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు ॥ ౨
సత్త్వా నురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత
శ్రద్ధామయో యం పురుషో యో యచ్ఛ్రద్ధ స్స ఏవ సః ॥ ౩
యజంతే సాత్త్వికా దేవా న్యక్ష రక్షాంసి రాజసాః
ప్రేతా న్భూతగణాం శ్చా న్యే యజంతే తామసా జనాః ॥

భగవంతుడు చెప్పుచున్నాడు:— సమస్త జీవులయొక్కయు నీ శ్రద్ధ స్వభావమును బట్టి సాత్త్వికమనియు, రాజసమనియు, తామసమనియు మూడు విధములు. అది యెట్లో వినుము. ౨

ఓ భారతా! అందఱును శ్రద్ధ వారి వారి పూర్వజన్మసంస్కార

మతో గూడిన యంతఃకరణము ననుసరించి కలుగును మనుష్యుడు శ్రద్ధామయుడై యున్నాడు. ఎవనికి దేనియందు శ్రద్ధ యుండునో యటులే వాడగును. ౩ సాత్వికములు (సత్వగుణ ప్రధానములయిన) స్వభావము గలిగిన వారు దేవతలను యజించుచున్నారు. రాజసులు యక్ష రాక్షసుల నుపాసించుచున్నారు. మిగిలిన వారు (అనగా: తామసులు) ప్రేతలను, భూత గణము లను యజించుచున్నారు. ౪

తులాధారః। అత్రగాథా బ్రహ్మగీతాః కీర్తయంతి పురావిదః
శుచేరశ్రద్ధధానస్య శ్రద్ధధానస్య చాశుచేః ॥ శా. ౨౬౪-౩౧

ఈ విషయమై పెద్దలగు వారు బ్రహ్మగీతలను గాథలను గానము జేయుచున్నారు. శుచియై శ్రద్ధ లేనట్టియు, అశుచియై శ్రద్ధ గలట్టియు యీ యిరువురి యొక్క హోమద్రవ్యములను సమముగా గ్రహించుచున్నాను. శ్రద్ధయు, సత్వ రజ స్తమములతో గూడి యుండును. ఏ శ్రద్ధతో గూడిన నట్టి శ్రద్ధ గలవాడగును.

శ్రద్ధావాన్నృద్ధిధానశ్చ ధర్మశ్చైవ హి జాజలే
స్వవర్త్మని స్థితశ్చైవ గరీయా నితి జాజలే ॥ "

మహాప్రాజ్ఞా! శ్రద్ధను బొందుము. దానివలన నీవు పరమును బొందుదువు. శ్రద్ధ గల వాడు, శ్రద్ధతో మెలగువాడును, ధర్మాత్ము డగును; శ్రద్ధావంతుడు గొప్పవాడగును.

ఈ యధ్యాయమున తులాధారుడు జాజలికి శ్రద్ధా విధానమంతయు జెప్పియున్నాడు.

కిం తస్య తపసా కార్యం కిం వృత్తేన కిమాత్మనా
శ్రద్ధామయోయం పురుషో యో యచ్ఛ్రద్ధస్స ఏవ సః ॥

శా. ౨౬౩-౧౭. శ్రద్ధామయుడగు పురుషునకు తపస్సు మొదలగు వాట్టితో నవసరముండదు.

అశాస్త్ర విహితం ఘోరం తప్యం తే యే తపో జనాః
దంభాహంకార సంయుక్తాః కామ రాగ బలాన్వితాః॥ ౫
కర్షయంత శ్శరీరస్థం తాన్ విద్ధ్యాసుర నిశ్చయాన్
మాం చైవాంత శ్శరీరస్థం తాన్ విద్ధ్యాసుర నిశ్చయాన్॥ ౬

(కాని) ఎవరు దంభాహంకారములతో గూడిన వారయి కామము యొక్కయు నాసక్తి యొక్కయు బలముచే శాస్త్ర విరుద్ధ మయిన ఘోర తపస్సును జేయుచున్నారో వారవివేకులైన యాసుర బుద్ధి గల వారని యెఱుంగుము. ౫

మఱియు నెవరు శరీర మందున్న పంచమహా భూతములు మొదలగు వాని సముదాయమునే గాక శరీరములో నుండు నన్ను నైతము కష్ట పెట్టు చున్నారో వారవివేకు లయిన యాసుర బుద్ధి గల వారని యెఱుంగుము. ౬

కర్ణః స్వావిష్టచిత్తాత్మా నరకస్యాం తరాత్మనా
సంశప్తకా శ్చ యే వీరా రాక్షసా విష్ట చేతసః
భీష్మ ద్రోణ కృపాద్యా శ్చ దానవా క్రాంతచేతసః
న తథా పాండుపుత్రాణాం స్నేహవంతో విశాంపతే॥

అర. ౭౫౧. రాక్షసావిష్ట చిత్తులు గావుననే దుర్యోధనుని యందువలె పాండుపుత్రులయందు స్నేహము జూపరైరి.

ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః
యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేద మిమం శృణు॥ ౭
ఆయు స్సత్త్వ బలారోగ్య సుఖ ప్రీతి వివర్ధనాః
రస్యా స్స్నిగ్ధా స్థిరా హృద్యా ఆహారా స్సాత్త్విక ప్రియాః॥
కట్వామ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణ రూక్ష విదాహినః
ఆహారా రాజస స్యేష్టా దుఃఖ శోకామయ ప్రదాః॥ ౯

యాత యామం గత రసం పూతి పర్యుషితం చ యత్
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామస ప్రియమ్॥ ౧౦

ప్రతి మనుజునకును నిష్టమగు నాహారము నైతము మూడు విధములుగ నున్నది అట్లే యజ్ఞమును, తపస్సును, దానమును మూడు విధములు. వాని భేదమును జెప్పు చున్నాను వినుము. ౭

సాత్త్వికపురుషునకు రుచించు నాహారమాయుష్యమును సాత్త్విక వృత్తిని, బలమును, నారోగ్యమును, సుఖమును, ప్రీతిని వృద్ధి పొందించును. మఱియు రసయుక్తమును స్నిగ్ధమును నై శరీరమందు ప్రవేశించి చిరకాలముండు నదియు మనస్సునకు నానందదాయకమును నగును. ౮

రాజస పురుషులకు నిష్టమగు నాహారము కారముగను, పులుపుగను, నుప్పగను మిక్కిలి వేడియైనదిగను, నుడుకునదిగను రూక్షమైనదిగను, దాహమును జేయునదిగను, దుఃఖమును, శోకమును, రోగమును పుట్టించు నదిగను నుండును. ౯

తామస పురుషులకు నిష్టమగు నాహారము, చాల సేపటి క్రింద వండ బడినదిగను, రసశూన్యమైనదిగను, దుర్గంధము గలదిగను చద్దిదిగను నుచ్ఛిష్టమైనదిగ నపవిత్రమైనదిగ నుండును. ౧౦

నారదః. అమృతం బ్రాహ్మణోచ్ఛిష్టం జనన్యా హృదయం కృతం
తజ్జనాః పర్యుపాసంతే సత్యం సంత స్సమాసతే ॥శా. ౯౯౩.

బ్రాహ్మణులు భుజించిన పిదప మిగిలిన శేషాన్నమును భుజించువారిని మిక్కిలి గౌరవింతురు అట్టి శిష్టాన్నము తల్లి పాలతో సమానమయినది.

అఫలాకాంక్షిభి ర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే
యష్టవ్య మేవేతి మనః సమాధాయ స సాత్త్వికః॥ ౧౧

: అభిసంధాయ తు ఫలం దంభార్థ మపి చైవ యత్
: ఇజ్యతే భరత శ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్॥ ౧౨
: విధి హీన మసృష్టాన్నం మంత్ర హీన మదక్షిణమ్
: శ్రద్ధా విరహితం యజ్ఞం తామసం పరిచక్షతే॥ ౧౩

ఫలాశను జెందక యజ్ఞమును జేయుట, తన కర్తవ్యమని యెన్ను కొని శాస్త్రి విధి ప్రమాణముగ శాంత చిత్తముతో జేయ బడు యజ్ఞము సాత్వికము. ౧౧

ఓ భరత శ్రేష్ఠా! ఫలమును గోరి గాని, దంభార్థమై గాని అనగా: నైశ్వర్యమును జూపుటకై చేయ బడు యజ్ఞము రాజసమని యెఱుంగుము. ౧౨

శాస్త్రి విధిని వదలి యన్న దానమును, మంత్రములును దక్షిణలును, శ్రద్ధయు లేకుండ గాచేయ బడిన యజ్ఞము తామసమని చెప్పు చున్నారు. ౧౩

విదురః. ఇజ్యా ధ్యయన దానాని నయ స్సత్యం క్షమా ఘృణా
అలోభ ఇతి మార్గో యం ధర్మస్యా ష్టవిధ స్స్మృతః
తత్ర పూర్వ శ్చతు ర్వర్గో దంభార్థ మపి సేవ్యతే
ఉత్తర శ్చ చతుర్వర్గో నా మహాత్మసు తిష్ఠతి ॥ఉద్యో. ౩౪.

యజ్ఞము, అధ్యయనము, దానము, నీతి, సత్యము, శాంతి, దయ, లోభము లేకుండుట యను నెనిమిది ధర్మ మార్గములు. మొదటి నాలుగును డంబము కొఱకయినను జేయవచ్చు. తరువాతినగు సత్యాదులు నాలుగు మహాత్ములు గానివారియందుండ నేరవు. డంబముకొఱకు జేయబడినవి రాజసములుగా బరిణామ మొందును. తామస మంతయు వ్యర్థమని వేరుగా చెప్ప నవసరము లేదు.

శంకమానాః ఫలం యజ్ఞే యే యజేరన్ కథంచన
జాయంతే సాధవో ధూర్తా లుబ్ధా విత్త ప్రయోజనాః॥

స స్మ పాపకృతాం లోకాం గచ్ఛే దశుభకర్మణా ॥

శా. ౨౬౩-౧౪. యజ్ఞ ఫలము కలదో లేదో యని శంకించుచు నెట్లో దానిని జేయునట్టి వారు మరుసటి జన్మము నందసాధువులును, ధనమే ప్రధానముగా గల లోభులునై బుట్టు దురు. మఱియు నిట్టి యశుభకర్మచే పాపలోకము బొందుదురు.

: దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచ మార్జవమ్
: బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే ॥ ౧౪

దేవతల యొక్కయు, బ్రాహ్మణుల యొక్కయు, విద్వాంసుల యొక్కయు పూజనమును, శుచిత్వమును, సరళత, బ్రహ్మచర్యము, అహింస యనునవి శారీర తపస్సులు (అనగా: కాయిక తపస్సు) అని చెప్పుచున్నారు. ౧౪

ఉభౌ హి మాతా పితరౌ జన్మన్యేవో పయుజ్యతః
శరీర మేవ సృజతః పితా మాతా చ భారత
అచార్య శిష్టా యా జాతి స్సా దివ్యా సా జరామరా ॥ ”

జన్మకు కారణులు తలిదండ్రులు. ఆచార్యుని వలన శిక్ష బొందిన వారు జరా మరణములు లేనివారగుదురు.

“మాతృతః పితృత శ్చైవ తస్మా త్పూజ్యతమో గురుః ”

తలిదండ్రుల కన్నను గురు వత్యంత పూజనీయుడు. తలిదండ్రులను గురువును ద్వేషించువాడు పాపము లను పొందును.

శ్రీకృష్ణుడు బ్రాహ్మణ పూజను స్వయముగ (ధర్మరాజు గారి రాజసూయమున) నాచరించి లోకమున బ్రకటించి నాడు. ఇదిగాక మార్కండేయ పురాణమునందును యప్రతిమ మగు బ్రాహ్మణ భక్తిని నెఱపి యున్నాడు. ఈ బ్రాహ్మణమాహాత్మ్య మానుశాస నిక మందు జాల విస్తారముగా గలదు.

ప్రాణాతి పాత స్తైన్యంచ పరదారాభిమర్శనం
త్రీణి పాపాని కాయేన సర్వతః పరివర్జయేత్ ॥ శా. ౧౩.

లోకయాత్రాధ్యాయము. బలవన్మరణము, దొంగతనము, పర దార యను నీ మూడింటిని యన్నివిధముల విడువవలయును.

ప్రాణాతిపాతా ద్విరతా శ్శీలవంతో దయాన్వితాః
మాతృవ త్స్వస్రువ చ్చైవ నిత్యం దుహితృవ చ్చ యే
పరదారేషు వర్తంతే తే నరా స్స్వర్గ గామినః
స్తైనా న్నివృత్తా స్సతతం సంతుష్టా స్స్వధనేన చ
స్వభాగ్యా దుపజీవంతి తే నరా స్స్వర్గ గామినః
పరదారేషు యే నిత్యం చారిత్రా వృత లోచనాః
యతేంద్రియా శ్శీలపరా స్తే నరా స్స్వర్గగామినః ॥అను.౧౪౪

బలవన్మరణమును మానుకొనిన వారును, శీల వంతులును, నియమవంతులును, పరదారల దన యప్ప చెల్లెండ్ర వలె జూచు వారును, దొంగతనము చేయక స్వీయ ధనముతో కాలము గడపు వారును, పరదారల సచ్చరిత్రతో గనువారును, నియమింప బడిన యింద్రియములు గలవారును స్వర్గమును బొందెద రని యుమా మహేశ్వర సంవాదమున గలదు. ఇదే శారీరమగు తపస్సు.

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్
స్వాధ్యాయాభ్యాసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే ॥ ౧౫

(మనస్సునకు) నుద్వేగము నియ్యనదియు, సత్యమును ప్రియమును, హితకరమును నయిన భాషణమును, స్వాధ్యాయమును (అనగా: స్వకర్మ యొక్క యభ్యాసమును (వాచికమైన తపస్సని చెప్పుచున్నారు. ౧౫

అసత్ప్రలాపం పారుష్యం పైశున్య మనృతం తథా
చత్వారి వాచా రాజేంద్ర న జల్పే న్నా నుచింతయేత్ ॥

తా. బూతులు, కఠినములు, చాడీలు, అసత్యములు, నను నీ నాలుగింటిని వాక్కుచే నుచ్చరింపరాదు. హృదయమున జింతింపను రాదు.

అస్మహేతోః పరార్థం వా నర్మ హాస్యాశ్రయా త్తథా
యే మృషా న వదంతీహ తే నరా స్స్వర్గగామినః॥ అను. ౧౪౪

తనకొఱకు గాని ఇతరుల కొఱకుగాని పరియాచకముగా గాని యెవరసత్యము బలుకరో వారు స్వర్గము నొందుదురు.

"సాంత్వం వదంతి క్రుద్ధా హి తే నరా స్స్వర్గగామినః"

ఎవరు కోపము గలిగినను సౌమ్యముగ మాటాడుచుండెదరో వారు స్వర్గగాము లగుదురు.

"ఏష వాణీకృతో దేవి ధర్మ స్సేవ్య స్సదా నరైః"

ఓ దేవీ ఇట్టి వాగ్ధర్మముల నరు లవశ్య మాచరింప వలయునని మహేశ్వరుడు జెప్పెను. ఇదియే వాఙ్మయ తపస్సు.

: మనః ప్రసాద సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః
: భావ సంశుద్ధి రిత్యేత త్తపో మానస ముచ్యతే॥ ౧౬

మనస్సును ప్రసన్నముగ నుంచుట, సౌమ్యత, మౌనము, (అనగా: మునివలె ప్రవర్తించుట) మనోనిగ్రహము, శుద్ధ భావన అనునవి మానస తపస్సులని చెప్పుచున్నారు. ౧౬.

అనభిధ్యా పరస్వేషు పరసత్త్వేషు సౌహృదం
కర్మణాం ఫల మస్తీతి త్రివిధం మనసా చరేత్॥ శా.

పరద్రవ్యమునందనపేక్షయు, అన్ని జంతువులయందును సుహృద్భావమును, ప్రతి కర్మకును ఫలము గలదని తెలియుటయు మనస్సుచే నాచరింప దగినవి

మహేశ్వరః. మానసేనేహ ధర్మేణ సంయుక్తాః పురుషా స్సదా
స్వర్గం గచ్ఛంతి కల్యాణి తన్మే కీర్తయత శ్శృణు
అరణ్యే విజనే న్యస్తం పరస్వం దృశ్యతే యదా
మనసాపి న హింసంతి తే నరా స్స్వర్గగామినః
గ్రామే గృహే వా యద్ద్రవ్యం పారక్యం విజనే స్థితం
నాభినందతి వై నిత్యం తే నరా స్స్వర్గగామినః

అవైరా యే త్వనాయాసా మైత్రీ చిత్తగతా స్సదా
సర్వభూతదయావంత స్తే నరా స్స్వర్గ గామినః
శుభైః కర్మ ఫలై ర్దేవి మయై తే పరికీర్తితాః
స్వర్గ మార్గ పరా భూయః కిం శ్రోతుం త్వ మిహేచ్ఛసి॥

అను. ౧౪౪. పరద్రవ్యమును మనస్సుచే నైనను కోరని వారును, వైరములు లేక సర్వమును జూచువారును, శుభకర్మల నాలోచించు వారును స్వర్గ గాములగుదురు. ఇది మానసతపస్సు.

మానసం సర్వభూతేషు వర్తతే వై శుభాశుభం
అశుభేభ్య స్సదా క్షిప్య శుభే ష్వేవా వతారయేత్ ॥

శా. ౩౯- ౧౯. సర్వ భూతములకు మనస్సు శుభా శుభాత్మకమగుట సహజము. అట్టి మనస్సును యశుభముల నుండి మరలించి శుభముల యందుంచ వలయును.

ఆత్మనా నర్థయుక్తేన పాపేన విశతే మనః
స్వకర్మ కలుషం కృత్వా కృచ్ఛ్రే లోకే విధీయతే ॥

శా. ౧౭౧. అనర్థముగూడిన యాత్మచే మనస్సు పాపమందు ప్రవేశించి స్వకర్మలజెరిచి పురుషుని పాపలోకముల కంపించును.

భృగుః. మానసం సర్వభూతానాం ధర్మ మాహు ర్మనీషిణః
తస్మా త్సర్వేషు భూతేషు మనసా శివ మాచరేత్ ॥

శా. ౧౯౩. సర్వభూతములకును మనస్సే ధర్మమని యుండుటచే నెల్లరు నెల్ల భూతముల యందును మనస్సు చేతనే కల్యాణము నాశింపు చుండ వలయును.

అగాధే విమలే శుద్ధే సత్యతోయే ధృతి హ్రదే
స్నాతవ్యం మానసే తీర్థే సత్య మాలంబ్య శాశ్వతమ్ ॥

ధైర్య మను మడువున, మలినము లేనట్టియు స్వచ్ఛ మయి నట్టియు సత్య జలములలో సత్యాశ్రయుడయి స్నానము చేయ వలయును. ఇదియే మనస్సునకు నిర్మల మగు తపస్సు.

శ్రద్ధయా పరయా తప్తం తప స్త త్త్రివిధం నరైః
అఫలాకాంక్షిభి ర్యుక్తై స్సాత్త్వికం పరిచక్షతే॥ ౧౭

సత్కార మాన పూజార్థం తపో దంభేన చైవ యత్
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చల మధ్రువమ్॥ ౧౮
మూఢగ్రాహేణా త్మనో య త్పీడయా క్రియతే తపః
పరస్యో త్సాదనార్థం వా త త్తామస ముదాహృతమ్॥ ౧౯

ఈ త్రివిధ మయిన తపస్సును, ఫలాశనువదలి యధికమగు శ్రద్ధ తోడను, యోగ యుక్త మగు బుద్ధి తోడను, మనుజునిచే జేయబడినచో నది సాత్త్విక మని జెప్ప బడుచున్నది. ౧౭ తనకు సత్కారము, మానము, లేక పూజ కావలయునని గాని, దంభ ముతోడను గాని చేయబడిన తపస్సును చలమయిన (అస్థిరమగు) తపస్సును నిచ్చో (యనగా: శాస్త్రీయమన) రాజసమని చెప్ప బడినది. ౧౮ వెఱ్ఱి పట్టుదలచే తన్ను పీడించు నదియు లేక (జారణ మారణాది కర్మలచే) లోకులను పీడించుటకై చేయ బడునదియు నగు తపస్సు తామస మనుచున్నారు. ౧౯

యద్దు రాపం దురామ్నా యం దురాధర్షం దురన్వయం
త త్సర్వం తపసా సాధ్యం తపో హి దురతిక్రమమ్॥
సురాపో బ్రహ్మహా స్తేయీ భ్రూణహా గురుతల్పగః
తపసై వ సుతప్తేన ముచ్యతే కిల్బిషా త్తతః॥ అశ్వ. ౫౧

పొంద శక్యము గాని విన్నియు తపస్సు వలననే సాధ్యము అగును తపస్సు దాట శక్యము గానిది. తపస్సువలన సురా పానాది పాపములన్నియు నశించును.

దాతవ్య మితి యద్దానం దీయతే నుపకారిణే
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్॥ ౨౦
యత్తు ప్రత్యుపకారార్థం ఫల ముద్దిశ్య వా పునః
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్॥ ౨౧

: అదేశ కాలే యద్దాన మపాత్రేభ్య శ్చ దీయతే
: అసత్కృత మవజ్ఞాతం త త్తామస ముదాహృతమ్ ॥ ౨౨

దానము చేయుట తనకు కర్తవ్య మను బుద్ధితో యోగ్య మగు స్థలమును, కాలమును, పాత్రమును విచారించి ప్రత్యుప కారమును కోరక చేయు దానము సాత్త్విక మని చెప్ప బడినది. ౨౦ కాని (చేయబడిన) యుపకారము నకు బదులుగ గాని, లేక ముందేవో యొక యాశ నుంచుకొని గాని తప్పించుకొనలేక చేయబడు దానము రాజస మని చెప్ప బడినది. ౨౧ అయోగ్య స్థలము నందును, నకాలమునందును, నపాత్రయందును, సత్కా రరహితముగ గాని, లేక యప మాన పూర్వక ముగ గాని చేయు బడు దానము తామస మని చెప్పుచున్నారు. ౨౨

దాతవ్య మి త్యయం ధర్మ ఉక్తో భూతహితే రతైః
తం మన్యతే ధనయుతాః కృపణై స్సంప్రవర్తితమ్ ॥

శా. ౨౫౯. సర్వ భూతముల యందనుగ్రహముగలవారు దానమివ్వదగు నని జెప్పెదరు. • ధనము గల వా రట్టి ధర్మమును కృపణులు గల్పించిరని మొఱలిడుదురు.

దాన ధర్మమును గురించి యనుశాసనిక పర్వమునందనేక విధములుగా జెప్ప బడినది.

: ఓం త త్స దితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధ స్స్మృతః
: బ్రాహ్మణా స్తేన వేదా శ్చ యజ్ఞా శ్చ విహితాః పురా ॥ ౨౩

పరమాత్మ "ఓం త త్సత్" అని మూడు విధములుగ (శాస్త్రి ములయందు) నిర్దేశము చేత (నే) పూర్వము నందు బ్రాహ్మణులును, వేదములును, యజ్ఞములును నిర్మింప బడినవి.

---

[సర్వ సృష్టి యొక్కయు ప్రారంభమునందు బ్రహ్మ దేవు డను మొదటి బ్రాహ్మణుడును, వేదము లును, యజ్ఞము లును బుట్టిన వని పూర్వమునందె (గీ. 3. ౧౦.) చెప్పబడినది. కాని

తస్మా దో మిత్యు దాహృత్య యజ్ఞ దాన తపః క్రియాః
ప్రవర్తంతే విధానోక్తా స్సతతం బ్రహ్మవాదినామ్॥ ౨౪

"తస్మాత్" అనగా: ఈ సంకల్పము నందుండి జగత్తు ప్రారంభింప బడినది గాన బ్రహ్మ వాదుల యొక్క యజ్ఞములును, దానములును, తపస్సులును, నితరములగు శాస్త్రోక్త కర్మలను నెప్పుడును ఓం అని యుచ్చరించి యాచరింపబడుచున్నవి.

అదా వేవ హి తచ్ఛాస్త్రి మోంకార స్వర పూజితం
ఋషిభి శ్చారిచితం త్రత యత్ర కారుణికో హ్యసౌ॥

శా. ౩౩౫- ౩౭. ఇట్లే ఓంకార స్వర ముచే బూజిత మయిన యా శాస్త్రిమును వచించిరి.

త దిత్య నభిసంధాయ ఫలం యజ్ఞ తపః క్రియాః
దాన క్రియా శ్చ వివిధాః క్రియంతే మోక్షకాంక్షిభిః॥ ౨౫
సద్భావే సాధుభావే చ సది త్యేత త్ప్రయుజ్యతే
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే॥ ౨౬
యజ్ఞే తపసి దానే చ స్థితి స్సదితి చోచ్యతే
కర్మ చైవ తదర్థీయం స దిత్యేవాభిధీయతే॥ ౨౭

"తత్" అనుశబ్దముచే ఫలాశనువదలి యజ్ఞము తపస్సు

---

యిదంతయు, నే పర బ్రహ్మ యందుండి నిర్మింప బడినదో యా పరబ్రహ్మ యొక్క స్వరూపము "ఓం తత్ సత్" అను నీ మూడు శబ్దముల యందు నున్నది. కాన "ఓం తత్ సత్" అను సంకల్పము సృష్టికంతకును మూల మయి యున్నదని యీ శ్లోకమునకు భావార్థము. ఇప్పుడీ సంకల్పము నందున్న మూడు పదములను కర్మ యోగ దృష్టితో మఱి యొక విధమున నిరూపించు చున్నాడు -] ఇది తిలక్ గారి యాశయము.

దానము మొదలగు యనేక విధములగు క్రియలను, మోక్షార్థులు చేయుచున్నారు. ౨౫ అస్తిత్వమను నర్థమునను, సాధుత్వమను నర్థమునను (అనగా: మంచితనము) 'సత్' అనుశబ్దము ప్రయోగింపబడుచున్నది. మఱియు నో పార్థా! యిటులె ప్రశస్తమగు కర్మను బోధించుటకును సచ్ఛబ్దము ప్రయోగింపబడుచున్నది. ౨౬ యజ్ఞము, తపస్సు, దానము నను వాని యందలి స్థితియు (అనగా: స్థిర భావన నుంచుట యనునదియు) 'సత్' అని చెప్పబడుచున్నది. ఈ హేతువు చేతనే చేయదగిన కర్మలకును సత్ అని పేరు. ౨౭

అసతా ధర్మకామేన విశుద్ధం కర్మ దుష్కరం
సతా తు ధర్మకామేన సుకరం కర్మ దుష్కరమ్॥

శా. ౩౧౦-౯. ధర్మకాముడయ్యును నసత్పురుషుం డగు వానికి బరిశుద్ధంబగు కర్మము దుష్కరమే యగును. ధర్మకాముడగు సత్పురుషుని కన్ననో దుష్కరములగు కార్యములు గయితము సుకరములగును.

అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్
అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ॥ ౨౮

అశ్రద్ధతో జేయబడిన హోమమును, దానమును, తపస్సును వేమైన చేయబడిన దంతయు (కర్మ)ను "అసత్" అని చెప్పబడినది. ఓ పార్థా! ఆ కర్మ యీ లోకమున గాని పరలోకమున గాని లాభించునది గాదు. ౨౮

భారతీయులకు ధర్మగ్రంథమగు
శ్రీ మన్మహాభారతము నందలి మోక్షధర్మ బోధకమగు
శ్రీమద్భగవద్గీతల యందు
శ్రద్ధాత్రయ విభాగ యోగమను సప్తదశాధ్యాయము.

శ్రీ శివాభ్యాంనమః

---

# శ్రీ కుమారగీత.

---

## మోక్ష సన్న్యాస యోగము.

### అష్టాదశాధ్యాయము.

---

అర్జున ఉవాచ.

సన్న్యాసస్య మహాబాహో తత్త్వ మిచ్ఛామి వేదితుం
త్యాగస్య చ హృషీకేశ పృథక్కేశి నిషూదన ॥ ౧

అర్జును డడుగు చున్నాడు. ఓ మహాబాహువా! ఓ హృషీకేశా! యో కేశిదైత్యనిషూదనా! సన్న్యాసమునందున్న తత్త్వమును త్యాగమునందలి తత్త్వమును వేర్వేఱుగ నెఱుంగ గోరు చున్నాను.

శ్రీ భగవా నువాచ.

కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః
సర్వ కర్మ ఫల త్యాగం ప్రాహుః త్యాగం విచక్షణాః॥ ౨

శ్రీ భగవంతుడు సెప్పు చున్నాడు - కామ్యములు నాబడు కర్మల యొక్క న్యాసమును ( అనగా: వదలుటను ) బుద్ధిమంతులు సన్న్యాస మని చెప్పుచున్నారు. మఱియు సర్వ కర్మల యొక్క ఫలములను వదలుట పండితులు త్యాగమని చెప్పు చున్నారు. ౨

నా త్యక్త్వా సుఖ మాప్నోతి నా త్యక్త్వా విందతే సుఖం
నా త్యక్త్వా చా భయు శ్చైతే త్యక్త్వా సర్వం సుఖీభవ
ఇత్యేత ద్ధాస్తినపురే బ్రాహ్మణేనో పవర్ణితం
శంపాకేన పురా మహ్యం తస్మా త్త్యాగః పరో మతః ॥

శంపాక గీత. శా. ౧౭౬-౨౨.
త్యాగమును జేయక సుఖమును, పరమును, అభయమును పొంద నేరడు కావున త్యాగమువలన సుఖము బొందుము" అని శంపాకుడు బోధించెను. త్యాగము దెలియగోరువారు శంపాక గీతను జూడ గలరు.

చాతు రాశ్రమ ధర్మాశ్చ యతిధర్మాశ్చ పాండవ
లోక వేదోత్తరా శ్చైవ క్షాత్రధర్మే సమాహితాః ॥ భీష్మః

శా. ౬४. ధర్మనందనా! క్షత్రియ ధర్మమునందు నాలు గాశ్రమ ధర్మములు, మఱియు యతి (సన్యాస) ధర్మములు వేద ధర్మములును గలవు. క్షత్రియుడు లోకరక్షణమునకయి-

"విద్యా ద్రాజా సర్వ భూతా నుకంపీ
దేహ త్యాగం చాహ వై ధర్మ మగ్ర్యం
త్యాగ శ్రేష్ఠం మునయో వై వదంతి
సర్వ శ్రేష్ఠం య చ్ఛరీరం త్యజేత్ "

దయగల వాడగు రాజు సర్వభూతముల హితము కొఱకు యుద్ధమున దేహ త్యాగము గావించుట యుత్తమ ధర్మమని మునులు జెప్పెదరు. గావున శరీర త్యాగ ముత్తమము.

త్యాజ్యం దోషవ దిత్యేకే కర్మ ప్రాహు ర్మనీషిణః
యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్య మితి చాపరే ॥ 3
నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ
త్యాగో హి పురుష వ్యాఘ్ర త్రివిధ స్సంప్రకీర్తితః ॥ ४
యజ్ఞ దాన తపః కర్మ న త్యాజ్యం కార్య మేవ తత్
యజ్ఞో దానం తప శ్చైవ పావనాని మనీషిణామ్ ॥ ౫
ఏతాన్య పి తు కర్మాణి సంగం త్యక్త్వా ఫలాని చ
కర్తవ్యానీ తి మే పార్థ నిశ్చితం మత ముత్తమమ్ ॥ ౬

కర్మ దోషయుక్తము గావున దానిని బొత్తిగ వదలి

జేయవలయునని యనేకులు పండితులు సెప్పుచున్నారు. మఱియు యజ్ఞము, దానము, తపస్సు, కర్మయు ననువాని సెప్పుడును వదలకూడదని మఱికొందఱు చెప్పుచున్నారు. ౩ అయిననో భరతశ్రేష్ఠా! త్యాగము విషయమై నా నిర్ణయమును వినుము. ఓ పురుషశ్రేష్ఠుడా! త్యాగము మూడువిధములని చెప్పబడినది. ౪ యజ్ఞము, దానము, తపస్సు, కర్మయు ననువానిని వదలగూడదు; వానిని (కర్మలను) జేయుచునే యుండవలయును. యజ్ఞము, దానము, తపస్సు ననునవి విద్వాంసుని సైతము పవిత్రము జేయుచుండును. అనగా: చిత్తశుద్ధిని గలుగ జేయును. ౫ కాననో పార్థా! (యజ్ఞ దానాది) కర్మలను సైత మాసక్తిని విడచి, ఫలములను త్యజించి, (యితరము లయిన నిష్కామ కర్మలనువలెనే లోకసంగ్రహార్థమై) చేయవలయును అని నాయొక్క ముఖ్యాభిప్రాయము. కావున నదియే యుత్తమ మయినది. ౬

త్యాగ ఏవ హి సర్వేషాం యుక్తానా మపి కర్మణాం
నిత్యం మిథ్యావినీతానాం క్లేశో దుఃఖవహో మతః ॥

పంచశిఖాచార్య వచనము. శా. ౨౧౯.

ముక్తికయి బూనియున్న వారి కందరికి గర్మముల త్యాగమే ముఖ్యము త్యాగము లేక ముక్తిని గోరు వారు మిక్కిలి దుఃఖ రూపము లగు క్లేశముల మాత్రమే బొందుదురు.

"బభూవ యజ్ఞో వేదేభ్యః యజ్ఞః ప్రీణాతి దేవతాః"

వేదముల వలన యజ్ఞము లయ్యెను. ఆయజ్ఞమే దేవతలను తృప్తి పొందించు చున్నది.

నష్టప్రజ్ఞో యదా తు స్యా త్తదా నా న్యం స పశ్యతి
తస్మా త్సుఖ క్షయ ప్రాప్తే పుమా నుగ్రం తప శ్చరేత్ ॥

శా. ౨౫౫. ప్రజ్ఞాహీనుడు రెండవదాని జూడ జాలడు. అందువలన సుఖక్షయ మగు డు గమగు తపము నాచరింపవలయు.

తేషాం ప్రతిష్ఠితా కీర్తిః యావత్స్థాస్యతి మేదినీ
గృహస్థైస్తు దానతపసా యైర్లోకా వై వినిర్జితాః ॥

అనుశా. ౧౩౪- ౨౮. దానము, తపస్సు జేయువారి కీర్తి భూమి యుండునంతవరకు వ్యాపించి యుండును. దాన తపంబుల వలననే లోకంబులు జయింపబడినవి.

యజ్ఞము దేవతా ప్రీతిని, తపస్సు సర్వఫలములను, దానము చిరకీర్తిని గలుగజేయును.

నాస్తి విద్యాసమం చక్షుః నాస్తి సత్యసమం తపః
నాస్తి రాగసమం దుఃఖం నాస్తి త్యాగసమం సుఖమ్ ॥
శాంతి. ౧౭౫- ౩౫.

విద్యతో సమమగు నేత్రమును, సత్యముతో సమమగు తపస్సును, రాగము (అనగా: విషయాసక్తి) తో సమమగు దుఃఖమును, త్యాగముతో సమమగు సుఖమును లేదు.

యజ్ఞ, దాన, తపస్సులు త్యాజ్యములనియు, కర్తవ్యములనియు జెప్పుట జూడగా: ధనత్యాగము వలన యజ్ఞములును, యజ్ఞముల త్యాగము వలన మోక్షమును పొందుదురని తాత్పర్యమయి యుండును; యజ్ఞ త్యాగము దేవతల కప్రీతికరము. తపస్త్యాగము సర్వహానికి మూలము. ధనత్యాగము లేక యున్నచో నిహామునందే దుర్భాగ్యుడగును. భారతము త్యాగమునే జెప్పుచున్నది. గ్రంథమామూలాగ్రముగ జదివిన వారికి గాని త్యాగధర్మము బోధపడదు.

నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే
మోహాత్తస్య పరిత్యాగ స్తామసః పరికీర్తితః ॥ ౭

దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్ ॥ ౮

కార్య మిత్యేవ యత్కర్మ నియతం క్రియతే ర్జున
సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగ స్సాత్త్వికో మతః ॥౯
న ద్వేష్ట్య కుశలం కర్మ కుశలే నానుషజ్యతే ॥
త్యాగీ సత్త్వసమావిష్టో మే ధావీ ఛిన్నసంశయః ॥ ౧౦
న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్య శేషతః
య స్తు కర్మఫలత్యాగీ స త్యాగీ త్య భిధీయతే ॥ ౧౧

(స్వ ధర్మా నుసార ముగ) నియత మగు కర్మ యొక్క సన్న్యసము (అనగా: త్యజించుట), (ఎవరికిని) యోగ్యమ యినది కాదు. మోహముచే జేయబడిన యా త్యాగము తామస మని చెప్పబడును ౭ శరీరము నకు కష్టము గలుగు నను భీతిచే (అనగా: దుఃఖ కరమగు నను తలంపుతో మాత్రమే) కర్మ ను వదలితిమేని యా త్యాగము రాజసమగుటచే త్యాగమునకు లభింపదగిన ఫల మతనికి సిద్ధింపదు. ౮ ఓ యర్జునా! సంగమువదలి నిత్య మగు కర్మను విధి గనుక చేయ వలయు నను తలంపుతో జేయుచు ఫలమును వదలినచో నా త్యాగము సాత్త్విక మనంబడును. ౯ ఒక కర్మ 'అకుశల మని' (అకల్యాణకర మని) దానిని ద్వేషింపకయు, మఱియొక కర్మ కల్యాణకరమని, లేక లాభదాయక మని దాని యందనురక్తి జెందకయు నుండు వాడే సత్త్వశీలుండగు బుద్ధిమంతుడును సంశయ రహితు డయిన త్యాగి యనియు (అనగా: సన్న్యాసి యనియు) చెప్ప వలయును. ౧౦ కారణ మేమన: దేహధారియైనవాడు కర్మను నిశ్శేషముగ త్యజించుటకు వీలు లేదు. కాన కర్మలను వదలక, కర్మ ఫలము లను మాత్రము వదలిన వాడే నిజ మగు త్యాగి, సన్న్యాసి, యని జెప్పబడును.౧౧

శాంతి. అభిమానకృతం కర్మ నియతం క్రియతే ర్జున
సంగం త్యక్త్వా ఫలం చైవ స త్యాగ స్సాత్త్వికో మతః ॥

అభిమానముతో జేయబడిన కర్మ నియమబద్ధని జేయు
చున్నది. ఆ కర్మయే ఫలాపేక్ష లేనిచో సాత్విక మనంబడు
చున్నది; అనగా: మోక్షము నిచ్చుచున్నది.

నపులః. విత్తాని ధర్మలబ్ధాని క్రతుముఖ్యేష్వ వాసృజన్
కృతాత్మా స మహారాజ స వై త్యాగీ స్మృతో నరః ॥ ౮

(శా. ౧౨.) ధర్మముచే బొందబడు ధనముల నుత్తమ
యాగములందు దానముచేయు మనుష్యుడే మనస్సును జయించిన
వాడు. "అనవేక్ష్య సుఖాదానం తథైవోర్ధ్వం ప్రతిష్ఠితః
ఆత్మత్యాగీ మహారాజ స త్యాగీ తామసః ప్రభో ॥ ౯"

మహారాజా! గృహస్థధర్మమున సుఖమును బాటింపక
నట్లే యడవియందు గొప్ప నిష్ఠను బూనినవాడయి శరీరమును
విడచువాడు తామస త్యాగి యనబడును.

"అనికేతః పరిపత న్వృక్షమూలాశ్రయో మునిః
అయాచక స్సదా యోగీ స త్యాగీ పార్థ భిక్షుకః॥ ౧౦"

ఇల్లు విడచి బిచ్చమునకయి దిరుగాడక చెట్లనీడల నాశ్ర
యించి మననము చేయువాడును, ఎప్పుడును యోగము గలవాడు
నగు యోగి సన్యాసమునకు దగిన త్యాగము గలవాడగును.

"క్రోధహర్షా వనాదృత్య పైశున్యం చ విశేషతః
విప్రో వేదా నధీతే య స్స త్యాగీ పార్థ భిక్షుకః॥ ౧౧"

కోపమును, సంతోషమును విడచి, పరదూషణము మాని,
వేదాధ్యయనము జేయు బ్రాహ్మణుడు గురుపూజకు దగిన త్యాగి
యగును. "ఆశ్రమాం స్తులయా సర్వా న్ధృతా నాహు ర్మనీషిణః
ఏకత శ్చ త్రయో రాజన్ గృహస్థాశ్రమ ఏకతః ॥ ౧౨"

రాజా! ఎఱుక గలవారన్ని యాశ్రమములను త్రాసునందు
దూచి మూడాశ్రమము లొకప్రక్కను గృహస్థాశ్రమ మొక

ప్రక్కను పోగునని జెప్పెదరు.

" సమీక్ష్య తులయా వార్థం కామం స్వర్గం చ భారత
అయం పంథా మహర్షీణా మియం లోకవిదాం గతిః ॥ ౧౭
ఇతి యః కురుతే భావం స త్యాగీ భరతర్షభ, "

కామమును, స్వర్గమును సమముగా నుండుటను జూచి లోకవృత్తము నెఱింగిన మహర్షులను నీ గృహస్థాశ్రమమే మంచి మార్గమనియు, మంచి గతి యనియు నెవడు దలంచునో వాడు త్యాగి యగును. మఱియు గృహమును విడచి యడవికేగి యొక ప్పుడేని వెనుకటి భోగముల దలంచుచో నట్టివానిని ధర్మ వేషి యనియు, మృత్యు పాశముచే నీడ్వబడు ననియు జెప్పెదరు.

ఆశను మున్నిడుకొని చేశిన కర్మవలన ఫలములేదని అనగా నుత్తమ గతి లేదని జెప్పెదరు. మఱియు ఆశను విడచి యాచ రించుచో నా కర్మయే మహాఫల వంత మగు ననియు జెప్పెదరు.

ఈ ప్రకారముగ నహుషుడు, రాజ్యము విడచి యడవికేగు దునను చున్న ధర్మరాజునకు జెప్పెను. ఈ యధ్యాయమున గృహ స్థాశ్రమ ప్రాముఖ్యత జూడదగినది.

: అనిష్ట మిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలం
: భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్న్యాసినాం క్వచిత్ ॥

ఆ త్యాగులకు మరణించిన పిదప 'అనిష్టము' ఇష్టము, మిశ్రము నను ముద్విధము లగు ఫలములు ప్రాప్తము లగును. ఫలములను సన్యసించిన వానికి ( అనగా: ఫలాశను వదలి కర్మ చేయువానికి ) నీ ఫల మెప్పుడును ప్రాప్తము కాదు. అను నవి బాధింప నేరవు. ౧౨

అనిష్టస్య హి నిర్వృత్తి రనిర్వృత్తిః ప్రియస్య చ
లక్ష్యతే యతమానానాం పురుషార్థ స్తతః కుతః ॥

అనిష్టస్యాభినిర్వృత్తి మిష్టసంవృత్తి మేవ చ
అప్రయత్నేన పశ్యామః కేషాంచి త్స్వభావతః ॥

ప్రష్ఠాదః. శా. ౨౨౨- ౧౯.

శ్రీకా! పురుషు డనువాడు కర్త యగునేని యిప్పుడా పురుషుడు తన శ్రేయస్సునకయి పూనిన కార్యము లన్నియును సిద్ధించవలెను. కాని ప్రయత్నించువానికి విషయములు సిద్ధించుటయు, సిద్ధింపక పోవుటయు; అట్లే యప్రయత్నముగ గొందఱికి యిష్ట సిద్ధియు, యనిష్ట నాశమును గలుగుచుండుటను జూచుచున్నాము. ఇది స్వభావము వలన గల్గినది గావలయును. ఈ లోకమున మనుష్యులకు సంబంధించియుండు శుభాశుభము లన్నియును కర్మల వలన బుట్టుచున్నవి. నేను కర్మల విషయమును సాకల్యముగ జెప్పెద వినుము. "కర్మ ఫల త్యాగ సుఖించును."

పంచై తాని మహాబాహో కారణాని నిబోధ మే
సాంఖ్యే కృతాంతే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్ ॥
అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధం
వివిధా చ పృథ క్చేష్టా దైవం చైవాత్ర పంచమమ్॥ ౧౪
శరీర వాఙ్మనోభి ర్య త్కర్మ ప్రారభతే నరః
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః ॥

ఓ మహాబాహూ! సర్వకర్మలును సిద్ధించుటకు సాంఖ్యుల యొక్క సిద్ధాంతమున చెప్పబడిన యైదు కారణము లను నేను చెప్పుచున్నాను వినుము. ౧౩ అధిష్ఠానము ( స్థానము ) కర్త, వెవ్వేఱగు సాధనములు, అనేక విధములుగను వెవ్వేఱుగ నుండు (కర్త యొక్క) వ్యాపారమును నటులే యైదవది దైవమును ౧౪ శరీరముచేతను, వాక్కుచేతను, మనస్సుచేతను మనుజుడు సేయనారంభించిన శాస్త్రోక్తములుగాని, యశాస్త్రీయములుగాని యగు కర్మల కన్నింటికిని నీ యైదే కారణము. ౧౫

శాంతి ( ౩౪౭- ) యందు "అధిష్ఠానం తథా కర్తా" యను ఏ గీతా శ్లోకమే గలదు.

"పంచకారణసంఖ్యాతో నిష్ఠా సర్వత్ర వై హరిః
తత్త్వం జిజ్ఞాసమానానాం హేతుభి స్సర్వతోముఖైః
తత్త్వ మేకో మహాయోగీ హరి ర్నారాయణః ప్రభుః॥"

నారాయణుడన్నిటికి నధిష్ఠానమును, కర్తయు, నానా విధమగు కరణమును నగును. పూర్వ వాసనారూపమగు స్వభావమును, గర్మములను, నదృష్టమును నెవనికి గారణమో వానికి బురుషుడు గదా కారణము. వివిధములయిన చేష్టలు నతడు. ఐదవది యగు దైవమును ( జనులు సర్వ నియంతగా జెప్పుకొనెడి యదృశ్య తత్త్వమును ) నతడె. అన్ని విధములచే తత్త్వమును దెలియ గోరువారు పైన చెప్పిన పంచకారణములను హరి యని యును, సర్వమునకు చివర పొందదగిన వాడు నతడే యనియు, ప్రభుండును, మహాయోగియనియు, హరియనబడు నారాయణుండొకడే తత్త్వము. ఈ యధ్యాయము భక్తిపూరితము.

తత్రైవం సతి కర్తార మాత్మానం కేవలం తు యః
పశ్య త్యకృతబుద్ధిత్వా న్న స పశ్యతి దుర్మతిః॥ ౧౬
యస్య నాహంకృతో భావో బుద్ధి ర్యస్య న లిప్యతే
హత్వా౽పి స ఇమాం ల్లోకా న్న హంతి న నిబధ్యతే॥౧౭

నిజమయిన స్థితి యటులుండ బుద్ధి సంస్కరింపబడినది కానందున, నేనొక్కడనే కర్తనై యున్నానని యనుకొనెడు దుర్మతి కేమియు దెలియదు. ( అని చెప్పవలయును. ) ౧౬
ఎవనికి నేను చేయుచున్నానను భావన లేదో మఱి యెవనిబుద్ధి యలిప్తమైనదో యతడు లోకములను చంపినను చంపినవాడు కాదు. మఱియు నా కర్మల వానికి బంధకములును గావు. ౧౭

ఈశ్వరో వా భవేత్కర్తా పురుషో వాపి భారత
హతో వా వర్తతే లోకే కర్మజం వా ఫలం స్మృతమ్
ఈశ్వరేణ నియుక్తో హి సాధ్వసాధు చ భారత
కురుతే పురుషః కర్మ ఫల మీశ్వరగామి తత్ ॥

వ్యాసః. శాం. ౩౨-౧౧.

ధర్మపుత్రా! కర్మమునకు ( మంచిదానికి, చెడ్డదానికి ) కర్త యీశ్వరుడా? లేక, మనుష్యుడా? ఫలము ( సుఖముగాని దుఃఖముగాని ) తనంతనే లోకమునకు గలుగుచున్నదా? మనుష్యుడీశ్వరునిచేతనియుక్తుడయ్యే కర్మము నాచరించునేని యాకర్మఫల మీశ్వరుని చెందవలయును. గాని ( గొడ్డలితో చెట్టు నఱికిన యందుకైన ఫలము గొడ్డలికి జెందనట్లు ) యొకడు జేసినకర్మముల ఫలము వాడే యనుభవించుటగాక నొకడు జేసినదాని నింకొకడు బొందజాలడనుటయె సమ్మతము కావున కర్మఫలము నొకరియం దుంచుకొనక యీశ్వరునికే యర్పించుట సమ్మతము.

జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః ॥ ౧౮
జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి ॥ ౧౯

జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాతయు నని కర్మచోదన మూడు విధములు మఱియు కరణము, కర్మ, కర్త యని కర్మసంగ్రహము మూడువిధములు. ౧౮ జ్ఞానము, కర్మ, కర్త యనునవి మూడును ( ప్రత్యేకము ) సత్వము, రజము, తమము ( అనుగుణభేదములచే ) మూడు మూడు విధములుగ నున్నవని గుణసంఖ్యాశాస్త్రము నందు ( అనగా: కాపిల సాంఖ్య శాస్త్రము నందు ) చెప్పబడినది. అవి యున్నటుల ( నీకు చెప్పుచున్నాను ) వినుము.

కరణం కర్మ కర్తా చ మోక్ష ఇత్యేవ భామిని
చత్వార ఏతే హోతారో యై రిదం జగదావృతమ్॥

అనుగీత. ౨౩. ఈ విషయమంతయు పై యధ్యాయమున యోగయజ్ఞమందు జెప్పబడినది.

యథా ఛాయా తపౌ నిత్యం సుసంబద్ధౌ నిరంతరం
తథా కర్మ చ కర్తా చ సంబద్ధా వాత్మకర్మభిః॥ అను. ౧

ఎండనీడలు యెల్లపుడు కూడియుండునటుల కర్మ, కర్త; వీరువురు నాత్మీయమగు కర్మచే గూర్చబడియుందురు.

యథా ధేనుసహస్రేషు వత్సో విందతి మాతరం
తథా పూర్వకృతం కర్మ కర్తార మనుగచ్ఛతి॥ శా. ౧౮౧

లేగ దన తల్లిని గోసహస్రములలో నున్నను యేవిధముగా గనిపెట్టి పొందగలదో యదే విధముగ పూర్వకృత కర్మ కర్తను గనిపట్టి పొందుచుండును.

సర్వభూతేషు యేనైకం భావ మవ్యయ మీక్షతే
అవిభక్తం విభక్తేషు తద్జ్ఞానం విద్ధి సాత్వికమ్॥ ౨౦
పృథక్త్వేన తు యద్జ్ఞానం నానాభావాన్ పృథగ్విధాన్
వేత్తి సర్వేషు భూతేషు తద్జ్ఞానం విద్ధి రాజసమ్॥ ౨౧
యత్తు కృత్స్నవ దేకస్మి న్కార్యే సక్త మహైతుకం
అతత్వార్థవ దల్పం చ తత్తామస ముదాహృతమ్॥ ౨౨

విభక్తమయినదియు (అనగా: వేర్వేరగు సర్వభూతముల యందును నొక్కొటిగా యైనదియు) నవిభక్తమైనదియు, నవ్యయమైనదియు నగు భావ (లేక తత్వ) మున్నదని యే జ్ఞానమునచే తెలియంగ బడునో యది సాత్విక జ్ఞాన మని యెఱుంగుము. ౨౦

సర్వభూతముల యందును వేర్వేరగు నానా భావము లని పృథక్త్వబోధను గలిగించిన జ్ఞానము రాజసమని తెలిసికొనుము.

ఇదియే సర్వస్వమని యేదో యొక విషయమునం దేకారణము లేకయును, తత్త్వార్థమునకు వ్యతిరేకముగను గలుగు నల్పజ్ఞానము తామసమని చెప్పబడుచున్నది. ౨౨

నియతం సంగరహిత మరాగద్వేషతః కృతం
అఫలప్రేప్సునా కర్మ య త్త త్సాత్త్విక ముచ్యతే ॥ ౨౩
య త్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః
క్రియతే బహుళాయాసం త ద్రాజస ముదాహృతమ్ ॥ ౨౪
అనుబంధం క్షయం హింసా మనపేక్ష్య చ పౌరుషం
మోహా దారభ్యతే కర్మ య త్త త్తామస ముచ్యతే ॥ ౨౫

ఫలప్రాప్తిని కోరని మనుష్యునిచే ప్రీతియైనను, ద్వేషమైనను మనస్సున నుంచుకొనక యాసక్తిని వదలి (స్వధర్మాను సారముగ) నాచరింపబడిన కర్మ సాత్త్వికమని చెప్పబడును. ౨౩

కాని కామమును (ఫలాశను) కోరిగాని, లేక యహంకారబుద్ధితోగాని మిక్కిలి యాయాసపడి చేసిన కర్మ రాజసమని చెప్పబడును. ౨౪

అనుబంధము (అనగా: ముందు రాబోవు శుభాశుభ ఫలమును) నాశమును, హింసను, తన సామర్థ్యమును విచారింపకయే మోహముచే నారంభింపబడిన కర్మ తామసమని చెప్పబడుచున్నది. ౨౫

ముక్తసంగో నహంవాదీ ధృత్యుత్సాహ సమన్వితః
సిద్ధ్యసిద్ధ్యో ర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే ॥ ౨౬
రాగీ కర్మఫలప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకో శుచిః
హర్ష శోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః ॥ ౨౭
అయుక్తః ప్రాకృత స్తబ్ధ శ్శఠో నైష్కృతికో లస.
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే ॥ ౨౮

అసక్తి లేని వాడును, తనదియనిగాని, తన సంబంధ మైనది యని గాని యనుకొనని వాడును, కార్యము సిద్ధించినను, లేక పోయినను (మనస్సునందు) వికారముజెందని వాడును (అయిన) ధైర్యమును పట్టుదల యును గల వాడును నై కర్మలను జేయు వాడు సాత్వికు డగు కర్త యనబడును ౨౬

విషయాసక్తుడును, లోభియు (సిద్ధించ టవలనను, సిద్ధింపక పోవుటవలనను యథాక్రమముగ) హర్షముతోడను, శోకము తోడను కూడుకొను వాడును, హింసించు వాడును, నశుచియు నగు కర్త రాజసు డన బడుచున్నాడు. ౨౭

చలచిత్తుడును, నవివేకియు, జడుడును, మాయ జేయు వాడును, నితరుల పనులను జెఱుచువాడును, సోమరియు, దుఃఖ శీలుడును, ఘంటలో జేయదగిన పనిని నెల వఱకును జేయుచుండు వాడును నగు కర్త తామసుడని చెప్పబడును. ౨౮

బుద్ధే ర్భేదం ధృతే శ్చైవ గుణత స్త్రివిధం శృణు
ప్రోచ్యమాన మశేషేణ పృథక్త్వేన ధనంజయ ॥ ౨౯
ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే
బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధి స్సా పార్థ సాత్వికీ ॥
యయా ధర్మ మధర్మం చ కార్యం చా కార్య మేవ చ
అయథావ త్ప్రజానాతి బుద్ధి స్సా పార్థ రాజసీ॥ ౩౧
అధర్మం ధర్మ మితి యా మన్యతే తమసా వృతా
సర్వార్థా న్విపరీతాం శ్చ బుద్ధి స్సా పార్థ తామసీ ॥ ౩౨

ఓ ధనంజయా! బుద్ధికిని ధృతికిని గుణముల వలన గలుగు మూడు విధము లగు భేదము లను వేర్వేఱుగను: నిశ్శేషము గను చెప్పుచున్నాను వినుము. ౨౯

ఓ పార్థా! ప్రవృత్తిని, (అనగా: నే విషయ మయి నను

చేయ నారంభించుటను ) నివృత్తిని, ( అనగా: నేవిషయమునయి నను చేయ కుండుటను ) కార్యమును ( అనగా: నేపని చేయుటకు తగినదియో దానిని ) అకార్యమును ( అనగా: నేది చేయ గూడనిదియో దానిని ) దేని వలన భయపడ వలయునో, దేని వలన భయపడ కూడదో యా సంగతులను, బంధమోక్షములు దేని వలన గలుగునో యా విషయమును తెలిసికొనిన బుద్ధి సాత్వికము.

ఓ పార్థా! యే బుద్ధి ధర్మము యొక్కయు, నధర్మము యొక్కయు, లేక కార్యము యొక్కయు, నకార్యముయొక్కయు యథార్థమును నిర్ణయింపలేదో యది రాజసము. ౩౧

ఓ పార్థా! తమస్సుచే వ్యాప్తమగుట వలన నధర్మమును ధర్మమను కొనునదియు, నన్ని విషయములను విపరీతముగా గ్రహించునదియు నగు బుద్ధి తామసము. ౩౨

: ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేంద్రియక్రియాః
: యోగేనావ్యభిచారిణ్యా ధృతి స్సా పార్థ సాత్వికీ ॥ ౩౩
: యయా తు ధర్మ కామార్థా ధృత్యా ధారయతే ర్జున
: ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతి స్సా పార్థ రాజసీ ॥ ౩౪
: యయా స్వప్నం భయం శోకం విషాదం మద మేవ చ
: న విముంచతి దుర్మేధా ధృతి స్సా పార్థ తామసీ ॥ ౩౫

ఓ పార్థా! ఏ యవ్యభిచారియగు ( అనగా: నీకడ నాకడ భ్రష్టము గాని) ధృతితో గూడిన పురుషుడు, మనస్సుయొక్కయు ప్రాణములయొక్కయు. నింద్రియముల యొక్కయు వ్యాపారమును ( కర్మ ఫల త్యాగ రూపమగు ) యోగముచే ధరించుచున్నాడో యా ధృతి సాత్వికము. ౩౩

ఓ యర్జునా! పార్థా! ఏ ధృతిచే ధర్మము, అర్థము, కామము పురుషార్థము లను ( ధర్మార్థ కామ్యముల యందలి )

ప్రసంగానుసారముగ ఫలమును గోరు పురుషుడు ధరించుచున్నా
డో యా ధృతి రాజసము. ౩౪ ఓ పార్థా! ఏ ధృతిచే మను
జుడు దుర్బుద్ధి గలవాడయి నిద్ర, భయము, శోకము, విషాదము
మదము నను వానిని వదలడో యాధృతి తామసము. ౩౫

సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ
అభ్యాసా ద్రమతే యత్ర దుఃఖాంతం చ నిగచ్ఛతి ॥ ౩౬
యత్తదగ్రే విష మివ పరిణామే మృతోపమం
తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధి ప్రసాదజమ్॥ ౩౭
విషయేంద్రియ సంయోగా ద్యత్తదగ్రే మృతోపమం
పరిణామే విష మివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥ ౩౮
యదగ్రే చానుబంధే చ సుఖం మోహన మాత్మనః
నిద్రాలస్య ప్రమాదోత్థం త త్తామస ముదాహృతమ్ ॥ ౩౯

ఓ భరతశ్రేష్ఠా! సుఖమునకును మూడు భేదముల నిప్పుడు
చెప్పుచున్నాను వినుము. అభ్యాసముచే ( అనగా: నెల్లప్పుడును
పరిచయము గలుగుటచే ) నెచ్చో రమించునో, యెచ్చో దుఃఖ
మునొందకుండునో, ౩౬ ఏది యారంభము నందు విషము వలె
నుండియు పరిణామమున నమృత తుల్యముగ నగునో, యాత్మనిష్ఠ
కలిగిన బుద్ధియొక్క ప్రసన్నత వలన గలుగు (అనగా: నాధ్యా
త్మిక మయిన ) నా సుఖము సాత్త్విక మని చెప్ప బడినది. ౩౭

ఇంద్రియముల యొక్కయు వాని విషయములయొక్కయు
కలయికవలన గలుగునదియు ( అనగా: నాధిభౌతిక మగునదియు )
మొదట నమృతమువలె నున్నను పరిణామమున విషమువలెనుండు
నదియు నగుసుఖము రాజస మని చెప్పబడినది. ౩౮

ప్రారంభమునందు పరిణామము నందు తనను మోహము
గలుగ జేయునదియు, నిద్ర, ఆలస్యము, ప్రమాదము ( అనగా:

కర్తవ్యమును మఱచుట ) యను వాని వలన గలుగు సుఖము తామస మని చెప్పబడినది. ౩౯

జ్ఞానము, కర్మ, కర్త, బుద్ధి, ధృతి, సుఖము నను నీ యాఱింటియందును సాత్విక, రాజస, తామసాది భేదములు వివరముగా జెప్పంబడినవి. లోకమంతయు నీ మూటి యందే నిండి నిబిడీకృతమయి యున్నది. విషయ మెుక్కటి యయినను సత్వ రజ స్తమో గుణముల వలన నాయా గుణములకు దగిన ఫలములను బొందు చున్నారు. శైవ మంతయు సాత్వికము. లౌకిక మంతయు రాజసము తామసము నరకదాయకము. భూలోక మంతయు రజో గుణము గలదయి యున్నది. రజోగుణముకన్న పైదియగు సత్వగుణమును బొందిన దేవలోకములు దప్ప నేరవు. రజో గుణము వలన నెన్ని జన్మల కును భూమిని విడువ జాలరు. తమోగుణము వలన అధోమార్గముల నుండి పైకి రాజాలరు ఇట్టి త్రిగుణ విచార పరుడు యెన్నటికిని సంసార చక్రమున దగులు కొననేరడు

న త దస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః
సత్వం ప్రకృతిజై ర్ముక్తం య దేభి స్స్యా త్త్రిభి ర్గుణైః॥

ఈ పృథివి యందు గాని, యాకాశము నందు గాని, దేవ లోకమునందు గాని, ప్రకృతి యొక్క యీ గుణ త్రయముచే విడువ బడిన పదార్థ మేమియు లేదు. ౪౦

బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ పరంతప
కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవై ర్గుణైః॥ ౪౧

శమో దమ స్తప శ్శౌచం క్షాంతి రార్జవ మేవ చ
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రహ్మ కర్మ స్వభావజమ్॥ ౪౨

శౌర్యం తేజో ధృతి ర్దాక్ష్యం యుద్ధే చా ప్యపలాయనం
దాన మీశ్వరభావ శ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్॥ ౪౩

కృషి గౌరక్ష్య వాణిజ్యం వైశ్యకర్మ స్వభావజం
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్ ॥ ౪౪

ఓ పరంతపా! బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రుల యొక్క కర్మలు వారియొక్క స్వభావ జన్యములైన (అనగా: ప్రకృతిసిద్ధములగు) గుణములను బట్టి వేర్వేఱుగ విభజింపబడినవి. ౪౧ శమము, దమము, తపస్సు, శుచిగ నుండుట, శాంతి, సరళత (ఆర్జవము), జ్ఞానము (అనగా: అధ్యాత్మ జ్ఞానము), విజ్ఞానము (అనగా: వివిధజ్ఞానమును), ఆస్తిక్యబుద్ధియు, ననునవి బ్రాహ్మణులయొక్క స్వభావజన్యములైన కర్మలు. ౪౨ శౌర్యము, తేజస్విత, ధైర్యము, దక్షత, యుద్ధములో వెనుదీయకుండుట, దాతృత్వము, ప్రజల నేలుట యను నవి క్షత్రియునకు స్వభావజన్యము లగు ధర్మములు. ౪౩ కృషి, గోరక్షణము (అనగా: పశుపాలనము మొదలగు వ్యాపారములు), బేరము ననునవి వైశ్యునియొక్క స్వభావ జన్యములైన కర్మలు. అటులే సేవించుట శూద్రునకు స్వభావ జన్యమగు కర్మ. ౪౪

నాలుగు వర్ణములధర్మములును పై శ్లోకములయందు వర్ణింపబడినవి. వర్ణములు, వర్ణధర్మములు నాయావర్ణములవారికి స్వాభావికములు. అట్లు గాక తక్కువ వర్ణము వారయినను, ఉత్తమ గుణములచే ఉత్తమ వర్ణమువారు బొందునట్టి సుగతి బొందుదురు. ఉత్తమ గతి నందుట కుత్తమ వర్ణమే గావలయునన్న నియమ మంత బాటింప నవసరముండదు. ఉత్తమ గుణము లున్న నెట్టి వారైన నుత్తమ గతి నందగలరు. ఇందులకు భారత మంతయు ననేక ప్రమాణముల చేతను, మఱియనేక చరిత్రలచేతను యనేకములగు యుపపత్తులను స్పష్టముగా తెలియజేయుచున్నది.

బ్రాహ్మణో వా ప్యసద్వృత్త స్సర్వ సంకర భాజనం
బ్రాహ్మణ్యం సమనుత్సృజ్య శూద్రో భవతి తాదృశః ॥

ఉమా మహేశ్వర సంవాదము. అనుశా. ౧౪౩.

సద్వృత్తిహీనుడై సంకరమునకుద్యుక్తుడగు బ్రాహ్మణుడు శూద్రతుల్యుడగును.

అనుశా. ఏవం శరీరశౌచేన తీర్థశౌచేన చాన్వితః
శుచిః సిద్ధి మవాప్నోతి ద్వివిధం శౌచ ముత్తమమ్॥ ౧౦౪.

శరీరమునకు శుచిత్వమవసరము; అంతరశుచిత్వమును యవసరమే. ఈ రెండింటి చేతనే సిద్ధి గలుగును గాన బ్రాహ్మణునికి శౌచ మత్యవసరము.

దమ స్తేజో వర్ధయతి పవిత్రం దమ ముత్తమం
విపాప్మా వృద్ధతేజా స్తు పురుషో విందతే మహత్ ॥

ఉద్యో. ౬౨-౧౧. దమ మనగా నింద్రియ నిగ్రహము. దమము తేజస్సును వృద్ధి బొందించును. దమము గలవాడు వృద్ధి బొందిన తేజస్సు గలవాడయి మహత్తును దెలిసికొనును.

క్షమా ధర్మః క్షమా యజ్ఞః క్షమా వేదాః క్షమా శ్రుతం
య ఏత దేవం జానాతి స సర్వం క్షంతు మర్హతి ॥

కాశ్యప గీతా. ధర్మ, యజ్ఞ, వేద, శాస్త్రములు క్షమ యని యెఱుంగవలయును. నీ ప్రకారముగ దెలిసికొన్న వారు సర్వమును క్షమించుటకు దగుదురు.

మహేశ్వరః. వైశ్యస్య సతతం ధర్మః పాశుపాల్యం కృషి స్తథా
అగ్నిహోత్ర పరిస్పందో దానాధ్యయన మేవ చ
వాణిజ్యం సత్పథాస్థాన మాతిథ్యం ప్రశమో దమః
విప్రాణాం స్వాగతం త్యాగో వైశ్యధర్మ స్సనాతనః ॥

అనుశా. ౧౪౧-౫౨. పశుపాలన, కృషి, అగ్నిహోత్రము, దానము, అధ్యయనము, వాణిజ్యము, సన్మార్గమందుండుట, త్యాగము నను నివి వైశ్య ధర్మములు.

స శూద్ర స్సంశిత తపా స్సత్యవాదీ జితేంద్రియః
శుశ్రూషు రతిథిం ప్రాప్త స్తప స్సంచినుతే మహత్
నిత్యం స హి శుభాచారో దేవతాతిథిపూజకః
శూద్రో ధర్మఫలై రిష్టై స్సంప్రయుజ్యేత బుద్ధిమాన్ ॥

నియమముగ తపస్సును, సత్యవచనమును, ఇంద్రియనిగ్రహమును, అతిథి సేవయు, (ఇదియు తపస్సే) నిత్యశుభవర్తనమును, దేవతాతిథి పూజయు గల బుద్ధిమంతు డగు శూద్రుడును యట్టి ధర్మములనే పొంది ధన్యుడగును.

"ధర్మ దండేన నిర్దండో ధర్మ కార్యా నుశాసకః
యంత్రితః కార్యకరణై షడ్భాగకృతలక్షణః ॥ అను శా ౧౪౭

ఆఱవ భాగమునను హక్కుగలరాజు కార్యములను చక్కగా జేయించుచు ధర్మ దండముచే ధర్మకార్యములను నడపించుచు ప్రజలను బీడింపని నాడు ధర్మరాజనబడును.

స్థితో బ్రాహ్మణ ధర్మేణ బ్రాహ్మణ్య ముపజీవతి
క్షత్రియో వా థ వైశ్యో వా బ్రహ్మభూయం స గచ్ఛతి ॥

బ్రాహ్మణ ధర్మముచే బ్రాహ్మణులు జీవింతురు. మూడు వర్ణములలో యెవరైనను శమ దమాది బ్రాహ్మణ ధర్మ ములతో గూడు కొనిన బ్రహ్మ భూతు లగుదురు.

పరాశరగీత. న చా పి శూద్రః పతతీ తి నిశ్చయో
న చా పి సంస్కార మిహా ర్హతే వా
శృతి ప్రవృత్తం న చ ధర్మ మాప్నుతే
న చా స్య ధర్మే ప్రతిషేధనం కృతమ్ ॥
వైదేహకం శూద్ర ముదాహరంతి
ద్విజా మహారాజ శ్రుతోపపన్నాః
అహం హి పశ్యామి నరేంద్ర దేవం
విశ్వస్య విష్ణుం జగతః ప్రధానమ్ ॥ శా. ౨౯౭-౨౭

శూద్రుడు అవిహితములయిన కర్మములను జేయుట వలన నెప్పుడును బతితుడు గాడు; శృతిధర్మములు వానికి జెల్ల నేరవు. త్రివర్ణ సామాన్య ధర్మముల నాచరింప వచ్చును. వేదవిదు లగు బ్రాహ్మణులు, ధార్మికు డగు శూద్రుని బ్రాహ్మణు డనియు జెప్పెదరు. మఱియు నేను విశ్వమున కంతెయు దేవుడు గను, జగత్తునకు ప్రధానుండగు విష్ణునిగా జూచు చున్నాను. తక్కువ వర్ణముల వారు కామక్రోధాదుల విడునాడ దలచి సత్పురుషుల మార్గ మవలంబింప వచ్చును. క్రియలన్నియు మంత్ర రహితము లగు నొనర్చిన దోషపూరితులు గా నేరరు.

స్వే స్వే కర్మణ్యభిరత స్సంసిద్ధిం లభతే నరః
స్వకర్మనిరత స్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు ॥ ౪౫

యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వ మిదం తతం
స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః ॥ ౪౬

తమ తమ స్వభావ జన్యము లగు గుణముల ననుసరించి ప్రాప్తములయిన కర్మల యందు నిత్యమును నభిరతుడయిన పురుషు డుత్తమ మగు సిద్ధి నొందును. స్వకర్మ యందు తత్పరు డగుటచే సిద్ధి యెట్లులభించునో వినుము. ౪౫ ఎవరి నుండి సర్వ భూతములును ప్రవర్తించెనో, మఱియు నెవరిచె నీ సర్వ జగత్తును వ్యాపింప బడినదో వారియొక్క పూజ (స్వధర్మానుసారముగ) ప్రాప్తములయిన కర్మలచే (కేవల వాక్కుచెగాని, పుష్పములచే గాదు) జేయ బడు నేని మనుజులకు దాని చేతనే సిద్ధి గలుగును.

కర్మణా మేధ్యతే పూర్వం కర్మణా చోపలభ్యతే
కర్మణా నీయతే స్వాత్మ స్వకృతేన బలీయసా
స తు దేహీ యథా దేహం త్యక్త్వాన్యం ప్రతిపద్యతే ॥

శాంతి ౨౧౦-౪౬. తనచే జేయుబడి నట్టియు, బలిష్ఠ మయినట్టియు కర్మచే సంసారమునందు దిరుగుచున్నాడు

దేహాంతమునందు మఱియొక దేహమును పొందుచున్నాడు.

"ప్రజా స్స్వమనువర్తంతే స్వై స్వైః కర్మభి రావృతాః"

ప్రజలు స్వకృత కర్మల చేతనే నడచుకొనుచుందురనియు ఇది లోక నిర్మాణ మనియు బ్రహ్మ జెప్పెను.

స్వకర్మభి స్సంసితానాం ప్రకృత్యా శంసితాత్మనాం
ఋజూనాం శమనిత్యానాం స్వేషు కర్మసు వర్తతాం
సర్వ మానంత్య మేవాసీ దితి వ శ్శాశ్వతీ శ్రుతిః॥ శా.౧౬౯.

స్వకర్మలచే నియమించబడి స్వభావముచే నిగ్రహపరులై మృదు స్వభావము గల వారలకు సర్వము నంతము లేనిదగుచున్నది.

అవేక్షస్వ యథా స్వైః స్వైః కర్మభి ర్వ్యాపృతం జగత్
తస్మాత్ కర్మైవ కర్తవ్యం నాస్తి సిద్ధి రకర్మణః॥

శా. ౧౦- ౨౮. జగత్తంతయు స్వకర్మలచే నిండినది. అందుచే కర్మ తప్పక చేయవలయును. కర్మ జేయకున్న సిద్ధి గలుగ నేరదని యుధిష్ఠిరునకు భీముడు జెప్పెను.

మహేశ్వరః కర్మభి శ్శుచిభి ర్దేవి శుద్ధాత్మా విజితేంద్రియః
శూద్రో౽పి ద్విజవ త్సేవ్య ఇతి బ్రహ్మానుశాసనం॥ అను శా.౧౪౩

శుచివంతములయిన కర్మలచే యింద్రియనిగ్రహముగలవాడు శుద్ధాత్ము డగును. ఇట్టివాడు శూద్రుడయినను ద్విజుని వలెనే సేవింపదగినవాడని బ్రహ్మానుశాసనము.

శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వభావ నియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్॥ ౪౭
సహజం కర్మ కౌంతేయ సదోషమపి న త్యజేత్
సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్ని రివావృతాః॥ ౪౮
అసక్త బుద్ధి స్సర్వత్ర జితాత్మా విగత స్పృహః
నైష్కర్మ్య సిద్ధిం పరమాం సన్న్యాసే నాధి గచ్ఛతి॥ ౪౯

పరుల యొక్క ధర్మము సుఖముగా నాచరించుటకు శక్య మైనను దాని కంటె తనధర్మమే (అనగా: చాతుర్వర్ణ్యవిహిత మగు ధర్మమే) విగుణ మైనను (అనగా: సదోష మైనను) మిక్కిలి శ్రేయస్కర మై యున్నది. తన స్వభావ సిద్ధముగ అనగా: గుణ స్వభావము ననుసరించి నిర్ణయింప బడిన చాతుర్వర్ణ్య వ్యవస్థచేత విధింప బడిన కర్మలను చేయు చున్నప్పు డేవిధమగు పాపమును నుండ నేరదు ४७ ఓ కౌంతేయా! ఏకర్మలు సహజ మైనవో (అనగా: పుట్టుక మొదలు గుణకర్మ విభాగముచేని యతములైనవో) యవి సదోషములుగా నున్నను విడల కూడదు కారణ మేమన: పొగచే నగ్నిహోత్రము వలె సర్వారంభములు (ఉద్యోగములు) నేదో యొకానొక దోషముతో గూడి యుండును. ४८

కాన దేని యందును నాసక్తిని జెందక మనస్సును స్వాధీనములో నిడికొని నిష్కామ బుద్ధితో బ్రవర్తించినచో కర్మ ఫలముల యొక్క సన్న్యాసమగును. దాన పరమ మగు నైష్కర్మ్యసిద్ధి బ్రాప్తమగును.

వ్యాసః. ఏవ మభ్యాహ తే లోకే కాలేనో పనిపీడితే
సుమహత్ ధైర్య మాలంబ్య ధర్మం సర్వాత్మనా చరు
అథేమం దర్శనో పాయం సమ్య గ్యో వేత్తి మానవః
సమ్య క్స్వధర్మం కృత్వే హ పరత్ర సుఖ మశ్నుతే ॥

శా ३.३३- ४६. ఇట్లు లోకమంతయు మృత్యువుచే గొట్టుబడియు, పీడింపబడియునుండగా నన్ని విధములచేతను మానవుడు ధైర్య మవలంబించి ధర్మ మాచరింప వలయును.

పురుషుడీ మోక్షోపాయము జక్కగా నెఱింగి స్వ ధర్మము లను జక్కగా నిర్వర్తించినచో పరలోకమున సుఖముబొందును.

మ హేశ్వరః. స్వభావం కర్మ చ శుభం యత్ర శూద్రే పి తిష్ఠతి

విశిష్టే స్తై ర్ద్విజాతి ర్వై విజ్ఞేయ ఇతి మే మతిః ॥ అను. శా.

స్వభావమగు శుభకర్మ శూద్రునియందున్నచో నట్టిమంచి కర్మలచే వాడు ద్విజాతి యనియే నా యభిప్రాయము.

వేదా నధీత్య బ్రహ్మచర్యేణ పుత్ర
పుత్రా నిచ్ఛే త్పావనార్థం పితౄణాం
అగ్నీ నాధాయ విధివ చ్చేష్టయజ్ఞో
వనం ప్రవిశ్యా థ ముని ర్బుభూషేత్ ॥

పితా పుత్ర సంవాదము. శా. ౧౭౫-౬.

శ్రేయ మేద్ది యని యడిగిన ధర్మజునికి భీష్మడిట్లు చెప్పెను " పితా పుత్ర సంవాదమున పుత్రుడు శ్రేయమును గూర్చి ప్రశ్నింపగా తండ్రి 'వేదముల జదివి, పుత్రులను బడసి, యజ్ఞములు గావించి, యంతమునందు వనమునకుఁ జని ముని గావలయు ననగా: స్వధర్మ పరాయణుడు గావలయు నిద్దియే పరమశ్రేయము ' అని చెప్పెను. గాన బ్రాహ్మణుడు స్వధర్మపరాయణు డగుటయే శ్రేయము (అనగా: ధర్మము)."

స్వధర్మ ఇతి కృత్వా తు న త్యజామి ద్విజోత్తమ
పురా కృత మితి జ్ఞాత్వా జీవా మ్యేతేన కర్మణా
స్వకర్మ త్యజతో బ్రహ్మ న్నధర్మ ఇతి దృశ్యతే
స్వకర్మ నిరతో య స్తు ధర్మ స్స ఇతి నిశ్చయః ॥

వ్యాధః. అరణ్యం. ౨౦౭.

మాంస విక్రయము గావించు వ్యాధుని, నీవిట్టి పని జేయం దగునా? యని కౌశికు డడుగ నాతడు, కౌశికునితో బ్రాహ్మణా నే జేయు మాంసవిక్రయము స్వధర్మము, పురాకృతమును యని జేయుచున్నాను. స్వకర్మ పరిత్యాగ మధర్మ మనబడును. స్వకర్మ నిరతుడే ధర్మవంతుడన బడును.

అవాప్తః క్షత్రధర్మస్తే రాజ్యం ప్రాప్తమకంటకం
రక్ష స్వం ధర్మం కౌంతేయ శ్రేయాన్ యః ప్రేత్యభారత॥
వ్యాసః శాంతి. ౩౭-౪౭

క్షత్రధర్మముచే నీవు రాజ్యము లభించినది; స్వధర్మమును రక్షించుకొనుము; దానిచే శ్రేయస్సును పొందెదవు; అని వ్యాసుడు ధర్మజునకు జెప్పెను.

“కారణాద్ధర్మ మన్విచ్ఛే న్నలోక చరితం చరేత్॥” సకారణముగా నున్నప్పుడే ధర్మము నాచరింప వలసినది; కాని లోకాచారముగ నున్నదని యనుసరింప రాదు. శాం. ౨౬౭-౫౪

సన్యస్య సర్వ కర్మాణి సన్యస్య విధివత్తపః
సన్యస్య వివిధా విద్యా సర్వం సన్యస్య చైవ హః॥
భీష్మః శాం. ౧౬౯-౩౦

సన్యాసీ జ్ఞాన సంయుక్తః ప్రాప్నోతి పరమాం గతిమ్
ఆతీతో ద్వంద్వ మభ్యేతి తమో మృత్యు జరా గతిః॥
అశ్వ. ౬౩-౨౯

సర్వ కర్మలను, తపస్సును, వివిధ విద్యలను యథా శాస్త్రముగా త్యజించి సన్యాసి యైన వాడు జ్ఞాని యగు నేని యుత్తమ గతి నొందును. అట్లు జ్ఞాని గానిచో ద్వంద్వ భూతమగు సంసారమును బొందును.

ఈ విధానమాత్మ జ్ఞానమును గురించి జెప్పిన దానిలో గృహస్థునకు జెప్పిన కట్టకడపటి ధర్మమని యెఱుగు నది.

సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథాప్నోతి నిబోధ మే
సమాసే నైవ కౌంతేయ నిష్ఠా జ్ఞానస్య యాపరా॥ ౫౦
బుద్ధ్యా విశుద్ధయా యుక్తో ధృత్యాత్మానం నియమ్య చ
శబ్దాదీన్ విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్య చ॥ ౫౧

వివిక్త సేవీ లఘ్వాశీ యత వాక్కాయ మానసః
ధ్యాన యోగపరో నిత్యం వైరాగ్యం సముపాశ్రితః॥ ౫౨
అహంకారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్
విముచ్య నిర్మమః శాంతో బ్రహ్మభూయాయ కల్పతే॥ ౫౩
బ్రహ్మ భూతః ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి
సమః సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్॥ ౫౪
భక్త్యా మామభి జానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః
తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరమ్॥ ౫౫
సర్వ కర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పదమవ్యయం॥ ౫౬

ఓ కౌంతేయా! (ఈరీతిగ) సిద్ధిలభించిన పిదప (ఆపురుషుడు) జ్ఞానముయొక్క పరమావధి యగు నిష్ఠ యయినను బ్రహ్మ మెట్లు ప్రాప్తమగునో దానిని సంక్షేపముగ నేను చెప్పుచున్నాను వినుము. ౫౦ శుద్ధబుద్ధితో గూడుకొనిన వాడై, ధైర్యముతో దన్ను సంయమించుకొని శబ్దాదికములగు నింద్రియముల విషయముల విడచి రాగ ద్వేష ములను వదలి, ౫౧ ఏకాంతమగు స్థలమునందున్న వాడై, మితాహారియై, మనో వాక్కాయము లను స్వాధీనములో నుంచుకొని, నిత్యమును ధ్యానయుక్తుడు విరక్తుడునయి, ౫౨ (అటులే యహంకారమును) బలమును, గర్వమును, కామమును, క్రోధమును, పరిగ్రహమును, ఆశాపాశమును వదలివైచి, శాంతుడును, మమత్వ రహితుడును నయిన వాడు బ్రహ్మభూతుడగుటకు సమర్థుడగు చున్నాడు. ౫౩

బ్రహ్మభూతుడగు నేని ప్రసన్న చిత్తుడయి దేనిని కోరడు. మఱియు దేనిని ద్వేషింపడు. సర్వభూతములయందు సముడై, నాయందు పరమ భక్తిని సంపాదించు కొనును. ౫౪ నే నెంత వాడనో, నే నెవడనో యని తన (నాయందు) భక్తిచే నాతడు

నిజముగా దెలిసికొనును. ఇట్లు నాయొక్క తాత్విక జ్ఞానము గలిగిన పిదప వాడు నాయందే ప్రవేశించును ౫౫ నన్నే యాశ్రయించుకొని సర్వకర్మలను నియమముగ జేయుచున్నను, నాయొక్క యనుగ్రహముచే శాశ్వతమును నవ్యయమును నగు స్థానమును పొందును. ౫౬

గీతలలో (అ. ౬.) ధ్యానయోగమున. ఈ (౧౫) అధ్యాయములోని శ్లో ౫౦, మొదలు ౫౬. వఱకును ధ్యానయోగమునే "ధ్యాన యోగ పరో నిత్య" మని జెప్పియుండుటవలన నాఱవ యధ్యాయములోని ధ్యానయోగమునకును, ఏ ౫౦, ౫౬ వ శ్లోకములకును సంబంధము గలదని యెఱిగికొని ధ్యాన యోగ పరులాఱవ యధ్యాయము ననుసరింతురు గాక.

ధ్యానయోగేన శుద్ధేన నిర్మమా నిరహంకృతాః
ఆప్నువంతి మహాత్మానో మహాంతం లోక ముత్తమమ్
ధ్యానయోగ ముపాగమ్య ప్రసన్నమతయ స్సదా
సుఖోపచయ మవ్యక్తం ప్రవిశంత్యాత్మవిత్తమాః
ధ్యానయోగా దుపాగమ్య నిర్మమా నిరహంకృతాః
అవ్యక్తం ప్రవిశంతీహ మహాంతం లోక ముత్తమమ్॥

వాసుదేవః. అనుగీత. ౫౧– ౬౩.

పరిశుద్ధమయిన ధ్యానయోగముచే నహంకారము లేనివారయిన మహాత్ములుత్తమ లోకము బొందుదురు. ధ్యాన యోగమును పొంది నిర్మల మతులై, యాత్మ వేదులగుచు నవ్యక్తమును ప్రవేశింతురు. ధ్యాన యోగముచే సాధ్యము గానిది లేదు.

కామ బంధన మేవైకం నాన్య దస్తీహ బంధనం
కామబంధన ముక్తో హి బ్రహ్మభూయాయ కల్పతే॥

శా. ౫౧– ౭. బంధనములలో కామ బంధనమె ముఖ్యమయినది (అనగా: కోరికలను లొంగియుండుట.) ఇట్టి బంధ

నము నుండి విముక్తుడగు వాడు బ్రహ్మభూతుడగును.

వాగ్దండ కర్మ మనసాం త్రయాణాం చ నివర్తకః
సమ స్సర్వేషు భూతేషు బ్రహ్మణ మభివర్తతే ॥

శా. ౨౩౬- ౩౪. మనో వాక్కాయికము లగు దుష్ట చర్యల నుండి మరలిన వాడును, సర్వభూతములయందును సముడగు వాడును బ్రహ్మ సాన్నిధ్యము నొందుచున్నాడు

చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః
బుద్ధియోగ ముపాశ్రిత్య మచ్చిత్త స్సతతం భవ ॥ ౫౭

మనస్సుచే సర్వ కర్మలను నా కర్పించి మత్పరాయణుడవగుచు (సామ్య) బుద్ధియోగము యొక్క యాశ్రయముచే నా యందెప్పుడును చిత్తము నుంచుము. ౫౭

బుద్ధి రాత్మా మనుష్యస్య బుద్ధి రేవా త్మనా త్మని
యదా వికురుతే భావం తదా భవతి సా మనః॥ శా. ౨౪౮-౩

మనుజుని సామాన్య వ్యవహారములందు బుద్ధియే వానికాత్మ యగుచున్నది. బుద్ధి తనంతట తానే లోపల భావముల బన్నునపుడు మనస్సని బిలువ బడుచున్నది.

చిత్తస్య హి ప్రసాదేన హిత్వా కర్మ శుభాశుభం
ప్రసన్నాత్మా త్మని స్థిత్వా సుఖ మానంత్య మశ్నుతే ॥
భృగుః శా. ౧౯౪ - ౩౧.

చిత్తమునకు గలిగిన నిర్మలత్వముచే దోషముల విడచి యోగ సమాధి నొందునేని యాతడు నిద్రించుటకు బూర్వమును తరువాతను దనయాత్మ బుద్ధిచే నా యాత్మను గనుచుండును.

మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదా త్తరిష్యసి
అథ చే త్త్వ మహంకారా న్న శ్రోష్యసి వినంక్ష్యసి॥ ౫౮

నా యందు చిత్తము నుంచితి వేని నాయొక్క యనుగ్రహముచే సర్వసంకటములను (అనగా: కర్మల యొక్క శుభాశుభ

ఫలములను ) తరించెదవు. కాని యహంకారముచే నా మాట వినక పోదువేని నాశము నొందుదువు. ౫౮

కామం క్రోధం చ మృత్యుం చ పంచేంద్రియజలాం నదీం
నావం ధృతిమయీం కృత్వా జన్మదుర్గాణి సంతర ॥

శా ౩౨౨-౧౩. కామ క్రోధ మృత్యువులు, పంచేంద్రియములు నను నదిని ధృతి యను నావచె దాటి, జన్మదుర్గము ( జనన మరణము ) లను దరించుము.

ఈశ్వరం సర్వభూతానాం జగతః ప్రభు మవ్యయం
భక్త్యా నారాయణం దేవం దుర్గా ణ్యతితరంతి తే
య ఏష పద్మరక్తాక్షః పీత వాసా మహాభుజః
సుహృ ద్భ్రాతా చ మిత్రం చ సంబంధీ చ తథా చ్యుతః
య ఇమా న్సకలా ల్లోకా శ్చర్మవ త్పరివేష్టయేత్
ఇచ్ఛ న్ప్రభు రచింత్యాత్మా గోవిందః పురుషోత్తమః
స్థితః ప్రియహితే జిష్ణో స్స ఏవ పురుషోత్తమః
రాజం స్తవ చ దుర్ధర్షో వైకుంఠః పురుషర్షభః
య ఏనం సంశ్రయంతీ హ భక్త్యా నారాయణం హరిమ్
తే తరంతీ హ దుర్గాణి న చాత్రా స్తి విచారణా ॥

శా. ౧౧౦-౨౪.

ఆశ్రమముల యందాశ్రమస్థులకు జెప్పంబడిన ధర్మములన్ని యునాచరించు వారు దుర్గముల దరింతురు

మఱియు నేకన్ని విధముల సాయభూతుడయి యుండు నారాయణుని భజించు వారు దుర్గముల తరింతురని భీష్ముడు ధర్మరాజునకు బోధించెను. మానవులకు దుర్గ తరణ మనగా: బాధలనునవే కోటలు శత్రు జయమునకు కోటలు దాటుటవలెనే జనన మరణము లను నీ కోటలు దాటుట యని తెలియ దగును.

యదహంకార మాశ్రిత్య న యోత్స్య ఇతి మన్యసే
మిథ్యైష వ్యవసాయ స్తే ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి॥౫౯
స్వభావజేన కౌంతేయ నిబద్ధ స్స్వేన కర్మణా
కర్తుం నేచ్ఛసి య న్మోహా త్త త్కరిష్య స్యవశోఽపి తత్॥

నేను యుద్ధము చేయనని యహంకారమును నీవు పొందెద వేని నీయొక్క యా నిశ్చయము వ్యర్థము. ప్రకృతి (అనగా: స్వభావము) నీచే నా పనిని జేయించును. ౫౯ ఓ కౌంతేయా! స్వీయమగు స్వభావజన్యమయిన యా కర్మచేత బద్ధుడవగుటచె మోహమువలన దేనిని నీవు చేయుటకిచ్ఛగింపవో దానినే పరతంత్రుడవయి (అనగా: ప్రకృతియొక్క స్వాధీనుడవయి) నీవు చెయవలసి వచ్చును. ౬౦

కర్మజం త్విహ మన్యంతే ఫలయోగం శుభాశుభం
కర్మజం విషయం కృత్స్నమహం వక్ష్యామి తం శృణు
యథా వేదయతే కశ్చి దోదనం వాయసో వ్యర్దత
ఏవం కర్మాణి సర్వాణి స్వభావస్యైవ లక్షణం
వికారా నేవ యో వేద న వేద ప్రకృతిం పరాం
తస్య స్తంభో భవే ద్బాల్య న్నాస్తి స్తంభో నుపశ్యతః
స్వభావ భావినో భావా న్సర్వా నేవేహ నిశ్చయాత్
బుధ్యమానస్య దర్పో వా మానో వా కిం కరిష్యతి॥
ప్రహ్లాదః. శా. ౨౨౨.

ఈ లోకమునందు మనుజులకు సంబంధించిన శుభాశుభము లన్నియు కర్మల వలన బుట్టుచున్నవని నామ దోచుచున్నది. కర్మముల విషయము జెప్పెదను వినుము. కాకి తా దినునప్పుడు దానందు యితర కాకుల బిలుచునట్లు మన కర్మము లన్నియు స్వభావ లక్షణముల దెలుపుచున్నవి. ఎవడయినను స్వభావము

నను గల వికారముల దెలియునే గాని, ప్రకృతి నెఱుంగుటకు మాత్ర మసమర్థుడగుచున్నాడు. యిట్లు ప్రకృతి నెఱుంగ జాలక గర్తమునను (అనగా: నరకమున) బడుచున్నాడు. మఱియు నెవడు స్వభావమునకు గల వికారముల నెఱుంగుచున్నాడో యాతడు జడిమను దాటుచున్నాడు. సర్వ భావపదార్థములును స్వభావము వలన బుట్టుచున్నవి. ఇది నిజమని నమ్మినచో దర్పముగాని యభిమానముగాని మనుజు నేమియు చేయజాలవు ధర్మవిధులకెల్ల నిది మూలమనియు భూతము లనిత్యము లనియు నాకు దెలిసి యున్నది అని ప్రహ్లాదుడింద్రునకు బోధించెను.

శా. ౩౨౧-౪౦. సులభా జనక సంవాదము.

నేను ముక్తుడ నని జనకుడు సులభతో జెప్పగా విని యా సులభ జనకునితో నిట్లనియె. "రాజ్య భారము వహించు నీవు ముక్తుడ వగుటెట్లు సంభవించును? ఏలన' 'అవశః కార్యతే తత్ర తస్మిం స్తస్మిన్ క్షణే స్థితః' స్వతంత్రుడయినను రాజు దన యధికారులచే దన యాజ్ఞలకు దానే బద్ధుడయి యాయాయి కార్యములాచరింప చేయుచున్నాడు. మఱియు 'స్నాహ్యాలభ పిబ ప్రాశ జుహుధ్యగ్నీ న్యజేతి చ' స్నానము, పానము, నిద్ర యొకటియేమి యన్ని విధములగు భోగములందును, మాటలయందును వివశుడయి పరులచే జేయించ బడుచున్నాడు. ఇట్టిచో రాజునకు స్వాతంత్రత యెక్కడ? మోక్షమేడ?" గాన కర్మబద్ధులు స్వభావముచేతనే ధర్మము నెఱవేర్చవలయును. మోహము వలన స్వ-కర్మల నొద లుదు నన్నచో వివశుడయి తప్పక చేయవలసియే వచ్చును. కాన నో యర్జునా! నీ కర్తవ్యము నీ దేర్చుకొనుటయే ముఖ్యమని యెఱుంగు మని భగవదాశయము.

"స్వభావా త్సంప్రవర్తంతే నివర్తంతే తథైవ చ
సర్వే భావా స్తథా భావాః పురుషార్థో న విద్యతే"

సర్వమునకు స్వభావమే కారణము గావున పురుషార్థము లేదని తెలియుము.

అను శా. ౧. గౌతమీ లుబ్ధక వ్యాళ మృత్యు కాలసంవాదము.

యదనేన కృతం కర్మ తేనాయం నిధనం గతః
వినాశహేతుః కర్మాస్య సర్వే కర్మవశా వయం
కర్మదాయాదవాన్ లోకః కర్మసంబంధలక్షణః
కర్మాణి చోదయంతీహ యథాన్యోన్యం తథా వయం ॥

బ్రాహ్మణ చిన్నవాని నొక పాము కఱచి చంపెను. ఒక యెఱుకవాఁడా పామును కట్టెను గట్టి తెచ్చి దీనిం జంపుదు ననగా నబ్బాలుని తల్లియగు గౌతమి 'ఎవని పురాకృతము వానిని వెంబడించు చుండును. కాన పామును చంపవలదు.' అని యనెను. ఈ వివాదమునందు కాలుఁడిట్లు చెప్పెను 'లుబ్ధకా! ఎవని కర్మచే వాఁడు వశుఁడగును. వీని కర్మయే వీని నాశమునకు హేతువు. లోకమంతయు కర్మతో సంబంధము గలది. కావున, వీని మృతికి, కాలుఁడనగు నేను, మృత్యువు, సర్పము కారణములు గానేరము. మాయందు దోషము లేదు.' అని చెప్పగా విని లుబ్ధకుడు పామును విడచి పెట్టెను. ధర్మనందనా! నేనందఱ జంపితినని పరితపించితివి నీవు గాని, దుర్యోధనుడు గాని, కారణు లెట్లగుదురు వారి వారి స్వకర్మలే వారి వారి శుభాశుభములకు గారణము లని భీష్ముడు ధర్మరాజునకు జెప్పెను.

ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేऽర్జున తిష్ఠతి
భ్రామయన్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ॥ ౬౧
తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత
తత్ప్రసాదాత్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతం ॥
ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా
విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథా కురు ॥ ౬౩

ఓ యర్జునా! ఈశ్వరుడు సర్వభూతముల యొక్క హృదయమునందు నుండి యంత్రము మీద నెక్కించినటుల సర్వ భూతములను (తన మాయచే) త్రిప్పుచున్నాడు. ౬౧ కాన నో భారతా! సర్వ భావముల చేతను నాతనినే శరణు నొందుము. అతని యనుగ్రహముచే పరమ మగు శాంతి, నిత్యమైన స్థానమును ప్రాప్తమగును ౬౨ ఈ రీతిగ గుహ్యము లలో గుహ్య మగు జ్ఞానము నాచే జెప్పబడినది. దీనిని పూర్ణముగ విచారించి నీయిచ్చ వచ్చి నటుల జేయుము. ౬౩

ఈశ్వరుడు సర్వభూతములయొక్క హృదయముల యందు గలడని శ్రీకృష్ణుడిచట జెప్పి యున్నాడు. ఈ యర్థమును ప్రతిపాదించునట్టి విషయములే భారతమందంతటను జెప్పబడియున్నవి. అందలి కొన్ని యుదాహరణములను జూపెదు శా. ౩౪౧.

వాసుదేవః. కపర్దీ జటిలో ముండః శ్మశానగృహసేవకః
ఉగ్రవ్రతధరో రుద్రో యోగీ పరమదారుణః
దక్షక్రతుహర శ్చైవ భగనేత్రహర స్తథా
నారాయణాత్మకో జ్ఞేయః పాండవేయ యుగేయుగే
తస్మిన్ హి పూజ్యమానే వై దేవదేవే మహేశ్వరే
సంపూజితో భవే త్పార్థ దేవో నారాయణః ప్రభుః
అహ మాత్మా హి లోకానాం విశ్వేషాం పాండునందన
తస్మా దాత్మాన మేవాగ్రే రుద్రం సంపూజయా మ్యహం
యద్యహం నార్చయేయం వై ఈశానం వరదం శివం
ఆత్మానం నార్చయే త్కశ్చి దితి మే భావితాత్మనః
మయా ప్రమాణం హి కృతం లోక స్సమనువర్తతే
ప్రమాణాని హి పూజ్యాని తత స్తం పూజయామ్యహం
య స్తం వేత్తి స మాం వేత్తి యో ను తం స హి మా మను
రుద్రో నారాయణ శ్చైవ సత్వ మేకం ద్విధా కృతం

లోకే చరతి కౌంతేయ వ్యక్తస్థం సర్వకర్మసు
న హి మే కేనచి ద్వేద్యో వరః పాండవనందన
ఇతి సంచింత్య మనసా పురాణం రుద్ర మీశ్వరం
పుత్రార్థ మారాధితవా నహ మాత్మాన మాత్మనా
న హి విష్ణుః ప్రణమతి కస్మైశ్చి ద్విబుధాయ చ
ఋత ఆత్మాన మేవే తి తతో రుద్రం భజామ్యహం॥

ఓ పాండవేయా! పై య్యుగ్రవతాది నామములుగలరుద్రు ని ప్రతియుగమునందును నారాయణాత్మకుండని తెలియుము. దేవ దేవుండగు నా మహేశ్వరుడు పూజితుడు కాగా ప్రభుండగు నారాయణుండును బూజితుడగుచున్నాడు. ఓ పాండునందనా! నేను సమస్త లోకము లకు నాత్మను. కనుక రుద్రుండును నా యాత్మయే. గాన నేనతనిని బూజించుచున్నాను. వరదుండును, శివుడును నగు నీశాను నేనర్చింపక పోతి నేని నన్నెవ్వడును నర్చింపడు. నేను గావించిన ప్రమాణమును లోకమంతయు నను వర్తించు చున్నది. ప్రమాణము లెప్పుడును బూజ్యములు. కనుక నే నేనాతని బూజించు చుందును. ఎవడు రుద్రు నెఱుగునో వాడు నన్నెఱుగుచున్నాడు, నన్నెవ డెఱుగునో వాడు రుద్రు నెఱుగు చున్నాడు. ఎవడురుద్రు ననువర్తించునో వాడు నన్ననువర్తిం చుచున్నాడు. రుద్రుడు నారాయణుడు నొక్కటియే. ఒకడే రెండురూపములతో వేర్వేఱుగ గన్పట్టుచున్నాడు.

రుద్ర నారాయణు లిరువురు నొకటే లోక మందున్న యన్ని వ్యక్తుల యందును జరించుచు, వానిని బ్రవర్తింప జేయు చున్నారు. రుద్రుడుదప్ప మ రెవ్వడును నాకు వరములొసంగ సమర్థుడు గాడు. ఇట్లని నేను మనసునందు జింతించియే, తొల్లి పురాణుండగు నీశ్వరుని బుత్రుని కొఱకారాధించితిని. ఇటుల రుద్రు నారాధించుట వలన నన్ను నేనే యారాధించు కొంటిని,

విష్ణువు తన యాత్మను దప్ప మఱి యే దేవతను బ్రణామము సేయడు ఇట్టి కారణములచే రుద్రునికి నమస్కరించుచున్నాను.

హృదయం సర్వభూతానాం క్షేత్రజ్ఞ స్త్వ మృషిష్టుతః ॥

అను. ౧౪-౪౨౩. సర్వ భూతముల కు నీవు హృదయ మవు. క్షేత్రజ్ఞుడవు. ఋషులచే స్తుతింపబడు వాడవు. సర్వము నావ రించి యుండు వాడవు. " త్వం వై ప్రభా ర్చిః పురుష స్సర్వస్య హృది సంస్థితః " సర్వులయొక్క హృదయ మందుండు వాడవు. పురుషుడవు న ని మఱి యనేక విధముల జెప్పబడి నందున హృద్దేశముల యందుండు వాడీశ్వరుడనుట వలన శివు డనియె నిశ్చయము.

మయా త్వం రక్షితో యుద్ధే మహాంతం ప్రాప్తవా న్జయం
య స్తు తే సోऽగ్రతో యాతి యుద్ధే సంప్రత్యు పస్థితే
తం విద్ధి రుద్రం కౌంతేయ దేవదేవం కపర్దినం
కాల స్స ఏవ కథితః క్రోధ జేతి మయా తవ
నిహతా స్తేన వై పూర్వం హతవా నసి యాన్రిపూన్
అప్రమేయప్రభావం తం దేవదేవ ముమాపతిం
నమస్వ దేవం ప్రయతో విశ్వేశం హర మక్షయం ॥

వాసుదేవః; శా. ౩౪౨- ౧౩౬.

అర్జునా! యుద్ధమునందు నాచే రక్షింప బడి గొప్పజయము నందితివి. యుద్ధ సమయమున నీ ముందు నిలచి శత్రువుల నశింప జేసిన మహానుభావుడు రుద్రుడని దెలియుము. అట్టి దేవ దేవుని నమస్కరింపుము. అని శ్రీకృష్ణు డర్జునునకు బోధించెను.

" త మేవ శరణం గచ్ఛ " యను శ్లోకము వలన శివా ను గ్రహముచే శాంతి పొందుటయే గాక శాశ్వతస్థానమును పొంద గలరు. " గుహ్యా ద్గుహ్యతరం " అను శ్లోకమునందు నీకు మహా రహస్యము దెలుపజెప్పితి ననుటవలనను, యీశ్వరునికన్న వేఱు శరణ్యము లేనందుననే యిట " త మేవ శరణం గచ్ఛ " యనుట

తో పూర్తి జేయబడినది. భారతము నందలి శివ ప్రతిపాదక గ్రంథమంతయు గీతాధర్మమున వ్రాయబడును.

సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః
ఇష్టోఽసి మే దృఢ మితి తతో వక్ష్యామి తే హితమ్ ॥ ౬౪
మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే ॥ ౬౫
సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥

సర్వగుహ్యములలో గుహ్యమయిన యొక విషయమును తుదకు మరల చెప్పుచున్నాను వినుము. నీవు నాకత్యంతము నిష్టుడవగుటచే నీ యొక్క హితార్థమై యీ విషయమును చెప్పుచున్నాను ౬౪ నాయందు మనస్సునుంచుము. నన్ను భజింపుము. నన్నుద్దేశించి యజనము జేయుము నన్ను గురించివందనము జేయుము; అట్లు సేయుదువేని నీవు నన్నే పొందుదువు. సత్యము. ప్రతిజ్ఞ చేయుచున్నాను. కారణ మేమనః నాకు నీ విష్టుడవు. (భక్తుడవు.) ౬౫ సర్వధర్మములను వదలి నన్నొక్కనినే శరణు నొందుము. నేను నిన్ను సర్వ పాపముల నుండియు ముక్తునిగ జేయుదును; నమ్ముము. ౬౬

ఇట (౬౫ వ శ్లోకమున) గీత. అ ౯-౩౪ వ శ్లోకము లోని యభిప్రాయమే ప్రతిజ్ఞాపూర్వకముగ జెప్పబడినది.

అరణ్యాం. ౨- ౩౪ ధర్మనందనునకు శౌనకుడు జెప్పిన ధర్మము.

యదిదం వేదవచనం కురు కర్మ త్యజేతి చ
తస్మా ద్ధర్మా నిమా న్సర్వా న్నాభిమానా త్సమాచరేత్ ॥

వేదము కర్మను వదలుమనియు, జేయుమనియు జెప్పుచున్నది. అందువలన నధ్యయన యజ్ఞ దాన తపంబులును, సత్యము, క్షమ, దయ మొదలగు ధర్మముల నభిమానముతో

జేయం జనదు. "సమ్యక్కర్మసన్న్యాసాత్ సమ్యక్చిత్తనిరోధనాత్ ఏవం కర్మాణి షర్వంతి సంసారవిజిగీషవః" అన్నగా కర్మలయొక్క సన్న్యసించుట వలనను, చిత్తనిరోధము వలనను, సంసారము జయింపబడునను నిచ్ఛచే కర్మలను జేయుచున్నారు.

స్వధర్మ త్యాగము కన్నను అభిమాన త్యాగమును వేదమే చెప్పుచున్నది. కర్మ త్యాగమును జెప్పుచు కర్మల జేయుమనుచున్నచో, "అభిమానకృతం కర్మ నైత త్ఫలవ దుచ్యతే" యను శ్లోకాభిప్రాయము ననుసరించి కర్మలనాచరించినను అభిమాన రహితముగా జేయుటయే మంచిదని తెలుచున్నది.

ఇచ్చట సర్వధర్మ త్యాగము జెప్పుచు నన్నొకని శరణు బొందు మనుటచే, నొక్కచక్కని ధర్మము నాచరించుటవలన ఫల మనంతము గల్గునని జెప్పినపుడు సర్వ ధర్మ కర్త యగు పరమేశ్వరు నొకనినే సేవించినచో నితరధర్మములతో బనియుండ నేరదని భగవదాశయము.

భగవంతుని కధీనుడగు వాడు యితరధర్మముల నాచరించి నచో దోషము లేదు. జ్ఞాని యగు వాడు కర్మ నాచరింపనిచో దోషము లేదు గాని లోకసంగ్రహము బాధితమగును.

త్యజ ధర్మ మధర్మం చ ఉభే సత్యానృతే త్యజ
ఉభే సత్యానృతే త్యక్త్వా యేన త్యజసి తం త్యజ
త్యజ ధర్మ మసంకల్పా దధర్మం చా ప్య లిప్సయా
ఉభే సత్యానృతే బుద్ధ్యా బుద్ధిం పరమనిశ్చయాత్ ॥

ధర్మము, నధర్మము నను రెంటిని విడువుము. సత్యమును, నసత్యమును విడువుము. వీని నిట్లు విడచి దేనిచే వీని విడతువో యద్దానిని నైతము విడువుము. అనగా: సంకల్పము లేమిచే ధర్మమును, లోభము లేమిచే నధర్మమును, బుద్ధిచే సత్యాసత్యములను రెంటిని, పరమనిశ్చయముచే ననగా: పరమాత్మ విషయక మగు

దృఢ జ్ఞానముచే బుద్ధిని విడువుము. ఇట్లు శుకునకు నారదుడు రెండు పర్యాయములు (శా. ౩౩౧- ౪౪.) "త్యజ ధర్మ" మని బోధించి యున్నాడు.

రెండవసారి ధర్మాధర్మముల విడువుమని జెప్పినపుడు-

"ఏత త్తే పరమం గుహ్య మాఖ్యాత మృషిసత్తమ
యేన దేవాః పరిత్యజ్య మర్త్యలోకం దివంగతాః"

ఓ ఋషిసత్తమా! నీకు పరమ గుహ్యంబయిన దీనిం జెప్పితిని. ఈ యుపదేశము వలన తొల్లి మనుష్యులుగా నుండిన దేవతలు మనుష్య లోకము విడచి దేవలోకమును బొందిరి.

ఇట్లు నారదుని వలన విని శుకుడు సిద్ధసంఘములచే సేవింపబడు కైలాస శిఖరము నపుంజనెను. నాలుగాశ్రమముల వారును యధర్మత్యాగముచే గాని ధర్మపరులు గానేరరు. ధర్మపరులు ధర్మ త్యాగముచే గాని మోక్షము నందజాలరు.

తత స్స్వధర్మం వేదోక్తం యథా శాస్త్రోక్త మేవ చ
శిష్టాచీర్ణం చ ధర్మం చ త్రివిధం చింత్య చేతసా ॥

శా ౩౫౪. వేదోక్తము, శాస్త్రోక్తము, శిష్టాచీర్ణము, నని మూడువిధములుగానుండు ధర్మములను చిత్తముచే చింతించితి నని బ్రాహ్మణుడు జెప్పెను.

మహేశ్వరః. వేదోక్తః పరమో ధర్మ స్స్మృతిశాస్త్రగతో పరః
శిష్టాచీర్ణః పరం ప్రోక్త స్త్రయో ధర్మా స్సనాతనాః ॥

శా. ౧౪౩- ౬౫ ఈ శ్లోకమునందు "స్మృతిశాస్త్ర" యని స్మృతులును జేర్పబడినవి. ఈ శ్లోకము పలుతావుల గలదు. గావున భరతఖండమున ధర్మము మూడు విధములుగా నున్నది.

పై మూడు ధర్మములలో వేదోక్తము వదలిన భ్రష్టుడగును. స్మృతిశాస్త్రముల నతిక్రమించిన గతి గానడు శిష్టాచారమును తిరస్కరించిన శిష్టులలో బరిగణింపబడడు

వ్యాసః. మనస శ్చేం ద్రియాణాం చా ప్యైకాగ్ర్యం పరమం తపః
త జ్జ్యాయ స్సర్వధర్మేభ్య స్స ధర్మః పర ఉచ్యతే॥
సర్వధర్మములకు నొదులుటయే నిశ్చయ మగుచో ఈధర్మ మును గురించి యేమి జెప్ప వలయు? "మనస్సు యొక్కయు, యింద్రియముల యొక్కయు యేకాగ్రతయే పరమ మగు తపస్సు; ఇది (యేకాగ్రత) యన్ని ధర్మ ములకన్న నెక్కుడయినది." అని జెప్పి యుండుటచే పరమాత్మ ను బొందించు నట్టి ధర్మము త్యాజ్యము గానేరదు. శా. ౨౫౮- ౪.

ఉభే సత్యానృతే త్యక్త్వా శోకా నందౌ ప్రియా ప్రియే
భయా భయే చ సంత్యజ్య సం ప్రశాంతో నిరామయః॥
జనకగీత. శా. ౨౭౯- ౧౧.

సత్యానృతములను, ద్వంద్వభావములను వదలిన యెడల ప్రశాంతు డగునని జనకుడు మాండవ్యునకు జెప్పెను.

గ్రంథమంతయు "త్యాగము" మంచి దనుటచే, త్యాగి యెప్పుడును సుఖి యగును. ధర్మ ముల నొదులు మని భగవం తుడు జెప్పుట యిదియే "అర్జునా! ధర్మము లను నమ్మికొని యాచరించు చుంటి వేని, యవి తరుగునవి గావు కాబట్టి ఫల మూలకముగా నమ్మి యాచరింపక, వానిని నాకు వదలి పెట్టి సుఖింపుము!

కొన్ని ధర్మ ములు సులభములు, కొన్ని కష్ట భూయిష్ఠములు.
అనుశా. ౧౨౭, ౨౯. ఈ యధ్యాయ ముల యందు దేవ రహస్యము లనేకములు గలవు. ద్రవ్య హీనులు సర్వ కర్మల యొక్కయు, యజ్ఞముల యొక్కయు ఫలముల నెట్లు బొందుదురు? అని బ్రహ్మ సభయందు ప్రశ్నలు గలిగి నపుడు, యెవరి యనుభవ ముల వారట్లు వెలి బుచ్చిరి. అట్టి ధర్మములే సామాన్యములు విశేషములు నయి ప్రజలలో నాచరణ యందున్నవి.

ధర్మజః. త్యాగవాం శ్చ పునః పాపం నా లంకర్తు మితి శ్రుతిః
త్యాగవాన్ జన్మ మరణే ప్రాప్నోతీ తి శ్రుతి ర్యదా
ప్రాప్తవర్ణాశ్ర కృతమతి ర్బ్రహ్మ సంపద్యతే తదా ॥ శా. ౪-౩.

అర్జునా! చేసిన పాపము మంచి జేయుటచే పోగొట్టుకొనబడు చున్నది. చేసిన పాపమును జెప్పుట, తపస్సు, విరక్తి, తీర్థయాత్ర, శ్రుతి స్మృతుల బఠించుట యను పేసనాటిన ధర్మము నవలంబించుటచే పాపములు దొలగు నని యున్నది.

త్యాగముచే తిరిగి పాపముల నొనరించడని శ్రుతి జెప్పుటచే, త్యాగమార్గమును బొంది జ్ఞానము సంపాదించినపుడే బ్రహ్మ మగును. అని యుండుటవలన, నే నందఱ విడచి వనమునకు పోయెదను. ఏల ననగా: "త్యాగేనైకే అమృతత్వ మా నశుః," త్యాగము వలననే అమృతత్వమును బొందగిలరని శ్రుతి గలదు.

ఇదం తే నాతపస్కాయ నాభక్తాయ కదాచన
నచాశుశ్రూషవే వాచ్యం నచమాం యోభ్యసూయతి ॥ ౬౭
యఇదం పరమం గుహ్యం మద్భక్తేష్వభి దాస్యతి
భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః ॥ ౬౮
నచతస్మా న్మనుష్యేషు కశ్చిన్మే ప్రియ కృత్తమః
భవితా నచమే తస్మా దన్యః ప్రియతరో భువి ॥

ఇది (గుహ్యము) ఎవరికి తపస్సు లేదో, యెవరికి భక్తిలేదో, యెవరికి వినవలయు నని కోరిక లేదో, నన్నెవడు నిందించునో, వానికి నీ వెప్పుడును దీనిని చెప్పకుము. ౬౭ ఎవడీ పరమ గుహ్యమును నా యొక్క భక్తులకు తెలుపునో, వానికి నాయందు పరమ భక్తి గలిగి వాడు నన్నే పొందును. సంశయము లేదు. ౬౮ మఱియు నతనికంటె నాకు ప్రియము చేయువాడు, మనుజులలో మఱియొకడుండడు మఱియు నీ భూమియందు వానికంటె నాకు మిక్కిలి యిష్టుడు పుట్టను పైతము పుట్టడు. ౬౯

అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాద మావయోః
జ్ఞానయజ్ఞేన తేనా హ మిష్టః స్యా మితి మే మతిః ॥ ౭౦
శ్రద్ధావా ననసూయశ్చ శృణుయా దపి యో నరః
సోఽపి ముక్త శ్శుభాన్ లోకా న్ప్రాప్నుయా త్పుణ్యకర్మణాం॥
కచ్చి దేత చ్ఛ్రుతం పార్థ త్వ యైకాగ్రేణ చేతసా
కచ్చి దజ్ఞానసమ్మోహః ప్రణష్ట స్తే ధనంజయ ॥ ౭౨

మన యిరువురి యొక్క యీ ధర్మ సంవాదమును చదివిన వాడు జ్ఞాన యజ్ఞముచే నన్ను పూజించిన వాడనితలచెదను. ౭౦ అటులే దోష ముల నేమియు నెంచక శ్రద్ధతో వినిన వాడును (పాపముల నుండి ముక్తుడై) పుణ్యాత్ములు పోవుశుభలోకముల కేగుదురు. ౭౧ ఓ పార్థా! నీవేకాగ్రమగు చిత్తముతో వింటివా? ఓ ధనంజయా! నీ యజ్ఞాన రూప మగు మోహ మిప్పుడు పూర్తిగ నశించినది గదా? ౭౨

యాజ్ఞవల్క్యః తస్మా దుపాసస్వ పరం మహ చ్ఛుచిః
శివం విమోక్షం విమలం పవిత్రం
క్షేత్రం జ్ఞాత్వా పార్థివ జ్ఞానయజ్ఞ
ముపాస్వ నై త త్త్వ మృషి ర్భవిష్యసి ॥

శా. ౩౨౯-౧౧౦. నీవు పరంబును, మహా శుచియు, శివంబును, విమలంబును, పవిత్రంబును నగు మోక్ష స్వరూపుని యుపాసించుము. క్షేత్రమును తెలిసి, జ్ఞానమనెడి యజ్ఞమును యుపాసించితివేని నీవు వాస్తవమున ఋషి వగుదువు.

పూర్వము యాజ్ఞవల్క్యుడు ఉపనిషత్తుల వలన గలుగు నుపకారమును జనకునకు బోధ గావించెను.

నష్టో మోహా స్స్మృతి ర్లబ్ధా త్వ త్ప్రసాదా న్మయా చ్యుత
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ ॥ ౭౩

అర్జునుడు చెప్పుచున్నాడు- ఓయచ్యుతా! మీ యొక్క యనుగ్రహముచే మోహము నష్టమైనది మఱియు నాకు (కర్తవ్య ధర్మము) స్మరణకు వచ్చినది. నే నిప్పుడు సందేహము లేని వాడనుగనున్నాను. నీవు చెప్పినటుల (యుద్ధము) చేయుచున్నాను.

సంజయ ఉవాచ

ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః
సంవాద మిమ మశ్రౌష మద్భుతం రోమహర్షణం ॥ ౭౪
వ్యాసప్రసాదా చ్ఛ్రుతవా నేత ద్గుహ్య మహం మహత్
యోగం యోగేశ్వరా త్కృష్ణా త్సాక్షా త్కథయతః స్వయం॥
రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాద మిమ మద్భుతం
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః ॥ ౭౬
త చ్చ సంస్మృత్య సంస్మృత్య రూప మత్యద్భుతం హరేః
విస్మయో మే మహా౯రాజన్ హృష్యామి చ పునః పునః॥ ౭౭

సంజయుఁడు జెప్పుచున్నాడు. — ఈ రీతిగ శరీరముపై పులకలు వొడమునట్టి, వాసుదేవుని యొక్కయు మహాత్ముఁడగు నర్జునుని యొక్కయు నద్భుతమగు సంవాదమును నేను వింటిని. వ్యాసుని యొక్క యనుగ్రహముచే ఈ పరమ గుహ్యమును (అనగా: యోగమును అనగా: కర్మయోగమును) సాక్షాత్ యోగేశ్వరుఁడగు శ్రీకృష్ణుడు జెప్పుచుండగా నాకు వినుట సంభవించినది. ౭౪, ౭౫.

ఓ రాజా! (ధృతరాష్ట్ర) కేశవుని యొక్కయు, నర్జునుని యొక్కయు ఈ యద్భుతమును, పుణ్యకారకమగు సంవాదమును తలచుకొనుటచే నాకు మాటిమాటికి సంతోషము బయలు వెడలుచున్నది. ౭౬ మఱియు నో రాజా! శ్రీ హరి యొక్క యద్భుతమగు విశ్వరూప స్మరణము నాకు మిక్కిలి విస్మయము కలుగుచున్నది. మాటిమాటికి హర్షము బయలుదేరుచున్నది. ౭౭

: యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః
: తత్ర శ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ॥ ৪৮

ఏ కడ యోగేశ్వరు డగు శ్రీకృష్ణుడును, ధనుర్ధరు డగు నర్జును డుందురో, యా కడనే లక్ష్మియు, విజయమును, శాశ్వత మగు నైశ్వర్యమును, నీతియు నుండునని నేను తలంచు చున్నాను. ৪৮

బలవంత శ్చ దాశార్హా బహవ శ్చ విశాంపతే
యతః కృష్ణ స్తత స్సర్వే యతః కృష్ణ స్తతో జయః॥

విదురః ఆదిపర్వ. ౨౦౫.

దాశార్హులు బలవంతులు; ఇట్టి బలవంతులెచ్చటనుందురో యచ్చటనే కృష్ణుడు నుండును; యెట కృష్ణు డుండునో నచట సర్వులు ( ననగా: దాశార్హాదు లగు వీరులు ) నుందురు. అందు వలన కృష్ణు డెచ్చోట నుండునో యచ్చటనే జయము.

కావున కృష్ణసహాయులగు పాండవులతో వైరము వలదు. అని కౌరవులతో విదురుడు జెప్పెను.

మఱియు "యతో ధర్మ స్తతో జయః" ధర్మ మెచ్చట నుండిన నచ్చట జయము గలుగు నని, భీష్మ ద్రోణులు, గాంధారి మొదలగు వారు జెప్పి యున్నారు.

ద్రౌపదీ వస్త్రాపహరణ సందర్భమున భగవంతుడే ధర్మముగా మారినట్లు గలదు. కావున భగవంతుడే ధర్మము. ధర్మమే భగవంతుడు. కావుననే మనకు ముక్తి సాధనము కొఱకు భగవంతుని ధర్మముగా జెప్పియున్నారు అట్టి యా ధర్మమే మహాభారతమున లక్ష శ్లోకములతో జెప్పబడి యున్నది. అట్టి భారతమునకే జయ మని పేరు. ఆ భారత సారమే భగవద్గీత; భగవద్గీతా ధర్మమే భగవంతుడు. కావుననే భగవంతుడు "సర్వ

ధర్మములను వదలి యనగా: ధర్మము లన్నియు గలసి నేనె యగుదును. గావున ప్రతి ధర్మమునకు వేర్వేరు ఫలము లున్న వను మూఢ విశ్వాసము నొదలి; భగవంతుడను, ధర్మస్వరూపుడను నగు నన్ను శరణు నొందుము '' అని యర్జునునకు బోధించి యున్నాడు. ఓమ్. వందే మాతరమ్.

---

భారతీయులకు ధర్మ గ్రంథ మగు

శ్రీ మన్మహా భారతము నందలి మోక్ష ధర్మ బోధక మగు

శ్రీమద్భగవద్గీతల యందు

మోక్షసన్న్యాసయోగ మను అష్టాదశాధ్యాయము.

---

శ్రీమద్భాగ్య నగర స్థిత

శ్రీ మ దు ద్భ టా రా ధ్య వం శ సం భ వ

భారద్వాజసగోత్ర - వైద్యకళావిశారద -

ముదిగొండ మల్లనారాధ్య పుత్ర

ముదిగొండ బుచ్చయ్య లింగా రాధ్యైః

శ్రీ మద్భగవద్గీతా

మహా భారత ప్రమాణ వచనైః

ప్రకటితా.

---

శ్రీ శివాభ్యాంనమః

# స్తవరాజోపాఖ్యానము.

యోగేశ్వరం పద్మనాభం విష్ణుం జిష్ణుం జగత్పతిం
కృతాంజలిపుటో భూత్వా వాగ్విదాం ప్రవరః ప్రభుః
భీష్మః పరమధర్మాత్మా వాసుదేవ మథాస్తువత్ ॥

ఆరిరాధయిషుః కృష్ణం వాచం జిగదిషామి యాం
తయా వ్యాససమాసిన్యా ప్రీయతాం పురుషోత్తమః ॥ ౧

శుచిం శుచిపదం హంసం తత్పదం పరమేష్ఠినం
యుక్త్వా సర్వాత్మనా త్మానం తం ప్రపద్యే ప్రజాపతిమ్ ॥ ౨

అనాద్యంతం పరం బ్రహ్మ న దేవా నర్షయో విదుః
ఏకోయం వేద భగవాన్ ధాతా నారాయణో హరిః ॥ ౩

నారాయణా దృషిగణా స్తథా సిద్ధమహోరగాః
దేవా దేవర్షయ శ్చైవ యం విదుః పర మవ్యయమ్ ॥ ౪

దేవదానవగంధర్వా యక్షరాక్షసపన్నగాః
యన్న జానంతి కో హ్యేష కుతో వా భగవానితి ॥ ౫

యస్మి న్విశ్వాని భూతాని తిష్ఠంతి చ విశంతి చ
గుణభూతాని భూతేశే సూత్రే మణిగణా ఇవ ॥ ౬

యస్మి న్నిత్యే తతే తంతౌ దృఢే స్రగివ తిష్ఠతి
సదసద్గ్రంథితం విశ్వం విశ్వాంగే విశ్వకర్మణి ॥ ౭

హరిం సహస్రశిరసం సహస్రచరణేక్షణం
సహస్రబాహుమకుటం సహస్రవదనోజ్జ్వలమ్ ॥ ౮

ప్రాహు ర్నారాయణం దేవం యం విశ్వస్య పరాయణం
అణీయసా మణీయాంసం స్థవిష్ఠం చ స్థవీయసామ్ ॥ ౯
గరీయసాం గరిష్ఠం చ శ్రేష్ఠం చ శ్రేయసా మపి
యం వాకేష్వ నువాకేషు నిషత్సూ పనిషత్సు చ ॥ ౧౦
గృణంతి సత్యకర్మాణం సత్యం సత్యేషు సామసు
చతుర్భి శ్చతురాత్మానం సత్త్వస్థం సాత్వతాం పతిమ్ ॥ ౧౧
యం దివ్యై ర్దేవ మర్చంతి గుహ్యైః పరమనామభిః
యస్మి న్నిత్యం తప స్తప్తం య దంగేష్వ నుతిష్ఠతి ॥ ౧౨
సర్వాత్మా సర్వవి త్సర్వ స్సర్వజ్ఞ స్సర్వభావనః ॥ ౧౩
యం దేవం దేవకీదేవీ వసుదేవా దజీజనత్
భౌమస్య బ్రహ్మణో గుప్త్యై దీప్త మగ్ని మివా రణిః ॥ ౧౪
య మనన్యో వ్యపేతాశీ రాత్మానం వీతకల్మషం
దృష్ట్వా నంత్యాయ గోవిందం పశ్యత్యా త్మాన మాత్మని॥ ౧౫
అతివాయ్వింద్రకర్మాణ మతిసూర్యాతితేజసం
అతిబుద్ధీంద్రియాత్మానం తం ప్రపద్యే ప్రజాపతిమ్ ॥ ౧౬
పురాణే పురుషం ప్రోక్తం బ్రహ్మ ప్రోక్తం యుగాదిషు
క్షయే సంకర్షణం ప్రోక్తం త ముపాస్య ముపాస్మహే ॥ ౧౭
య మేకం బహుధా త్మానం ప్రాదుర్భూత మధోక్షజం
నా న్యభక్తాః క్రియావంతో యజంతే సర్వకామదమ్ ॥ ౧౮
య మాహు ర్జగతః కోశం యస్మి స్సన్నిహితాః ప్రజాః
యస్మి ౯ లోకాః స్ఫురంతీ మే జలే శకునయో యథా ॥ ౧౯
ఋత మేకాక్షరం బ్రహ్మ య త్త త్స దసతః పరం
అనాదిమధ్యపర్యంతం న దేవా న ర్షయో విదుః ॥ ౨౦
యం సురాసురగంధర్వా సిద్ధా ఋషిమహోరగాః
ప్రయతా నిత్య మర్చంతి పరమం దుఃఖభేషజమ్ ॥ ౨౧

అనాదినిధనం దేవ మాత్మయోనిం సనాతనం
అప్రేక్ష్య మనభిజ్ఞేయం హరిం నారాయణం ప్రభుమ్ ॥ ౨౨
యం వై విశ్వస్య కర్తారం జగత స్తస్థుషాం పతిం
వదంతి జగతో ధ్యక్ష మక్షరం పరమం పదమ్ ॥ ౨౩
హిరణ్యవర్ణం యం గర్భ మదితే ర్దైత్యనాశనం
ఏకం ద్వాదశధా జజ్ఞే తస్మై సూర్యాత్మనే నమః ॥ ౨౪
శుక్లే దేవా న్పితౄన్ కృష్ణే తర్పయత్యమృతేన యః
యశ్చ రాజా ద్విజాతీనాం తస్మై సోమాత్మనే నమః ॥ ౨౫
మహత స్తమసః పారే పురుషం హ్యతితేజసం
యం జ్ఞాత్వా మృత్యు మత్యేతి తస్మై జ్ఞానాత్మనే నమః ॥
యం బృహంతం బృహత్యుక్థే య మగ్నౌ యం మహాధ్వరే
యం విప్రసంఘా గాయంతి తస్మై వేదాత్మనే నమః ॥ ౨౭
ఋగ్యజుస్సామధామానం దశార్ధహవిరాత్మకం
యం సప్తతంతుం తన్వంతి తస్మై యజ్ఞాత్మనే నమః ॥ ౨౮
చతుర్భి శ్చ చతుర్భి శ్చ ద్వాభ్యాం పంచభి రేవ చ
హూయతే చ పున ర్ద్వాభ్యాం తస్మై హోమాత్మనే నమః ॥
యస్సుపర్ణో యజు ర్నామ ఛందోగాత్ర స్త్రివృచ్ఛిరాః
రథంతరం బృహ త్సామ తస్మై స్తోత్రాత్మనే నమః ॥ ౩౦
య స్సహస్రసమే సత్రే జజ్ఞే విశ్వసృజా మృషిః
హిరణ్యపక్ష శ్శకుని స్తస్మై హంసాత్మనే నమః ॥ ౩౧
పాదాంగం సంధిపర్వాణం స్వరవ్యంజనభూషణం
య మాహు రక్షరం దివ్యం తస్మై వాగాత్మనే నమః ॥ ౩౨
యజ్ఞాంగో యో వరాహో వై భూత్వా గా ముజ్జహార హ
లోకత్రయహితార్థాయ తస్మై వీర్యాత్మనే నమః ॥ ౩౩
య శ్శేతే యోగ మాస్థాయ పర్యంకే నాగభూషితే

ఫణాసహస్రరచితే తస్మై నిద్రాత్మనే నమః॥ ౩౪
య స్తనోతి సతాం సేతు మృతేనామృతయోనినా
ధర్మార్థవ్యవహారాంగై స్తస్మై సత్యాత్మనే నమః॥ ౩౫
యం పృథగ్ధర్మచరణాః పృథగ్ధర్మఫలైషిణః
పృథగ్ధర్మై స్సమర్చంతి తస్మై ధర్మాత్మనే నమః॥ ౩౬
యత స్సర్వే ప్రసూయంతే హ్యనంగాత్మాంగదేహినః
ఉన్మాద స్సర్వభూతానాం తస్మై కామాత్మనే నమః॥ ౩౭
యం చ వ్యక్తస్థ మవ్యక్తం విచిన్వంతి మహర్షయః
క్షేత్రే క్షేత్రజ్ఞ మాసీనం తస్మై క్షేత్రాత్మనే నమః॥ ౩౮
యం త్రిధా త్మాన మాత్మస్థం వృతం షోడశభి ర్గుణైః
ప్రాహు స్సప్తదశం సాంఖ్యా స్తస్మై సాంఖ్యాత్మనే నమః॥
యం విన్నిదా జితశ్వాసా స్సత్వస్థా స్సంయతేంద్రియాః
జ్యోతిః పశ్యంతి యుంజానా స్తస్మై యోగాత్మనే నమః॥
అపుణ్యపుణ్యోపరమే యం పునర్భవనిర్భయాః
శాంతా స్సన్న్యాసినో యాంతి తస్మై మోక్షాత్మనే నమః॥ ౪౧
యో సౌ యుగసహస్రాంతే ప్రదీప్తార్చి ర్విభావసుః.
సంభక్షయతి భూతాని తస్మై ఘోరాత్మనే నమః॥ ౪౨
సంభక్ష్య సర్వభూతాని కృత్వా చైకార్ణవం జగత్
బాల స్స్వపితి య శ్చైక స్తస్మై మాయాత్మనే నమః॥ ౪౩
అజస్య నాభౌ సంభూతం యస్మి న్విశ్వం ప్రతిష్ఠితం
పుష్కరే పుష్కరాక్షస్య తస్మై పద్మాత్మనే నమః॥ ౪౪
సహస్రశిరసే చైవ పురుషాయా మితాత్మనే
చతుస్సముద్రపర్యాయ యోగనిద్రాత్మనే నమః॥ ౪౫
యస్య కేశేషు జీమూతా నద్య స్సర్వాంగసంధిషు
కుక్షౌ సముద్రా శ్చత్వార స్తస్మై తోయాత్మనే నమః॥ ౪౬

యస్మాత్సర్వాః ప్రసూయంతే సర్గప్రళయవిక్రియాః
యస్మింశ్చైవ ప్రలీయంతే తస్మై హేత్వాత్మనే నమః ॥ ౪౭
యో నిషణ్ణో భవేద్రాత్రౌ దివా భవతి విష్ఠితః
ఇష్టానిష్టస్య చ ద్రష్టా తస్మై ద్రష్ట్రాత్మనే నమః ॥ ౪౮
అకుంఠం సర్వకార్యేషు ధర్మకార్యార్థ ముద్యతం
వైకుంఠస్య చ యద్రూపం తస్మై కార్యాత్మనే నమః ॥ ౪౯
త్రిస్సప్తకృత్వో యః క్షత్రం ధర్మవ్యుత్క్రాంతగౌరవం
క్రుద్ధో నిజఘ్నే సమరే తస్మై క్రౌర్యాత్మనే నమః ॥ ౫౦
విభజ్య పంచధాత్మానం వాయుర్భూత్వా శరీరగః
యశ్చేష్టయతి భూతాని తస్మై వాయ్వాత్మనే నమః ॥ ౫౧
యుగేష్వావర్తతే యోగై ర్మాసర్త్వయనహాయనైః
సర్గప్రళయయోః కర్తా తస్మై కాలాత్మనే నమః ॥ ౫౨
బ్రహ్మ వక్త్రం భుజౌ క్షత్రం కృత్స్నమూరూదరం విశః
పాదౌ యస్యాశ్రితాశ్శూద్రా స్తస్మై వర్ణాత్మనే నమః ॥ ౫౩
యస్యాగ్ని రాస్యం ద్యౌర్మూర్ధా ఖం నాభి శ్చరణౌ క్షితిః
సూర్య శ్చక్షు ర్దిశః శ్రోత్రం తస్మై లోకాత్మనే నమః ॥ ౫౪
పరః కాలాత్పరో యజ్ఞా త్పరా త్పరతర శ్చ యః
అనాది రాది ర్విశ్వస్య తస్మై విశ్వాత్మనే నమః ॥ ౫౫
విషయే వర్తమానానాం యం వై వైశేషికై ర్గుణైః
ప్రాహు ర్విషయగోప్తారం తస్మై గోప్త్రాత్మనే నమః ॥ ౫౬
అన్నపానేంధనమయో రసప్రాణవివర్ధనః
యో ధారయతి భూతాని తస్మై ప్రాణాత్మనే నమః ॥ ౫౭
ప్రాణానాం ధారణార్థాయ యోఽన్నం భుంక్తే చతుర్విధం
అంతర్భూతః పచ త్యగ్ని స్తస్మై పాకాత్మనే నమః ॥ ౫౮
పింగేక్షణసటం యస్య రూపం దంష్ట్రానఖాయుధం
దానవేంద్రాంతకరణం తస్మై దృప్తాత్మనే నమః ॥ ౫౯

యం న దేవా న గంధర్వా న దైత్యా న చ దానవాః
తత్త్వతో హి విజానంతి తస్మై సూక్ష్మాత్మనే నమః ॥ ౬౦
రసాతలగత శ్శ్రీమా ననంతో భగవా న్విభుః
జగ ద్ధారయతే కృత్స్నం తస్మై వీర్యాత్మనే నమః ॥ ౬౧
యో మోహయతి భూతాని స్నేహపాశానుబంధనైః
సర్గస్య రక్షణార్థాయ తస్మై మోహాత్మనే నమః ॥ ౬౨
ఆత్మజ్ఞాన మిదం జ్ఞానం జ్ఞాత్వా పంచస్వవస్థితం
యం జ్ఞానేనా భిగచ్ఛంతి తస్మై జ్ఞానాత్మనే నమః ॥ ౬౩
అప్రమేయశరీరాయ సర్వతో బుద్ధిచక్షుషే
అనంతపరిమేయాయ తస్మై దివ్యాత్మనే నమః ॥ ౬౪
జటినే దండినే నిత్యం లంబోదరశరీరిణే
కమండలునిషంగాయ తస్మై బ్రహ్మాత్మనే నమః ॥ ౬౫
శూలినే త్రిదశేశాయ త్ర్యంబకాయ మహాత్మనే
భస్మదిగ్ధోర్ధ్వలింగాయ తస్మై రుద్రాత్మనే నమః ॥ ౬౬
చంద్రార్ధకృతశీర్షాయ వ్యాళయజ్ఞోపవీతినే
పినాకశూలహస్తాయ తస్మై ఉగ్రాత్మనే నమః ॥ ౬౭
సర్వభూతాత్మభూతాయ భూతాదినిధనాయ చ
అక్రోధద్రోహమోహాయ తస్మై శాంతాత్మనే నమః ॥ ౬౮
యస్మి న్సర్వం యత స్సర్వం య స్సర్వం సర్వత శ్చ యః
య శ్చ సర్వమయో నిత్యం తస్మై సర్వాత్మనే నమః ॥ ౬౯
విశ్వకర్మ న్నమ స్తేస్తు విశ్వాత్మ న్విశ్వసంభవ
అప వర్గస్థ భూతానాం పంచానాం పరతః స్థితః ॥ ౭౦
నమ స్తే త్రిషు లోకేషు నమ స్తే పరత స్త్రిషు
నమ స్తే దిక్షు సర్వాసు త్వం హి సర్వమయో నిధిః ॥ ౭౧
నమ స్తే భగవ న్విష్ణో లోకానాం ప్రభవా వ్యయ
త్వం హి కర్తా హృషీకేశ సంహర్తా చా పరాజితః ॥ ౭౨

న హి పశ్యామి తే భావం దివ్యం హి త్రిషు వర్త్మసు
త్వాం తు పశ్యామి తత్త్వేన యత్తే రూపం సనాతనమ్ ॥ ౭౩
దివం తే శిరసా వ్యాప్తం పద్భ్యాం దేవీ వసుంధరా
విక్రమేణ త్రయో లోకాః పురుషో సి సనాతనః ॥ ౭౪
దిశో భుజా రవి శ్చక్షు ర్వీర్యం శుక్రః ప్రజాపతిః
సప్తమార్గా నిరుద్ధా స్తే వాయో రమితతేజసః ॥ ౭౫
అతసీపుష్పసంకాశం పీతవాసస మచ్యుతం
యే నమస్యంతి గోవిందం న తేషాం విద్యతే భయమ్ ॥ ౭౬
ఏకో పి కృష్ణస్య కృతః ప్రణామః
దశాశ్వమేధావభృథేన తుల్యః
దశాశ్వమేధీ పున రేతి జన్మ
కృష్ణప్రణామీ న పున ర్భవాయ ॥ ౭౭
కృష్ణవ్రతాః కృష్ణ మనుస్మరంతో
రాత్రౌ చ కృష్ణం పున రుత్థితా యే
తే కృష్ణదేహాః ప్రవిశంతి కృష్ణం
ఆజ్యం యథా మంత్రహుతం హుతాశే ॥ ౭౮
నమో నరకసంత్రాసరక్షామండలకారిణే
సంసారనిమ్నగావర్తతరికాష్ఠాయ విష్ణవే ॥ ౭౯
నమో బ్రహ్మణ్యదేవాయ గోబ్రాహ్మణహితాయ చ
జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమో నమః ॥ ౮౦
ప్రాణకాంతారపాథేయం సంసారోచ్ఛేదభేషజం
దుఃఖశోకపరిత్రాణం హరి రిత్య క్షరద్వయమ్ ॥ ౮౧
యథా విష్ణుమయం సత్యం యథా విష్ణుమయం జగత్
యథా విష్ణుమయం సర్వం పాప్మా మే నశ్యతాం తథా ॥ ౮౨
త్వాం ప్రపన్నాయ భక్తాయ గతి మిష్టాం జిగీషవే
య చ్ఛ్రేయః పుండరీకాక్ష త ద్ధ్యాయస్వ సురోత్తమ ॥ ౮౩

ఇతి విద్యా తపో యోని రయోని ర్విష్ణు రీడితః
వాగ్యజ్ఞేనా ర్చితో దేవః ప్రీయతాం మే జనార్దనః ॥ ౮౪
నారాయణపరం బ్రహ్మ నారాయణపరం తపః
నారాయణపరో దేవః సర్వం నారాయణ స్సదా ॥ ౮౫

సర్వము సంపూర్ణము.

ఏతావ దుక్త్వా వచనం భీష్మ స్తద్గతమానసః
నమ ఇత్యేవ కృష్ణాయ ప్రణామ మకరో త్తదా ॥
అభిగమ్య తు యోగేన భక్తిం భీష్మస్య మాధవః
త్రైకాల్యదర్శనం జ్ఞానం దివ్యం దత్వా యయౌ హరిః ॥

భీష్ముడు భగవంతుని స్తుతించి నమస్కారము గావించెను. భీష్ముని యొక్క యోగయుక్తమగు భక్తిని జూచి మాధవుడాతనికి త్రికాలములు దెలియునట్టి జ్ఞానమును ప్రసాదించి యంతర్ధానము జెందెను.

ఈ స్తోత్రము భారతగాథ కంతయు సారమనియు, గీతా పాఠకులకు నతిముఖ్యమనియు దెలియవలయును; గీతా భాష్యమును జదువుకొన్న పండితులు గీతారహస్యమును దెలుసుకొన్న విధమున నారద భీష్మ స్తవముల నాలోచించి పఠించు వారును పండితులకంటె నూరంతల ఫలమును బొందుదురు.

ఆచార్యకృతభాష్యములు పండితులకు బోధనీయములు. నారద భీష్మాది స్తవములు సర్వజనులకు మోక్షదాయకములు.

కావున గీతను పారాయణ జేయువారు నారద భీష్మాది స్తవములను పారాయణ జేసిన, భగవ త్తత్వమును సులభముగా దెలుసుకొన గలరు.

శ్రీ భారతధర్మోపన్యాసవిశారద, ముదిగొండ బుచ్చయ్యలింగ శాస్త్రిచే సమకూర్చబడిన శ్రీ కుమార గీత సంపూర్ణమైనది.